నారాయణమూర్తి, భోగరాజు

# అల్లాహు అక్బర్

బెజవాడ, 1929

Record no. 450

Nārāyaṇamūrti, Bhōgarāju

Allāhū Akbar

Bejavāḍa, 1929

Record no. 450

## Bibliographic Record Target

నారాయణమూర్తి, భోగరాజు.
అల్లాహూ అక్బర్ : పారితోషిక నవల / గ్రంథకర్త భోగరాజు
నారాయణమూర్తిగారు.- బెజవాడ : విజ్ఞానచంద్రికామండలి, 1929.
7, 396 p. ;19 cm.
Record no. 450

Nārāyaṇamūrti, Bhōgarāju.
Allāhū Akbar : pāritōṣika navala / granthakarta Bhōgarāju
Nārāyaṇamūrtigāru.- Bejavāḍa : Vijñānacandrikāmaṇḍali, 1929.
7, 396 p. ;19 cm.
Record no. 450

చంద్రికా గ్రంథమాల. ౩౭.



# అల్లాహో అక్బర్.

(పారితోషికనవల)





గ్రంథకర్త:
భోగరాజు నారాయణమూర్తిగారు.

విజ్ఞానచంద్రికామండలివారిచే
ప్రకటితము.

బెజవాడ

౧౯౨౯.



[వెల చందాదారులకు ౧-౮-౦
ఇతరులకు ౧-౧౪-౦.

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపఁబడియె.
1929

# పీఠిక.

—o—

"అల్లాహో అక్బర్" చారిత్రక నవల. నాయికానాయకుల పరిణయకథలను లక్ష్యముగ గైకొని మనోహరములగు వర్ణనములతో చిత్రములగు కల్పనలతో కథను కల్పించి దానిని దేశచరిత్రలో నేదో యొక సందర్భమున సమర్చి రచియింపబడిన చారిత్రకనవల లాంధ్రమున గలవు. కాని దేశచరిత్రలో ప్రసిద్ధిజెందిన స్త్రీ పురుషుల కష్టసుఖములనె ప్రధాన కథగఁ గైకొని రచియింపబడిన నవలలుగాని, దేశచరిత్రయందు జాతీయ జీవనమున ప్రాముఖ్యముగాంచిన సాంఘిక రాజకీయ మత సమస్యలు, ఉద్యమములు, సిద్ధాంతములు, చక్కఁగ ప్రదర్శించి జాతీయవికాసమునకు తోడ్పడఁ గల చారిత్రకనవలలు గాని ఇంతవరకును రచియింపఁ బడ లేదు. దీనికి కారణము లేక పోలేదు. పూర్వకాలమున గ్రీసు రోము దేశముల వారివలె జాతీయచరిత్రను భారతీయులు వ్రాసికొనియుండరైరి. అందువలన ప్రాచీనార్యభారతీయ నాగరకత మాటుమణగినది. చరిత్రప్రసిద్ధులగు స్త్రీ పురుషుల రూపము లదృశ్యములైనవి. వ్యాస, వాల్మీకులు, బౌద్ధ జైనాచార్యులు, కాళిదాస భవభూతులను గూర్చి మాత్రమెగాక చరిత్ర ప్రసిద్ధులగు స్త్రీపురుషులం దెవ్వరిని గూర్చియు మనకు సరియగు చరిత్ర లేదు. ఆయా మహాపురుషులను గూర్చిన పుక్కిటి పురాణములే మిగిలినవి. హిందూ బౌద్ధ మహాయుగ

ములందు భారతీయ వైభవముఁ జూచిన దేశాంతరయాత్రి
కుల వ్రాతలును శిలాశాసనములును తప్ప మనకు చరిత్రా
ధారములే లేవు. మహమ్మదీయ మహాయుగమునమాత్ర
కొన్ని చరిత్రలు కలవు. పాశ్చాత్యులు మనదేశమున వ్యా
పారము పేరున నడుగు పెట్టినదాది దేశపటమెల్ల నరుణముగ
చిత్రించిన సామ్రాజ్యమును సంపాదించుకొనువరకును జరిగిన
చిత్రకథను గూర్చిన యథార్థ చరిత్రయైనను మనకు లేదు.
భారతీయపారతంత్ర్య చరిత్రమున క్లైవు, వారను హేస్టింగ్సు
మొదలు డాల్ హౌసీవరకును జరిగిన అన్యాయములు
యొక్క చరిత్రగాని 1857 లో జరిగిన భారతీయవిప్లవము
యొక్క సత్యచరిత్రగాని మనకు లేదు. ఇంత యేల? పాశ్చాత్య
చరిత్రకారులు వ్రాసిన అన్యాయపు వ్రాతలు తప్ప మనదేశ
చరిత్రను గూర్చి నిష్పక్షపాత బుద్ధితో వ్రాయఁబడిన గ్రంథము
లెవ్వియు మనకు లేక పోవుటవలననే మనదేశ వేష భాష
లందలి యభిమానము నశించినది. ఇప్పు డిప్పుడు భారతీయ
జాతీయతకు నూతన వికాసము కలిగినందున దేశీయచరిత్ర
కారులు కొంతవరకు దేశచరిత్రయందలి యథార్థమును
గూర్చి పరిశోధించుచున్నందున బ్రిటీషు చరిత్రకారులు
నిందించు శివాజి, హైదరాలి, టిప్పుసుల్తాను మున్నగు ప్రసిద్ధ
పురుషులను గూర్చిన యథార్థ చరిత్రలు బయల్పడి వీ రెల్లరు
భారతజాతీయతకు వన్నెపెట్టిన వీరులనియు, పాశ్చాత్య చరిత్ర



గలిపి ప్రతాపునికిమిగిలిన సైనికుల జంపెను. ప్రతాపుని
భార్యయుబిడ్డలు మలమల మాడిరి "స్వకుటుంబ సంరక్షణమా
స్వరాజ్య రక్షణమా?" యను సమస్య ప్రతాపునికి కలిగినది.
సత్యాగ్రహ మహాస్త్రము నుపాసించువారికిట్టి యిక్కట్టులు
కలుగుట సహజమె. ప్రతాపుఁడు తాత్కాలికముగ నోటువడి
నాఁడుకాని కార్యదీక్షయు నిశ్చితార్థము నితనిని వీడలేదు. పర
మేశ్వరుఁ డితనికి ధైర్యము కలిగించెను. ప్రతాపుఁడుఁ నూతన
కార్యక్రమ మూని అక్బరుతో మరల పోరు సాగించెను. ఈ
సమరమున ప్రతాపునికే జయము కలిగినది. అక్బరుకుమారు
డతని చేఁ జిక్కెనుగాని ప్రతాపుఁ డౌదార్యముతో నాతని నక్బరు
కడ కంపివైచెను. అక్బరపజయము గాంచినాఁడు కాని అతఁడు
తలచుకొనినచో మరల మహాసైన్యములనుగూర్చికొని రణ
భూమిని రక్తముతో ముంచివేయఁగలఁడు. కాని ప్రతాపుని యో
గ్యతను జూచి అక్బరు దీర్ఘముగ యోజించినాఁడు. ప్రతాపుని
కతనితో వేరువిరోధము లేదు. పారతంత్ర్యమున కిచ్చగింపక
స్వాతంత్ర్యము నభిలషించిన సత్యాగ్రహదీక్షాపరునకు
పరునిపై తీరనిపగ యేలకలుగును? స్వధర్మ స్వదేశ రక్షణము
చేసికొనుట మానవుని జన్మబాధ్యత యని అక్బరు గ్రహించు
కొని హర్షించినాఁడు. ప్రతాపునితో కయ్యము మాని అతనిని
స్వతంత్రరాజుగ మిత్రునిగ నంగీకరించి గౌరవించినాఁడు. ఇది
సత్యాగ్రహనాయకుడగు ప్రతాపుని విజయమా? ప్రజారంజక
చక్రవర్తియగు నక్బరు విజయమా?

ఏపాశ్చాత్యచక్రవర్తి ఏదేశమున నేకాలమున తన యంతట తాను వైరివీరులను గౌరవించినాఁడు? ప్రజలు నిగ్రోధించి బలవంతముగ లాగికొనకుండఁగ నేచక్రవర్తి ఏదేశ ప్రజల స్వాతంత్ర్యము నంగీకరించినాఁడు? అయినను అక్బరు లోకోత్తరచక్రవర్తి. అక్బరుప్రభుత్వము నిరంకుశ పరిపాలనముకాదు. బాధ్యతాయుత ప్రజాస్వపరిపాలనమున ప్రజలేలాభములు పొందగలరో వానినెల్ల అక్బరు తనంతట తాను ప్రజలకు కలిగించుచుండెను. అందువలన నతఁడు ప్రజారంజకుడయ్యెను. అక్బరుప్రభుత్వమున హిందూమహమ్మదీయ ద్వేషములు లేవు. మిత్రభేదము లేదు. మతపక్షపాతములేదు. బ్రాహ్మణాబ్రాహ్మణకక్షలు లేవు. దేశభక్తులను జెరలకంపు సి. ఐ. డీ. లు లేరు. 'అల్లాహోఅక్బర్' అనుమాటలు సార్థకము లయ్యెను. అందువలననే స్వాతంత్ర్యాభిలాషియు సత్యాగ్రహదీక్షతో బాధల నందిన ప్రతాపసింహునిపై మన కెంత గౌరవమో అతని లోఁబరచుకొని భరతఖండమును నేకచ్ఛత్రముగ పరిపాలింపదలఁచిన అక్బరుపైనను మన కంతగౌరవమే! దేశచరిత్రలో నీయుపాఖ్యానము చదువునప్పుడు మన కన్నుల యెదుట సత్యాగ్రహనాయకుడగు ప్రతాపుడును ప్రజారంజకుడగు నక్బరుచక్రవర్తియు సమానతేజముతో ప్రకాశించుచున్నారు. భారతజాతీయచరిత్రమున నీకథ యత్యంత తేజోవంతమైనది. ప్రతాపుని సత్యాగ్రహకార్యదీక్ష భరతఖండ



మునకుఁ గ్రొత్తకాదు. హిరణ్యకశిపుని ప్రహ్లాదుఁడును, జీవహింసను బుద్ధుఁడును, అలెగ్జాండరును పురుషోత్తముడు నెదిరించుటలో చూపిన దీశక్తియే. మౌర్యసామ్రాజ్యాధీశుడగు చంద్రగుప్తుని చరిత్రయు, ఔరంగజేబు నిరంకుశాధికారము నెదిర్చిన శివాజీమహారాజు కథయు, తూర్పుఇండియాసంఘము వారి దుష్పరిపాలనమును అన్యాయము నెదిర్చిన లక్ష్మీభాయి శౌర్యమును సత్యాగ్రహానుష్ఠానమున కుదాహరణములే! విక్టోరియా మహారాజ్ఞి బాసలు వృథలుచేసిన బ్రిటిషుసామ్రాజ్యాధికారముతో స్వరాజ్యముకొరకు పోరాడుచు స్వార్థము త్యజించినలోకమాన్యుఁ డాదిగాగల దేశీయనాయకులదీక్షయు సత్యాగ్రహదీక్షయె. ఇట్టిసత్యాగ్రహ మహాస్త్ర ప్రయోగము నుగ్రపాలకులతో నభ్యసించిన గాంధిమహాత్ముని కార్యక్రమము నేఁడు మనకన్నార చూచుచునే యున్నాము.

ఇట్టి సత్యాగ్రహ మాహాత్మ్యమును దెలుపగల ప్రతాపసింహుని చరిత్రను కథాసందర్భముగ గైకొని 'అల్లాహో అక్బర్' రచియింపఁబడినది. ఇది యాంధ్రచదువరుల హృదయములందు గాఢమగు దేశాభిమానము కార్యదీక్షయు గలిగించు ననుటకు సందియములేదు.

బెజవాడ,
10—2—29.

దిగవల్లి వేంకటశివరావు, (బి. ఏ., బి. ఎల్.)
చెరుకుపల్లి వేంకటప్పయ్య. (ఎం.ఏ., బి. ఎల్.)



# విషయసూచిక





# అల్లాహో అక్బర్.

## ఒకటవ ప్రకరణము



### ఈ బహుమానము నాది.

'దిలేర్ఖాన్!'

'చిత్తము'

'మహాప్రభూ యని యనుచుండవలెనని నీకెన్ని మారులు చెప్పితిని? పశువా!'

'చిత్తము మహాప్రభూ!'

'నువ్వు వచ్చుచున్నావా?'

'వచ్చుచున్నాను.'

'బండి వెంటనే వచ్చుచున్నావా?'

'బండి వెంటనే వచ్చుచున్నాను మహాప్రభూ!'

'బండి నడచుచున్నదా?'

'నడచుచున్నది.'

'ఎడ్లు నడచుచున్నవా?'

'నడచుచున్నవి మహాప్రభూ'

'ఇంక నాప్రాణముల కేమియు భయము లేదుకదా?'

'మీప్రాణములకు మాప్రాణములడ్డు మహాప్రభూ!'

'ఛీ పశువా! నాప్రాణములను గాపాడఁ గలుగుటకు మీప్రాణములంత గొప్పవటరా? నోటికి వచ్చినట్లు ప్రేలకు!'

'లేదు మహాప్రభూ! తమప్రాణములే గొప్పవి. తమ ప్రాణములే మాప్రాణములను గాపాడఁగలవు.'

'అట్లైన నన్నీమహారణ్యములో విడిచి పోయెదరా యేమి? ముక్కుపచ్చలారని రాచబిడ్డఁడను, పిఱికిపంద లగు మీతో బయలుదేఱితిని. ఈకొండలు కనుమలు దాటులోపల నా కేదో యుపద్రవము తప్పదు. ఏక్షణమున నాకస్మికముగ వచ్చి యారాణాప్రతాపసింగు నన్నెగుర వేసికొని పోవునోయని నాప్రాణములు పిడికిటిలోఁ బెట్టుకొంటిని. అబ్బబ్బా! ఆ రణమల్లు ఎంతఘోరమైన చావు చచ్చినాఁడు! తలఁచుకొనిన గుండె బ్రద్దలై పోవుచున్నది!'

'నిజము మహాప్రభూ! మనసిపాయిలలో గొప్పవీరుఁడు చనిపోయినాఁడు.'

'ఏడిచినట్లయున్నది నీ తెలివి! యుద్ధమునకు వచ్చి చచ్చిపోయిన రణమల్లు గొప్పవాఁడా? బ్రదికివచ్చిన నేను గొప్పవాఁడనా?............చూడు! చూడు! ఎవరో పరుగెత్తివచ్చుచున్నట్లు పాదములచప్పుడు వినవచ్చుచున్నది.



'ఎవ్వరును లేరు మహాప్రభూ! అది గులకరాళ్ళపైఁ బ్రవహించుచుండిన సెలయేళ్ళ చప్పుడు!'

'అంతేనా? జాగ్రత్తసుమీ! ఈదిక్కుమాలిన కొండలోయ యెంతకును దరుగదు. దీనినిదాటి మైదానముపై బడువరకు నాప్రాణములు కుదుటఁబడవు........విను! విను! ఆ కేకలు విను! ఏదో యుపద్రవము తప్పనట్లేయున్నది!'

'ఏయుపద్రవమును లేదు మహాప్రభూ! సాయంకాలమగుటచేత గొఱ్ఱెలమందలఁ దోలుకొని పల్లెలకుఁ బోవుచున్న గొల్లపిల్లల కేకలవి!'

'అలాగునా? గట్టిగాఁ గేకలు వేయవలదని చెప్పు. వద్దు, వద్దు, వెళ్ళకు, బండియొద్ద నెవ్వరును లేరు. ఆసిపాయి లంతవెనుక నుండి పోయెదరేమి? కేకవేసి వడిగా బండిని గలిసికొమ్మని చెప్పు. వట్టి పశువులు, బుద్ధిలేదు.'

పైవిధమున సంభాషించుచుండిన పాత్రలకు రంగస్థలమగు నాకొండలోయ రాజపుత్రస్థానమునందలి యుదయాపురమునకుఁ దూర్పున నూరుమైళ్ళలో నున్నది. ఆప్రదేశమునకు సమీపముగ నైదారుమైళ్ళలోనే భిల్వారా - బనేరా - బాద్నోరా - మొదలగు దుర్గములు గలవు. ఇరువంకల నత్యున్నతముగఁ బెరిగిన పర్వతపంక్తులుగల యాలోయదారి తగినంత వైశాల్యము గలిగియుండుటచేత బండిదారిగా నుపయోగించుటకుఁ బనికివచ్చుచున్నది. ఎట్లైనను గొండ్లు నెడారులను

దడుచుగాఁగల యట్టిప్రదేశములలో బాటసారులకుఁ బ్రయాణసౌఖ్యము లేదనియే చెప్పవచ్చును. పర్వతచరులగు భిల్లులకును బర్వతదుర్గవాసులగు రాజపుత్రులకును దప్ప నితరులకాత్రోవ లనుగమ్యములు గావు. ఒకగ్రామమునుండి మఱియొకగ్రామమునకు బండిదారి పదునైదు మైళ్ళుండినను, కొండదారిమాత్రము మైదారుమైళ్ళే యుండును. అయినమాత్ర మేమి లాభము? కొండ లెక్కవలయు, దిగవలయు! నదులు చొరవలయు, నీదవలయు! ఒకచోటఁ గంటకశిలాకలితంబులగు గుహాం[illegible]నుండి నడువవలయు! మఱియొకచోట మెత్తని యిసుకచే దట్టముగనిండిన యెడారులలోఁ బిక్కలు పీకునట్లు పరువెత్తవలయు! ఒకప్పుడు భయంకరములగు దుష్టమృగముల బారినుండి తప్పించుకొనవలయు! మఱియొకప్పుడు క్రూరులైన కిరాతులతోడఁ బోరాడవలయు! బండిదారుల కిన్నిగండములు లేకపోయినను, గుంపుగుంపులుగా బయలుదేరుటయే బాటసారుల కెక్కుడు క్షేమము. సాధారణముగ స్వల్పసంఖ్యాకులా త్రోవలనుండి పోవుటకు సాహసింపరు.

ఆనాఁడా కొండలోయనుండి ప్రయాణము సేయుచుండిన బండికి ముందును వెనుకనుగూడ వందలకొలఁదిసిపాయిలు కూతవేటు దూరములో నడచుచుండిరి. వారందఱు సామాన్య బాటసారులవలెఁ గనఁబడరు. ఇంచుమించుగ నాలుగైదువందలవరకుఁ గల యాసిపాయిలలో ననేకులు తురంగారూఢులు.



కారు'బు ఘనులని పొగడిన క్లైవు, వారను హేస్టింగ్సు, డాల్ హౌసీ, యాదిగాఁగల తూర్పుఇండియాసంఘపు తాబేదారులచర్య లక్రమములనియు, 1857 లో జరిగిన భారతీయ విప్లవమున కొంద ఱేవైన నక్రమములు చేసినను భారతీయ స్వాతంత్ర్యముకొఱకు, స్వధర్మముకొఱకు, ప్రాణములబాసిన ఝాన్సీలక్ష్మీబాయి మున్నగువారి జీవితములు పవిత్రములనియు, స్పష్టముగ బయల్పడినది. భారతజాతీయతకు నూత్న వికాసము కలిగినందుననే స్వధర్మ స్వదేశ స్వరాజ్యములందలి యభిమానము నేటి వాఙ్మయమునందు గూడ కనబడుచున్నది. భారతీయ మోక్షసాధనము చేసి స్వరాజ్యముకొఱకు స్వార్థము త్యజియించిన గాంధిమహాత్ముఁడును లోకమాన్యుఁడు నాదిగా గల దేశీయ నాయకుల యుద్యమమునకు మన దేశమున నిజముగ గల లోపములు మాత్రమెగాక మతభేదము వలన కలిగిన సాంఘిక వైషమ్యములు కూడ, ఆటంకము కల్గించుచున్నవి. ఇది చూచియే గాంధిమహాత్ముఁడు నిర్మాణకార్యక్రమమునకు ప్రధానస్థాన మొసగినాఁడు. ఇట్టితఱి భారతీయులెల్లరు హిందూమహమ్మదీయ సమైక్యమైత్రి సంధాయకమును, జాతీయ వికాస ప్రద్యోతకమును, దేశాభిమాన సంభరితము నగు చరిత్రలను బఠియించుట యావశ్యకము. ఇది గ్రహించి విజ్ఞానచంద్రికామండలివా రిట్టి చరిత్రఘట్ట మేర్పనను కథాసందర్భముగ గొని వ్రాయఁబడిన యుత్తమనవలకు

రు 500-0-0 బహుమాన మీయ నిశ్చయించిరి. ఈపోటి పరీక్షకు చాల నవలలు వచ్చినవి. వీనిలో అల్లా-హో-అక్బరే యుత్తమమైన దని పరీక్షకులు తీర్మానించిరి. అందువలన బహుమాన మీగ్రంథమునకే యీయఁబడినది.

'అల్లా-హో-అక్బర్' యొక్క కథాసందర్భము చాల నుత్కృష్టమైనది. జగద్విఖ్యాతమగు మొగలు సామ్రాజ్యమునకుఁ జక్రవర్తియై, ప్రజారంజకుఁడై లోకోత్తరుఁడుగ భరతఖండము నేకచ్ఛత్రముగఁ బరిపాలించిన అక్బరు చక్రవర్తి ప్రభుత్వమును భారతీయు లంగీకరించి యుండిరి. ఎంత సత్పరిపాలన మయినను పారతంత్ర్యము హేయ మ్మని తలఁచి స్వధర్మము స్వదేశము స్వరాజ్యములను గాంక్షించి స్వాతంత్ర్యాభిలాషియై మేవాడరాజసింహుఁడగు ప్రతాపసింహుఁడు అక్బరును సర్వంసహాచక్రవర్తిగ నంగీకరింపక నిరోధించి నిలచెను. ఆర్యావర్తమెల్ల నివ్వెరఁబడెను. అనన్యసామాన్య బలము కల అక్బ రెక్కడ? చిన్నరాజగు ప్రతాపుఁ డెక్కడ? ప్రతాపు నడగద్రొక్కుట కక్బరు సైన్యమంపెను. ప్రతాపుఁడు మొదట కొంతజయము నొందెను గాని తుదకు ధర్మరాజాదులవలె పుడమియు రాజ్యము బంధుల న్విడచి మృగావళుల గలసి విపినంబులలో గడుకొని యిడుమలఁ బడసాగెను. అక్బరుసేనాని యాతనిని తరుమసాగెను. తినుట కేవస్తువును దొరుకకుండఁగ జేసెను. తటాకమున విషము



కొందఱు గజారూఢులు. మఱికొందఱు శకటారూఢులు. తక్కినవారు పాదచారులు. చిట్టచివర మైనపుగుడ్డలచే భద్రపరుపఁబడిన సామానుబండ్లను దోలుచు గునుకుచుండిన బండివాండ్రను బ్రక్కల నడచుచుండిన సిపాయిలు చేతిబెత్తములతోఁ బొడుచుచుండ, వారు తుళ్లిపడి విసుగుకొనుచు నెడ్లను బొడుచుచుండిరి. చతురంగబల లక్షణములు గలిగియున్నను నతి స్వల్పసంఖ్యాకులగు నా సిపాయిలగుంపు సైన్యమనుటకుఁ జాలదు. ఆగుంపులోని సిపాయి లెల్లరును మొగలాయి సిపాయిలే. అందఱు నాయుధపాణులే. మొగలాయి లగుటచే వారు మొగలాయి చక్రవర్తియగు అక్బరుపాదుషాచేఁ బంపఁబడిన సిపాయిలు కావలయును. 'ప్రతాపసిం గెప్పుడు వచ్చి నన్నెగుర వేసికొని పోవునో' యనియు 'రణమల్లెంత ఘోరమైన చావు చచ్చినాఁ' డనియు, బండిలోఁ గూరుచుండిన మహావీరుఁడు పలికిన పలుకులవలన నక్బరుచక్రవర్తి యొక్క సైన్యమును దన దీర్ఘశత్రువగు రాణాప్రతాపసింగుపైకిఁ బంపినట్లును ఆసైన్యము పరాజితమైనట్లును, స్వల్ప సంఖ్యాకులగు నీ సిపాయి లందలి హతశేషులైనట్లును మనకు స్ఫురించుచున్నది. కాని యాసిపాయిల వర్తనవిశేషములును, నర్తనగానాదికములును, ముఖలక్షణములును, బరికించినయెడ నోటమిఁజెందిన వారివలెఁ గానరారు.

కొందఱు పాటలు పాడుచుండిరి. కొందఱు లయ వేయుచుండిరి. కొందఱు కథలు చెప్పుచుండిరి. కొందఱు

కొట్టుచుండిరి. కొందఱు పరువెత్తుచుండిరి. కొందఱు వెంటఁదరుముచుండిరి. మొత్తముపై గాయకులు, కథకులు, పౌరాణికులు, విదూషకులు మొదలగు పలువిధములవారిచే నా సిపాయిగుంపు పాటలతోడను, నాటలతోడను, ఇతిహాసములతోడను, బరిహాసములతోడను నిండి, నిర్లక్ష్యము నిర్భయము నైయుత్సాహమును నానందమును వెల్లడించుచుండెనే గాని, యేవిషయమునందును బరాజయసూచకంబగు విచారమును సూచించుచుండ లేదు.

ఇక్కడ బండిలోఁగూర్చుండిన ప్రభువువారింకను దిలేర్ఖానుతోఁ బ్రసంగించుచునే యుండిరి. దిలేర్ఖాను వాని ప్రశ్నముల కెల్ల విసుగుకొనక ప్రత్యుత్తరము లిచ్చుచుండెను.

"దిలేర్ఖాఁ! నీవు ప్రతాపసింగు నెప్పుడైనఁ జూచితివా?

"చూడలేదు మహాప్రభూ! నేనేకాదు మన సైన్యములో నెవ్వరును వానినిఁ జూచి యుండరు."

"ఎందుచేత? ఆతఁడు ఘోషా పురుషుఁడా యేమి?"

"ఘోషా కాదు. వాని ప్రవర్తనమే యట్టిది. తన భార్యాపుత్రులతో నేకొండలలో నేగుహయందు నివసించునో యితరులకుఁ దెలియనీయఁడు. వానికిఁ బెక్కువేల భిల్లసైన్యములు గలవు. ఆ సైన్యము లీ యుదయపుర రాజ్యము నందచ్చటచ్చటఁ గాచియుండి దండెత్తివచ్చిన శత్రుసేనల నెది



రించుచుండును. అందుచే యుద్ధముజరిగిన ప్రతిస్థలమునందుఁ బ్రతాపు డుండునని చెప్పలేము. ఉండఁడనియుఁ జెప్పలేము. ఈ స్థలములన్నియు నిరంతరము నాతఁడు సంచరించునట్టివియే."

"అమ్మయ్యో! అట్లైన మన కింకను బ్రతాపుని గండము తప్పనట్లే. దిలేర్ఖాఁ! ఆ రణమల్లు దురవస్థ నాకుఁ గలుగదు కదా?"

అని, యిట్లు సంభాషించుచుండఁగనే వారాలోయ దాటి సమప్రదేశములఁ బ్రవేశించిరి. అయిదారు మైళ్ళనుండి కలిసియుండిన యా కొండవరుసలు రెండును సమష్టికుటుంబములోని యన్నదమ్ములు వేరైనట్లిప్పుడు వేరై యుత్తరముగా నొకటియుఁ బశ్చిమముగా నొకటియుఁ బ్రాకిపోయినవి. ఆ మైదానమునందలి బండిదారి కిరువంకల దూరదూరముగఁ జిన్న చిన్న గుట్టలును, గట్టులును, జెట్టులును దప్పఁ బెద్ద పెద్ద కొండలేమియును లేవు. ముందువైపు కనుచూపుమేరఁ గల చెట్లచాటునుండి 'బైరాటఘర్' అను దుర్గము యొక్క శిఖరములు గానవచ్చుచుండెను. అట్టి సమయమున నాకస్మికముగ "అరే! ప్రతాప్‌సింగ్! జాగ్రత్త! జాగ్రత్త! మేవాడ రాజ్యాధీశ్వరుండను నేనే!" అని యత్యద్భుతమైన యొక భయంకరమహాధ్వానము వారి కందఱకు నొక్కుమ్మడిగ వినిపించెను. ఆగంభీరస్వనమునందు శబ్దార్థములు రెండును లేకుండునెడ నది నిజముగ సింహాగర్జన మని యనుకొనవలసి

నదే. పర్వత గహ్వరములు ప్రతిధ్వనించు నామహాధ్వానము చెవుల సోకినంతనే ముందు నడచుచుండిన సిపాయిలును వెనుక వచ్చుచుండిన సిపాయిలును దటాలున నెక్కడి వారక్కడనే యాగిపోయిరి. ధ్వని వినియుఁ బరధ్యానమున నందలి యర్థమును గుర్తింపనేరని సిపాయిలు కొందఱు తమ చెంతనున్నవారి నాతురతతో నడుగుచుండిరి. 'ప్రతాపసింగు! ప్రతాపసింగు! జాగ్రత్త! జాగ్రత్త, యని మనల బెదరించుచున్నాఁడు. మేవాడరాజ్యమున కెల్లఁ దానే యధీశ్వరుఁడట! ఏమి వాని సాహసము!' అని తమలోఁ దాము చెప్పుకొనుచు వెనుకనున్నవారుఁగూడ ముందునకే పఱువెత్తసాగిరి.

ఇంక బండిలోని ప్రభువారి సంగతి వర్ణనాతీతము! చూపరులకుఁ దన యాకారము గానరాకుండ నాపాదమస్తకము ముసుఁగు వేసికొనియే మాటాడుచుండిన యాభీరుఁడు భయంకరమగు నాధ్వని వినినంతనే భయాతిశయమున నొడలు మఱచి, వికారమగు నొక వెఱ్ఱికేక వేసి గుండెయందలి దడదడలతోడను శరీరమునందలి గడగడలతోడను మొదలు నఱికిన చెట్టువలె దటాలున బండిలో వ్రాలెను. ఆమంద భాగ్యుని దురవస్థ కనిపెట్టి వెంటనే దిలేర్ఖాను బండిలోని కుఱికి వానిని గట్టిగఁ బట్టుకొనెను. తోడనే పోవుచున్న ప్రాణము లెంచుక కుదురుపడుటచేఁ గాఁబోలు పాపమతఁడు దిలేర్ఖానుని బిగ్గరగఁ గౌఁగిలించుకొని, యూరక నిట్టూర్పులు



విడుచుచు గద్గదస్వరముతో "దిలేర్ఖాన్! నాకేమి దారి? ఏమిసాధనము! నీబిడ్డఁడను! నీపాదములఁ బట్టుకొనెదను. నీవే రక్షింప వలయును! వెనుక బండ్లలోని సామానులు తెచ్చి నామీఁదఁ బడవేసి యిది సామాను బండి యని చెప్పుము!... వద్దు వద్దు! సామాను లపహరించుటకు బండిలోని కుఱికెదరేమో......దిలేర్ఖాన్! ఏమిగతి? పోనిమ్ము, చచ్చినట్లు పడియుందును. యుద్ధములోఁ జచ్చిన శవమిది. ఇంటికిఁ గొనిపోవుచున్నామని చెప్పుము...అయ్యయ్యో! మాఅక్క...మా బావ..." అని మఱి మాటాడలేక రోదనముఁ బ్రారంభించెను. పూర్వమువలె వాని మాటలకుఁ బ్రత్యుత్తరము లిచ్చుచుండుటకుఁగాని, మాటిమాటికి వానికి ధైర్యము చెప్పుచుండుటకుఁగాని దిలేర్ఖానున కిప్పుడు శ్రద్ధలేదు. వాని దృష్టి యంతయు ముందు పఱుగిడుచున్న సిపాయిలయందే యున్నది. తానును బఱువెత్తి యావిశేష మేదియో కనుఁగొనవలెనని కుతూహల పడుచుండెనేగాని బండి విడిచి పోవుటకు వానికిఁ బ్రభువువారి యనుజ్ఞలేదు. అందుచే నాతఁడు వడివడిగా బండి సాగనిమ్మని బండివానిని హెచ్చరింప సాగెను. మార్గమునకుఁ బ్రక్కనే కొంచెము దూరములో నున్న దట్టమగు చెట్లగుంపులో గుమిగూడియున్న సిపాయిల గుంపును సమీపించిన కొలఁదిఁ గేకలును ఖంగుఖంగను కత్తుల మోతలును దిలేర్ఖానునకు వినఁబడుచు వచ్చెను. అతఁడా సమూహమును సమీ

పించుకొలంది నాకత్తుల మోతలు కరతాళధ్వనులుగా మార నారంభించెను.

కెవ్వునఁ గేకలు - తువ్వంతువ్వున గెంతులు - పకపక నవ్వులుంగలిగి, సంపూర్ణ విజయానందసాగరంబునఁ దెప్పయి తేలుచుండిన యాసిపాయిగుంపును దిలేర్ఖాను బండితోఁ గూడ సమీపించెను. తోడనే వందలకొలంది సిపాయి లాబండి చుట్టుం గుమిగూడి, "ప్రభువు వా రేమిచేయుచున్నారు? ప్రభువు వా రేమిచేయుచున్నారు? మహాప్రభూ! లెండి! లెండి! అదృష్టవశమునఁ బ్రతాపసింహుఁ డప్రయత్నముగ మనచేఁ జిక్కినాఁడు! వాని కరచరణములు బంధించి ఖైదీగాఁ బట్టుకొంటి" మని కేకలు వేయుచుఁ జెప్పిరి. అంతవరకు నూపిరి బిగఁబట్టి ముసుఁగుదన్ని చలనములేక పడియున్న యాభీరున కిప్పు డుచ్ఛ్వాస నిశ్వాసములు స్వేచ్ఛగా విడుచుట కవకాశము కలిగినది. అవయవములకుఁ జలనము వచ్చినది. ప్రాణములు కుదురుపడినవి. వందలకొలంది సిపాయిలు తనచుట్టును గుమిగూడియే యున్నారు. ప్రతాపసింహుఁడు పట్టువడె నని చెప్పుచున్నారు. ఇఁక వాని ధైర్యసాహసముల కేమి కొదువ? అత్యంతసాహసముతోఁ దనముసుఁగు దీసి పారవేసి, యించుమించుగ నిరువదియైదేండ్ల యీడుగల చామనచాయ మేనివాఁడగు నారాజపుత్త్రుఁడు దిలేర్ఖాను చేయూతతో బండిలోనుండి క్రిందకుదాఁటి వెఱ్ఱివానివలె నిటునటుఁజూచుచు



'ప్రతాపసింగు పట్టువడెనా? నిజముగాఁ బట్టువడెనా! ఏఁడీ! ఏఁడీ! ఆ మందభాగ్యుఁ డెక్కడ నున్నాఁడు!' అని యడుగుచుండఁ గొందరు సిపాయిలు ఖైదీగాఁబట్టుకొనఁబడిన రాజపుత్త్రవీరుని ఆజానుబాహుని, విశాలనేత్రములవాని, మేలిమిబంగారు రంగుగలమేనివాని, రాజ్యభ్రష్టుఁడైన యొకమహారాజని గంభీరముఖలక్షణములే చెప్పకచెప్పుచున్న వాని విధివశంబున వేటకాండ్రకుఁబట్టువడి శృంఖలాబద్ధుఁడైన యడవియేనుఁగును బోలువాని నొకనిం గొనివచ్చి యచ్చటఁబడ వేసి, "మహాప్రభూ! వీఁడే ప్రతాపసింగు! ఈచెట్లచాటున నొకపాడు దేవాలయము గలదు. అందులోఁ బదిమంది యనుచరులతో వీఁడు మాకు లభించినాఁడు. ఆపదిమందియు రాజపుత్త్రులే! వారు మాచేఁ గడ తేరినారు."

"పోనిండు! మనలో నెవ్వరును జావలేదుకదా?"

"నలువదిమందికంటె నెక్కుడు చావలేదు మహాప్రభూ!"

"ఆనలువదిమందియైనను నాతోఁజెప్పకుండ నేలచావవలయును! వట్టి పశువులు! బుద్ధిలేదు."

"ఆ నలువదిమందినిగూడ నీ ప్రతాపుఁ డొక్కఁడే కడతేర్చినాఁడు మహాప్రభూ!"

"ఆఁ-ఆఁ- వీఁడొక్కఁడే! ఎంతసాహసము! ఓరి మూర్ఖా! ప్రతాపా! నే నెవ్వఁడనో యెఱుఁగుదువా! చెప్పిన

మెడల గుండె పగిలి చచ్చెదవు! బికనేరు రాజకుమారికి మా యక్క. మా యక్కకు నేను తమ్ముఁడను. మా యక్క మగఁడు అక్బరు చక్రవర్తి. ఆ యక్బరు చక్రవర్తి నాకు బావమరది. నే నతనికి బావమరదిని. వీరపురుష మనుష్యశిఖామణి రాజ చంద్రుఁడను. దామోదరసింగు ప్రీతపేరుండను. స్యాలక మహారాజ క్రొత్తపేరుండను! జాగ్రత్త!” అని పాప మాతని శిరస్సుపైఁ దన కాలితో నొక్క తాపు దన్నెను. బంధితుఁడై నేలఁ బొరలుచుండిన యా వీరపురుషుఁడు చేయున దేమియు లేక మహాసర్పమువలె బుస్సువెట్టుచుఁ, బండ్లు పటపటఁ గొఱుకుచుఁ దన కన్నులనుండి వెడలు కోపానలజ్వాలల నా స్యాలకునిపై నొక్కమారు ప్రసరింపఁజేసెను. ప్రతాపసింగు, చక్రవర్తి కెంతయు గౌరవయోగ్యుఁడనియు, వానినట్లు తన్నుట భావ్యముగాదనియు దిలేర్ఖాను మొదలగువారలు స్యాలకుని మందలించిరి. స్యాలకుఁడా మాటలు లక్ష్యపెట్టక తన ప్రభుత్వము నిట్లు ప్రకటింపసాగెను.

“ఓరీ! దిలేర్ఖా! నీవు మున్ముందుగాఁ బట్టణము నకుఁబోయి స్యాలక మహారాజుగారు ప్రతాపసింగును బట్టుకొని వచ్చుచున్నారని మా యక్కతోడను మా బావతోడను జెప్పి యీ శుభవార్త పట్టణమునం దంతటఁ జాటింపుము. నగరమంతయు నలంకరింపఁబడవలెను. స్త్రీలును బురుషులునుగూడ నన్నెదుర్కొని నా మెడలోఁ బూలదండలు వేసి



మహోత్సవముతో నన్ను నగరులోనికిఁ దీసికొని పోవలయును. ప్రతాపసింగును బ్రాణములతోఁ బట్టుకొనినవారికిఁ జిత్తూరు రాజ్య మొసంగెద నని బావగారి ప్రతిజ్ఞ. అందుచే నన్నిఁక మీఁద మీరందఱును జిత్తూరుమహారాణావా రని పేర్కొనుచుండవలయును. ఈ బహుమానము నాది.”

## రెండవ ప్రకరణము

### — ఆర్త ప్రాణరక్షణము —

అక్బరు చక్రవర్తికిఁ బ్రస్తుతరాజధాని యగు ఆగ్రా పట్టణమునం దంతటఁ బ్రతాపసింహుఁడు పట్టువడిన వార్తయు రణమల్లుని మరణవార్తయు నింగిముట్టుచుండెను. నగరవాసు లాబాలగోపాలము నిందు మొదటివార్తకు వింతపడుచుండిరి. రెండవ వార్తకు వంతపడుచుండిరి. ఆరావళీ పర్వతగహ్వరముల నివసించు ప్రతాపసింహుని పౌరుషవిక్రమము లాగ్రాపురవాసులు నిరంతరమును వింతకథలుగాఁ జెప్పుకొనుచుందురు.

“ఒకనాడు ప్రతాపసింహుఁ డొక గుహలోఁ దిరుగాడుచుండఁగా శత్రువు లెట్లో కనిపెట్టి యా గుహలోఁ జొరబడ నారంభించిరఁట! లోపలనున్న ప్రతాపుఁడు లోనఁ బ్రవేశించు వారినెల్ల ద్వారముకడనే కడతేర్చుచు మొత్తముపైఁ

దా నొక్కఁడే యైదువందలమందిని సంహరించినాఁడఁట!" ఇది ప్రతాపుని శౌర్యసాహసములం గూర్చిన కథ.

"ప్రతాపుఁ డొంటరిగ నొక కొండపై సంచరించుచుండ నాకస్మికముగ వేలకొలఁది సైనికు లా పర్వతాగ్రముపై కెగఁబ్రాకి యాతనిని ముట్టడించిరఁట! అప్పుడతఁడు చేయున దేమియు లేక యాకొండకొననుండి క్రిందఁ బ్రవహించుచుండిన ప్రవాహములోనికి గుభిల్లున దుమికి యెట్టి ప్రమాదమును లేకుండఁ దప్పించుకొనఁ గలిగెనఁట" ఇది ప్రతాపుని యమానుషచర్యలం గూర్చిన కథ.

"ఒకనాడు ప్రతాపుఁడు వేటాడి మిక్కిలి డస్సి యొక మంచెపై నెక్కి యచ్చట విశ్రమించి యుండఁగా మొగలాయి సిపాయిలు వానిపై నెన్నియో తుపాకులు ప్రయోగించిరఁట! ఆ తుపాకులగుండ్లన్నియు వాని చెవిప్రక్కనుండి రివ్వునఁ దప్పిపోవుటయేగాని యొక్కగుండుదెబ్బయైన వానికిఁ దగులలేదఁట!" ఇది ప్రతాపుని యందలి దైవశక్తిం గూర్చినకథ.

ఈకథలును నిట్టికథలు ననేకములును చెప్పుకొనుచుండుటయేగాక, "ప్రతాపసింహుఁ డింకమీఁద మూఁడుసంవత్సరములవరకు నెవ్వరికిని గానరాఁడు. ఆరావళీపర్వతగుహాలలో నొక గుహాయందు దేకాంతముగఁ గూర్చుండి, యతిసిద్ధుతో నేదో యొక శక్తి నుపాసించు నఁట! యది సిద్ధించినంతనే పోయి స్వరాజ్యమగు మేవాడరాజ్యమునకే



గాక, హిందూదేశమున కెల్ల నాతఁడే చక్రవర్తి యగు నఁట!" అను నిట్టివార్తలుగూడఁ బ్రజ లప్పుడప్పుడు ప్రతాపునిఁగూర్చి చెప్పుకొనుచుండుట నాటి దినములలో నాచారమై యుండెను. లోకులు కాకు లగుటచే నిట్టికథ లూకొట్టవలసినవియేగాని విమర్శింపవలసినవి కావు. ఈ విశేషములనుబట్టి ప్రతాపుఁ డన్నఁ బ్రజల కెట్టి పూజ్యభావము కలదో మాత్రము మనకుఁ దెలియఁగలదు. అందుచేతనే యాతఁడు పట్టుపడెనన్న వార్త యనేకులు విశ్వసింపలేదు.

దిలేర్ఖాను వచ్చి యీవార్త ప్రకటించిన యుత్తరక్షణమునుండియుఁగూడ నాగ్రాపట్టణమున నిండ్లలోను, వాకిళ్లలోను, వీథులలోను, సంగళ్లలోను, బాఠశాలలలోను, గళాశాలలలోను, గార్యస్థానములలోను నిదియే ప్రసంగము! వీథులలోఁ దమదారిం బోవుచు నొండొరులం గలిసికొనిన పురవాసులు తటాలున నాగిపోయి,

"విన్నారా?"

"విన్నాను, విన్నాను. వింతగానే యున్నది."

"మీ యభిప్రాయమేమి?"

'ఏమని చెప్పఁగలను? అతఁడు మహనీయుఁడు. అంతవరకు సందేహము లేదు. ఎంతటి మహనీయుఁడైనను విధివశమునకు లోఁబడవగాకతప్పదు కదా? అందుచేఁ బట్టుబడినఁ బట్టుబడియుండును."

అని యీవిషయమును గూర్చియే ప్రసంగించుకొను చుండిరి. ప్రతాపుఁ డొక యుచ్ఛిష్టదేవత నుపాసించి, యది బెడిసి కొట్టుటచేఁ బట్టువడినాఁ డని మంత్రశాస్త్రవేత్తలు సమాధానము చెప్పుచుండిరి. ప్రతాపున కిప్పుడు శనియోగము బాగులేదు. గ్రహములన్నియు దుష్టస్థానములయందే యున్నవి. అందుచే నారునెలలవరకు వానికి ఖైదు తప్పదని జ్యోతిషజ్ఞులు గణించుచుండిరి. శత్రుమిత్రభేదమును హిందూమహమ్మదీయ భేదమును లేని యత్యుత్తమప్రభు వని కీర్తింపఁ బడుచుండిన చక్రవర్తి, తాను బట్టువడిన యెడలఁ దన్నేమి చేయునో పరీక్షింపవలె నని ప్రతాపుఁడు స్వయముగనే కోరి పట్టువడినాఁ డని రాజనీతిజ్ఞులగు కొందఱు బుద్ధిమంతు లూహించుచుండిరి.

సామాన్య ప్రజాభిప్రాయభేదములను మన కింతకంటెఁ జర్చించుట కవకాశము చాలదు. ఉన్నతోద్యోగస్థులైన మహామంత్రులు, సేనానాయకులు, సుబేదారులు మొదలగు వారుఁగూడ నిందలి సత్య మిదమిత్థ మని నిర్ణయింపజాలకుండిరి. మహామంత్రులలో మానసింహుఁడు ప్రప్రథమగణ్యుఁడు. చక్రవర్తికి బహిఃప్రాణము. ప్రతాపసింహుని స్వయముగా నెఱిఁగినవాఁడు. అందుచేఁ గవిశేఖరులైన పృథ్వీరాజు, ఫైజీ—అబుల్ ఫజలును, రాజనీతినిపుణులైన తోడరుమల్లు—బీరబలుఁడు— భగవానుదాసు మున్నగువారును నీవిషయమును గూర్చి



మానసింహునితోఁ బ్రసంగింపవలె నని తలంచిరిగాని పాపమతఁడిప్పుడు వ్యాధిగ్రస్తుఁడై మంచముపట్టి యుండుటచేత వీలు పడలేదు.

చక్రవర్తి యవస్థయు నించుమించుగఁ దక్కినవారి యవస్థవలెనే యుండెను. నిజముగాఁ బ్రతాపసింహుఁడే పట్టువడినా వాని కంతకంటె మించిన విజయానంద ముండదు. ఆతని శత్రువులలోఁ బ్రతాపునిమించిన ప్రబలశత్రు వింకొకఁడు లేడు. తన సార్వభౌమత్వ మంగీకరింపని శత్రులనెల్ల నయముచేఁ గొందఱను, భయముచేఁ గొందఱను జక్రవర్తి యెట్లో వశపరచుకొనఁ గలిగెను. గాని ప్రతాపునియెడ మాత్రము వాని నయభయములు సాగలేదు. ఉత్తరముల మూలమునను రాయబారుల మూలమునను వానిని మంచి చేసికొనవలయునను ప్రయత్నములన్నియు వ్యర్థమైనవి. ఆ యుత్తరములకును రాయబారములకును గూడ నాటికిని నేటికిని రాణా యొసంగుచుండిన ప్రత్యుత్తర మొక్కటియే. ఇదియే యా ప్రత్యుత్తరము.

"అక్బర్! ఈమేవాడరాజ్యమునకెల్ల నేనే యధీశ్వరుఁడను. తక్కిన హిందూదేశభాగమునకెల్ల నీవు రాజవు. మన రాజ్యములే యొకటి చిన్నదియు, నొకటి పెద్దదియు నై యున్నవి. గాని మన మిరువురమును సమానులమే. అందుచేఁ జక్రవర్తిపదము నీకుఁ జెల్లనేరదు. తక్కిన రాజ్యములయందు

వలె నీ మేవాడరాజ్యమునందుఁగూడ బెత్తెడు నేలయేని మిగులకుండ నీవు స్వాధీనపరచుకొనఁగలిగినయెడ నప్పుడే నీవు హిందూదేశ చక్రవర్తివి కాఁగలవు. ప్రస్తుతము నా రాజ్యములోని కొన్ని దుర్గములను నీవు జయించుకొనఁ గలిగితివి. అయిన మాత్రమేమి ? నేను నివసించు ప్రదేశములు-నేను విహరించు గుహామందిరములు-నేనుసంచరించు పర్వతములు-నేను వేటాడు నరణ్యములు- యివియన్నియు నా ప్రస్తుత రాజ్యములోని విభాగములు. ఈభాగములుఁగూడ జయించుకొనఁగలిగితివేని మేవాడ సంపూర్ణముగ జయించినవాఁడ వగుదువు. మేవాడ జయించిన నింక హిందూదేశమంతయు నీవు జయించినట్లే. హిందూదేశమంతయు జయించినప్పుడే నీవు చక్రవర్తి బిరుదాంకుఁడవు కాఁగలవు.”

ఇందువలనఁ బ్రతాపుఁడు పట్టువడుట చక్రవర్తి కెంతటి మహావిజయమో స్పష్టపడుచున్నది. అంతటి మహామహుఁడింత సూక్ష్మముగాఁ బట్టువడునా యను సంశయము వానిని బీడించుచుండినను, దిలేర్ఖానుతోఁ బ్రసంగించునప్పుడు మాత్రము పట్టుపడినవాఁడు ప్రతాపుఁడేయను నిశ్చయము వానికి గలుగుచుండెను. “మహాప్రభూ! ప్రతాపసింగు యువరాజై యుండఁగా మనము చిత్తూరు ముట్టడించిన సందర్భమున నేను వానిని గన్నులారఁజూచితిని. బాల్యమునందలి యాకారవిశేషములు నేటి ప్రతాపునియందు నాకు స్పష్టమగుచున్నవి.”



అని దిలేర్ఖాను చెప్పుచువచ్చిన సమాధానములు చక్రవర్తి సంశయ నివారణమునకుఁ గొంతవరకుఁ గారణము లగుచుండెను. ఇంతకు నప్పటికొక సంవత్సరముక్రిందటనే ప్రతాపసింహునిఁ జూచివచ్చిన మానసింహుఁ డుండనేయున్నాఁడు. అతఁడు రోగవిముక్తుఁ డైనంతనే నిజము గ్రహింపవచ్చునని యెంచి చక్రవర్తి కొంతవ్యాకులత్వమును దొలంగించుకొనెను. ఇంక మనము ప్రస్తుత కథావిధానము ననుసరింతము.

దిలేర్ఖాను తెచ్చిన వార్తవలనఁ బ్రజలెల్లరు రెండుదినములవరకు నాందోళన మొందుచుండఁగా మూఁడవనాటి సాయంకాలమున నాగ్రాపురవీథులలో నొక క్రొత్త కలకలము ప్రారంభించెను. ఏదో మహోపద్రవము జరుగుచున్నట్లు పౌరులెల్లరుఁ గలతపడుచుఁ గేకలిడుచు నిటునటుఁ బరువెత్తుచుండిరి. జనసమ్మర్ద మంతకంత కధికమగుచుండుటచేత వీథులలో నాడుకొనుచున్న తమపిల్లల నెత్తుకొని తల్లు లరుగులమీఁదను మేడల మీఁదను నిలిచి యావిశేషములను వీక్షింపసాగిరి. మహోపద్రవము! “మహోపద్రవ” మను కేకలేగాని యామహోపద్రవ మెట్టిదియో యనేకులకుఁ దెలియదు. తెలిసినవారు తెలిసి తత్తర పడుచుండఁగాఁ దెలియనివారు తెలిసికొనవలయునని తత్తర పడుచుండుటచేత జరుగుచున్న యుపద్రవమును గూర్చి యాజనసమ్మర్దములో నెఱిఁగినవా రెవరో యెఱుఁగనివా రెవరో నిర్ణయించుట కష

సాధ్యముగా నుండెను. 'అయ్యయ్యో! తరుణము మించిపోవుచున్నది. రక్షింపుఁడు! రక్షింపుఁడు! పాదుషావారి కెఱింగింపుఁ' డను కేకలచే వీధులెల్ల మాఱుమ్రోగుచున్నవి. విషయ మెఱుంగని యాందోళనముతోడను, గమ్యస్థాన మెఱుంగని పఱుగులతోడను గారణము తెలియని కలవరపాటుతోడను నిండిన యాజనసమ్మర్దములోఁ గొందఱు పృథ్వీరాజుయొక్క యుద్యానవనమువైపు పఱువెత్తుచుండఁగా ననేకులు వారి వెంట ననుసరించిరి. మఱికొందఱు రాజమందిర ప్రాంతమున నున్న 'దివానియము' వైపు పఱువెత్తుచుండఁగా ననేకులు వీరి వెంటఁగూడ ననుసరించిరి. దివానియ మనఁగాఁ జక్రవర్తి ప్రజలకు దర్శనమిచ్చు సభాభవనము.

ఆ వైపునకుఁ బోవుటవలన మనకిప్పు డెట్టి ప్రయోజనము నుండదు. ఆ దివానియమునందుఁ జక్రవర్తిదర్శన ముదయకాలములయందేగాని సాయంకాలములయందు లభింపదు. అందుచే నుద్యానవనప్రాంతమునకే పోవుదము. పట్టణమునకు నట్టనడుమ నైదారు ఫర్లాంగుల విస్తీర్ణముతో నిర్మింపఁబడిన యాయుద్యానవన మాపట్టణమును రెండుభాగములుగా విభాగించుచున్నది. ఇందు మొదటిభాగమున రాజమందిరములు రాజోద్యోగస్థుల మందిరములు రాజకీయ కార్యస్థానములు మెండుగా నుండును. రెండవభాగమున సామాన్యప్రజలును వర్తకులును విశేషముగా నుండురు. దుర్గప్రాకారముల



వలె నాయుద్యానవనముచుట్టునున్న ప్రాకారము లత్యున్నతము లగుటచే నేనుంగులపై నెక్కిపోవువారికిఁ దక్కఁ దదితరులకుఁ దద్వనాంతర్భాగములు గోచరింపవు. భార్యయైన జోసీభాయి ప్రోత్సాహమువలనఁ బృథ్వీరాజుచే నిర్మింపఁబడిన యావన మాదిలో సామాన్యసంసారమువలెనే యుండుచుండెను. ఆగ్రాపట్టణమునందలి రాజపుత్రస్త్రీ లనేకులు జోసీభాయితోఁగూడఁ బ్రతిసాయంకాలమున నందు విహరించుచుండుటయు, జోసీభాయియందలి గౌరవాతిశయమున నొక్కొక్కప్పుడు చక్రవర్తి భార్యలైన జోధాభాయి, రేవాదేవి మున్నగువారుఁగూడ నచ్చటకు వచ్చుట తటస్థించుటయు నాయుద్యానవన వైభవ మింతటి యున్నతివహించుటకుఁ గారణములయ్యెను.

వీధులు దాటి పఱువెత్తుచు నయ్యారామసీమ సమీపించుకొలఁది ముందువైపునుండి ప్రజలకు శరత్కాల మేఘములంబోలు తెల్లని పొగ లెల్లెడలఁ గ్రమ్ముకొని కానవచ్చుచుండెను. అందువలన వారి గమనవేగము నధికమైనది. నిప్పు లేకయే పొగయుండదుకదా! అందు నారామ ప్రాకారములు కంటఁబడిన వెంటనే తన్మధ్యంబున నఖండముగ మండుచుండిన యగ్నిమంటలును వారికి గోచరములైనవి. నా డుద్యానవనమధ్యంబునఁ దత్ప్రాకారౌన్నత్యమును నతిక్రమించి విజృంభించుచుండిన యగ్నిభగవానుఁడు ఖాండవవన కథా

విధానమును జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను. కడుంగడుఁ బొడవులై యున్న గోడలుదాటుటకు వీలుపడక వేలకొలఁదిఁ బౌరులు ద్వారమునకుంగల యినుపగజముల తలుపులకడ గుమిగూడి కేకలు వేయుచుండిరి. ఆ తలుపులయందలి యినుపగజములు, క్రిందను బల్లెములవలెను, మీఁదను ద్రిశూలములవలెను గడు వాడిమొనలుగలిగి యుండుటచేఁ గ్రిందనుండి దూరిపోవుటకు గాని మీఁదనుండి దాటిపోవుటకుఁగాని సాధ్యపడలేదు. ఆ తలుపుల కొక్కటితాళము వేయుటయే యాచారమైయుండినను నాడుమాత్ర మతిదృఢములైన రెం డినుపకప్పలు బిగింపఁబడి యున్నవి.

ఇనుపగజముల నెట్లయిన సాగఁదీయవలయు నను ప్రయత్నములు జరుగుచుండఁగా వెనుకనుండి గణగణ మను గంటలచప్పుడు వినవచ్చుటచేఁ బ్రజలావంకకుఁ దిరిగి నిరీక్షింప సాగిరి. యానసంబంధ బాంధవ్యంబున గజయానలు విహరించు నుద్యానమునఁ బ్రవేశించు కుతూహలముచేఁ గాఁబోలు, నత్యంతజవంబున వచ్చుచుండిన యొక గజరాజమును, దానిపై శృంగారింపఁబడిన బంగారపుటంబారియం దధిష్ఠించి యున్న యొక వీరపురుషుఁడును, వానివెనుకఁ గత్తులుఁ గటారులు నీటెలు బల్లెములు మొదలగు నాయుధములతోఁ దురంగా రూఢులైన సిపాయిలును, బ్రజలకుఁ గాన్పించిరి. తోడనే యెల్లవారును దత్తరపాటుతో ద్వారప్రదేశమును విడిచి దూర



దూరముగఁ దొలంగసాగిరి. తొలఁగిపోవుటయే తడవుగ నయ్యుత్తుంగమాతంగ మయ్యినుపతలుపులకడఁ బ్రత్యక్షమయ్యెను. దానిపైఁగల వీరపురుషుండును క్షణమాత్ర మిటు నటుఁ జూచి యేమియుం దోచక, యేనుఁగును బ్రాకారము చేరువకుఁ దోలించి, యత్యంత సాహసంబుతో నయ్యంబారి నుండి ప్రాకారమ్ముపై కుటికి, యందుండి లోనికిం దుమికి కంటఁబడుచుండిన మంటలవైపు పఱువెత్తసాగెను. ఆసాహస కృత్యమునకుఁ బ్రజ లెల్లరు నిర్భరానందభరితులై కరతాళ ధ్వనులతో 'అల్లాహో అక్బర్' అని కేకలిడిరి. వెంటవచ్చిన సిపాయిలును జక్రవర్తిమార్గమునే యనుసరించిరి.

లోనఁ బ్రవేశించిన చక్రవర్తి యిరువంకల బహువిధ పుష్పలతాపరిశోభితంబులగు సన్నని గచ్చుదారులనుండి పఱువెత్తుచు రెండుమూఁడు మళుపులు దాటినంతనే యయ్యుద్యానవనంబున నొకమూల విశాలమగు నొక యగ్నికుండమునం దఖండముగ మండుచుండిన ప్రచండానలజ్వాలలం జూడఁగలిగెను. ఆ యగ్నికుండముచుట్టును గొందఱు రాజపుత్ర స్త్రీలు చేతులుమోడ్చి నిమీలితనేత్రలై యతి భక్తితో నగ్నిభగవానుని ధ్యానించుచుండిరి. వారిమధ్య నిండు జవ్వనియగు నొక సుందరీమణి రక్తాంబరధారిణియై మందారకుసుమదామాలంకృతయై తన కోమల కరసరోజంబులఁ బసుపును గుంకుమమును ఫలంబులుం గల బంగారుపళ్ళెరంబు ధరించి

పతికై పరమేశ్వరుని ధ్యానించు రతివలె భక్తిపరవశయై నిలిచి యుండెను. ఆ సుందరీమణి కొంతవరకట్లు ధ్యానించి ధ్యానించి, తుదకొక నిట్టూర్పువిడిచి, 'జయ్ దీనరక్షకా! లోకపాలకా! అగ్ని భట్టారకా! మాం పాహి! మాం పాహి' యని కన్నులు విప్పెను. ఆమెతోడనే తక్కినస్త్రీలును దమ ధ్యానములు చాలించి కనురెప్ప లెత్తిరి. కన్నులు విప్పినతోడనే తటాలున నొక్కమా రగ్ని కుండములో నుఱుకవలెనని యుద్యమించి యారక్తాంబరధారిణి తన కట్టెదుటఁ బురుషరూపమునఁ బ్రత్యక్షమైన యగ్నిభగవానుఁడో యనునట్లు చూపట్టు చక్రవర్తిం గాంచి నిశ్చేష్టితయై స్తంభమువలె నట్లే యుండిపోయెను. జోసీభాయి మొదలగు తక్కినరాజపుత్రకాంతలుఁగూడ వెలవెలఁ బాటుతో వెనుకవెనుక కడుగు లిడఁ జొచ్చిరి. అప్పుడు చక్రవర్తి కరుణారసభరితంబులగు మంద మంద మృదూక్తులతో కరుణాదేవి కిట్లనియె.

"అమ్మాయీ! కరుణా! నీకిట్టి సాహసము తగునా నీ పతియైన రణమల్లుఁడు నా రాజ్యముకొఱకుఁ దనప్రాణము లర్పించినాఁడు. ఆతనికి నేను ఋణగ్రస్తుండను. నీ జీవితకాలమంతయు నిన్ను నాసోదరికంటె నెక్కుడుగ నాదరించి పోషించుచు నేనా ఋణమును దీర్చుకొనవలయునని యెంచుచుండ నీ విట్టి దుస్సాహసంబు వహింప వచ్చునా? నా రాజ్యంబున నిట్టి దారుణకర్మములు జరుగరాదని నేను శాసించుట నీ



వెఱుఁగవా! అతిదారుణమైన యీ యాత్మహింస మూఢచిత్తులేగాని నీవంటి ప్రజ్ఞావతు లొనర్పవలసినది కాదు. ఈ బలవన్మరణోద్యమమునుండి నీ వింక మరలుము! లెమ్ము!"

## మూడవ ప్రకరణము

### కరుణారణమల్లుల పూర్వచరిత్రము

ఆనాడు గురువార మగుటచేత మతవివాదసభలకై ఫతేపూరు సిక్రీకిఁ బ్రయాణ సన్నాహములోనున్న చక్రవర్తి యాకస్మికముగఁ గరుణాదేవి యగ్నిప్రవేశము గావింపనున్న దని విని, సిక్రీప్రయాణమునకు సిద్ధపరుపఁబడిన యేనుఁగు నెక్కి యచ్చటకు వచ్చెను. వానివెంట వాని పట్టపుదేవియైన జోధాభాయియు, ముద్దులరాణియైన దేవాదేవియు, క్రైస్తవభార్యయైన 'మేరీ'రాణియు, యువరాజ కుమారుఁడైన సలీమును, తక్కిన యంతఃపురరాణులునుగూడ బయలుదేర నెంచిరి. గజేంద్రప్రాణరక్షణార్థమై మహావిష్ణువు వెడలిన నాఁడు, వైకుంఠపురంబున నభ్యంతర సౌధమునం దవరోధవ్రాతమునఁ గలిగిన సంరంభమే నాఁ డార్తప్రాణరక్షణార్థమై వెడలిన చక్రవర్తియంతఃపురమునఁ గూడఁ గలిగెను.

మ॥ తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్ దానివె
న్కను బక్షీంద్రుఁడు వానిపొంతను ధనుఃకౌమోదకీ శంఖచ

క్రీనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు రావచ్చిరో య్యన వైకుంఠపురంబునం గలుగు వారాబాలగోపాలము౯.

జోధాభాయి మొదలగువారు ప్రయాణ సన్నద్ధులయ్యు జక్రవర్తితో సమముగా బయలుదేర లేకపోయిరి. స్త్రీలు మందయానలుగదా? పురుషులకుంగల కార్యతత్పరత వారి కుండదు. వారితోఁ జక్రవర్తియు జాగుచేసియుండిన యెడ, సునకీకథలోఁ గరుణాదేవి ప్రసంగమే లేకపోయి యుండును. తన దర్శనమునకువచ్చిన పౌరస్త్రీల దరఖాస్తులు మన్నించు చుండుటచే జోధాభాయియు, తన యలంకరణమున కావం తయుఁ గొఱంత కలుగఁగూడదను నియమము గలదగుటచే రేవాదేవియు, సురాపాన తత్పరతచే సలీమును, దమ తమ పరివారములతోఁ జాల సేపునకుఁగాని యా యుద్యానవన మునఁ జేరుకొనలేకపోయిరి. వారు వచ్చునరికే చక్రవర్తి యాజ్ఞప్రకారము కవాటములు తెఱువఁబడుటయు నగ్నిజ్వాలలు చల్లార్పఁ బడుటయుఁ గరుణాదేవి సంపూర్ణముగఁ రక్షింపఁబడుటయు జరిగిపోయినవి. అందుచే వచ్చినవారు వచ్చినయడుగులలోనే యంతఃపురమునకు మఱలుట తప్ప వారు చూడవలసినదియుఁ జేయవలసినదియు నేమియు లేకపోయెను. కొన్ని దినములవరకుఁ గరుణ నీయంతఃపురమున నీసంరక్షణమునం దుండవలయునని చక్రవర్తి చెప్పుటచేత, జోధాభాయి, మూర్తిభవించిన నాటి సాంధ్యరాగ ప్రభావిభ



వంబున శోభిల్లుచున్న కరుణను గరుణం జేరఁదీసి, లాలించి యోదార్చి తన గుఱ్ఱపుబండిలోఁ గూర్చుండఁబెట్టుకొని కోటకుఁ దీసికొనిపోయెను.

ఫతేపూరుసిక్రీప్రయాణ మానాఁడు చక్రవర్తికి వీలు పడలేదు. ప్రతాపసింగును గూర్చియే రెండుదినములనుండి విధి విరామములు లేకుండ యోచించుచుండుటచేత, వాని మనసు మిక్కిలి చీకాకు పడుచున్నది. కణతలు నొప్పిపెట్టు చున్నవి. సిక్రీపట్టణమున 'ఇబదత్ ఖానా' భవనములోఁ బండితుల మతవివాదములు విన్నయెడల మనోగమనమునకుఁ గొంత మార్పుగలిగి యా చీకాకు తొలంగునని యాత డనుకొనెను. కాని మహాకార్యములవలెనే స్వల్పకార్యములును మన మనుకొనినట్లు జరుగవు. ఇంతవరకు వీరప్రతాప వేదండముచే నల్లకల్లోలము గావింపఁబడుచున్న వాని మానస కాసారమునందుఁ గరుణారస తరంగములలోఁ గరుణారణ మల్లులిప్పుడు రాయంచల జతలవలె నుయ్యాల లూగుచున్నారు. వానిచిత్తమునం దిప్పుడు కరుణా రణమల్లుల చింతయే గాని ప్రతాపుని చింతలేదు.

అకాలమరణమ్మును బ్రాపించిన రణమల్లుఁడు బలవన్మరణమును దలంచిన కరుణాదేవియుఁ జక్రవర్తి యంత వానికి సంతాపకారకు లగుటచే, ఆదంపతుల విషాద జీవిత కథాసంగ్రహమును మా చదువరులు తెలిసికొనవలసియున్నది.

చక్రవర్తి చిత్తూరు ముట్టడించి రాజపుత్రుల నోడించి ప్రతాపసింగును వాని తండ్రియైన యుదయసింగును బారఁదోలి కోటను స్వాధీనపరచుకొనిన సందర్భములో ఘటికులైన రాజపుత్రవీరులను గొందఱను ఖైదీలుగాఁబట్టి దీసికొనివచ్చెను. ఆఖైదీల యదృష్టవశమునఁ గొలఁది దినములకే చక్రవర్తి జన్మదినోత్సవము వచ్చినది. చిత్తూరురాణా సైన్యములో నిఁకఁ జేరుకొనమని ఖరారుచేసినవారు నేడు విడుదల కాఁబడుదురని చక్రవర్తి ప్రకటింప ఖైదీలందఱు నా షరతున కంగీకరించిరి. వారిలోఁ గరుణాదేవితండ్రి యొకఁడు, కాని యందరితోఁబాటుగ జయపాలుఁడు విడువఁబడలేదు. చిత్తూరు రాణాలకు ముఖ్యమంత్రియై యతఁడనేకలక్షల ధనము నార్జించి యుంచినట్లు చక్రవర్తి విని, విడిచిపెట్టినయెడల జయపాలుఁడా ధనమంతయు సైన్యాభివృద్ధికొఱకుఁ బ్రతాపసింగున కొసంగునేమోయని యనుమానపడి, 'నీయాస్తికంతకును మేము ధర్మకర్తల (Trustees) మై యుందుము, మాతోఁ జెప్పకయే నీవెట్టి వ్యయము నొనర్పరాదని యాజ్ఞాపించెను. జయపాలుఁడున్ దనయొద్దనంత యధికమైన ధన మేమియు లేదని మనవి చేసికొనెను. తన సెలవగువరకుఁ బట్టణమును విడిచిపోకుండ నాజ్ఞాపించి చక్రవర్తి వాని యాస్తిశోధనము చేయించెను. ఆకార్యమున కేర్పడినవాఁడు వానికి విశ్వాసపాత్రుఁడును ఖిల్లేదారు నగు రణమల్లుఁడు జయపాలుని స్వస్థలంబైన కుంభిళా



ఘర్ దుర్గమున కేగి రణమల్లుఁడు వాని కుటుంబముచే నెంతయు నాదరింపఁబడెను. జయపాలుని భార్యాపుత్రికలు జయపాలుని కొఱకు విచారించుచుండ రణమల్లుఁడు వాని క్షేమవార్తల నెఱింగించి వారికి ధైర్యమును గఱపెను. ఆ సందర్భమునందే కరుణారణమల్లుల నిర్మలమానసక్షేత్రములయందుఁ బరస్పరానురాగబీజములు నాటఁబడినవి.

జయపాలుని యాస్తివివరములను వ్రాసితెచ్చి రణమల్లుఁడు చక్రవర్తికిఁ జూపించెను. ఆ వివరములను మొత్తము చేసి విమర్శింపఁగా నుద్యోగ మక్కరలేకయే జయపాలుఁడును నాతని కుటుంబమువారును స్వేచ్ఛగా జీవనము చేయుటకుఁ దగినంత ధనముకంటె నధిక ధనమేమియు వానికిఁ గానరాలేదు. అందుకుఁ దోడు రణమల్లుఁడును జయపాలుని యోగ్యతావిశేషములనుఁ గూర్చి కుంభిళాదుర్గమునఁ దాను విన్నవి విన్నవించుటయుఁ జక్రవర్తి సంతుష్టుఁడై రాజకీయ నిర్బంధమునుండి జయపాలుని స్వేచ్ఛగా విడిచెను. ఇంతటి మహోపకార మొనర్చిన రణమల్లున కేమి ప్రత్యుపకార మొనర్పవలెనో యింటి కేగి భార్యాపుత్రికలతోఁ బ్రసంగించువరకు జయపాలునకు స్ఫురింపలేదు. స్ఫురించిన తరువాతఁ గరుణను [illegible] ణాతోఁ బరిగ్రహింపుమని యతఁడు రణమల్లునకు శుభవార్త నంపెను. కరుణారణమల్లుల వివాహము నిశ్చయమైనది.

తన తమ్ముని వివాహమును గూర్చి ప్రయత్నించుచుండిన రేహారాణి కీసంగతి తెలిసెను. తెలిసి కరుణను దా మో

దరసింగు కొలువు నడుగవలయునని యామె చక్రవర్తిని గోరినది. చక్రవర్తియు జయపాలునకుఁ గబురు పంపెను. కరుణా రణమల్లుల వివాహ మిదివరకే నిశ్చయింపఁబడిన దనియు, నుత్తమ రాజపుత్రుఁ డన్నమాట దాటనేరఁడనియు, క్షమింపవలసినదనియు జయపాలుఁడు ప్రత్యుత్తరమును బంప, నుదారమానసుఁడైన సార్వభౌముఁడు వాని యుత్తమశీలమున కెంతయు సంతసించి తానే లగ్ననిశ్చయమును జేయించి జయపాలున కెటెంగించి స్వంతధనముతోడనే కరుణా రణమల్లుల పరిణయోత్సవమును మహోత్సాహమునఁ జేయించెను.

ఎంతకాలమునుండి యెంత ప్రయత్నించుచుండినను ఘన్నతకుటుంబస్థు లెవ్వరును దామోదరసింగునకుఁ గన్య నిచ్చుట కంగీకరింపకపోవుటచేతను జక్రవర్తియుఁ దద్విషయమున శ్రద్ధవహింపకుండుటచేతను, రేవాకు సహజమైన యీర్ష్య, పంతము, పౌరుషము, క్రౌర్యము, మొదలగు దుర్గుణములు కార్యరూపమున వెలువడి జయపాలునిపై విజృంభించినవి. మద్యపానమత్తులైన దామోదరసింగును సలీమును దన పరివారములోనుండి కొందఱు సేవకులను జయపాలుని కడ తేర్చుటకై యామె ప్రోత్సహించినది. కుమార్తెనుజూచుట కాగ్రా నగరమునకు వచ్చి స్వగ్రామమున కొకటిరెండు దినములలో బోవనెంచుచు నొకనాటి సాయంసమయమున యమునాప్రాంతమున విహరించుచున్న జయపాలుని మూర్ఖులైన దామోద



రాదు లాకస్మికముగఁ బట్టుకొని కాలుసేతులు గలయఁగట్టి నదిలోఁ బారవేసి, ప్రమాదవశమునఁ బాపము జయపాలుఁడు కాలుజారి నదిలోబడిఁ గొట్టుకొనిపోయెనని ప్రకటించిరి. ఆదారుణ కృత్యమున కాధూర్తులే కారకు లని పురవాసులు గ్రహించిరి. చక్రవర్తియు గ్రహించెను. కాని యెంతవిచారించినను దగినసాక్ష్యము రానందున నతఁడు వారిని శిక్షింపలేకపోయెను.

ఇంక, రేవాదేవి క్రూరదృష్టిపథంబున సంచరించుచున్న రెండవవాఁడు రణమల్లుఁడు. చక్రవర్తి మొదలు రాజభవనములోని నీచసేవకుని వరకును నెలనెలకు నగు ఖర్చులన్నియు రణమల్లుని చేయిమీఁదుగనే జరుగుచుండును. చక్రవర్తికిని వాని రాణులకును వలయు దుస్తులకు, వస్తువులకు, వారప్పుడప్పుడు గావించుచుండు నుత్సవములకు నగు ధనవ్యయమంతయు వారివారి యనుమతుల ననుసరించి రణమల్లుఁడే గావించుచుండెను. సాధారణముగఁ బ్రతిసంవత్సరమును జరుగు నౌరోజా యుత్సవములోని స్త్రీల యుత్సవభాగమున కెప్పుడును జోధాభాయియే యాజమాన్యము వహించుచుండుట వాడుక. ఉద్యోగస్థుల భార్యల కందఱకు నామెసంతకముతోడనే యాహ్వానపత్రికలు పంపఁబడుచుండెను. ఏటేట నీ గౌరవమొక్క జోధాభాయియే పొందుచుండుట రేవారాణి చూచి సహింపలేక చక్రవర్తికడఁ దగవు పెట్టెను. చక్రవర్తియు నొక్కొక్క సంవత్సర మొక్కొక్కరు యాజమాన్యము

వహించుచుండు డని యా తగవు పరిష్కరించెను. ఆ పరిష్కా-
రము ప్రకారము రేవాదేవివంతుగల సంవత్సరము వచ్చినది.
అందటి రాణులకంటెం దన యాజమాన్యమున నా యే డా
యుత్సవ మతిజయప్రదముగ జరుగవలయుననియు, పట్టణ
మందలి స్త్రీలును బురుషులును 'నోశాహా హో' యని తన్ను
వేనోళ్ళ శ్లాఘింపవలయుననియు, చక్రవర్తియు బ్రహ్మానంద
భరితుండై యింకమీంద వంతులనియమమును రద్దుచేసి తన
కే శాశ్వతమైన యాజమాన్యము నొసంగవలయు ననియు
నెన్నియో గొంతెమ్మకోరికలు కోరుచు రేవారాణి సంవత్సర
ప్రారంభమునుండియే యుత్సవ ప్రయత్నములు ప్రారం
భించెను. ఉద్యోగస్థుల భార్యలకు, ఆహ్వానింపంబడిన యితర
పౌరస్త్రీలకు బహుమానము లొసంగం దగినట్టివియు, తనకును
దన పరివారమునకును నర్హమైనట్టివియు దుస్తులను నామె
యొక జాబితా వ్రాయించి రణమల్లున కిచ్చెను. ఆ జాబితా
ప్రకారము నందలి దుస్తులన్నియు సిద్ధము చేయించి యుత్సవ
మున కెంతయు ముందుగనే తెప్పించవలసిన భారము రణమల్లు
ందున్నది.

పలువిధములైన మేలి ముసుంగులు, చీరెలు, రవికలు,
పాయ్జామాలు, కబ్బాలు, మొదలుగ రాజపుత్రి మొగలాయి
కాంత లా దినములలో నుపయోగించుచుండు స్త్రీవస్త్రవిశే
షములేగాని యాజాబితాయందుం రుషులకుం గావలసిన
వేమియు లేవు. తెల్లనివికొన్ని, రంగురంగులవికొన్ని, తళతళ
లాడు వెండిజరీబుటాలవి కొన్ని, ధగధగలాడు బంగారు జరీ
హారంగుల రంగారునవికొన్ని, పిడికిట నిముడంగల సన్నని
నేత నేరుపు చూపు నూలుపనులు కలవిగొన్ని, కన్నులకు మిఱు
మిట్లు గొలుపు హారాంబట్టు పట్టుపనులు కలవికొన్ని, ఇట్లు రేవా
రాణి తనకుం గావలసిన వాని కన్నింటికిని బరిమాణరూప
మూల్యాదులను నిర్ణయించియే యాజాబితా యందు వ్రా
యించెను. అందు వివరింపంబడిన దుస్తులు వర్తకులకుం బ్రత్యే
కముగ 'దాదాన్' (advance) ఇచ్చి చెప్పి చేయించవలసి
నవియే గాని బజారులలో సిద్ధముగా దొరకునట్టివి కావు.
మహారాణులకుం గావలసిన యమూల్యము లగు వస్త్రములు
నాటి యాగ్రాపట్టణమునం గాని తదితరపట్టణములం గాని
కొనువారికి లభింపకపోవు. కాని రేవారాణి నిర్ణయించిన వివ
రము లన్నియుం గ్రొత్తక్రొత్తవి యగుటచేత రణమల్లుండు
ప్రత్యేకముగం దయారు చేయించవలసి వచ్చెను. అంగళ్లలో
సామాన్యముగా లభించుచుండు రకములం దెప్పించిన యెడల
రేవా కేమిగొప్ప యున్నది?

రణమల్లుం డతిజాగరూకతతో జాబితాను మఱల
మఱలం జూచుకొని, పట్టుదుస్తు లన్నియు 'సూరత్' నగరము
నందును, నూలు దుస్తులన్నియు 'అహమ్మదాబాదు' నందును
చేయింప నేర్పాటు చేసికొనెను. ఆకాలములోం జిత్రవిచిత్రము

లైన వెండి బంగారు జరీపనులతో నూలుబట్టలు నేయుటకు అహమ్మదాబాదుపట్టణమును, పట్టుతో నత్యద్భుతముగ తివాసులు చీరెలు నేయుటకు సూరత్ పట్టణమును మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి. పారిశ్రామికవిద్యలయందును జక్రవర్తి మిక్కిలి మక్కువగలవాఁడగుటచే నాటి దినములలో ననేకస్థలములయం దిట్టిపను లభివృద్ధి గాంచుచుండెను. జను లీకళల నతిశ్రద్ధతో నభ్యసించుచుండిరి. చక్రవర్తి మెప్పువడయుటకై వర్తకులును బోటీతోఁ దమనేరుపు చూపుచుండిరి.

జాబితాప్రకారము కలతుల మొత్తము మూల్యము గల యావస్తులకొఱకు సూరత్తహమ్మదాబాదు వర్తకులకు రణమల్లుఁడు వేలకొలది ధనము బాకీ నొసంగెను. వర్తకులును నియమిత కాలములోఁ దమపనులు నెరవేర్చిరి. ఒంటెలు, బండ్లు మొదలగువానిపై నాసామానులు జాగరూకతతో భద్రపరచిరి! బిడారులు గట్టిరి! బయలుదేరిరి! కాని బిడారులం గట్టివచ్చు వర్తకులదారిలో నడ్డువెట్టి, కొల్లగొట్టు నాచారము గల భిల్లాసేనాపరివృతుండగు ప్రతాపసింగును వారెట్లుతప్పించుకొనఁగలరు? పాపము రేవాదేవి దురదృష్టవశమున లక్షల కొలఁది విలువగల యాసామానులఁ బ్రతాపసింగు భిల్లులతో సంపూర్ణముగా దోచుకొనెను. వర్తకులేడ్చుచు వచ్చి చక్రవర్తితోఁ జెప్పుకొనిరి. రేవాదేవి పేరాసలన్నియు నొక్కమారుగ నాశనమైనవి. నౌరోజాయుత్సవ ప్రయత్నము



లెక్కడి వక్కడనే యాగిపోయినవి. రేవావంటి స్వార్థపరుల కార్యములిట్లే భంగపడుచుండును.

తనతమ్ముఁడైన దామోదరుఁడే జయపాలుని మరణమునకుఁ గారకుఁడని యెంచి, రణమల్లుఁ డాకోపముతోఁ దన కార్యమును భగ్నపరుపవలయు నని ప్రతాపసింగునకు రహస్యవార్త నంపి, యీదోపిడి చేయించెననియు, ఆరణమల్లుఁడే యిప్పుడు సేనలతో నేగి ప్రతాపసింగు నోడించియో ప్రార్థించియో సామానులన్నియు యథాక్రమముగఁ దెచ్చి యప్పగింపవలసిన పూచీకలవాఁడనియు రేవాదేవి చక్రవర్తిని హెచ్చరింప నారంభించెను. ఆసేతుహిమాచలమును భారతవర్షమంతయు జయింపఁగలిగిన చక్రవర్తి యొక్క స్త్రీమానసమును జయింపలేక యెట్టకేలకందు కంగీకరింపక తీరినదికాదు. చక్రవర్తి సెలవుపై రణమల్లుఁ డాసఫ్ఖాను సాహాయ్యముతో సేనలంగొని ప్రతాపసింగుపై దండెత్తెను. ఆదండయాత్రలో నతఁడు గతించెనన్న వార్త రేవాకెంత సంతోషకరమో వేరుగఁ జెప్పవలయునా?

## నాలగవ ప్రకరణము.

### పరామర్శలు

ఆరాత్రి గడచి యెట్లో తెల్లవారినది. తెల్లవారుటయుఁ గరుణను బరామర్శించుట కంతిపురి రాణులొక్కరొక్కరె

జోధాభాయి భవనంబునకు వచ్చుచుండిరి. రేవాదేవియు వచ్చెనని మాత్రము మా చదువరు లూహింపరాదు. అన్ని విషయములయందును జోధాభాయికిఁ గల ప్రాభవము తనకును గలుగవలెనని యామె యాశయము. అందుచే నామె యెవ్వరి యభ్యంతరమునకును బోదు. రాణు లెవ్వరును నామె భవనమునకు రారు. తఱచుగాఁ దన్నుఁ జూచుటకు వచ్చుచుండు రాణులను జోధాభాయి యెదుర్కొని గౌరవాదరణములతోఁ గొనివచ్చి సుఖాసీనలం జేసి కర్పూర తాంబూలాదుల సత్కరించుచుండుట యాచారము. నాఁడామె యెవ్వరి నెదుర్కొనలేదు. కూర్చుండుఁడనినైన నుడువలేదు. ఆ నజరుమహాలులోని వింత సొగసులను జూచి యానాఁ డానందించువారే లేకపోయిరి. తన సపత్నులుగాని, పౌరస్త్రీలుగాని తన్నుఁ జూచుటకు వచ్చినప్పుడు జోధాభాయి యానజరుమహాలులోనే దర్శన మిచ్చుచుండును. దేవితో నత్యవసరముగా మాటాడవలయునని వచ్చు మందయానల తొందర లెల్ల నాసుందర మందిరమందుఁ జొచ్చునంతనే మందమగు [illegible]డును. సత్యము చూచుచుండువారికే చూచిన కొలందిని జూడ వేడుక వొడమించు నాదివ్యభవనము స్వర్గమునుండి తెగి భూమండలమునకు జారిన యొకఖండమువలె నున్నదని యొకప్పుడు 'అబుల్ ఫజల్' వర్ణించెనఁట! చక్రవర్తి తాను దఱచుగఁ దెప్పించుచుండు 'ఫిరంగుల'ను నూతనాగ్ని యంత్రో,



ములను బరీక్షించుటకై యాకసమ్ముదెస ప్రేలించుచుండుటచే నమ్మహాధ్వానమునకే స్వర్గఖండ మిట్లు పగిలి జారియుండునని తన యన్నగారి వర్ణనమునకు 'ఫైజీ' మహాకవి మఱింత వన్నె పెట్టెనట! అట్లు తెగిపడిన స్వర్గభాగమునందే రమాదేవి యంతఃపురమునుండుటచేత, నాయంతిపురి సౌధంబుతోడనే నామెయు నేలకుం జారి 'జోధాభాయి' యను నూతననామము వహించెనని యాసోదర కవుల కవితాలంకారమును 'ఖాదాసీ' కవీశ్వరుఁడు పొడిగించెనఁట! లక్ష్మీవియోగమును సహింపలేక మహావిష్ణువు తన తేజోగుణశీలాదులతోఁ జక్రవర్తియం దైక్యము చెందెనని పృథ్వీరాజును జమత్కరించెనఁట! ఇట్లు రమామహావిష్ణులు భూలోకవాసులైరని వినినంతనే సత్యభామయు రేవాదేవియై యవతరించెనని వికటకవియైన 'బీరబలుఁడు' అందఱను నవ్వించెనఁట!

ఇట్లు మహాకవుల కవితావర్ణనములకు వలయు నన్ని భావముల సంఘటించుచుండు తత్కాంచనాంచిత సుందర మందిరమందు వచ్చినవారిని 'దయచేసి కూర్చుండు' డని గౌరవించుచున్నవో యనునట్టు లత్యద్భుతముగ నిర్మింపఁబడిన చిత్రవిచిత్రములైన సాల భంజికలకు నడుమనడుమ వెండి బంగారు పనుల మఖమలు సోఫాలపై సుఖాసీనలైన రాణులు, కడుంగడు విచారముతో నోట నేమాటయులేక నిశ్చేష్టలై తదేకధ్యానంబున నట్టె కూర్చుండి యుండిరి. వారి యుచ్ఛ్వాస

నిశ్వాసములే సాల భంజికలనుండి వారిని వేరు సేయుచున్నవి. వారికిఁ గట్టెదుటనే రత్నప్రభాభాసమాన మగు నొక హేమాసనమున జోధాభాయియుఁ గరుణతో నాసీనయై యుండెను. నిద్దంపు టద్దంపుఁ బనుల నేరుపు నందే రాజ్య మేపుచూపునో తీర్పు చెప్పఁ డని చూపరులఁ గోరుతీరున నొండొంటి నతిక్రమించుచు నలువంకల నలంకరింపఁబడిన నాల్వార బీహార దేశముల నిలువు టద్దములలో వారందఱి ప్రతిబింబములు నసంఖ్యాకములై గానవచ్చుచుండెను. దేవితో నేకాసనాసీనయైన కరుణ దేవిదిక్కు మొగంబై యాసోఫాపై వెనుకకుఁ జేరబడి, చుట్టును గల బంగారు దండెపైఁ దన మోముదమ్మినిఁ జేర్చి శిల్పకారుఁ డందు మంచి ముత్తియమ్ములఁ బొదువని కొఱంతను తన యశ్రుకణంబులఁ దొలంచుచుండెను. జోధాభాయియుఁ దన కాంచనచేలాంచలమున నప్పుడప్పు డామె కన్నీ రొత్తుచుండెను. ఆటకత్తెలనాట్యములతోడనో, యంగనామణులసంగీతములతోడనో, చెలిమికత్తెలక్రీడావిశేషములతోడనో, పలువిధము లగు నుత్సవములతోడనో నిత్యము సత్యుత్సాహ జనకం బగు నాయంతఃపురమంతయు నిప్పుడు నిశ్శబ్దమై యున్నది. ఆదినము వినోదముల కెల్ల సెలవుదినము. అంతిపురి పరిచారికలు సైతము నొండొరులతోఁ బ్రసంగించుకొని నప్పుడు గుసగుసలే కాని, మాట విన నిచ్చుట లేదు. కంకణముల ఘణంఘణలు, కింకిణుల ఝణంఝణలు, బంగరు చిఱుము



వ్వాల ఘల్ఘలారవములు, ఆటలు పాటలు, పకపకలు వికవికలు ముచ్చటకైన నెచ్చటను వినరావు, కనరావు. పంజరంబులయందలి రామచిలుకలుగూడ నొంటికాలు మడచి యోరగన్ను వైచి సగము నిద్రించుచుండెనే గాని రెక్కలు చాచుచుఁ జకచక లాడుచుఁ గిలగిలఁ బలుకుట లేదు. మొత్తముపై నా ప్రాంతమునం దెందుఁ జూచిన నా నా డానందమునకుఁ జోటే లేకపోయినది. కరుణ ప్రవేశించినప్పటినుండియు నాయంతఃపురమంతయు, 'ఏకో రసః కరుణ ఏవ' యని పల్కిన భవభూతిమహాకవి కావ్యమువలెఁ గేవలము గరుణ రసపూరితమై కానవచ్చుచుండెను.

కరుణను బరామర్శించుటకు వచ్చిన రాణులు పాపమామెదీనావస్థను జూచి నోరు విప్పి మాటాడలేక వచ్చినవారు వచ్చినట్లే కూర్చుండి యుండిరి. ఏడ్చుచున్న కరుణయేడ్చుచున్నట్టులే యుండెను. చలనములేని యవయవములుఁ, చలనములేని దృష్టులు, చలనములేని మనోచింతలును గల రాణుల కెల్లరకును కట్టెదుట నున్న ద్వారమునకు వ్రేలాడుచున్న పటకవాటమును దప్పించుకొని వచ్చిన చక్రవర్తి యాకస్మికదర్శనము క్రొత్తచలనము కలిగించినది. రాణులెల్లరుఁ దమతమ యాసనముల నుండి తటాలున లేచిరి. కరుణయు జోధాభాయితోడనే లేచి కన్నీరొత్తుకొనుచు నామె వెనుకను నిలిచి యుండెను. చక్రవర్తి మెల్లఁగ వచ్చి యాసీనుఁడై

చేసంజ్ఞలతోడనే తక్కినవారికిని గూర్చుండ సెల వొసంగెను. ఆతనిదృష్టిపథమునుండి తప్పి జోధాభాయి చాటుగ నందఱితోఁ గరుణయుఁ గూర్చుండెను. ఆమెకు దుఃఖోపశమనము గావింపవచ్చిన చక్రవర్తిప్రవేశము తద్దుఃఖాతిశయమునకే కారణమైనది. పరామర్శించుకొలఁది నతిశయించుచుండుట దుఃఖమునకు స్వభావము. ఆమె దుఃఖాతిశయమును గనిపెట్టియుఁ జక్రవర్తి రెండు మూఁడు నిముసములవరకు నిశ్శబ్దముగఁ గూర్చుండి మెల్లఁగ నిట్లోదార్పఁ గడంగెను.

"కరుణా! ధైర్యమును వహింపుము. గతమును మఱచిపొమ్ము. ప్రజ్ఞావతివైన నీవంతకంత కజ్ఞానమునఁ బడిపోకుము. నీపతి తన ప్రభువుకొఱకుఁ దన బాహువిక్రమకళాకౌశలం బెల్ల వెల్లడించి యిప్పుడు వీరస్వర్గము నలంకరించియున్నవాఁడు. అట్టి లోకైకవీరు నిల్లాల వగుటచేతనే నీ వెంతయు ధన్యురాలవు. రణమల్లుఁడు సార్థక నామధేయుఁడు. వానియం దింతటి యసాధారణ ప్రజ్ఞ కలదని నే నెన్నఁడు నెఱుఁగను. రాజపుత్ర భిల్లసేనాపరంపరలయం దాతని వీరవిహార నైపుణిం గాంచి మన యూసఫ్‌ఖానాదులు దిగ్భ్రమఁ జెంది నిశ్చేష్టితులైనట్లు లెర్ఖాను చెప్పుచున్నాఁడు. రణరంగమున వీరమరణము నొందిన పతిం దలంచి గర్వించునేకాని యుత్తమరాజపుత్రిక యెన్నఁడును గంటఁ దడిపెట్టదు. వీరశిఖామణి యైన నీ మనోహరుని వీరవిహారగాథలను వినోదకథలుగాఁ జెప్పుచు నీజీవిత



శేషమును భర్తృనామస్మరణముతోడనే గడపి నీవును వీరపత్ని వను విఖ్యాతి నొందుము. ఎన్నిదినంబులని యిట్టు లేడువఁగలవు? ఏడిచి యేమి ప్రతిఫల మొందఁగలవు? మహాపతివ్రత కిది యుత్తమశీలమా!"

"దేవా! మహాపతివ్రతల యుత్తమశీలము ననుసరించుటకు నాకు దేవరవారియనుజ్ఞ లేకపోయినది. ఏమి చేయఁగలను? లేనియెడల నేనీసరికే హాయిగా వీరస్వర్గమున నామనోహరుని చరణసేవ సేయుచు నీ దుర్భర విషాదబాధ లేక సుఖించియుందును. మహారాజా! ఇప్పుడైన నేమాయె? నాయొక్కతెకు మాత్రమే సెలవొసంగుఁడు. మీ పాదములు పట్టుకొనెదను. నే నెవరికొఱకు జీవింపవలయును? నాకుఁ దండ్రియైనను లేఁడుగదా! దేవా! నాతండ్రి...... నాతండ్రిని.........నాకన్నతండ్రిని—"

"సోదరీ! నీపతివిషాదగాథకుఁ దోడుగ గతించిన నీ తండ్రివిషాదగాథకూడ జ్ఞప్తికిఁ దెచ్చి నామనసు మఱింత కలతపెట్టకుము. నీవును హృదయమును బ్రద్దలు చేసికొనకుము! ఎంతవిచారించినను రవంతయైన నాధారము లేకపోయినదికాని నీతండ్రిమరణమునకుఁ గారకులైన వారు నా కెట్టి యాప్తులైనను క్షమింపక స్వయముగ నా చంద్రహాసముతో నే చిత్రవధ గావించియుందును. [illegible]ంచిపోయినది. ఇప్పుడదంతయును ద్రవ్వనేల? నీ దుఃఖజీవితమునకు

నీకంటెను నే నెక్కుఁడు దుఃఖించుచున్నాను. నీ వేమి కోరి నను గాదనను గాని నీవెంత ప్రార్థించినను నాత్మహత్యకు మాత్రము నీకు సెలవొసంగఁ జాలను. దారుణమైనయట్టి యాత్మహింస కూడదని నాశాసనము. నాశాసనమును నేనే యతిక్రమించిన........”

“దేవా! పతిమరణక్లేశానలమున దందహ్యమానాంగి నగుచున్న నిర్భాగ్యురాలను. నాయెడల దేవరవారి శాసనముపయోగపడలేదు. సహగమనమును నివారించిన మీ దయార్ద్ర హృదయము దారుణమైన యాత్మహింస నొందు నన్నుఁ జూచియుఁ గరుగకున్న దేమి? క్షణములో నెంతబాధయైన భరింపనచ్చును గాక! ఈదారుణ మనోవ్యధను జీవితకాలమంతయు నెట్లు భరింపఁగలను? మహారాజా! ఈక్రూరశాసనము నా కొఱకే నిర్ణయించిరా! పోనిండు! నన్నిచ్చటకైనఁ బోనిండు! నాకు దయతో సెలవొసంగుఁడు! కాషాయాంబరధారిణినై భర్తృసంకీర్తనములతో దేశాటనము గావించుచు నెన్నినాళ్లకైనను దివ్యక్షేత్రంబైన నాపతిమరణక్షేత్రంబునఁ జేరుకొనెదను. అందొక యాలయంబును గట్టించెదను. దానిలో నాదైవమును బ్రతిష్ఠించుకొనెదను. అచ్చటనే హృదయేశ్వరారాధనముతో నాజీవితమును గడపెదను.”

“ఆయాలయమును నేనే కట్టించెదను. అబలవు. ఏకాకివై యంతదూర మెట్లు పోఁగలవు? హృదయేశ్వరారాధనము



నీకు! వీరపురుషారాధనము మాకు! అందుచే రణమల్లుని విగ్రహము మాకును నవసరమైయున్నది. మొగలాయి సామ్రాజ్యమునకు రక్షకులైన మానసింహాదిమహావీరుల చిత్రపటములు నాయొద్ద గ్రంథస్థములైయుంట నీ వెఱుఁగుదువు కదా! అందు రణమల్లుని చిత్రపటమిప్పుడు చేర్పవలయు. ఆచిత్రమును నీవే చిత్రింపుము. చిత్రలేఖనమునందు నీవప్రతిమ ప్రతిభామతి వని జనానాలో నప్పుడప్పుడు వినుచుందును. నీపతిమరణస్థలంబున నీవు కోరినట్లుగ మండపమును గట్టించువరకు నీవు మా జోధాభాయికడ నుండుము. లేదా జోసీభాయికడనుండుము. నీ వెక్కడ నున్నను బ్రతిమాసమును నీపతివేతనము నీకుఁ జెల్లుచుండును.”

“దేవా! రేవాదేవికడ నుండెదను. నాతండ్రికిని నాపతికినిం బోలె నాకును ద్వరలోనే కష్టములు తుదముట్టఁగలవు.”

“అబ్బబ్బా! చెప్పినమాట విను. ఆప్రసంగము లింక మఱచిపొమ్ము. సర్వకారణ కారణుండైన సర్వేశ్వరుఁడే సకల శుభాశుభములకును గారణుఁడు. అకారణముగ నొరుల నిందింపనేల?”

“మహారాజా! ఏలినవారు నాకుఁ గటాక్షించిన నాపతి వేతనము నష్టద్రవ్యపరిహారముకొఱకుగా రేవాదేవికిఁ జెల్లుచుండునట్లనుజ్ఞ దయచేసి యీయపఖ్యాతి నాకును నాపతికిం గూడఁ దొలంగునట్లనుగ్రహింపుఁడు.”

"కరుణా! నాకుఁగాని మానసింహాదులకుఁ గాని రణ మల్లునందట్టి యనుమానము లేదు. కేవలము రేవాసు దృష్టి పరచుటకొఱకే నీపతి నీకార్యమునందు నియోగించితిని గాని యనుమానముచేతఁ గాదు. ఎన్నిమారు లాప్రతాపుఁడు మన వర్తకుల దోచుకొనలేదు? ఎన్నికోట్లద్రవ్యము నష్టము కాలేదు? ఇన్నింటికిని మీరే బాధ్యులా? పోయిన నౌరోజాయుత్సవపు సామానుల జాడ లచ్చటచ్చటఁ గానవచ్చుచున్నవఁట! అందుకొఱకుఁ బ్రత్యేకపరిశోధకులేర్పడిరికదా? తొందర యేల? సత్యాసత్యములు బయలుపడక పోవు."

ఇట్లు ప్రసంగించుచుండ దిలేర్ఖాను వచ్చి ఖైదీయైన ప్రతాపసింగుతో స్యాలకమహారాజు సపరివారంబుగఁ బట్టణమునఁ బ్రవేశించెనని చెప్పుటచేతఁ జక్రవర్తి యాప్రసంగము నంతతో ముగించి తటాలున లేచిపోయెను.

## అయిదవ ప్రకరణము.

### —♦ కలవరింత ♦—

"మహారాజా! రాజపుత్రవంశములోఁ బ్రతాపసింగు వంటి తేజశ్శాలి లేఁడు. మనకాతఁడు ప్రబలశత్రువని యాసేతుహిమాచలము నీ భరతఖండములో నందఱు నెఱుంగుదురు. అట్టి మహావీరుఁ డిప్పుడు పట్టువడినందున వానియెడఁ



దమకు సహజమగు నౌదార్యమును వెల్లడింప గోరుచున్నా"మని రాణులును ముఖ్యముగా జోధాభాయియుఁ జక్రవర్తికిఁ గబురంపిరి. రాణులు తన్నుఁ గోరినదియుఁ దాను దనలోఁ దలంచుచున్నదియు నొక్కటియే యైనందున నతఁడు నిర్వివాదముగ వారి విన్నపమును మన్నించెను. అబుల్ఫజలు పృథ్విరాజు మొదలగు వారుఁగూడఁ జక్రవర్తిని దర్శించి యీవిషయమును గూర్చియే యాతనితోఁ బ్రసంగించిరి. ఔదార్యవంతుఁడైన ప్రభువు, యోగ్యులైన మంత్రులును గలరాజ్యములో నకార్యములు సాధారణముగ జరుగవుగదా? వారందఱుఁగూడ నేకగ్రీవముగఁ బ్రతాపసింహు నుచితగతి గౌరవింప వలయుననియే తలంచిరి. పట్టణమంతయు నలంకరించి గొప్పయుత్సవముతో ఖైదీని నగరులోనికిఁ దీసికొని రావలయుననికూడ వారాలోచించిరి. గాని దొరకినవాఁడు ప్రతాపుఁడో కాఁడో యనుసంశయము తన్నింకవదలనందునఁ జక్రవర్తి యందుకు సమ్మతింపలేదు. క్రమక్రమముగా నట్టి మహోత్సవములు గావింపవచ్చునని యతఁడప్పటి కాప్రయత్నములు మాన్పించెను.

తనకిష్టుడుగాని రణమల్లుఁడు గతించుటయు దన యుత్సవద్రవ్యము గొల్లగొట్టిన ప్రతాపసింహుఁడు పట్టువడుటయు, రేవాదేవికి గలిగించిన యానందమునకు మేరయే లేదు ప్రతాపసింహుఁడు పట్టువడుట దా[illegible]ందరసింగుప్రతాపముచేతనే యని

యాగ్రాపట్టణమున విశ్వసించి సంతోషించుచున్న దామె యొక్కతెయే. అట్టిప్రయోజకుఁడైన తనతమ్ముని నంబారిలోఁ గూర్చుండఁబెట్టి మహోత్సవముతో నూరేగింపుచుఁ గోట లోనికిఁ దీసికొని రావలయుననియు, చక్రవర్తిచేసిన ఖరారు ప్రకార మానాఁడే యాతఁడు 'చిత్తూరుమహారాణా' యని ప్రకటింపఁ బడవలయుననియు, నామె ముఖ్యాభీష్టములు. కాని పట్టువడినవాఁడు ప్రతాపుఁడో కాఁడోయని చక్రవర్తి సందేహించుచున్నాఁడని విని యావిషయమున రేవాదేవి వాని నేమియు నిర్బంధింపలేకపోయినది. అయినను నంత మాత్రమున నామె యూరకుండలేదు. తనతమ్ముని సహవాసులైన సలీంరాజకుమార ప్రముఖులను బ్రోత్సహించి దామోదరసింగు నెదుర్కొనుట కూరావలకుఁ బంపించెను.

సిపాయిలు ఖైదీలతోఁగూడఁ బట్టణప్రారంభమున్ననే చక్రవర్తియాజ్ఞకొఱకు నిరీక్షించుచుండిరి. చిత్రవిచిత్రములైన వెండిబంగారు మలామాలతోడను, మఖమల్ జరీహురంగుల పరుపులతోడను, రంగురంగుల పట్టుకుచ్చులతోడను, నత్యంతవైభవోపేతంబై కనువిందొనరించు జోడుగుఱ్ఱాల బగ్గితో దిలేర్ఖాను అచ్చటకు వచ్చి చక్రవర్తి యాజ్ఞలను వారి కెఱింగించెను. ఖైదీనందుఁ గూర్చుండఁజేసి తలుపులు మూసి వేసి పరులకంటఁబడకుండ బట్టణములోనికిఁ దీసికొని రావలయుననియు, ప్రజలు గుంపుగుంపులై చుట్టును గుమిగూడఁ



గూడదనియు, చిత్రశాలకుఁ గట్టెదుటనున్న లాల్ మహాలు' లో ఖైదీనుంచి సిపాయిలు చుట్టును గాపుండవలయుననియు, మహామంత్రులు మొదలు సేవకులవఱకును దన సెలవులేకుండ నెవ్వరును ఖైదీని జూడఁబోఁగూడదనియు, ఖైదీకిఁ జేయవలసిన సంరక్షణములన్నియు దిలేర్ఖాను స్వయముగాఁ జేయుచుండవలయుననియుఁ జక్రవర్తియొసంగిన యాజ్ఞలు. ఆయాజ్ఞలన్నియు దిలేర్ఖానుచే యథాక్రమముగా నిర్వహింపఁబడినవి. ఖైదీని జూడవలయునని కుతూహలపడుచుండిన పౌరులు రాజభటులకు వెఱచి తత్ప్రయత్నములు కావింపలేదు. ప్రయత్నించినను లాభములేదు. మేడలు నరుగులు నెక్కి ప్రజలు వింతగా వీక్షించు నప్పుడు వారి దృష్టుల నాకర్షించినవాఁడు స్యాలకుఁడు మాత్రమే.

స్యాలకుఁ డూహించినట్లు పాపము వానికెట్టి యుత్సవమును జరుగలేదు. దిలేర్ఖాను గొనివచ్చిన గుఱ్ఱపుబండి సైతము తనకొఱకుఁ గాదని విని పండ్లుకొఱుకుచుఁ గేకలువేయుచుఁ దన యాగ్రహాధికారములు చెంతనున్న సిపాయిలపైఁ జూప నారంభించెను. కాని రేవాదేవి ప్రోత్సాహమున సలీము ప్రముఖులువచ్చి యెదుర్కొని మెడలోఁ బూలదండలు వైచి చిత్తూరు మహారాణాయను నూతన బిరుదముతో నాహ్వానించి గౌరవించుటచేఁ స్యాలకునకుఁ గొంత సంతుష్టికలిగినది. ఉన్నవి చాలక మఱికొన్ని పూలదండలు తానే స్వయముగఁ

దెప్పించుకొని, యలంకరించుకొని, దామోదరుఁడు సహీసాందులతోఁ గూడ వారెక్కివచ్చిన గుఱ్ఱపుబండి నెక్కెను. ప్రతాపసింగును బట్టి తెచ్చిన మహావీరుఁ డితఁడే యని ప్రజలు తన్నుఁ జూచి యానందింతురనియుఁ దన దర్శనముకొఱకు వారూరక యాందోళన మొందు చున్నారనియుఁ బలికి స్యాలకుఁడు తన మిత్రులతో సమానముగాఁ గూర్చుండక యాగుఱ్ఱపుబండిలోఁ గూర్చుండవలసిన దానిపైఁ గాళ్లిడుకొని, చేరఁ డవలసిన దానిపై నెత్తుగాఁ గూర్చుండి, 'ఉత్తమ మున్నతాసన' మ్మను సామెతను సార్థకము చేసెను. రాజమార్గము నుండి పోవుచున్నప్పుడు మాటిమాటికిఁ దన పూలదండలు సవరించుకొనుచు, నూనూగు మీసముల మెలిపెట్టి త్రిప్పుకొనుచు, తనలోఁ దానే నవ్వుకొనుచు, ప్రజలు తనకు నమస్కరింపక పోయినను నమస్కరించుచున్నట్లు భావించి శిరఃకంపనములతో శూన్య నమస్కారము లందుకొనుచు, స్యాలకుఁడు పలువిధములైన వికారచేష్టలతో నత్యంత వినోదకరుఁడై ప్రతాపసింగును జూడలేక పోయితిమను విచారమును బ్రజలకుఁ దొలంగించెను. ఆద్విపాదమర్కటమును జూచి పౌరులు కడుపులు చెక్క లగునట్లు నవ్వలేక నవ్వసాగిరి. రణమల్లుని మరణమ్మునకు భీతుఁడై త న్నింటికి దిగబెట్టవలయునని రోదనము చేయుటచేతఁ దగిన పరివారముతో నాసఫ్‌ఖాను త న్నారీతిగాఁ బంపి వేసెనన్న గహాస్యమాగ్రిలో నెవ్వరు నెఱుఁగరనియే యామూర్ఖుని నమ్మకము.



తన యుత్సవద్రవ్యము నపహరించిన బందిపోటు దొంగ యగు ప్రతాపసింగును సామాన్యపు ఖైదిగనే పరిగణించుచు సామాన్య కారాగృహముననే పెట్టించ వలయునని రేవాదేవి ప్రార్థనము. అట్టి యగౌరవ మాతనియెడ జరుప గూడదని జోధాభాయి విన్నపము. ఏమందిరము చుట్టును సిపాయిలు తుపాకులతోఁ గాపుండి ఖైదీని బోనీయకుండ కాచుచుందురో యామందిరమే కారాగృహమనియు, నందుచే బ్రతాపసింగు సామాన్యపు ఖైదిగనే పరిగణింపఁబడెననియుఁ జెప్పి రేవాదేవిని; సామాన్య గృహమునఁ జేర్పక రాజోపచారములతోఁ బ్రతాపసింగు నొక మహలునం దుంచి ప్రత్యేక గౌరవము చూపించితి నని చెప్పి జోధాభాయిని దక్షిణనాయకుండైన చక్రవర్తి తృప్తిపరుపఁ గలిగెను.

మానసింహుని వ్యాధి క్రమక్రమముగఁ బ్రాణాపద్రవకర మగునంతవఱకు మీరియుండుటచేతఁ జక్రవర్తి తాను స్వయముగనే రాత్రింబవళ్లు చెంతనుండి చికిత్స చేయించు చుండుట వలన ఖైదీనిఁ బరీక్షించుటలోఁ దగినశ్రద్ధ వహించుట కాతని కవకాశము చిక్కలేదు. మానసింహుని సోదరి చక్రవర్తిరాణులలో నొకతె యైనందున, మానసింహుఁ డిప్పుడు తనసోదరి యంతిపురమునందే చికిత్సచేయింపఁ బడుచుండెను. రోగము మితిమీరుటచేత చక్రవర్తియుఁ గొన్నిదినముల వఱకు నచ్చటనే యుండిపోయెను. ఒకనాటి

మధ్యాహ్నమున రోగియవస్థ యనుకూలముగనే యున్నదని వైద్యులు చెప్పినమీఁదఁ జక్రవర్తి ఖైదీయవస్థ కనిపెట్టవలయునని దిలేర్ఖానుని రప్పించి వానితోఁగూడ లాల్ మహలునకుఁ బోయెను. పహరాసిపాయిల సలాము లందుకొనుచు మాటాడవలదని చేసంజ్ఞలతోడనే వారి కాజ్ఞాపించుచు, తానును జప్పుడు కాకుండ దిలేర్ఖాను చూపు మార్గమున ద్వారములన్నియుఁ గడచి లోనికిఁ బోయి యచ్చటఁ దలుపులన్నియుఁ దాళములు వేయఁబడి, గవాక్షములు మాత్రమే తెఱువఁబడియున్న యొక విశాలమందిరముకడ నిలిచెను. అందులోనే ఖైదీ యున్నాఁడనియు, నేలినవారు కిటికీలోనుండి చిత్తగింపవలయు ననియు ముకుళితహస్తుండును వినయ వినమిత మస్తకుండును నై దిలేర్ఖాను సంజ్ఞలతోడనే విన్నవింపఁ జక్రవర్తియు మెల్లఁగ నొక గవాక్షమును సమీపించి గోడచాటుననే నిలిచి ప్రక్కచూపులతో నినుపగజములనుండి లోనికి విలోకింపసాగెను. అట్లొకటి రెండు మాఱులు విలోకించినంతనే తా నింకఁ జాటు చాటునఁ బ్రక్కచూపులతోఁ జూడవలసిన యవసరము లేదని చక్రవర్తికిఁ దోఁచినది. లోపలనున్న ఖైదీ గాఢనిద్రానిమగ్నుఁడై యుండుటచేత నతఁడు గోడచాటు తొలంగి గవాక్షమునకుఁ గట్టెదుటనే నిలువఁబడి తన దీర్ఘదృష్టులతో మఱింతయధికముగాఁ బరిశీలింపసాగెను. తగినంత పొడవును బొడవునకుఁదగు వెడల్పును గలిగి యతిస్నిగ్ధములైన జేగురురంగు గోడలును, నలుచదరపు నెలరాల నేలయుం గ్రాలు నవ్విశాలమందిరమున నట్టనడుమనే వట్టి నేలపై వేయఁబడిన పట్టు పరుపులపై నెత్తైన మఖమల్ తలగడలపైఁ దల నిడుకొని, తన కభిముఖముగా వెల్లకిలఁ బరుండిన ఖైదీని చక్రవర్తి చక్కఁగా విలోకింపఁగల్గెను. శయ్యాతలంబున నొకప్రక్కఁ దాంబూలపళ్లెరమును రెండవప్రక్క ఫలహారపుఁ బళ్లెరములును జలపాత్రములు మాత్రమే కలవు. తక్కిన మందిరభాగము లన్నియు నెట్టి వస్త్రములును లేక శూన్యములయియే గానవచ్చుచుండెను.



తనయందలి యనిమిషత్వమును దన సోగకన్నులనుండి వెల్లడించుచుఁ దన కభిముఖముగాఁ బరుండియున్న ఖైదీముఖమును జక్రవర్తి చాలసేపువఱకు నిదానించెను. ముఖపరిశీలనమును గావించి హృదయధర్మ మెట్టిదో కనిపెట్టుటయందు సార్వభౌముఁ డసాధారణప్రజ్ఞ గలవాఁడు. చక్రవర్తింగూర్చి చరిత్రకారులుఁగూడ నిట్లే వ్రాయుచున్నారు.

ఆజానుబాహువులు, పచ్చని శరీరచ్ఛాయలు, గంభీరమైన ముఖమండలము, ముఖమండలమును గ్రమ్మి వెలుంగు ముంగురులు, ముంగురులనుండి వెడలు ముఖకాంతులు, చక్కని చిక్కని గడ్డంబును, గడ్డంబునకు గమ్యస్థానమగు గభీర నాభికావలయంబును, నాభికావలయంబునుండి జానువులంజేరు జేగురురంగు చెడ్డీయును, మొదలగు వాని లక్షణ

ములన్నియు గుర్తించి, సాముద్రికశాస్త్రమునుబట్టి యాలక్షణము లెట్టి వ్యక్తిని బోధించునో చక్రవర్తి నిదానించుచుండెను. అందుచే వాని దృష్టులు యథాక్రమముగ నిశ్చలములై ఖైదీవంకనే యున్నను, మనసుమాత్ర మన్యథా వర్తించుచుండెను. అట్లు పరధ్యానమునున్న సార్వభౌముం డొక్కమాఱు త్రుళ్లిపడునట్లుగ నాఖైదీ దీనస్వరముతో "అంబా! అంబా! ఒక్కమాఱిటు రావమ్మా! చక్కని నీ ముద్దుమొగమును ముద్దాడనీయవమ్మా! వట్టి నిర్భాగ్యుఁడైన యీ ప్రతాపుని కడుపున నీవేల పుట్టితివి తల్లీ! ......... ఇవియే కడసారిచూపులు! నిన్ను మఱి చూడలేనమ్మా!" అని నిద్దురలోఁ బలువరించెను. ఆపలువరింపుమాటలు వాని సాముద్రికశాస్త్రచర్చను దప్పించి మనసున కెక్కుటచేతఁ జక్రవర్తి యామాటలయందలి తత్వ మెట్టిదియో యని యూహింపసాగెను. కాని యా యాలోచనమునకుఁగూడ వాని కవకాశము కలుగలేదు. ఆతఁడు చూచుచుండఁగనే, యంఖైదీ యొక్కమాఱు ప్రక్క కొత్తిగిలి గంభీరస్వరముతో "ఓరీ మూర్ఖా! ఫాలాక్షు డడ్డుపడినను బ్రాణము లున్నంతవఱకు మేవాడరాజ్యమును నీకుఁ దక్కనీయనుఁ జాగ్రత్త!" అని నిద్దురలోఁ గేకవేసి, దిగ్గున లేచికూర్చుండెను. చక్రవర్తియు వాని కంటఁబడక తటాలునఁ బ్రక్కకుఁ దొలంగి మెల్లఁగ నందుండి వెడలిపోయెను.



## ఆఱవ ప్రకరణము.

### పట్టువడినవాఁడు ప్రతాపసింహుఁడే

"దిలేర్ఖా! మనమింక సంశయింపవలసిన దేమున్నదో చెప్పు!"

"ఏమియును లేదు మహాప్రభూ! ఏలినవారే మొదటినుండియు సంశయించుచున్నారు గాని నాకట్టి సంశయ మెప్పుడును లేదు."

"లేకపోవచ్చునుగాని యొక్క సంగతి విను. విమర్శింపక విశ్వసించితిమేని మనము లోకమునకు హాస్యాస్పదులము కావలసి వచ్చును. లోకములో నవ్వువారే యెక్కుడుగా నుందురు. పట్టుపడినవాఁడు ప్రతాపసింహుఁడు కాకపోయెనా మనము తలయెత్తుకొని తిరుగలేము. అందుచేతనే యెట్టి సంరంభమును జెందక యెవ్వరికంటను బడనీయక, యెవ్వరిని బోనీయక ఖైదీవిషయములో నేనింత జాగ్రతవహించితిని. ఇప్పుడు నా సంశయములన్నియు నివారణములైనట్లు తలంచుచున్నాను. నామనసున కిప్పుడు కొంత తృప్తి కలిగినది."

"కొంత తృప్తియనుటవలన నాకంత తృప్తి కలుగదు మహాప్రభూ!"

"ఈ కొంత తృప్తికిని గల కారణములు చెప్పెదను వినుము. విని యాలోచింపుము. యుక్తముగా నున్న యెడలఁ బూర్తిగానే విశ్వసింతము!"

"అబ్బబ్బా! ఏలినవారికి నేనా కార్యాలోచనమును జెప్పువాఁడను!"

"తప్పేమున్నది? జ్ఞానసామ్రాజ్యమునకుఁ గూడ నీవే చక్రవర్తి వనుకొనుచుంటివా యేమి?"

"నేనేకాదు మహాప్రభూ! ప్రజలందఱు నిట్లే యనుకొనుచున్నారు."

"వెఱ్ఱివాఁడా! విను విను. మొదటి విశేష మాతని యాకారమునం దత్యద్భుతమైన యాకర్షణశక్తి గలదు."

"ఔను మహాప్రభూ! ప్రతాపసింహునియందుఁ గాక యట్టి యాకర్షణశక్తి మఱి యెవ్వరియం దుండును?"

"తొందరపడకుము. విశాలములగు నాతని ఫాలమునందును లోచనములయందును రాజ్యాభిషేక చిహ్నము లున్నవి గాని, మొత్తముపై ముఖలక్షణములన్నియు రాజ్యభ్రష్టత్వమునే యెక్కుడుగా సూచించుచున్నవి."

"రాజ్యాభిషిక్తుఁడై రాజ్యభ్రష్టుఁడైనవాడు ప్రతాపసింహుడుగాక మేవాడలో నింకెవ్వఁ డున్నాడు మహాప్రభూ!"

"అప్పుడే నిర్ణయింపకుము. ఆ యాజానుబాహువులు సాముగరిడీల నారితేరిన ట్లొప్పు బలిష్ఠములగు దండలు-తిరుగటి దిమ్మలవంటి మాంసఖండములతోఁ బెరిగిన విశాలమగు వక్షస్థలము - మొదలగు వాని యవయవ విశేషములు మహావీరున కుండఁ దగినవియేగాని సామాన్యునకుండఁదగినవి కావు."



"కావు మహాప్రభూ! ఎంతటిమహావీరుఁడు కాకున్న - పోవుచున్న సిపాయిలను బోనీయక ప్రతాపసింగు! ప్రతాపసింగు! జాగ్రత్తజాగ్రత్త యని బెదరించునా? ప్రతాపసింగు గాక యూరునుబేరునులేని సామాన్యమార్గస్థుఁడు నలువది మంది సిపాయిల నొక్కఁడే కడతేర్పఁగలుగునా?"

"ఔను. ప్రతాపసింహుఁడైనను గాకపోయినను మార్గస్థుఁడగు సామాన్యరాజపుత్రుఁడు మాత్రము కాడు. మఱియు, వానితలయు గడ్డమును వాని నరణ్యవాసునిగాఁ దోపించుచున్నవి. ఆటవికులగు కిరాతుల కుండఁదగిన క్రౌర్యమును గాఠిన్యమునుగూడ వాని ముఖలక్షణములలోఁ గాన్పించుచున్నవి."

"క్రూరుఁడును గఠినచిత్తుఁడు నగుటచేతనే యడవులలో నాలిబిడ్డల నన్నములేక మలమల మాడ్చివేయుచున్నాడు."

"దిలేర్ఖాన్! ఇవన్నియు సాముద్రికశాస్త్ర నిదర్శనములు. ఇంక వాఙ్మూల నిదర్శనములు విచారింతము. వాని పలవరింతమాటలు నీవు విన్నావుకదా? ఆమాటలు తండ్రి కూఁతును ముద్దాడు ముద్దుమాటలని స్పష్టమేకదా? అంబా! అంబా! యను సంబోధనమువలన నాకూఁతురుపే రంబ యని [illegible] స్పష్టమే. అంబయనుపేరి కుమారిక ప్రతాపసింగున కున్నట్లు రూఢిపడినయెడల మఱి సంశయింప నక్కఱలేదు. కాని యిది మన మెట్లు తెలిసికొనఁగలము?"

"తెలియకపోయినమాత్ర మేమి సంశయమున్నది మహాప్రభూ! నిర్భాగ్యుఁడైన యీప్రతాపుని కడుపున నీవేల పుట్టితివని యాతఁడే తనపేరు వెల్లడించినాఁడే! ఇఁకయే కడసారి చూపులనుటవలన నేలినవారివలని ప్రాణభయ మొందుచున్నట్లుగూడ స్పష్టమే."

"ఔను. అంతియేకాదు. ఫాలాక్షుఁ డడ్డుపడినను ప్రాణము లున్నంతవఱకు మేవాడరాజ్యమును నీకుఁ దక్కనీయనను మాటలు నన్నుఁగూర్చి పలువరించినవియే కావలయును. ఈసాక్ష్యము లన్నియు నాతఁడు ప్రతాపసింహుఁడే! యని రుజువు పరచుచున్నమాట సత్యమే. మూఁడువంతులు నిశ్చయమైనది. ఇంక నొక్క వంతు మాత్రమే మిగిలి యున్నది. ప్రతాపసింగునకు 'అంబ' యను కూఁతురున్నట్లు రూఢి పడిన యెడల నాయొక్క వంతులో సగము పూర్తి కాఁగలదు."

"ఏలినవారి కప్పటికిని సంపూర్ణ విశ్వాసము కలుగదా? మహాప్రభూ! ప్రతాపసింగుకూఁతురుసంగతి మన మెట్లు తెలిసికొనఁగలము?"

"అదియే యాలోచించుచున్నాను. మానసింగు ప్రతాపసింగుతోఁ గలహించి వచ్చి యెంత కాలమైనది?"

"రెండు సంవత్సరములు దాటినవి మహాప్రభూ!"

"అప్పుడు ప్రతాపసింగు కుంభళాదుర్గమునం దున్నట్లు కదా మనము వింటిమి. ఆనాఁడు మానసింగు వెంటఁ గుంభళాదుర్గమున కేగిన పరివారజను లెవ్వరు నిచ్చట లేరా?"



"లేరు మహాప్రభూ! మన్సఫ్‌దారువారు జయపురమునకు దయచేసి యచ్చట స్వగృహమునఁ గొన్ని దినములుండి, యచ్చటినుండియే కుంభళాదుర్గమునకుఁ బ్రయాణమగుటచేత, వారి వెంట నేగినవా రచ్చటి పరివారములోని వారే గాని యిచ్చటి వారు కారు."

"అట్లైనఁ బ్రతాపసింగు కుటుంబమును గూర్చి యెఱిఁగినవా రెవ్వరు నిచ్చట లేనేలేరా?"

"లేకపోరు. ఉండవచ్చును. కాని ప్రతాపసింగుతో సంబంధమున్నట్లు తెలిసిన నేలినవా రేమి యనుమానించెదరోయని యెవ్వరును బయలు పడరు."

"అట్టి భయ మవసరములేదు. చెప్పు, చెప్పు. అట్టివా రెవ్వరున్నారు?"

"మహాప్రభూ! తక్కినవారి మాటకేమి! పృథ్వీరాజు భార్యయు ప్రతాపసింగుభార్యయు నక్కసెల్లెండ్రబిడ్డలే కదా!"

"ఔను వారికి వీరికి నేదో చుట్టఱిక మున్నదఁట! ఎన్నియో సంవత్సరములనుండి ప్రతాపసింగును జూచి యెఱుంగని పృథ్వీరాజుకు మాత్ర మీసంగతి యెట్లు తెలియఁగలదు? ఏనాటి చూపులో-ఏనాటి చుట్టరికమో!"

"నిజమేకాని మహాప్రభూ! జోసీభాయిగారు రహస్యముగా నుత్తర ప్రత్యుత్తరములు జరుపుచు దమయక్కగారి యోగక్షేమములను దెలిసికొనుచుందురు."

"ఆలాగునా? అట్లయిన నీరహస్య మింతవఱకుఁ జెప్పవేమి! నీవిప్పుడేపోయి జోసీభాయి నడిగి 'అంబా'వృత్తాంతమును గనుఁగొనిరమ్ము."

"మహాప్రభూ! తా నుత్తరప్రత్యుత్తరములు జరుపుచున్నట్లు తమకుఁ దెలియనీయవలదని జోసీభాయిగా రొకటి రెండుమాఱులు నన్నుఁగోరిరి. అందుచే—"

"నాకుఁ దెలియనీయకుండుట కిందేమి తప్పున్నది? పాపము వట్టియమాయకురాలు? అడవులలోఁ గొండలలో బడరాని యిడుములు పడుచున్న ప్రతాపసింహుని కుటుంబమును దాను రప్పించి తనయింట నుంచుకొని పోషించుచున్నచో నేనెంతయు సంతోషించియుండును. పోనిమ్ము నాసెలవైనదని పృథ్వీరాజుతోఁ జెప్పుము. అతఁడే తనభార్యనడిగి యారహస్యమును నీకుఁ జెప్పఁగలఁడు."

దిలేర్ఖాను వెంటనే బయలుదేరెను. చక్రవర్తి యొంటరిగనే కూర్చుండియుండెను. ఆచావడి వీధిద్వారమ్మునకుఁ జేరువగను ఖైదీ మందిరమ్మునకు దూరముగను నుండుటచేత, నచ్చట మాటలు ఖైదీకి వినఁబడుటకుఁగాని యచ్చటివారికి ఖైదీ కనబడుటకుఁగాని యవకాశములేదు. ఆచావడిలోఁ జక్రవర్తి కూర్చుండిన యాసనమును, ఆయాసనమునకుఁ జుట్టునున్న యాసనములును సామాన్యాసనములేగాని చక్రవర్తులు కూర్చుండఁదగినవికావు. ఆలాల్ మహాలు సైతము



నుత్సవములకుఁగాని రాజకీయ కార్యావసరములకుఁగాని చక్రవర్తి యాజ్ఞపై విదేశములనుండి వచ్చు నతిథులకు విడిదిగా నుపయోగింపఁబడుచుండిన దగుటచేత నందుకుఁ దగిన వైభవమునందే యుండెను.

కాలుపైఁ గాలిడుకొని యాసనమునకు ముందున్న మేజాబల్లపై మోచేతి నాని, బొట్టనవ్రేలు కనుబొమ్మల మధ్యఁ జేర్చి కుడిపాద మాడించుచుఁ జక్రవర్తి మానసిక వ్యాపారమునందే యుండెను. అతఁడు తన ముఖము నే మాత్రము ప్రక్కకుఁ ద్రిప్పినను వీధిద్వారమును నచ్చటి పహరా సిపాయిలును వాని కంటఁబడవచ్చును. కాని దీర్ఘాలోచనా నిమగ్నుఁడై యుండుటచే నతఁడొక్క మాత్రైన నట్లు తిరిగి చూడలేదు. అందుచేతనే వాని కొఱకేదో యొక యుత్తరమును గొనివచ్చిన సిపాయి యొకఁడు ద్వారముకడ నిలిచి యుండి, ప్రభువు తనవంకఁ జూచుటకుఁ జాలసేపునుండి నిరీక్షించుచుండెను. పట్టువడినవాఁడు ప్రతాపసింహుఁడే యని రుజువుపడుచుండుటచేత, చక్రవర్తి ముఖము సంతోషమునే సూచించుచున్నను, అతి నిర్మలంబైన యంబరంబు క్షణంబులో గాఢ జీమూతపంక్తిమైనట్లు మఱల శంకాకలితంబైనది. వానిహృదయమునం దేదియో మఱియొక సందేహ మావిర్భవించినది. ఆహా! ఉత్తమ ప్రభువులకు రాజకీయ కార్యములయం దెంత విచక్షణము! ఎంతనిదానము! ఎంత జాగరూకత! చక్రవర్తి యెన్నఁడు నా

లాల్ మహలులో నంతసేపుండ లేదని పహరా సిపాయి లాశ్చర్యపడుచుండిరి. 'మహాప్రభూ! హుజూరు వారి కన్నియు జయములే' యను దిలేర్ఖాను మంగళవాక్యములు చెవింబడువఱకు, చక్రవర్తి మానసికప్రపంచమునుండి బాహ్యప్రపంచమునకుఁ దన దృష్టి మార్పలేదు. ఆమాటలు వినినంతనే యతఁడు తటాలునఁ బ్రక్కకుఁ దిరిగి చూచెను. అప్పుడు దిలేర్ఖానుతోఁ బాటుగ నుత్తరము తెచ్చిన సిపాయియు నాని కంటఁబడెను. కాని సవినయముగ సలాముచేసి జాబును సమర్పించుకొనుటకే యాసిపాయి కవకాశము చాలియుఁ జాలనట్లయినది. నిర్భరానందభరితంబగు దిలేర్ఖాను ముఖమునే పరిశీలించుచుఁ జక్రవర్తి పరధ్యానముతోడనే చేయిసాచి యా యుత్తరము నందుకొనెను. మంత్రివర్గములనుండియో శుద్ధాంతముల నుండియో యేవో చిన్నచిన్న యుత్తరములు తనకుఁ దఱచుగా వచ్చుచుండుటచేత, నాయుత్తరమును విప్పి వెంటనే చదువవలయునను నాతురత వానికి లేకపోయినది. ఉత్తరమునకు, జేయి చాపుచునే యతఁడు దిలేర్ఖానుతోఁ బ్రసంగింప సాగెను.

"దిలేర్ఖాఁ! మనకన్నియు విజయములే యనియా యనుచున్నావు"

"ఔను మహాప్రభూ! రమారమి నేటికైదు సంవత్స ములక్రింద, ఆసఫ్ఖాను రాణీ దుర్గావతిపైకి దండెత్తి పోవుట



చేత హుజూరువారు షహబాజ్ఖానును ప్రతాపసింగుపై కొకమారు పంపవలసి వచ్చినది. అప్పుడు ప్రతాపసింగు 'లావా దుర్గప్రాంత పర్వతారణ్యములలో సంచరించు చుండెనట. షహబాజ్ఖాను తన సేనలతో నత్యాకస్మికముగా జుట్టుముట్టుట చేతఁ బ్రతాపసింగు గర్భవతియైయున్న భార్యను బిల్లలను సమీపమునంగల యంబికాలయమున భద్రముగఁ జేర్చి తాను శత్రువుల నెదుర్కొనెనఁట! ఆసందర్భమున నతఁడు షహబాజ్ఖాను నోడించి పాఱఁదోలుటయు నాతని భార్య సుఖప్రసవమునఁ గుమారికం గాంచుటయుఁ దటస్థించుటచేత 'నా సంతోషాతిశయమునఁ బ్రతాపసింగు తనశిశువునకు 'అంబ' యని పేరుపెట్టెనఁట!"

"శబాస్! దిలేర్ఖాఁ! గొప్ప శుభవార్త తెచ్చితివి. పట్టువడిన వాఁడు ప్రతాపసింహుఁడే యనుటకీ యొక్క నిదర్శనమే చాలును. కాని యిప్పుడిప్పుడే నాకు మఱియొక సంశయము స్ఫురించినది. దానినిగూడ......"

"మహాప్రభూ! మహత్తర విషయములయం దిట్టి సంశయములు స్ఫురించుచునే యుండును. వాని నెంతని విచారింపఁగలము?"

"అటుగాదు. సాధ్యమైనంతవఱకు విచారింపవలయును. ఆసఫ్ఖా నిప్పు డేప్రాంతమున యుద్ధము సేయుచున్నాఁడు?"

"ఉదయపుర ప్రాంతమున—"

"ఈ ఖైదీ యేప్రాంతమునఁ బట్టువడినాఁడు?"

"బైరాటఘర్ ప్రాంతమున—"

"ఈరెంటికిని నెంత దూరముండును?"

"నూరుమైళ్ళకంటె నెక్కువదూరమే యుండును?"

"తన సేనలను విడిచి తన కుటుంబమునువిడిచి ఘోరముగఁ బోరాడుచున్న శత్రుసేనలను విడిచి ప్రతాపసింహుఁడంతదూర మేలవచ్చియుండును? భయపడి పాఱిపోవలసినవాఁడు కాఁడుగదా?"

"మహాప్రభూ! తనసేనల శత్రుసేనలపైఁ బురికొల్పి తాను కుటుంబరక్షణార్థమై యట్లు వచ్చియుండఁగూడదా?"

"కాదుకాదు. ఇది సరియైన సమాధానముకాదు. ఆలోచింపుము. బాగుగా నాలోచింపుము. నేనును నాలోచించెదను."

అని పలుకుచుఁ జక్రవర్తి తనయాసనమునుండి లేచి గమనోన్ముఖుండయ్యెను. అతఁడించుక ప్రక్కకుఁ దిరిగినంతనె యుత్తరము తెచ్చిన సిపాయి దూరమునుండి వాని కంటఁబడెను. తోడనె యుత్తరముమాట వానికి స్ఫురించి చదువవలయునను బుద్ధిపుట్టినది. దిలేర్ఖానుతోఁ ప్రసంగించుచున్నంత సేపును గొట్టమువలెఁ జుట్టుచు నొకమాఱును, చిన్నచిన్న మడతలుగా మడచివేయుచు నొకమాఱును బలువిధములుగా నలిపివేసి యాయుత్తరమును జక్రవర్తి విప్పి చదువసాగెను. అందొకట్



రెండువాక్యములు మాత్రమే చదివి యతఁ డత్యాశ్చర్య నిమగ్నుఁడై "దిలేర్ఖాన్! మన మింతవఱకుఁ గానమైతిమి. ఇది యాసఫ్ఖాను వ్రాసినయుత్తరము." అనిపలికి వానికి వినఁబడునట్లు చదువ నారంభించెను.

"మహాప్రభూ! దిలేర్ఖాను ముఖంబున నిచ్చటి యుద్ధవిశేషము తెలిసినవారికిఁ గొంతవఱకుఁ దెలిసియేయుండును. ఆకారణముచేతనే యిచ్చటివార్తలను నివేదించుకొనుటలోఁ గొంత యాలస్యము జరిగినది. అయినను రణమల్లుని మరణముతప్ప మఱియొక విశేష మేదియు లేదు. ఈయుదయపుర ప్రాంతమునఁ బర్వతారణ్యములనుండి యనుదినమును వేలకొలఁదిగ భిల్లులును, రాజపుత్రులును నేల యీనినట్లు వచ్చి పైఁబడుచున్నారు. ఇదివఱకుఁ జూచియెఱుంగని క్రొత్తభిల్ల సేనలతోడను, క్రొత్త రాజపుత్రులతోడను బోరాడవలసి వచ్చుచున్నది. ఆక్రొత్తసేనలు ప్రతాపసింహునిసేనలో కావో ఇప్పటికింకను దెలియలేదు. అవి తూర్పుదిక్కుగానున్న పర్వతారణ్యములనుండి వచ్చుచున్నట్లు గూఢచారులు కనిపెట్టి చెప్పుటచేత నాసేనలెట్టివో కనుఁగొనవలయునని తత్ప్రాంతముననున్న లావాదుర్గాధిపతికి నేడే కబురంపితిని. మహాప్రభూ! ప్రతాపసింహుఁ డిప్పటివఱకును నాకంటఁబడలేదు. వానిజాడలు తెలియలేదు. అతఁడు బైరాటఘర్ ప్రాంతమున సంచరించుచున్నాఁ డను వదంతిమాత్రము ప్రబలముగానున్నది......"

ఈవాక్యము చెవినిబడినంతనే దిలేరా నానందాతిశయమునఁ జప్పునఁ జేతులు చఱచి,

"మహాప్రభూ! హుజూరువారి కన్నియు జయములే యని నేను మనవిచేసికొనలేదా?"

"దిలేర్ఖాన్! ఈశ్వరసంకల్ప మనుకూలముగా నున్నప్పుడు జయములే కలుగుచుండును. ఈయొక్క సంశయము గూడ నీయుత్తరముచే నివారింపఁబడినది."

"మహాప్రభూ! మ రెట్టిసంశయము నుండదుకదా"

"ఇంకేమిసంశయము! పట్టుపడినవాఁడు ప్రతాపసింహుఁడే."

## ఏడవ ప్రకరణము.



### —♦ కరుణ-దిలేర్ఖాను ♦—

"లూసీ! నీదరఖాస్తు దేవిగారి కిచ్చితిని. ఆమెచూచినారు. మేరీరాణిగారితో నాలోచించి చక్రవర్తితో మాటాడెదరఁట!"

"ఈయుపకారము మీవలననే జరుగవలసియున్నది ఈవిషయములో మాకుఁదోడ్పడవలయునని పాపము మీ భర్తగారెంతయో ప్రయత్నించుచుండిరి. ఆయన గతించుట మా



క్రైస్తవుల దురదృష్టము. మీరైనను మాయం దనుగ్రహించి యిందులో శ్రద్ధ వహింపవలయును."

"లూసీ! ఇట్టి దురవస్థలోనున్న మీకు నేనేమి యుపకారము చేయఁగలను? దేవిగారి స్వాధీనములోనున్న కార్యమైనయెడల నీసరికే చేయించియుందును. ఇది కేవలము చక్రవర్తి యాజ్ఞపైఁ గొనసాగవలసియున్నది. అందులో నాతని మతమునకు విరోధమైనది. త్రాగు డన్న యాతని యసహ్యామింతింతని చెప్పలేము. ఏనేరముచేసినను క్షమింపవచ్చును గాని త్రాగినవానినిమాత్ర మాతఁడు క్షమింపకున్నాఁడు. దుష్టసహవాసమున రహస్యముగాఁ ద్రాగుచుండు యువరాజును గూడ నాతఁ డొకొక్కప్పుడు శిక్షించుచుండును. అట్టి చక్రవర్తి మీ క్రైస్తవులకుఁ ద్రాగుటకు సెలవిచ్చునను ధైర్యము నాకులేదు."

"అమ్మా! మీపేరు సార్థకముగ మాయందుఁ గరుణ వహించిరేని మీరీకార్యమును సాధింపలేకపోరు. ఈవిషయమునుగూర్చి మా క్రైస్తవులు చాలకాలమునుండి ప్రయత్నించుచున్నారు. పట్టువడినవాఁడు ప్రతాపసింహుఁడే యని చక్రవర్తి పూర్తిగా విశ్వసించి ప్రకటించుటయుఁ గొలఁదిదినములలోనే మహోత్సవముతో గొప్ప యుత్సవమును గావించి యా యుత్సవమునాడు తాను దులాభారమును దూఁగనెంచుయు, మా మగవారు విని యీ యుత్సవ సందర్భముననే

తమ కోరికలు ఫలింపవలెనని యాశపడుచున్నారు. అమ్మా! ఏమి చేయమనెదవు? ఇది మా దేశాచారము! త్రాగుడు లేకున్న మావారు పనిచేయలేరు. మీ దేశమునందువలె మా దేశమునఁ ద్రాగుడు హేయముగాఁ బరిగణింపఁబడదు. సర్వమత సమత్వచిత్తుఁడైన చక్రవర్తి న్యాయమాలోచింపవలయునుగాని క్రైస్తవులు సైతము త్రాగఁగూడదని శాసించిన నేమి చేయఁగలము? ఈసంగతుఁ లొకటి రెండు మాటలు మీరు దేవిగారితో నొక్క చెప్పినయెడల నామె ప్రోత్సాహమునఁ జక్రవర్తి మమ్మనుగ్రహించును."

"లూసీ! నిజమేకాని వారము దినములై నే నంతఃపురమును విడిచి జోసీభాయి యింటనే యున్నాను. నాపతి చిత్రపటమును బూర్తిచేసి దానిని దేవిగారి ముఖంబునఁ జక్రవర్తి కందఁ జేయవలెనని నేడు వచ్చితిని. నా కవకాశము చిక్కినప్పుడెల్ల నీ విషయమై దేవితోఁ జెప్పుచుందును."

"అమ్మా! ఒక్క రహస్యమును మనవిచేసికొనెదను. అది విన్నయెడల నాయందు మీ కింతకంటె నెక్కుడు దయయు యు జనింపక తప్పదు. అనురాగమునందెంత శక్తి యున్నదో మీ రెఱుఁగుదురు కదా? మేరీరాణికడ నొకదాసినై యున్న నేను క్రైస్త వోద్యోగస్థుల వ్యవహారభారము పూనుకొన వలసి వచ్చినందు కనురాగమే కారణము. యంత్రశాలాధికారి నాప్రియుఁడు. చాలకాలమునుండి మా పరస్పర ప్రేమ



వర్ధిల్లుచున్నది. ఈ సంగతి నితర క్రైస్త వోద్యోగు లందఱు నెఱుంగుదురు. చక్రవర్తి కొసంగిన దరఖాస్తు లన్నియు విఫలములైనందున నంతఃపుర దాసియైన నీ ప్రియురాలి మూలమున నీ వీకార్యము సాధింపఁ గలవని వారందఱు నాప్రియుని హెచ్చరించిరి. నాప్రియుఁడు నన్ను హెచ్చరించెను. ఈ కార్యమును మేము సాధింపలేనియెడ వారు మాయనురాగ మంగీకరింపరు. మావివాహమునకుఁ దోడుపడరు. మఱియు మా వివాహములు మధుపానము లేకున్న వెలవెలఁ బోవును కాని యుత్సాహకరములుగా నుండవు."

"లూసీ! నీ యవస్థ నాకిప్పుడు స్పష్టమైనది. భర్తృవియోగదుఃఖమును బలవంతముగ దిగమ్రింగి, నీకు భర్తృసంయోగము గావించుటకుఁ బ్రయత్నించెదను. నీవింకఁ బొమ్ము."

అని పలికి క్రైస్తవదాసియైన లూసీకిఁ గరుణ సకరుణంబుగా సెలవొసంగెను. ఆమెయుఁ దనపనిపై నచ్చటనుండి వెడలిపోయెను. కరుణ తాను జిత్రించి తెచ్చిన తనపతిచిత్రపటమును జోధాబాయికిఁ జూపి యందలి చిత్రకలాకౌశలమున కామెచే నెంతయు మెప్పొందెను. ఆచిత్రపటమునే పరిశీలించుచు నా నాటి సాయంకాలమునఁ జాలసేపువఱకుఁ గరుణతోఁ గూడ నజరుమహాలునకు ముందున్న యతివిశాలమగు నెలరాల నేలపైఁ నందందుఁ గల మాలతీమల్లికా ప్రముఖ వివిధప్రసూనలతికా సమాకీర్ణంబులగు చంద్రకాంత వేదికలలో నొకదాని

యందుఁ గూర్చుండి ప్రసంగించి యామెకు సెలవొసంగి తాను లోనికింబోయెను. తఱుచుగాఁ జక్రవర్తి కంటబడుచుండుట తన కిష్టములేక దేవి యెంతబోధించినను వినక వారముదినములనుండి జోధాభాయి యింటనే నివసించుచున్నదగుటచేత, వెంటనే కరుణయు నింటికిఁ బోవలయునని లేచెను. దేవి వెడలిపోయినంతనే తనతోఁ బ్రసంగింపవలయు నని వేఱొక లతాకుటీరాంతరంబున వేచియున్న లూసీ తటాలునవచ్చి తన్నుఁ సందర్శించుటచేతఁ గరుణ మఱల నచ్చటనే కూర్చుండి కొంతవఱకామెతోఁగూడ మాటాడవలసివచ్చినది. లూసీ వెడలిపోయిన తరువాతఁగూడఁ గరుణ గృహాభిగమనమున కాటంకము వాటిల్లినది. అందుకుఁ గారకుఁడు స్యాలకప్రభువు. సర్వాంతర్యామియగు స్యాలకుఁ డాప్రాంతమున కేలవచ్చెనో వానికే తెలియదు. మనమెట్లు తెలిసికొనఁగలము? ఆకస్మికముగ వచ్చి యతఁడా కుటీర ద్వారముకడ నిలిచియుండుటచేఁ బొదరింటనున్న కరుణ వెలుపలికి రాఁజాలక వానింజూచి నిశ్చేష్టితురాలైనది. ధూర్తచిత్తుండగు వానికంటఁబడుటచేఁ గలిగిన భయాతిశయమునఁ బాపమాల తాంగి పవనచలితంబగు పుష్పలతవలె నెంతయు. వణకసాగెను. అత్తరి దామోదరుఁడు తన యవివేక ప్రలాపములు ప్రారంభించెను.

"కరుణా! మేమీమధ్య యుద్ధయాత్రకు విజయముచేయుటచేత మాదర్శనము నీకు లభింపలేదు. ఒకసంగతి నీతో మనవి చేసికొనవలె నని యిట్లు వచ్చినాము."



"అయ్యా! అదేదియో వెంటనే సెలవిండు."

"అది నీభర్త నీతోఁ జెప్పుమన్న కడసారిమాట."

కరుణ మోమువంచుకొని కన్నీరు దుడుచుకొనుచు—

"అయ్యా! త్వరగా సెలవిండు."

"సెలవిచ్చెదనుగాని నీవు కంట నీరు పెట్టుకొనుటచూచి నాకడుపు చెరువై పోవుచున్నది. పాపము నీపతి యుద్ధరంగములోఁ బెద్దపెద్ద గాయములు తగిలి నేలఁగూలినాఁడు. నేలఁగూలుటచేఁ బ్రాణములు పోయినవి. ప్రాణములు పోవుటచేఁ జచ్చిపోయినాఁడు. ప్రాణములు పోవునప్పుడో చనిపోవునప్పుడో జ్ఞాపకములేదుగాని నన్నుఁజూచి—స్యాలకప్రభూ! కరుణకును నాకును ఋణముతీరిపోయినది. ఇంక నామె సంరక్షణ మంతయు మీ దేయని నిన్ను నా కప్పగించెను."

"అయ్యా! మీమాటలు నాకేమియు నర్థముకాలేదు."

"పండితులకే బోధపడవు. నామాటలు నీవెట్లు తెలిసికొనఁగలవు? ఇదిగో విను. నీపతి చనిపోవుటచేత మఱి లేచి రాలేఁడని యిందలియర్థము. అందువలన నీవు భర్తలేనిదానవైతివని తాత్పర్యము. కాబట్టి నన్నుఁజేపట్టక తప్పదని దండప్రయము. ఇంకమీఁద దమయంతీ హరిశ్చంద్రులవలె మనమిద్దరమును—"

"అయ్యా! చాలింపుఁడు. మీరిచ్చటనుండి వెడలి పోయెదరా లేదా?"

"కళ్లెఱ్ఱచేయుచున్నావు కొట్టెదవా యేమి? కొట్ట వచ్చునుగాని నలువురిలోమాత్రము కొట్టకు. అదిమా కగౌరవము."

"అధికప్రసంగమును జాలించి యిచ్చటినుండి తొలఁగి పోకున్న దేవిగారిని బిలిపించెదను. చక్రవర్తికిఁ జెప్పించెదను జాగ్రత్త!"

"అమ్మయ్యో! చక్రవర్తికే? చక్రవర్తికిఁ దెలిసిన యెడఁ బరువుపోదా, పరువుపోయిన మర్యాదనిలుచునా, మర్యాద నిలువనియెడ మాన ముండునా? మాన ముండనిచో గౌరవముమాత్ర మెట్లుండును? కరుణా! నీకుఁ బ్రాణప్రియుఁడను. ప్రాణేశ్వరుఁడను. ప్రాణనాథుఁడను. ప్రాణకాంతుఁడను. ప్రాణాంతకుఁడను—నన్ను రక్షింపుము. నీవే నాదిక్కు. నిన్నువిడిచి బ్రదుకలేను. కుక్కవంటి విశ్వాసముగల నన్నుఁ బోఁగొట్టుకొనిన నీవుమాత్ర మేమి సుఖపడఁగలవు?"

"పొండు. వెంటనే యిక్కడనుండి వెడలిపొండు. అదుగో! దిలేర్ఖాను వచ్చుచున్నాఁడు. దిలేర్ఖాఁ! దిలేర్ఖాఁ!"

అని కరుణ బిగ్గరగాఁ బిలిచెను. అభ్యంతరమున నున్న చక్రవర్తియాజ్ఞపై నేదోపనిఁబూని బయలుదేరి వచ్చుచుండిన దిలేర్ఖా నా పిలుపువిని సత్వరముగా నామెను సమీపించెను. స్యాలకుఁడును వెనుకవెనుక కడుగు లిడుచు దిలేర్ఖాను రాక చూచి మెల్లఁగా నచ్చటనుండి సాగిపోయెను. తోడనే కరుణ తత్కుటీరాంతర్భాగమును వెలువడివచ్చి,



"దిలేర్ఖాఁ! ఈ దుష్టుని ధూర్తవర్తనము గనిపెట్టితివా?"

అమ్మా! మనకే కాదు, వాని ధూర్తవర్తనము చక్రవర్తికే కష్టముగా నున్నది. ఏమిచేయఁగలము? ఆమాట యటుండనిండు. దేవిగారు చక్రవర్తిగారితోఁ బ్రసంగించు సందర్భమున మీరింటికి బయలుదేరి చాలసేపైనదని విన్నానే, ఇంతవఱకు నిచ్చటనే యున్నారేమి?"

"ఔను. లూసీతోఁ గొంచెముమాటాడవలసి వచ్చుటచేతను దరువాత స్యాలకుఁడు నన్నడ్డగించుటచేతను నిచ్చటనే యుండి పోవలసివచ్చినది. దేవి చక్రవర్తితోఁ గావించిన ప్రసంగము నాచిత్రపటమును గూర్చియేనా?"

"ఔనమ్మా! మీ చిత్రలేఖనా నైపుణ్యమును జూచి చక్రవర్తి పొందిన యానందమేమి చెప్పఁగలను? దేవిగారా చిత్రమును జూపినంతనే ప్రభువుగారు కొంతసేపువఱకుఁ జిత్రాకృతినే వహించి, దేవీ! మాటలేలేవుగాని మన రణమల్లుఁడు మనయొద్దనే యున్నాఁడు సుమా యని సెలవిచ్చిరి. నేనిప్పుడు వారిసెలవు మీఁదనే మీకొఱకును బృథ్వీరాజుగారి కొఱకును బయలుదేరితి."

"ఆలాగునా? ఏదో విశేషముండవలయును. చెప్పు చెప్పు."

"అమ్మా! పట్టుపడినవాఁడు ప్రతాపసింహుఁడే యని రుజువగుటయుఁ జక్రవర్తిమహోత్సాహమున నుత్సవము

గావించి యానాడు తులాభారమును దూగనెంచుటయు మీరు విన్నసంగతులే కదా ? ఆ యుత్సవసందర్భములోఁ బ్రతాపసింహుని చిత్రపటములను దర్బారు మందిరద్వారములయందును రాజకీయ కార్యస్థానములయందును వ్రేలాడఁగట్టింపనెంచి, యాతని చిత్రము నొక్కొక రొక్కొక ప్రతి చిత్రింపవలయునని దర్బారు చిత్రకారులకుఁ బదునేడుగురకునుగూడఁ జక్రవర్తి యాజ్ఞాపించెను."

"బాగున్నదికాని ప్రతాపసింహునిఁజూడకుండ వారెట్లు చిత్రింపఁగలరు? ఇప్పుడందఱును జూడవచ్చును గాఁబోలు!"

"లేదు. లేదు. చిత్రకారులు మాత్రమే చూడవచ్చునని యాజ్ఞయైనది. మీ కెప్పుడవకాశమో సెలవిచ్చినయెడ నేను వచ్చి మిమ్ము సవారిలోఁ గూర్చుండబెట్టి లాల్ మహాలునకుఁ దీసికొనిపోయి ప్రతాపసింహుని జూపించెదను."

"నేనెందుకు? నేనుఁగూడఁ జిత్రింపవలయునని యాజ్ఞయైనదా యేమి" "ఒక్క చక్రవర్తి యాజ్ఞయే గాదు. దేవి యాజ్ఞగూడ నైనది."

"దిలేర్ఖాన్"! రాణావారి మొగమును నేను జూడలేను. ఆయన మాకుఁ బ్రభువు. ఆయన కుమారుఁడును నేనును నొక యీడువారమే. జ్ఞానము వచ్చువఱకు రాణావారిచే నేను రాజాంతఃపురముననే పెంపఁబడుచుండెడుదానను. బాల్యమునందలి నాయాటలు పాటల్లు ముద్దుమాటలును రాణావారికిని



రాణీగారికిని దఱుచుగా వినోదకాలక్షేపమున కాధారములగుచుండెడివి. అబ్బబ్బా! చూడలేను. ఆమహారాజు మొగము నేను జూడలేను. ఇంతకు నేల చూడవలయును? రాణావారి దివ్యాకృతి నాహృదయఫలకంబున నిదివరకే చిత్రింపఁబడియున్నది. తప్పనియెడల దానినే వేఱొకఫలకంబునఁ జిత్రించి యిచ్చెదను."

"అమ్మా! మీయిష్టము వచ్చినట్లే చేయవచ్చును. మనమింక బయలుదేరుదమా! పృథ్వీరాజుగారితో—"

"మాటల సందడిని మరచితిని. పృథ్వీరాజుగారికేమి యాజ్ఞయైనది."

"విశేషమేమియు లేదమ్మా! ఉత్సవముతో సంబంధించిన యేర్పాట్లనుగూర్చి యాలోచించుటకై బీర్ బల్, తోడర్ మల్, పృథ్వీరాజాదులు నేటిరాత్రి దివానియమునకు హాజరుకావలసినదని చక్రవర్తి సెలవైనది. నే నిప్పుడు తొందరగా నేగి—"

"దిలేర్ఖాన్! నీకు తొందరలేనిదెప్పుడు? దండయాత్రనుండి నీవు వచ్చినప్పటినుండియు నిన్నొకటిరెండు మాటలడుగవలయునని యనుకొనుచుంటినిగాని యిప్పటివఱకు నాకవకాశము కలుగలేదు.

"తల్లీ! ఏమిచేయుమనెదరు! క్షమింపుఁడు. ఖైదీనావాసమున నుండుటచేతఁ గాలు కదపుటకైన వీలు చిక్కలేదు. మీరడుగఁదలంచిన సంగతులు నే నెఱుగుదును. సావ

ముగా మీతో మనవి చేసుకొనవలయు నని యెన్నియో మాఱు లనుకొంటిని. అమ్మా! యుద్ధదినములలో నొకనాడవకాశమును గలిగించుకొని నేనును మీభర్తయుఁ గుంభికా దుర్గమునకుఁబోయి యచ్చట శోధించితిమి. భర్తపోయిన కొలఁది దినములకే మీతల్లిగారు మీసోదరిని వెంటనిడుకొని 'నాధద్వార' గ్రామమునకు వెడలిపోయినట్లును, అచ్చట 'భామాసా' యను నొక బట్టలవర్తకునియింట నాతని సంరక్షణమునందున్నట్లును మాకుఁ దెలియవచ్చినది."

అని దిలేర్ఖా నింకను నేమియో చెప్ప నుద్యుక్తుఁడగుచుండ నాకస్మికముగ బోయీలగు కొందఱు దాసీలచ్చటికి బిరబిర నరుదెంచి కరుణకు నమస్కరించి 'అమ్మా! చీకటిపడుచున్నది. సవారిలోనికి దయచేయుఁ'డని విన్నవించుకొనిరి. శేషించిన విశేషములు సవారినుండియే వినవచ్చునని దిలేర్ఖాను చెప్పుటచేతఁ గరుణ ప్రయాణసన్నద్ధయయ్యెను.

## ఎనిమిదవ ప్రకరణము.

### — మాతృఖండము —

లోకనాయకుఁడైన దివాకరుఁడు పూర్వపర్వతాగ్రమలంకరించెను. సరోవరంబులే సభాంతరములుగా, నీరజాత సభ్యవ్రాతములుగా, తటాలున విడిన శతపత్ర పత్రం



బులనుండి వెడలు పటపటారావంబులే తత్సభాధ్యక్షునకుఁ గరతాళధ్వనులైనవి. నాయకుని నాయకత్వ మంగీకరింపని భిన్నమతవాదుల వదనంబులంబోలి చెన్నుతఱిగి చెంగల్వలు వికాసవిహీనతంగాంచె. వెలవెలఁబోవుచు భావాభావమధ్యంబై తోఁచు చంద్రమండలము సభాధ్యక్షు నెదుటనుంచఁబడిన కార్యక్రమ నివేదికా పత్రంబువోలె సూక్ష్మముగాఁ గానవచ్చుచుండెను. గున్నమామిడికొమ్మకొన కెక్కి కోకిల జగన్మోహన మధురస్వరంబుతో సభారంభమంగళగీతాచారమును నిర్వర్తించెను. ఉపన్యాసము నారంభించుట కాసనమునుండిలేచి యధ్యక్షుఁడైన లోకబాంధవుఁడు మఱింత ప్రత్యక్షదర్శనమొసంగెను. "ఓ తామరలారా! కైరవములారా! మీ మీ సహోదరత్వములను మీ రేల మఱచిపోవుచున్నారు? చిరకాలసహవాససంబంధమున మీపరస్పర ప్రేమానుబంధమెంతయో కొనియాడఁదగినదిగా నుండవలయునే గాని, మీకీ యన్యోన్య వైముఖ్యము చెల్లునా? ఒక్కయెడనే జనించి యొక్కయెడనే పెఱుగుచుండియు భిన్నజాతుల మను దుర్భ్రమంబరిభ్రమించుచు నొకరివికాసము నొకరుచూచి సహింపలేక మొగములు ముడుచుకొనెదరేల? ................."

అని యుపన్యసించు లోకబాంధవు మహోపన్యాసమునందలి గంభీరారావముంబోలెఁ గాసారాంతర సంచరద్భ్రమర ఝంకారములు వీనులకు విందు గొలుపుచుండెను. అట్టి జాతీయోప

దేశములచేఁ గలుగు ఖావోద్రేకమున సభామధ్యమ్మునుండి యసంఖ్యాకములై వెడలు 'వినుఁడు! వినుఁడు!' అను నవిచ్ఛిన్ననాదంబులో యన సకలవిహంగకుల కలకలారావంబు లెల్లెడ పెల్లుగ నుల్లసిల్లె. తొఱ్ఱలనుండి గ్రుడ్లగూబలు గూఢచారులగతిఁ దొంగితొంగి చూచుచుండెను.

ఆ ప్రభాతసమయంబునఁ బటుదృఢప్రాకార పరివేష్టితంబై పర్వతోపరితలంబున నొప్పు 'లావా'దుర్గపు సింహద్వారమునందలి బలిష్ఠములగు నినుపతలుపులకుం గల రంధ్రములలో సూర్యకిరణములు తాళపుఁజెవులవలెఁ బ్రవేశింపఁ జొచ్చెను. తోడనే తత్కిరణప్రసారంబుననో యన నయ్యయః కవాటములు లోననుండి తటాలునఁ దెరువఁబడినవి. ఉత్తుంగ తురంగారూఢుఁడగు నొక మొగలాయి మన్సఫ్దారుఁడు తన వెనుకఁ గొందఱు సిపాయిలతో లోపలినుండి ద్వారమును దాటివచ్చి యైదారడుగులలోనే గుఱ్ఱమునాపి తన ముఖమ్మున గ్రుమ్ము లేయెండకుఁ జేయడ్డువెట్టుకొని యొక్కమాఱు నలువంకలఁ గలయ నీక్షించెను. తక్కినసిపాయిలు చేమోడ్పులతో గుఱ్ఱపు చుట్టును దూరదూరముగ నిలిచియుండిరి. రెండుమూఁడు నిముసములవఱకట్లు వీక్షించి యా మొగలాయిదొర తన పరివారమున కేమి యాజ్ఞాపించెనోగాని వారు మొగములు వంచుచు సలాములు చేయుచు లోనికి నిష్క్రమించిరి. వారు నిష్క్రమించుటయే తడవుగ నా రౌతు తనవాహనము నత్యంతజవంబున



సాగనిచ్చెను. పర్వతారోహణావరోహణములయం దారితేరిన యా కృష్ణవర్ణతురంగము మార్గముగ నేర్పడిన సమప్రదేశమునుండి క్షణమాత్రములో భూమికి నవతరించెను. యజమానుని యభిప్రాయము నెఱుంగుటకుఁ బ్రయత్నింపకయే యావారువము తన యలవాటుచొప్పున 'మాతృకుండ' గ్రామమున కభిముఖముగాఁ బోవసాగెను. తన గమ్యస్థానమదియే యగుటచేత నా రౌతుకూడ దానిని మఱియొకదిక్కునకు మఱలింపలేదు.

'లావా' దుర్గమునుండి మాతృకుండగ్రామమున కొక మైలుకంటె నెక్కుడు దూరములేదు. ఒకటి కొండమీఁదను మఱియొకటి కొండక్రిందను నుండుటచే నయ్యవి యొకదానినుండి యొకటి విభజింపఁబడినవిగాని లేకున్న నొక్కగ్రామముక్రిందనే పరిగణింపఁ బడియుండును. ఆ పల్లెటూరినుండి దుర్గమునకును దుర్గమునుండి పల్లెటూరునకును బ్రజల రాకపోకలు నిత్యమును జరుగుచునే యుండును. పర్వత దుర్గవాసులకా పల్లెయే పాలు, కూరలు, పండ్లు, ధాన్యములు మొదలగు వానిని సమకూర్చుచుండును. దక్షిణమునుండి యుత్తరము వైపు కొన్ని మైళ్ళవఱకుఁ దిన్నగాఁ బ్రాకిపోయి, తద్దుర్గద్వారముతో ముగిసిన యా పర్వతమును, మొదటినుండి చివరవఱకు నంటుకొని చంద్రభాగానది ప్రవహించుచుండెను. దుర్గద్వారమునుండి దిగిపోవు వారి కానదియొడ్డే మాతృకుండగ్రామ మార్గము. ఆమార్గమున కొకప్రక్క నది ప్రవహించు

చుండినను రెండవప్రక్క మాత్ర మక్కడక్కడ మామిడి పనస యరటి కొబ్బరి మొదలగు ఫలవృక్షములును, ఆ వృక్షముల నుండి కనుచూపు మేర పచ్చని పైరులును విచ్చలవిడిఁ గానవచ్చు చుండును. ఇండ్లకడ నత్తలమర్చి యిచ్చిన చలిది గంపల నెత్తులపై నిడుకొని కాపుఁగోడండ్రు యౌవనమదంబున మిన్ను మన్నుం గానక పకపకలాడుచుఁ జకచకలాడుచు నిక్కుచు నీల్గుచు నాడుచుఁ బాడుచు మార్గస్థులైన మొఁగలాయి రౌతున కెదురుగ వచ్చుచు మార్గమధ్యమునందే ప్రక్కకు మఱలి చెట్లగుంపులనుండి పొలము కాపులైన తమ నాయకులుగల కళ్ళములకుఁ బోవుచుండిరి. వారల యొయ్యారపు నడకలను యౌవనవిలాసములను రౌతు వింతగావీక్షించుచుండెను. అతఁడు మఱికొంచెము దూరము పోవుసరికే కొందఱు కాపురైతులు వాని కెదురైరి. చిక్కని బుగ్గమీసములు, వెడదలైన వక్షములు- కండలు పెరిగిన దండలు- దండలకు బంగారు దండకడియములు - ముంజేతులకుఁ గంకణములు- వ్రేళ్లకుంగరములు-కట్టుకొనిన యొడుకు నూలు బట్టపై స్పష్టముగఁ గానవచ్చుచున్న వెండిబిళ్ళల మొలత్రాళ్ళు- చేతులఁ జేయెత్తు పొడవైన చేపాటి కఱ్ఱలు- నోటిలోఁ బొగచుట్టలు—ఆఁ—పొరపాటు. ఆధునికపుఁ గాపురైతు కట్టెదుట గానవచ్చుచుండుటచేత రైతునోటికిఁ బరిపాటయిన పొగచుట్టను బొరపాటున నాటి రైతుల నోళ్ల నుంచవలసి



వచ్చినది గాని యప్పటి కింకను ధూమపత్రదేవత మన యార్యావర్తమునఁ బ్రవేశింపనేలేదు. అందుచే మాత్రకుండ గ్రామస్థులగు నాటిరైతుల నోళ్ళలోఁగాని తలగుడ్డలయందుఁగాని, చెవిసందులయందుఁ గాని సగము కాల్చిన పొగపీకలును బొగపీకలవలన జనించు దుర్గంధమును గానరావు. రత్నగర్భంబగు భారతభూమిపై మొదటి పొగచుట్ట యిమ్ము 1604 వ సం॥ లోఁ బడినది. మన కథాకాల మప్పటి కింకను బది, పదిరెండేండ్లకు ముందు దేయగుటచేత నాటి రైతులు 'ధూమపాన' మనుమాట నెఱుంగక పోవుటయేగాక, యట్టి యుచ్ఛిష్ట దేవతను ముందుముందు తామారాధింప వలసివచ్చునని యూహించియైన నుండరు! ఇంక బ్రస్తుత కథ ననుసరింతము.

అట్టి వేషములతో నెదురైన నాటి రైతులు తనకు సలాము చేయకయే నిర్లక్ష్యముగఁ బోవుచున్నారని మన్సఫ్దారున కించుక యాగ్రహము కలిగినది. అతఁడు చుఱచుఱమను వేడిచూపులతోఁ దనప్రక్కనుండి తొలఁగి పోవుచున్న రైతులను మెడతిరిగినంతవఱకుఁ దిరిగిచూచెను. మాత్రకుండగ్రామస్థులు తనకు సలాము చేయు నాచార మాదినుండియు లేకుండినదే యైనయెడల నానాడే యతఁడాగ్రహించుటకుఁ గారణముండదు. అందుచే నయ్యాచార మంతవఱకుఁ బ్రచారములో నున్నట్లును, నాడుమాత్రము వారేకారణము

చేతనో సలాముసేత లుపేక్షించినట్లును మన మూహింప వలసి యున్నది. ఆ చుఱచుఱ చూపులతోడనే చూపుమేర దూర ములోనున్న పల్లె నతఁడు మెల్లఁగా సమీపించెను.

కొండగ్రామ మగు మాతృకుండగ్రామమొక భిల్ల పల్లె యని చెప్పవచ్చును. అందు భిల్లకుటుంబములే తఱుచుగా నున్నవి. చుట్టుప్రక్కలనున్న కొండపల్లెలలో దానికంతటి ప్రాధాన్యము వచ్చుటకుఁ గారణ మాగ్రామమందలి మాతృకుండమే. పరశురాముఁడు గురువచన ప్రబోధితుఁడై తల్లియైన రేణుకాదేవిని ఖండించి, తన రక్తపుఁ జేతులును రక్తపుఁ గొడ్డలియు నాకుండమునందే కడుగు కొనెనఁట. ఆప్రాంత ములయందలి ప్రజల కాకుండమునం దట్టి భక్తివిశ్వాస ములు మెండుగ నుండుటచేత దానిచుట్టును విశాలమగు నొక యాలయము నిర్మింపఁబడినది. ఆయాలయమునందు రేణుకాదేవి యొక్కయుఁ బరశురాముని యొక్కయుఁ దదితర దైవముల యొక్కయు విగ్రహములు గలవు. తండ్రియైన జమదగ్ని మెచ్చి వరము కోరుమనుటయు, తనతల్లి పునర్జీవిత యగునట్లు వరమిమ్మని పరశురాముఁడు కోరుటయు, ఆకుండమునందు రక్తపుఁ జేతులు కడుగుకొనుచున్నప్పుడే తటస్థించుటచేత, అందుఁ గ్రుంకువారికి మరణము కలుగదను మూఢ విశ్వాసముతో, భిల్లు లొక్కొక్కప్పుడు కఫవాతములు గ్రమ్మి చావనున్నవారి నాకుండము లోనికి



మోసికొనివచ్చి ముంచి వారి మరణబాధ తగ్గించుచుందురు. రేణుక పునర్జీవితయగుటయే గాక తనకొడుకు వడసిన వరము విశేషమునఁ దనవధకుఁ గారణమైన జారత్వదోషము నుండి విముక్తయై పవిత్రచరిత్రయై వర్ధిల్లెఁ గావున నట్టి జారత్వశంకిత యైన మదవతికి మెడపై గండ్రగొడ్డలి నుంచి, రక్తమువలె నా పాదమస్తకము వసంతము జల్లి కులమువారితో నాకుండము కడకుఁ గొనివచ్చి, యామె నందు ముంచి మఱలఁ గులములోఁ గలుపుకొను చుందుట యా ప్రాంతములవారి యాచారము. చుట్టుప్రక్కలఁగల పల్లెలవా రెల్లరు రేణుకా. పరశురాముల కథలు పాడుకొనుచుఁ బ్రతిసంవత్సర మయ్యాలయములో గొప్పయుత్సవము చేయుచుందురు.

గ్రామమంతయు నాలయమునకు ముందే యున్నది. ఆ పల్లెటూరి చుట్టును 'బ్రహ్మజెముడు మట్టల'తోఁగూడ బండ రాళ్ళు దట్టముగఁ బెరిగియుండినను నడుమనడుమ నేర్పడిన దారు లలో నొకదారినుండి మొగలాయిరౌతు గ్రామములోఁ బ్రవేశించెను. ప్రవేశించి చిన్నచిన్న పాకలు గుడిసెలు పశుశాలలు గోమ యరాసులు నక్కలు నాగళ్లు విచ్చలవిడిఁ గానవచ్చువీథు లతిక్రమించి యతఁడు కచేరీవీథిలోఁ బ్రవేశించెను. అదియే యా గ్రామమున కెల్లఁ గడపటివీథి. ఆవీథికిఁ జిట్టచివరనే మేమిది వరకుఁ బేర్కొనిన యాలయము గలదు. వీధికి రెండువైపులం గల గడ్డిండ్లు కడు స్వల్పసంఖ్యాకంబులగుటయేగాక తక్కినవీథు

లంబోలెఁ దద్వీథిమధ్యంబున గోమయరాసులు మొదలగు మలినపదార్థములులేక కొంతవఱకు శుభ్రముగనే యుండెను. మనసబ్దారుఁ డా వీథిం బోవుచు వీధికి నట్టనడుమ విశాలములగు మంటియరుగులుగల యింటిముందర గుఱ్ఱమునుండి దిగెను. తోడనే నల్లని దీర్ఘకాయములును వికారాకారములును గల నలువురు మోటుమనుష్యులా యింటినుండి తటాలున వెలుపలికి వచ్చి సలాములు చేయకయే వానిని నిర్లక్ష్యముతోఁ జూచుచుఁ గట్టెదుట నిలువంబడిరి. అదివఱకే మార్గస్థులగు రైతు లొనరించిన పరాభవమువలనఁ గలిగిన యాగ్రహ మిప్పుడు మఱింత యధికమయ్యెను నతఁడు వెలుపలికిఁ దోపనీయక "ఖాజీసాహెబువా రెక్కడ? మాగుఱ్ఱమును గట్టుట కిచ్చుట నెవ్వరును లేరా?" యని గంభీరముగా నడిగెను. "ఆలయములో ఖాజీమహారాజ్ జపము చేసికొనుచున్నారు. వచ్చువేళ యైనది" అని వారిలో నొకఁడు ప్రత్యుత్తరము చెప్పుచుండఁగా మఱియొకఁ డాగుఱ్ఱమును అపరాధుల శిక్షించుటకు గుమ్మమున కెదురుగ వాకిటఁ బాతఁబడిన 'బొండకొయ్య' కడకుం గొనిపోయి కళ్ళెము నాకొయ్య కొలికియందుఁ దగిలించి వచ్చెను. తక్కిన యిరువురుభిల్లసేవకులును లోనికింబోయి తివాసిఁ గొని వచ్చి యరుగుపైఁ బరచిరి. దయచేయుఁడని యొకరు గౌరవింప వలసిన యపేక్షలేక



యే యతఁడు ధుమధుమలాడు మొగముతో ముంజూరు పంచనుండి వంగి యరుగెక్కి తివాసిపై సుఖోపవిష్టుం డయ్యెను.

అట్లు కొంతసేపు కూర్చుండి యాసిపాయివీరుఁడు విసుకుకొనుచు, గుమ్మములోఁ గూర్చుండిన భిల్లసేవకులం గాంచి, "మేము వచ్చినట్లు ఖాజీవారికిఁ దెలియఁ జేసెదరా?" యని యడిగెను. నల్లని ముఖములనుండి తెల్లని దంతచ్ఛాయలు వెలువడ వారొండొరులఁ జూచి నవ్వుకొనుచు "లేదు, లేదు. తపస్సులో నున్నప్పుడు మాటాడించుట కాజ్ఞలేదు." అని ప్రత్యుత్తర మొసంగిరి. ఆమాటలలోనే యాలయము వైపునుండి 'టప్పుటప్పను' పాదుకల చప్పుడు వారికప్పుడు వినఁబడఁ జొచ్చెను. తోడనే వారందఱి దృష్టులు నావంకకు మఱలినవి. గన్నేరుపూఁజాయ వన్నెలఁ జెన్నుమీఱిన సన్నని సీరుకావిదోవతి నిండార గుండారు వోసికొని, జాళువా బంగారు రంగులరంగారు పచ్చని శరీరచ్ఛాయలును, అరువదియేండ్లు గడచి మేనెల్ల ముడుతలు వడినను బాల్యమునందలి సాము గరిడీల పటుత్వము నింకను బ్రకటించుచున్న యవయవసౌష్టవంబును, సూర్యకిరణంబులంబోలి తళతళలాడు తెల్లని తలయుఁ బోడవైన గడ్డంబును, విబూదిరేకలు రుద్రాక్షమాలికలు జలకమండలము నల్లసిల్లఁ దన యమేయ తపఃప్రభావంబును వెల్లడించు దివ్యతేజంబుతో వచ్చు నొకమహాపురుషుం గాంచి యచ్చటి భిల్లులు వెంటనే లేచి దూరముగా నిలువఁబడిరి. సిపాయివీరుఁ,

డును లేవ నుద్యమించునంతలో నమ్మహాత్ముఁడు సమీపించి 'సాహెబ్జీ! కూర్చుండుఁడు! కూర్చుండుఁడు! ఇప్పుడే దర్శనము చేయుచున్నాను' అని లోనికిం బోయెను. లోని కేగిన యొకటి రెండు నిముసములలోనే కమండలమును బాదుకలను విడిచి వచ్చి యావృద్ధుఁడు సిపాయివీరునకుఁ బునర్దర్శన మొసంగెను. ఆతఁడును సుఖాసీనుం డైనంతనే యయ్యిరువురకు జరిగిన సంభాషణమును జదువరులు ముందు ప్రకరణమునఁ దెలిసికొనఁగలరు.

---

## తొమ్మిదవ ప్రకరణము.

### షహబజ్ఖాను.

"షహబజ్ఖాన్జీ నేఁడు మీరు స్వయముగానే బయలుదేరి నట్లున్నది. మీ సరదారుల ప్రయత్నము లేమియు ఫలింప లేదా?"

"మీ సహాయము లేకుండ నెవరి ప్రయత్నములైన నెట్లు ఫలించును? చుట్టుప్రక్కలనున్న పల్లెలన్నియు శోధించితిమి. కాని యింతవరకు దొరకలేదుగాని కొన్నిస్థలములు మాత్ర మనుమానింపవలసియున్నవి."

"మీ కనుమాన మున్న స్థలములలో మా గ్రామ మొకటి కాఁబోలు!"



ఆమాటకు షహబజ్ఖా నేమియుఁ బ్రత్యుత్తర మీయక మొగము వంచుకొని యూరకుండెను. ఖాజీయును గొంతసే పూరకుండి,

"ఖాస్జీ! మాటాడ రేమి? మా గ్రామస్థులు దొంగ లనియు, పితూరీదారులనియు మీరు సెలవిచ్చిరఁట! నిజమేనా?"

"ఖాజీసాహెబ్! మీ రంతగా నడుగుచున్నప్పుడు నేను దాఁచఁగూడదు. అర్ధరాత్రములయందు మీ యాలయము ప్రక్కనుండి వందలకొలఁది భిల్లసేనలు సాగిపోవుచుండుట దుర్గ రక్షకులైన మా సిపాయి లొకటి రెండుసారులు వెన్నెలరాత్రులలో గోపురములనుండి చూచినట్లు చెప్పుచున్నారు. ఇందుకు మీ రేమి సమాధానము చెప్పఁగలరు?

"ఏమి సమాధానము చెప్పగలను? ప్రతాపసింహుని కుట్రలోఁ జేరి వానికిఁ దోడుగా నేనే యీ దండు పంపుచున్నా నని మీ యనుమానము గదా? ఆ రహస్యసేనలు మా గ్రామమునుండియే వచ్చుచున్నట్లు మీ యన్నగారు కూడ మీకు వ్రాసినారు కాఁబోలు!"

"ఖాజీసాహెబ్! మీరు తొందరపడుచున్నారు."

"నేను గాదు, మీరు తొందరపడుచున్నారు. దుర్గాధ్యక్షులు మీరు. పంచాయితీదారుఁడను నేను. మన మిరువురమును గూడ సర్కారువారి నౌకరులమే. అందుచే రాజకీయకార్య నిర్వహణమునందలి బాధ్యత మీ కెంతయుండునో నా కంతే

యుండు నని మీ రూహింపవలసియున్నది. మీ రట్లూహింపక సర్కారునౌఖరునైన నన్నీకుట్రలో ననుమానించి యవమానించుచున్నారు."

"కాదు కాదు. ఖాజీసాహెబ్! నామనవి పూర్తిగా వినుఁడు."

ఇంకేమి వినవలెను? ఆలయమునుండియే కుట్రదండు బయలుదేరుచున్నప్పుడు గ్రామాధికారినగు నాకీకుట్రలో సంబంధమున్నట్లేకదా? ఇప్పుడు మీరాక మా యాలయమునుగూడ శోధింపవలెనని కాఁబోలు? కాని మాదైవక్షేత్రమునందు మీరెట్లు కాలిడఁగలరు? మీరింటికి దయచేసి మీకుఁ బ్రతినిధిగా రాజపుత్రునిఁ బంపుఁడు."

"మీభిల్లులాలయములోనికిఁ బోవుచుండలేదా? వారికంటెను మేము తక్కువవారమా? ఇది రాజకుటుంబము నవమానించుటకాదా?"

"ఎన్నటికినిగాదు, సర్వమతరక్షకుఁడైన ప్రభు వక్బరు చక్రవర్తి యనుమాట మీరు మఱచిపోయి మాటాడుచున్నారు. మీరు స్వయముగనే యాలయము శోధించుట కిచ్చటి గ్రామాధికారినగు నాయాజ్ఞగాని యచ్చుటఁ జక్రవర్తి యాజ్ఞగాని లభింపదు. అవసరమైన 'యెడల మీరు సర్కారువారికి వ్రాసి యీసంశయముఁ నివారించుకొనవచ్చును."



"ఖాజీసాహెబ్! సర్కారువారికే వ్రాయవలసివచ్చినప్పు డిది యొక్కటియేనా? అనేకసంగతులు వ్రాయవలసివచ్చును. ఆమాట లిప్పుడెందుకు?"

"ఔనౌను. మనము రాజోద్యోగస్థుల మగుటచేత ననేకసంగతులు వ్రాయవలసి వచ్చుచుండును. మీరును వ్రాయవచ్చును. నేనును వ్రాయవచ్చును. మీరెంతటి దుర్గాధ్యక్షులైనను నేనెంతటి పల్లెటూరియుద్యోగినైనను మత సంరక్షణమును గూర్చియుఁ బ్రజారక్షణమును గూర్చియుఁ బ్రభువేర్పరచిన శాసనములను గొనసాగించుటలో మనమిరువురమును సమానులమే. మీయన్నగారిపై మాగ్రామస్థులు పెట్టిన ఫిర్యాదులు వందలకొలఁది నున్నవి. ఆఫిర్యాదులను హుజూరుకు వ్రాసి పంపుటకు కలములేకగాని కాగితములేకగాని వ్రాయుట చేతఁగాకగాని మానివేయలేదు."

"దయఁదలఁచి మానివేసితిరా! అన్ని ఫిర్యాదులు వచ్చుటకు మాయన్నగారు చేసిన ద్రోహమేమి? వారికిని మీ గ్రామస్థులకు నేమి సంబంధమున్నది?"

"మాగ్రామముమీఁదుగా సేనలతోఁ బ్రతాపసింహునిపై దండెత్తి పోవునపుడు గుఱ్ఱములచేతను నేనుఁగులచేతను మాపంటలన్నియు నడుగంటఁ ద్రొక్కివేయఁబడినవి. ఫలవృక్షములయందలి పండ్లు కాయలు నామూలాగ్రముగఁ గోసివేయఁబడినవి. కొన్నివృక్షములు రూపురేఖలే లేకుండ.

బోయినవి. మార్గమధ్యస్థ గ్రామములయెడల సేనానాయకు లెంత జాగరూకతతో నుండవలయునో చక్రవర్తి చేసినశాసనములు మీ యాసఫ్ ఖానుసాహేబువారెఱుఁగనివారా? ఇప్పుడీ గ్రామమునకుఁ గలిగిన నష్టద్రవ్యము నెవరిచ్చుకొనెదరు?"

"ఖాజీసాహేబ్! ఇవన్నియు లౌకికపు మాటలు. రాజకీయ తంత్రమునందు మన మందఱమును గూడ నారితేరినవారమే. మీ రీ ఫిర్యా దేన్యాయాధికారియొద్దఁ బెట్టినను—"

"ఏ న్యాయాధికారియో యని మీరు భ్రాంతి పడుచున్నారు. పంచాయతీ సభలోఁ బరిష్కరింపఁ బడిన ఫిర్యాదులను జక్రవర్తికిఁదప్పఁ దక్కిన న్యాయాధికారులకు విచారించు నధికారము లేదు."

"సరే కావచ్చును. మీ ఫిర్యాదుల ప్రసంగము నాకెందుకు? నామనవియే మఱియొకమాఱు చిత్తగింపుఁడు. మీ యాలయమును శోధించుటకు మాకింక నధికారము లేనట్లేనా?

"ఆ యధికారము మీ కెప్పటికిని లేదు. మా యాలయము శోధించుటయన్న నన్ను శోధించుటయే. నన్ను శోధించుట యెప్పుడు? నేను నేరస్థుఁడ నైనప్పుడు. ఒక న్యాయాధికారితోఁ జేయవలసిన ప్రసంగము కాదిది."



"సరే? నేనువచ్చిన కార్యము సగమైనది. తక్కిన సగమును బూర్తిచేసికొనుటకు మిమ్ముఁ గొన్ని ప్రశ్నలడుగవలసియున్నవి. తగిన సమాధానము లిప్పించెదరా?"

"ఆప్రశ్నలు మీ రెవరి నడుగుచున్నారు! ఒక నేరస్థునా? న్యాయాధికారినా!"

"న్యాయాధికారినే. అందులో రాజభక్తిగల న్యాయాధికారిని"

"అట్లైన నాకు బ్రహ్మానందము. నేను నిజమైన, రాజభక్తిగల న్యాయాధికారిని. రాజభక్తియందే నాశరీరమెల్ల ముడుతలుపడినది. రాజభక్తియందే నాగడ్డము తెల్లఁబడినది."

"మీ కుమారుఁ డిప్పు డెచ్చట నున్నాఁడు?"

"నాకుమారుని ప్రసంగమెందుకు? కుట్రదారుఁడు వాఁడే యని మీ రూహించుచున్నారా?"

"అదికాదు. అతఁడు తఱుచుగా వేటయందే తిరుగుచుండునా యని మిమ్మడుగుచున్నాను."

"ఆహా! తప్పేమున్నది? కాలములోనున్న రాజకుమారునకే కాని నావంటివానికా వేటయం దాసక్తి?"

"నిజము నిజము. తప్పులేదు. వేటకు బయలుదేరినప్పుడెల్ల వానివెంట వందలకొలఁది భిల్లులుఁగూడ బయలుదేరుచుందురు కాఁబోలు!"

"వందలో వేలో నేను లెక్కపెట్టలేదు. ఇదికూడఁ బ్రశ్నయేనా సాహేబ్జీ!"

"ఖాజీసాహేబ్! కోపింపకుఁడు! వందలకొలఁది వేటకు బయలుదేరు మీభిల్లులెల్లరును, కత్తులు కటారులు ఈటెలు బాకులు మొదలగు నాయుధములతోఁ బాటు తుపాకులుగూడ దాల్చుచున్నారుకదా?"

"ఆహా! తుపాకులఁ దాల్చుటయేకాక తురంగారూఢులైకూడ బయలుదేరుచుందురు. సాహేబ్జీ! చిన్నసంశయము. మీసైనికోద్యోగులే గాని తదితరులు తుపాకు లుపయోగింపఁగూడదను క్రొత్తశాసనమేదియు నీమధ్య వెలువడలేదుకదా?"

"లేదు లేదు. అందఱు నుపయోగింపవచ్చును. కాని వందలకొలఁది గుఱ్ఱములును దుపాకులును మీ కుమారునకుఁ గాని వాని భిల్లపరివారములకుఁ గాని యెట్లువచ్చినవో మీరు చెప్పఁగలరా?"

"మీరు ధరించినదుస్తులు మీకెట్లు వచ్చినవో మీరు చెప్పఁగలరా?"

"ఖాజీసాహేబ్! మీ రేమన్నను నొకసంగతి మీకుఁ జెప్పకతప్పదు; మీరు వినకతప్పదు. మీరు వయోవృద్ధులు; రాజకార్యనిపుణులు. ఏవిషయమునందును మీకున్న యనుభవము మాకు లేనిమాట వాస్తవము. మీ రాజభక్తినిగూర్చిగాని మీయుత్తమప్రవర్తనముగూర్చిగాని మాకెప్పుడు నెట్టి యను



మానమును లేదు. కాని మీరు నిరంతరమును దైవచింతనమునందును రాజకార్యనిర్వహణమునందును దన్మయులై కాలమును గడపుచుండువారగుటచే నొక్కసంగతి గుర్తించుట కవకాశము లేకున్నవారు. మీకుఁ దెలియకుండ వేటయనుమిషపై మీ కుమారుఁడు రహస్యసేనలతో బయలుదేరిపోయి ప్రతాపసింహునకుఁ దోడుపడుచున్నట్లు చుట్టుప్రక్కలఁ బ్రబలమైన వదంతికలదు. మీకీసంగతి తెలిసియుండినయెడల మీరిదివఱకే వానిని మందలించియుందురు. ఇప్పుడైనను మించిపోలేదు. మీరు తఱుచుగా వానిని వేటకు బయలుదేరనీయకుఁడు. బయలుదేరినప్పుడు వానివర్తనమును మీరు రహస్యముగాఁ గనిపెట్టినయెడల మీకు సర్వమును విశదము కాఁగలదు."

"ఖాన్‌సాహేబ్! మీరు చెప్పినదంతయు నావిశ్వాసమునకు మేరమీరుచున్నది. ప్రతాపసింగుప్రసంగము వచ్చినప్పుడెల్ల వట్టి యప్రయోజకుఁడని వానిని దూషించుచుండు నా కుమారుఁడు వానికెన్నఁడైనను దోడ్పడనెంచునా? నాతోఁ జెప్పకుండ వాఁ డట్టిసాహసము లొనర్చునని నే ననుకొనను. ఇంతకు వాని కంతయీడేది.? మీరింతగాఁ జెప్పుచున్నారు. కాఁబట్టి వానిని మందలించుటకు నాకభ్యంతరము లేదు. మీరు నన్నుఁగోరునది యింతేకదా?"

"ఇంతేకాదు. ప్రతాపసింహుని దోపిడివస్తువులు కొన్ని యీచుట్టుపక్కల నెవరో వర్తకులు కొని విక్రయించుచున్నారఁట. మీరీవిషయములో నేమైన శ్రద్ధతీసికొనఁగలరా?"

"నావల్లఁగాదు. నాకంత యోపికయును లేదు. మా గ్రామములో నంతటి వర్తకులును లేరు. ఉన్న పెద్దవర్తకు లెవ్వరో మీదుర్గమునందే యున్నారు. అందుచే మీ రీవిషయములోఁ గూడ మాగ్రామమునం దనుమాన పడనక్కర లేదు."

"అచ్ఛా! ఖాజీసాహేబ్! మీకుమిక్కిలి శ్రమగలిగించితిని, సలామాలేఖుమ్."

"పాపము మీకుఁబ్రొద్దెక్కినదికాఁబోలు! సాబ్ సలాం."

షహాబజ్ ఖాను లేచి వెంటనే యరుగుదిగెను. ఖాజీ సెలవుప్రకారము భిల్లుఁడొకఁడు వాకిటిలోఁ గొయ్యకుఁ గట్టఁబడిన గుఱ్ఱమును విప్పి ఖానుకడకుఁ గొనివచ్చుచుండెను. అప్పు డాకస్మికముగ, నాలయములోనుండి "జయ్! జగద్రక్షకీ! జయ్! పరమేశ్వరీ! నీవే రక్షింపవలయును." అని యనేకు లొక్కమాఱుగఁ గేకలిడినట్లు పెద్ద కలకలము వినవచ్చినది. ఆ కలకలమును ఖాను వింతగావినుచుండెను గాని దేవతాదర్శనమునకువచ్చిన భక్తులెవరో కేకలిడుచున్నారని యెంచి చందావతుఁడా కేకలయందు లక్ష్యముంచలేదు. అప్పు డాలయమువైపు నుండి యొకరాజకుమారుఁడు, రమారమి పదునెనిమిదేండ్ల యీడువాఁడు, కలువరేకులంబోలు చక్కనికన్నులు, సూనాగు



మీసములు, పొడవైన నాసిక, విశాలమగు ఫాలమును గల లావణ్యవిగ్రహమువాఁడు, అచ్చటచ్చట రక్తపుమచ్చలు గల్గ తెల్లని పాయ్జామాయును దెల్లని యంగీయునుదాల్చి, తలపైఁగల యాకుపచ్చని కుచ్చులపగిడీకొనకొంగుతో మొగమ్మునఁ గ్రమ్మిన ఘర్మాంబుకణములఁ దుడుచుకొనుచుఁ దనవెనుక కొందఱు భిల్లులతో, నత్యాయాసపడిన ట్లుచ్ఛ్వాసనిశ్వాసములు విడుచుచుఁ బరుగున వచ్చుచుండెను. ఖాను వానినిజూచి సంగతులేమైనఁ గనిపెట్టవలయునని యెంచి, జీను దులుపుచున్నట్లును, కళ్లెము సవరించుచున్నట్లును, రికాఫులు సమపరచుచున్నట్లును నటించుచుఁ గొంత జాగుసేయసాగెను. అరుగుపైనే కూర్చుండియుండిన చందావతుఁడు తనకుమారుని రాకచూచి తటాలున నరుగుదిగి వాకిటిలోనికేగెను. వెంటనున్న భిల్లులెల్లరును దూరదూరముగనే నమస్కరించుచు నిలువఁబడియుండ శక్తిసింగు తండ్రిని సమీపించి వంగి నమస్కరించి, లేచి, జోడించినచేతులు జోడించినట్లే యుంచి, "బాబాజీ! దీనులగు నలువురు రాజపుత్రులు ప్రాణావశిష్టులై యాలయములో మృత్యుముఖమునఁ బడియున్నారు. మీరు త్వరగా దయచేసి యేమైన నవకాశమున్నయెడల వారికిఁ బ్రాణదానము చేయవలయును." అని గద్గదస్వరముతోఁ బలికెను. ఆమాటలు వినుటయేతడవుగఁ జందావతుఁడు తత్తరపాటుతో "ఆఁ - రాజపుత్రులా? ప్రాణావశిష్టులై

యున్నారా? అయ్యయ్యో! వారెవ్వరు? ఆలయములోని కెట్లు వచ్చిరి? ఎవరు తీసికొనివచ్చిరి? ఒక గంటక్రింద నచట నెవ్వరునులేరే? హరహరా!" అని యొకదానిపై నొక ప్రశ్న వేయుచు నాప్రశ్నలకు వానివలనఁ బ్రత్యుత్తరము విన నభిలషింపకయే యాతురతతో నాలయమువంక నతిత్వరితగతిం బోవసాగెను. వానివెంటనే శక్తిసింగును భిల్లులును నడువసాగిరి. ప్రయాణసన్నద్ధుఁడైన షహాబజ్ఖానుకూడఁ దన కపటనటనమునుజాలించి యంతకంటె జాగుసేయుట మర్యాద కాదనియు జాగుచేసినను లాభములేదనియు గ్రహించి తురంగాధిరూఢుఁడై దుర్గాభిముఖుండై వెడలిపోయెను.

---

## ప ది య వ ప్ర క ర ణ ము.

### రో గు లు.

చందావతుఁడు చందావత్కుల రాజపుత్రుఁడు. శక్తిసింగు వాని పెంపకపుఁ గొడుకుగాని కన్నకొడుకు గాఁడు. యౌవనదశలోఁ జందావతుఁడు చిత్తూరునం దుదయసింగు రాణాయొద్ద సరదారుగాఁ జాలకాలమువఱకుఁ బనిచేసెను. కారణాంతరములచేఁ బ్రభువుతోఁ దనకుఁ విరోధము సంభవించుటచేతను, తన భార్య సంతానరహితయై గతించుట



చేతను, రాజోద్యోగమునందును సంసారమునందును గూడ విరక్తి చెంది, తనకుఁ బూర్వు లార్జించిన భూవసతిగల మాతృకుండగ్రామమునకు విచ్చేసెను. ఆదినుండియు నతఁడు సదాచార సంపన్నుఁడును బూర్వాచారపరాయణుఁడు నగుటచేతఁ దన జపతపాదులకు దైవక్షేత్రమగు నాగ్రామ మెంతయు ననుకూలముగా నున్నదని యతఁడు నిత్యము సంతోషించుచుండును. ఉదయసింగు రాజ్యచ్యుతుఁడై గతించుటయు, ప్రతాపసింగు పరాజితుఁడై యడవుల పాలగుటయు, మేవాడరాజ్యము మొగలాయిప్రభువులకు స్వాధీనపడుటయుఁ దటస్థించిన తరువాత, అక్బరుచక్రవర్తి తన రాజ్యాంగ పద్ధతులను దనకు లోఁబడిన మేవాడరాజ్యభాగముల యందుఁగూడఁ బ్రవేశపెట్టెను. ఆ సందర్భమునఁ జుట్టుప్రక్కల నున్న పల్లెల కెల్లఁ దల్లియు దైవక్షేత్రమునైన మాతృకుండమునందుఁ బంచాయితీ సభ నేర్పాటు చేయవలసివచ్చినది. రాజోద్యోగస్థులచేఁ జందావతుఁడు తత్సభాధ్యక్షునిగా నెన్నుకొనఁబడెను గాని యతఁ డాపదవి కంగీకరింపలేదు. చక్రవర్తి పాట్నా ప్రయాణములో లావాదుర్గమునందు మజిలీచేసియున్నప్పుడు రాజోద్యోగస్థులు చందావతునిఁ గూర్చి చెప్పి యతనిని వాని కట్టెదుటఁ బెట్టిరి. చందావతుని పారమార్థికశీలమునకుఁ జక్రవర్తి యెంతయు సంతసించి 'ఖాజీ' యను బిరుదముతో స్వయముగానే ఫర్మానా యొసఁగుటచేత నతఁ డా పదవి నంగీకరింపక

తీరినది కాదు. మఱియుఁ బ్రాజ్ఞుఁడైన తరువాత వాని కుమారునకుఁ దన కొలువులో నున్నతోద్యోగ మొసఁగునట్లు ఖరారుచేసి చక్రవర్తి చందావతు నెంతయు సంతోషపరచెను.

చందావతుని యధ్యక్షత క్రింద నున్న పంచాయితీ సభలోని తక్కిన నలువురును నాలుగు గ్రామములకు సంబంధించినవారేగాని యొక్క గ్రామమువారు కారు. ఫిర్యాదులను విచారణ చేయుటకు, అధ్యక్షుని యనుమతి ననుసరించి నియమితకాలములకు వా రాగ్రామమునకు వచ్చుచుందురు. చందావతుఁడు స్వయముగనే చక్రవర్తిచే ఫర్మానా యొసంగఁబడినవాఁ డగుటచేత 'గ్రామతనిఖీ' లకు వచ్చు నున్నతోద్యోగుల యధికార విజృంభణము వానియెడ సాగుచుండుట లేదు. అట్టివారెల్లరు నాతనియెడ భయభక్తులతోడనే మెలఁగుచుందురు. చందావతుని యుద్యోగమిప్పటి గ్రామమునసబు కరణముల యుద్యోగమువంటిది. లిఖిత రూపమునను వాగ్రూపమునను గూడ నున్నతోద్యోగస్థులచే 'నీవునీ' వను నేకవచన ప్రయోగముచేతనే సంబోధింపఁబడుచున్న నేటి గ్రామోద్యోగుల యవస్థ వివరింప నక్కఱలేదుకదా? వారి యుద్యోగగౌరవ మెంతలోనున్నదో స్పష్టమేకదా? 'జమాబందీ'ల నిమిత్తము తమతమ గ్రామములకు వచ్చు 'తహసీల్దారులు' 'కలక్టర్లు' మొదలగు నున్నతోద్యోగస్థుల నుచిత



రీతిని గౌరవించుటకైనఁ బాపము వారి స్వల్పవేతనములు చాలవు.

మన చందావతుని యుద్యోగమునకుమాత్ర మట్టి యవస్థ తటస్థింపలేదు. ఒక్క చందావతునకు మాత్రమేకాక నాటి గ్రామోద్యోగస్థులకు నేటి మునసబు కరణములకంటె నెన్నియో రెట్లెక్కు డధికారగౌరవము లుండుచుండెనని చెప్పవచ్చును. శత్రురాజులపై దండెత్తిపోవు సేనల రాకపోకలచే మార్గమధ్యగ్రామముల కెట్టి నష్టమును గలుగఁగూడదనియు, కలిగిన నష్టమును బంచాయతీసభ నిర్ణయించి తనకుఁ దెలియఁజేయవలయు ననియుఁ జక్రవర్తి శాసించుటచేత వేలకొలఁది వేతనములుగల మన్సబుదారులు సైతము గ్రామోద్యోగస్థుల మంచిచేసికొను చుందురు. సామాన్య గ్రామోద్యోగస్థులకే యింతటి మన్ననగలచోటఁ జందావతునివంటివాని మాట వేరు చెప్ప నక్కఱలేదుకదా? ఇంకఁ దత్ప్రాంతావాసులగు సామాన్యజనులకెల్లరకుఁ జందావతుఁడు దైవమే. మంత్రించిన జలంబు ద్రావించియో కట్టెదుటఁ గానవచ్చు మొక్కలఁగోసి తెచ్చు పచ్చియాకుల నములించియో యనేకుల రోగములను సూక్ష్మముగాఁ గుదిర్చినవాఁ డగుటచే, వాని యందసాధారణమైన యమానుష శక్తి గలదని చుట్టుపక్కలవారెల్లరు వింతగాఁ జెప్పుకొనుచుందురు. తన పెంపకపుఁ గొడుకునకుఁ జక్రవర్తి కొలువులో నుద్యోగము లభించినను

లభింపక పోయినను, తనకుఁగల భూవసతియే తన యనంతరమున వాని జీవనమునకుఁ జాలునని యెంచి, యావృద్ధతపోధనుఁడు తన యర్థప్రాణములను బరోపకారార్థమే వినియోగించుచుఁ దన జన్మము సార్థకము చేసికొనుచుండెను. మహాత్ముల జన్మసాఫల్య మింతకంటె వేరే మున్నది? !!!

ఆనాడు మహబత్ఖానుతోఁ బ్రసంగించుచున్నంతసేపును గూడఁ జందావతుని మనసు శక్తిసింగును గూర్చియే పరిపరి విధముల విచారించుచుండెను. జ్ఞానము వచ్చినది మొదలు శక్తిసింగు నిరంతరము భిల్లపరివారములతో మృగయావినోదముననే సంచరించుచుండుట యాతఁడెఱుఁగని విషయము గాదు. వేటకు బయలుదేరి వారము దినములైనఁ గాకుండ శక్తిసిం గెన్నఁడు నిల్లుచేరుకొనలేదు. వాని వెంట నేగు భిల్లులు పదుగురో పదునైదుగురో మాత్రముందురని చందావతుఁడనుకొనుచుండెనేగాని వందలకొలఁది బయలుదేరుచుందు రని యెన్నఁడు విని యుండలేదు. మహబత్ఖానువలన విన్న యీసంగతి యెంతవఱకు నిజమోయని తనలో నాలోచించుచు నందలి యాథార్థ్యమును దెలిసికొనవలయునని నిశ్చయించెను. ఆసఫ్ఖానుని సేనలకును బ్రతాపుని సేనలకును బ్రబలమైనయుద్ధములు జరుగుచుండుటచేతఁ గొంతకాలమువఱకు నీవు వేటయందలి తమకమును విడువవలయునని చందావతుఁ డొకటిరెండు సారులు కుమారుని వారింపకపోలేదు. శక్తిసింగుకూడ నట్లేయని



చెప్పుచుఁ దన పనిమాత్రము మానలేదు. ఆనాఁ డతఁడు వేటనుండి వచ్చియే తండ్రికంటఁబడెను. అప్పటి కతఁడు వేటకేగి యిరువదియైదు దినములయ్యెను. వేటయం దంతకాలముండిపోవుట కతని కదియే మొదటిసారి. వేటతమకమును జాలింపుమని తాను బోధించినను వినక బయలుదేరుటయు, బయలుదేరినవాఁడు త్వరలో మఱలిరాక యిదివర కెన్నఁడునుండని యంతకాల ముండిపోవుటయు, వందలకొలఁది భిల్లులతో బయలుదేరుచున్నట్లును బ్రతాపసింహునకు రహస్యముగాఁ దోడుపడుచున్నట్లును మహబత్ఖాను చెప్పిన మాటలవలనఁ దన కనుమానము గలుగుటయు, ఆయనుమానమున కనుకూలముగనే వాని మేన రక్తపు మచ్చలు గానవచ్చుటయు శక్తిసింగుపైఁ జందావతున కమితాగ్రహకారణములైనవి. కంటఁబడినతోడనే మొగమువాచునట్లు గట్టిగఁ జీవాట్లు పెట్టవలయునని యతఁ డనుకొనెను గాని యత్యాతురతతోవచ్చి శక్తిసింగు జెప్పిన మాటలవలన నతనిపై జనించిన వాని యాగ్రహాంబుతయు నాలయములో మృత్యుముఖముననున్న రాజపుత్రులపై ననుగ్రహముగా మాఱిపోయినది.

భిల్లపరివారములతో శక్తిసింగు వెంటనంటి వచ్చుచుండఁ జందావతుఁ డాలయములోఁ బ్రవేశించెను. వందలకొలఁది నినుపమేకులతో నతి బలిష్ఠములైయున్న యాలయకవాటములను ద్రోసికొనిపోయి కట్టెదుటనున్న మంటపమును,...

మంటపము వెనుక రేణుకా విగ్రహముగల గర్భాలయమును, గర్భాలయమునకుఁ జుట్టుప్రక్కలనున్న యితర దేవతాలయములును నతిక్రమించి యాత్రికుల బసలకై యేర్పడిన పెక్కు మందిరములను దాటిపోయి శక్తిసింగుతోఁ బ్రసంగించుచు, నాలయభాగంబునకెల్లఁ జిట్టచివర ఉత్సవములలో దేవతా విగ్రహముల నూరేగించు పట్టుకుచ్చులపల్లకులుగల పెద్దచావడిని జందావతుఁడు సమీపించెను. చదువరులా చావడినడుమం గల కవాటములను దెరచి చూచితిరేని విశాలమైన పెరడు, పెరటిలో ననేకములైన గుఱ్ఱాలశాలలు, గుఱ్ఱాల శాలల కావలఁ గొంచెము దూరములోనే యడ్డముగా నొకపర్వతము, పర్వతముక్రిందఁ బ్రత్యేకముగఁ జెక్కఁబడినట్లున్న కుదురైన రెండుగుహాలు గానవచ్చును. కాని ప్రస్తుతము మన కా ప్రాంతముతో నెట్టి సంబంధమును లేదు.

ఒకప్రక్కఁ బల్లకు లున్నయాచావడిలో రెండవప్రక్క గుమిగూడియున్న భిల్లులు చందావతునిఁ జూచి దూర దూరముగఁ దొలఁగిపోయిరి. చందావతుఁడు చావడి చీడీయెక్కి తాటియాకుల చాపలపై స్మృతితప్పి వెల్లకిలఁ బడియున్న యారక్తవిగ్రహములను వీక్షించి వెలవెల పాటుతో నిశ్చేష్టితుఁడయ్యెను. వీని వయసింతయునికాని 'వీనిమేనిచాయ యిట్టిదనికాని' వీని మొగముతీ రిట్లుండు నని వీనిదుస్తు లిట్టి రంగువని కాని, లేశ



మును గుర్తించుట కవకాశములేకయే శరీరములనిండఁ బ్రబలముగఁ దగిలిన గాయములనుండి వెడలు కీలాల ధారలయందు మునిఁగి తేలుచు బాపము నలువురును నాలుగు జేగురు బొమ్మలవలెఁ గానవచ్చుచుండిరి. మూఁడునాలుగు నిముసములవఱకుఁ జందావతుఁడు వారి నతిజాగరూకతతో నిదానించెను. కూర్చుండి యొక్కొక్కని నాడి పరీక్షించెను. పరీక్షించి వెంటనే లేచెను. లేచి యొక పెద్ద నిట్టూర్పు విడిచెను. అంతవఱకును జుట్టును గుమిగూడి నిశ్శబ్దముగ నున్న భిల్లులెల్లరును జందావతుని ముఖలక్షణములు గనిపెట్టుచు నా నలువురిలో నొకఁడైన జీవింపఁ గలఁడను ధైర్యము లేదుకాఁబోలు నని తమలోఁ దాము గుసగుస లాడుకొను చుండిరి. అప్పుడు చందావతుఁడు తనదృష్టి రోగులనుండి మఱలించి అందందు గుంపు గుంపులై యున్న భిల్లుల నెల్లరఁ గలయంజూచి చేయిచాచి చూపుడు వ్రేలుతో నొక్కొక్కనిఁ బిలుచుచు నిట్లాజ్ఞాపింపఁ జొచ్చెను.

"వీరమల్లూ! నీవు త్వరగాఁబోయి నాలుగైదు బిందెలతో వేడినీరు సిద్ధముచేసి తీసికొనిరా! ఒకబిందెడు చల్లనినీరు గూడ నవసరమగునేమో! అందుచేఁ జన్నీరు సైతము తేవలయును. ఓరీ! కాళీ! నీవు పరుగెత్తిపోయి తిందుకపండ్లను గోసి వానిరసము నొక పాత్రనిండఁ దీసి యిక్కడనున్నట్లు తీసికొని రావలెను. ఓరీ! చండుఁడా! ఒక గంపనిండ వేపాకులు, కానుగాకులు, దూర్వాలును నేరి పఱుగున రావలెను. ఓరీ! భద్రా!

ఏఁడాకులయరటిచెట్లకడ కేగి వానిమట్టలను గోసి వానినిఁ జిదుకఁగొట్టి యందలి రసమును భద్రముగాఁ గొనితేవలయును. ఓరీ! భళీ! అర్కపత్రములను గోసి వానినిఁ గాల్చివేసి యామసిగుండ నొక్కక్షణములో నా కందించవలెను."

చందావతుని యాజ్ఞలు వాని నోటనుండి వెడలుటయే తడవుగ వీరమల్లాదులైన భిల్లులెల్లరుఁ దమతమ కార్యములపై నతిత్వరితగతిం బోయిరి. పిమ్మటఁ జందావతుఁడు తన ప్రక్కనే యున్న శక్తిసింగును జూచి, వాని కన్నుల నుండి వెడలుచుండిన దుఃఖబాష్పములను గనిపెట్టక "బాబా! నీవు పోయి మనయింటిలోఁ జలువచేసి సిద్ధముగానున్న బట్టలన్నియుఁ దెచ్చి యిచ్చటఁ బడవేయు"మని చెప్పెను. అందుకతఁ డేమియుఁబ్రత్యుత్తర మొసంగకయే కన్నీరు దుడుచుకొనుచు నచ్చటినుండి బయలుదేరుచుండఁ జందావతుఁడు మఱల వానినిఁ బిలిచి వానిముఖవైఖరిం గనిపెట్టి "బాబా! నీవెందుకేడ్చుచున్నా"వని యడిగెను. ఆమాటలకుఁగూడ శక్తిసింగు ప్రత్యుత్తరము చెప్పలేదు. చందావతుఁడు నవ్వుచు—

"భయములేదు. బాబా! భయములేదు. నిన్నేమియుఁ గోపింపను. చెప్పు చెప్పు. ఎందు కేడ్చుచున్నావు?"

"నామిత్రుని కొఱకు—"

"వీరిలో నీమిత్రుఁ డెవరు?"

"ఆ మొదటనున్న వాఁడే—"



"వానిపేరు?"

"నాకు దెలియదు."

"అరే! పేరే యెఱుఁగవు! నీకు మిత్రుఁడా! మీ స్నేహ మెక్కడఁ గలిగినది?"

"వేటలో—ఈ గాయములన్నియుఁ బులికాటులు! బాబాజీ! మీ రెట్టులైన వానిని బ్రతికింపరా?"

"వెఱ్ఱిబాబా! నేనా బ్రతికించువాఁడను? అన్నిటికిని బరమేశ్వరియే యున్నది. ఆమెయే బ్రతికింపవలయునుగాని నేనేమిచేయఁగలను. తండ్రీ! నీవాలస్యము చేయక నేను జెప్పినట్లు చేయుము. శక్తి యున్నంతవరకుఁ బ్రయత్నింతము."

అని పలుక శక్తిసింగు వెంటనే యచ్చటినుండి బయలుదేరెను.

---

## పదునొకండవ ప్రకరణము.

### చందావతుఁడు- శక్తిసింగు.

వీరమల్లాదులైన భిల్లులెల్లరును నియమితకాలములలో నోషధీరసాది వస్తువులను గొనివచ్చి సిద్ధముచేసిరి. కొందఱి గాయములలోని రక్త మొండిపోవుటయుఁ గొన్ని గాయములనుండి రక్తమింకను స్రవించుచుండుటయు, కొందఱు తీవ్రజ్వ

రగ్రస్థులై యుండుటయుఁ, గొందఱు కఫవాతపీడితులై యుండుటయు, మొదలగు రోగుల యవస్థా విశేషములన్నియు జాగరూకతతోఁ గనిపెట్టి, వారి కా దురవస్థ నాలుగైదు దినముల క్రిందటనే తటస్థించి యుండునని చందావతుఁ డనుకొనెను. మొట్టమొదట రక్తపూరితములగు వారి దుస్తులను విప్పించి, కౌపీనధారులఁ గావించి, వెచ్చవెచ్చని నీటితో వారిగాయములను రక్తముతోఁ దడిసిన కాయములను బరిశుభ్రముగాఁ గడిగించి, యతఁడు వారి కొక విధమైన రూపురేఖల నేర్పరచెను. ఇంతవఱకు జేగురుబొమ్మలవలెఁ గానవచ్చు నా నలువురు నిప్పుడు పచ్చని శరీరములపైఁ గానవచ్చు నెఱ్ఱని గాయములతో,మణిగణస్థగితంబులైన కాంచనప్రతిమవలెఁ గాన్పించుచుండిరి. ఆశరీరచ్ఛాయలు - ఆవిశాలవక్షములు-ఆ ముఖమండలములు - ఆయాజానుబాహువులు - కనిపెట్టి వారు నలువురు రణనిహతులైన రాజపుత్రవీరులనియు, సామాన్య పురుషులు కారనియుఁ జందావతుఁడు నిశ్చయించుకొనెను. మఱియు వారికాయములపై గల గాయముల యాకారవిశేషములను బట్టి యన్నలువురు శత్రువులచే మల్లయుద్ధమున శూలకరవాలభల్లాద్యాయుధములచేఁ బొడువఁబడి నేలఁబడియుండు రనియు నాతఁడూహించెను. ఎవరెవరి కేయేగాయముల కేయే సాధనము లుచితములని తనకుఁ దోచెనో, వారివారి కాయాగాయముల కాయా సాధనము లుపయోగించి చందావతుఁడు తెల్లని



గుడ్డలతో మెల్లఁగాఁ గట్లు కట్టించెను. శిరములనుండి పాదముల వఱకు గుడ్డపీలికలచే దట్టముగాఁ జుట్టఁబడి వికారాకారములు వహించి, పాప మా నలువురును దృష్టిదోషపరిహారార్థమై పొలములకావులు కట్టుకొను 'దిష్టిబొమ్మ'ల వలె నిప్పుడు తోచుచున్నారు.

ఓషధీరసాదులతోఁ గట్లు కట్టించినతరువాత నొకగంటకొకసారి రక్తస్రావములు కట్టినందునఁ జందావతుఁడు వారిని మెత్తగఁ బరపించిన తెల్లని శయ్యలపైఁ బరుండఁ బెట్టించి తనమందుల పెట్టెను దెప్పించెను. మఱల నాడులు పరీక్షించి పోయవలసిన యౌషధముల నిశ్చయించి, గుటికలరుగఁ దీయించి, తేనెలు కషాయములు రసములు మొదలగు ననుపానములతో వారివారి కవసరమైన మందులు గలిపించి పోయించెను. కొంచెము సేపునకు ధారకములును ద్రావించెను. అట్లు గంటగంటకుఁ బోయుచుండవలయునని కొందఱి నాజ్ఞాపించి యుంచి, మందిచ్చుక్రమమును మఱలమఱల బోధించి చెప్పి పొరపాటున నొకరిమం దొకరి కొసంగకుండ నా నలువురు రోగులకును రామలక్ష్మణభరతశత్రుఘ్ను లను సంకేతనామము లేర్పరచి, యప్పటికే పండ్రెండు గంటలైనందునఁ జందావతుఁడు కుమారునితోఁ గూడ భోజనము చేయుటకై యింటికి వచ్చెను.

భోజనము చేయుచున్నంతసేపు తండ్రి తన్నేమేమి ప్రశ్నలడుగునో యేమని కోపించునో తానేమేమి సమాధానములను జెప్పవలసి వచ్చునో యని తల నొచ్చుచున్నదని యొకమాఱును, భోజనము రుచింపకున్నదని మఱియొకమాఱును, ఆకలి లేదని యింకొకమాఱును, శక్తిసింగు పలువిధములైన నెపములను గల్పించుకొనుచు వచ్చెను. అవన్నియుఁ గపటనటనములనియే చందావతుఁడు గ్రహించి లోలోన నవ్వుకొనుచు, భోజనానంతరమున మఱల నాలయములోనికి వచ్చువఱకు వాని నేమియుఁ బ్రశ్నింపలేదు. భోజనమగుటయే తడవుగ శక్తిసింగు తండ్రికంటఁ బడకుండ నాలయములోనికిఁ బాఱిపోయెను. చందావతుఁడు కొంచెముసేపు విశ్రమించి మఱికొన్ని యౌషధములను సేకరించుకొని బయలుదేరెను. అతఁ డచ్చటకు వచ్చుటయే తడవుగ రోగుల నాడులను మఱలఁ బరీక్షించి యౌషధములు జీర్ణమునకువచ్చి యొంటఁబట్టుచుండినట్లు గ్రహించి సంతసించి యచ్చట నెత్తైన యొక బల్ల వేయించుకొని యందుపైఁ గూర్చుండెను. నియమితులైనవారు తప్పఁ దక్కిన భిల్లు లెల్లరునుగూడ భోజనములుచేసి వచ్చి యచ్చటనే యథాక్రమముగా గుమిగూడియుండిరి. మూఁడవసారి మోతాదు లొసంగఁబడుటయు ధారకములను ద్రావించుటయు నప్పుడే జరిగినందునఁ జందావతుఁడు భోజనముచేసిరండని నియమితులకు సెలవొసంగెను.



రోగులను సమీపమునందేగల గుండములోనికి మోసికొనిపోయి ముంచి తెచ్చినయెడల మఱి వారికి మరణము కలుగదని కొందఱుభిల్లు లొకరితో నొకరు చెప్పుకొనుచుండిరిగాని చందావతునితోఁ జెప్పుటకుమాత్ర మెవ్వరును సాహసింపలేదు. బల్లపైఁ గూర్చుండిన తరువాత భిల్లులను భిల్లులమధ్య నక్కియున్న శక్తిసింగును జూచి చందావతుఁడు—

"ఓరీ! మీరందఱు శక్తిసింగుతో వేటకుఁ బోయినవారేకదా? అందుచే నీరాజపుత్రు లెవ్వరో వీరికి గాయము లెట్లు తగిలినవో యెన్నాళ్ళక్రిందఁ దగిలినవో మీ రెఱుఁగుదురుగాని నాకేమియుఁ దెలియదు. మీరును జెప్పరు. శక్తిసింగంతకంటెను జెప్పఁడు! ఈరోగుల యవస్థ నాకేమియు ధైర్యము గలిగింపకున్నది. వీరిలో నొక్కఁడైన బ్రతుకునని నాకుఁ దోచదు. శక్తివంచనములేక పాటుపడుచున్నానుగాని లాభముండునని యనుకొనను. ఇంతకు రోగుల నిజమైన యవస్థ తెలియకుండ నెంత చికిత్స చేసినను నేమి ప్రయోజనముండును? మీరు నిజము దాచక చెప్పెదరా, వీరి నెట్లైన బ్రతికించెదను. చెప్పరా, వీరు నిష్కారణముగఁ జనిపోయెదరు. ఇప్పుడైనను మించిపోలేదు. మీలో నెవరైనను. సరే, నిజము చెప్పుఁడు, నేనేమియుఁ గోపింపను. ఈరోగుల గాయములన్నియు వేటలోఁ దగిలిన పులికాటులా? యుద్ధములో దగిలిన కత్తిపోటులా? పులికాటులైనయెడల నొకవిధమైన

చికిత్స చేయవలెను. కత్తిపోటులైనయెడ మఱియొక విధమైన చికిత్స చేయవలెను. ఒకదాని కొకటి చేసినయెడల వీరు బ్రతుకరు. అందుచేఁ ద్వరగాఁ జెప్పుఁడు. ఇవి పులికాటులా? కత్తిపోటులా?"

అని మిక్కిలి యుక్తిగా నడిగెను. చందావతుని మాటలు విని గుంపులు గుంపులైయున్న భిల్లు లొకరిమొగ మొకరు చూచుకొనుచు, "స్వామీజీ! పులికాటులు పులికాటులు" అని కొందఱును, 'కాదు. కాదు. కత్తిపోటులు! కత్తిపోటులు' అని మఱికొందఱును గేకలు వేయసాగిరి. చందావతుఁడు క్షిప్తకర సంజ్ఞలతో వారి కలకలమును వారించి, శక్తిసింగును జెంతకుఁ బిలిచి—

"శక్తిసింగ్! అబద్ధమాడకుండఁ జెప్పు! ఇవి పులికాటులా? కత్తిపోటులా?"

"బాబాజీ! కత్తిపోటులవంటి పులికాటులు!"

ఛీ! నిర్భాగ్యుఁడా! క్రమముగా నీవు పట్టి దొంగవైపోవుచున్నావు. నీ సహవాసమున వీరందఱుఁగూడఁ జెడిపోవుచున్నారు. నేను వలదు వలదని చెప్పుచుండ నీవు వేటకేల బయలుదేరితివి? బయలుదేరినవాఁడవు వెంటనే తిరిగి రాక యింతకాల మెందుంటివి? నీదొంగతనము నాకుఁ దెలిసినది. వేటయను మిషపై నీవెచ్చటి కేగుచున్నావో, ఏమి



చేయుచున్నావో యన్నియు నాకుఁ దెలిసినవి. తొందరపడకు! తొందరపడకు! నీకుఁదగిన ప్రాయశ్చిత్తమును జేసెదను."

"బాబాజీ! మీ యిష్టమువచ్చిన ప్రమాణము చేసెదను. నేను వేటకే బయలుదేరుచున్నాను."

"ఔనౌను. వేటకే బయలుదేరుచుంటివి. అందుచేనెట్టి ప్రమాణములైనను జేయఁగలవు. కాని— ఆవేట జంతువుల వేటకాదు—మనుష్యులవేట—అంతేనా? నీదొంగమాటలు నమ్మి నేను మోసపోయెద ననుకొంటివా? ఆ ప్రతాపసింగునకుఁ దోడుపడిన నీకేమి లాభమున్నది? వాని కొక రాజ్యమా? ఇల్లా? వాకిలియా? నీవెక్కడ? నీవయ సెక్కడ? నీకుఁగల యుద్ధసామగ్రి యేమి? ప్రతాపునకుఁ దోడుపడుట యేమి?........."

"బాబాజీ! పరమేశ్వరిసాక్షిగా నాప్రతాపునకుఁ దోడుపడవలెనని నాకెప్పుడును లేదు."

పోనిమ్ము! మఱెవరికిఁ దోడుపడ నేగుచున్నావు? నీవెవరిపక్షము?!"

"నే నెవరిపక్షముననను లేను. నాపక్షము నాది."

"నీ కొకపక్ష మున్నదా? పెద్దమాట లాడకు. నీదుర్వర్తనము క్రమక్రమముగా నధికారులకుఁగూడఁ దెలిసి, నాకుఁ దలవంపు గలిగించుచున్నది. నీవ్యవహార మంతయు షహబజ్ఖా నెట్లో తెలిసికొని నేఁడుదయమున నాతో మొఱపెట్టుకొ

న్నాఁడు. నీకుట్రలంగూర్చి యతఁడు ప్రసంగించునంత సేపును నేనెంతో లజ్జపడి మాటాడవలసివచ్చినది. ఈపాటి 'యాచోక్తి' తెలిసినయెడల నాషహాబక్షు నెట్టివాఁడో యెఱుఁగుదువా!"

"ఎఱుఁగుదును బాబాజీ! వాఁడు పట్టి మూర్ఖుఁడు: క్రూరుఁడు! దొంగ! వాని నెట్టులైన నీ దుర్గములోనుండి సాగ నంపవలెను."

"ఆఁ — ఆఁ — అప్పుడే అంతవాఁడవైతివా? ఇంతటి ప్రయోజకుఁడవైన కొడుకుండ నాకింకేమి కొదువ?—ఓరి పశువా! నోటికివచ్చినట్లెల్ల మాటాడెదవురా? ఇప్పుడు నీవన్న మాట నెవరైన ఖానుచెవిలో వేసినయెడల ముందు ముందు నీగతి యేమగునో యాలోచించితివా? ఒక్క నీగతియే కాదు. వాఁడు సేనలతోవచ్చి నిన్నును నన్నునుగూడ నింత లింతలుగాఁ జిత్రవధ చేయఁగలఁడు."

బాబాజీ! మనకుమాత్రము సేనలు లేవా? నాకంఠములోఁ బ్రాణ మున్నంతకాలము వాఁడు మీ చెంతకైన రాఁగలఁడా? మీ సెలవైనయెడల క్షణమాత్రములో లావా దుర్గమును—"

"నోరు మూసెదవా లేదా? ఈ ధూర్తత్వమునకుఁ దోడు నీకు రాజద్రోహచింతకూడఁ గలదా?. అట్లైన సంక బాగుపడెదవులే! ఇన్నాళ్ళు నేమో యనుకొంటిని గాని యిప్పుడు నీ సంగతియంతయుఁ దెలిసినది. చిరకాలము



నుండి యన్నవస్త్రము లొసంగి పోషించుచుండిన ప్రభువు పైనే కత్తిగట్టనెంచిన నీ కేదైవము తోడ్పడఁ గలఁడు? మఱి నాలుగేళ్ళు పైఁబడినతరువాత నిన్నెట్టులైనఁ జక్రవర్తి కొలువులోఁ బ్రవేశపెట్టవలయునని నేను గొండంత యాశపడుచుండ—"

"వద్దు బాబాజీ! వద్దు. నాకా సేవకావృత్తి వద్దు—"

"సేవకావృత్తియా? సేవకావృత్తికాక నీ బ్రతుకునకు రాజ్యము లెక్కడనుండి వచ్చునురా?"

"ఒకరిరాజ్యములు నాకెందుకు! నేనే స్వతంత్రరాజ్యమును స్థాపించుకొనెదను."

"ఎక్కడ? నీ నెత్తిమీఁదనా?"

"ఔను. మూర్ధాభిషేకమును మీరే చేయవలయును గదా?"

"ఇవే చిన్ననోటికిఁ బెద్దకూతలు! కర్మము ననుసరించి యే బుద్ధియుఁ బుట్టుచుండును. బాగుపడవలసినవాని కిట్టి బుద్ధు లెప్పుడును బుట్టవు. నీ ప్రారబ్ధ మెట్లున్నదో నేనేమి చెప్పఁ గలను? నీవు బాగుపడుటకు మీ యన్నదమ్ములలో నెవరు బాగుపడిరి గనుక? పో! నాయెదుట నుండకు!"

"బాబాజీ! పోయెదనుగాని నా కన్నదమ్ములుఁ గూడ నున్నారా? ఎక్కడ నున్నారు? ఈ సంగతి మీరెప్పుడును జెప్పలేదే? నన్నుఁ బెంచుకొన్నట్లు మాత్రమే చెప్పినారు. నాయన్నదమ్ములను నేనొక్కమాఱు చూడవచ్చునా? చూచి

వెంటనే తిరిగివచ్చెదను............బాబాజీ! మాటాడరేమి? నే నక్కడ నుండిపోయెదనేమో యని సంశయించుచున్నారా? అబ్బబ్బా! నేను మిమ్ము విడిచిపెట్టి మఱియొకచోట నుండిపోఁగలనా?......బాబాజీ! మాయన్నదమ్ములు బాగుపడలేదని యన్నారుగదా? వారిని మనము బాగుచేయలేమా?"

శక్తిసింగడుగుచుండిన ప్రశ్నలకెల్లఁ జందావతుఁడు ప్రత్యుత్తర మొసంగక పోవుటయేకాక, కరుణారస భరితములగు వానిమాటలవలనఁ దన యాగ్రహం బంతయు మంచు విరిగినట్లు మాయమైపోవ, కుమారు నొకచేతఁ గౌఁగిలించుకొని, "బాబా! కోపాతిశయమునఁ బొరపాటుపడి యంటినిగాని నీ కన్నదమ్ము లెక్కడ నున్నారు తండ్రీ!" యని ప్రక్కమొగము తోడనే పలికి, కన్నులనుండి యేకధారగా నశ్రుధారలఁ గార్చెను. 'కన్నప్రేమకన్నఁ బెంచినప్రేమ దొడ్డ' దని యిందుకే పెద్దలందురు. తన యన్నదమ్ములను గూర్చి యత్యాతురతతోఁ బ్రశ్నించిన యా బాలునిమాటలు చందావతునకు హృదయభేదన మొనరించునంతటి దుఃఖాతిశయమును గలిగించినవి. అందుచే నతఁ డచ్చటినుండి తటాలున లేచిపోయి, యొరులకంటఁ బడకుండఁ దన కన్నీరు చాటుచాటుగఁ దుడుచుకొని, రోగులను సమీపించి మఱియొక మాఱు వారి



నాడులు పరీక్షించి వచ్చి యథాక్రమముగ బల్లపైఁ గూర్చుండెను. శక్తిసింగు మరలఁ దండ్రి నుద్దేశించి."

"బాబాజీ! వీరికేమియుఁ బ్రాణభయము గలుగదు కదా? వీరిలో నెవరైనను బ్రతికెదరా?"

"ఔషధములు పని చేయుచున్నట్లే తోఁచుచున్నది. అయినను నింతలో ధైర్యముగాఁ జెప్పలేను. ఈరాత్రి గడచి తెల్లవారవలెను."

"తెల్లవారిన మఱి ప్రాణభయము కలుగ

"మఱి ప్రాణభయము కలుగదు."



## పండ్రెండవ ప్రకరణము.



### బ్రహ్మాస్త్ర ప్రయోగము.

"అక్కడ నెవరెవ రున్నారు?"

"ఉండవలసిన ముగ్గురు నున్నారు. దేవిమాట చెప్పనక్కర లేదుకదా? కరుణయున్నది. జోసీభాయి యున్నది."

"జోసీ యెందుకువచ్చినది? అంతఃపురములోఁ గాలుపెట్టకుండ దానికి మోకాళ్ళు విఱుగఁ దన్నించవలెను. ఈ మాట లొక్క దేవియే యన్నదా? ఆ ముష్టిముండ లిద్దరుఁ గూడ నేమైనఁ గూసినారా?"

"దేవి యనుచుండ వారు వెనుక భళీయని, హెచ్చరింపఁజొచ్చిరి. చుట్టుప్రక్కల నున్నదాసీలెల్ల నవ్వుచుండిరి."

"మెహార్! ఎట్టిమాటలు వినవలసి వచ్చినవి? నా తమ్ముఁడు కురూపియా? మూర్ఖుఁడా? మందుఁడా? పడ్డవలె నున్నాఁడా? పొట్టచీల్చిన నక్షరములేదా? ప్రపంచమంతయు వానినిఁ బిచ్చివానికిక్రింద గణించుచుండెనా? రణమల్లుని మరణముచూచి వాఁడు భయపడి పాఱిపోయివచ్చెనా? అట్టి తమ్ముఁడున్నందున సిగ్గుపడక, వాఁడే ప్రతాపునిఁ బట్టుకొన్నవాఁడని నే నుప్పొంగుచుంటినా? మెహార్! చెప్పు! చెప్పు! కొసమాట మఱియొకమాఱు చెప్పు."

"అబ్బా! ఎన్నిమాఱులు చెప్పుమనెదరమ్మా! అట్టి నిర్భాగ్యదామోదరునకుఁ జిత్తూరురాజ్యము ధారపోయుటకు మా మగవారు వివేకహీనులు కారని"

"నాతమ్ముఁడు నిర్భాగ్యదామోదరుఁడా? తనమగవారా? తనమగవారు నాకు మగవారుకారా? ఏమీ పొగరుఁబోతుతనము!"

"ఆమె పట్టపుదేవి. మీరు సామాన్యకాంతలు, ఆమె మగవారు మీకు మగవారెట్లయ్యెదరు?"

"అట్లయినఁ బట్టపుదేవితప్పఁ దక్కిన భార్యలందఱు నుంపుడుకత్తెలేనా?"

"ఆహా! అదియే దేవియుద్దేశము."



"సరే! బాగుగా నేయున్నది. మెహార్! దేవికిని నాకును నిప్పుడు పందెము పడినది. చిత్తూరు రాజ్యాభిషేకము నాతమ్మునికెక్కడ జరుగునో యనికదా దేవియేడుపు. రేపటి యుత్సవసందర్భమున దర్బారులో 'దామోదరసింగే చిత్తూరురాజ్యాధీశ్వరుఁ' డని చక్రవర్తి ప్రకటించుననియు, నీవు నిజముగాఁ జేతనైన పట్టపుదేవివే యైనయెడల నట్లు జరుగకుండఁ జేయవచ్చుననియు, చేయలేకపోతివా పట్టపుదేవి వగుటకే కాక యంతఃపురములో దాసివై యుండుటకైనను దగనియు నీవు పోయి చెప్పు. నీకేమిభయము? నేను జెప్పుమంటిననియే చెప్పు!"

"ఎందుకమ్మా! మీకింతభ్రాంతి. మీతమ్ముని రాజ్యాభిషేకమునకు భంగము గలిగింపవలెనని మొన్నటి సాయంకాలమునుండియుఁ గూడ వారుమువ్వురు నాలోచనలపై నాలోచనలతో విశ్వప్రయత్నము చేయుచుండ ననవసరముగా మీ రాయబార మెందుకు?"

"సరే పోనిమ్ము! రాముని రాజ్యాభిషేక భంగమునకు నొక్కతెయే కైక. నాతమ్ముని రాజ్యాభిషేక భంగమునకు ముగ్గురుకైకలు జతపడినారు."

"అటుకాదమ్మా! కైక యొక్కతెయే. మందరలు మాత్ర మిద్దరు జతపడినారు."

"ఆముండ లెక్కడ జతపడినారే! మన యంతఃపురమును మఱి విడిచిపోరా యేమి? సరేకానిమ్ము. నూరుగురు

కైకలను నూరుగురు మందరలను జంపి యీరేవా పుట్టినదని వారెఱుఁగరు కాఁబోలు! ఎవరుగెలిచెదరో నీవే చూచెదవు కదా? కాని మెహర్! నీవు నాపక్షముననే యుండి నాకుఁ దోడుపడవలయునుజుమా! తోడుపడుటయే కాదు. కార్యము ఫలించిన తరువాతఁ జిత్తూరురాజ్యమునకు నీవే పట్టపుదేవివి కావలయును. వెఱ్ఱిదానవుగాని యెన్నాళ్ళనుండి నీకు నేను బోధించుచున్నను, నీవిష్టపడకుండుటకు నాతమ్మునికేమితక్కువ. గ్రుడ్డివాఁడా? కుంటివాఁడా? కులహీనుఁడా? కనుగ్రుడ్లుమాత్రము కొంచెము తెల్లగానుండును. అయినను బిల్లికన్నులున్నవా రదృష్టవంతులని నీవు వినలేదు కాఁబోలు. ఇంకఁ జదువా? పట్టాభిషేక మగుసరికి, ఈచక్రవర్తిగారికి సంతకము చేయుట కూడఁ జేతఁగాకుండెడి దని నీవెఱుఁగుదువా?"

"ఎఱుఁగుదును. ఇతఁడు పేరుకే చక్రవర్తికాని రాజ్యవ్యవహారమంతయు మాతండ్రియే నడిపించెడువాఁడు."

"ఔనా మఱి? ఇప్పుడు నాతమ్మునకుఁ జదువురానందున నేమినష్టమున్నదో నీవే చెప్పు."

"ఏమియు నష్టములేదు. రాజ్యవ్యవహారములన్నియు నేను స్వయముగానే నడిపించెదను."

"అదే ప్రజ్ఞ. అప్పుడే నీవు బైరమ్‌ఖాను సాహేబ్జీవారికిఁ దగిన కుమార్తెవని పేరొందఁగలవు. ఇది యిట్లుండ— ఉత్సవ ప్రయత్నములలో లేశమును దీరుబడి లేకయుండుటచేఁ



జక్రవర్తి నేడుగాని రేపుగాని యిచ్చుటకు వచ్చునని నాకు ధైర్యములేదు. రేపు దాటిపోయినదా — ఎల్లుండియే యుత్సవము. అప్పుడెంత ప్రయత్నించినను మఱి లాభములేదు. అందుచేఁ జక్రవర్తి యెక్కడనున్నను సరే నీవిప్పుడేపోయి, రేవాదేవి వెల్లకిలఁ బరుండి, మూలుగుచు—మితిమీఱిన యుచ్ఛ్వాస నిశ్వాసములు విడుచుచు నెంతపిలిచినను బలుకకున్నదని చెప్పు. గుండె బ్రద్దలై యెంతపనిలో నున్నను నతఁడిచ్చుటకు రాకతప్పదు. పైకథ తరువాతఁ జెప్పెదను."

ఈసంభాషణమున రేవాతోఁ బ్రసంగించిన 'మెహరున్నిసా' బైరంఖాను కూఁతురని మఱలఁ జెప్పనక్కఱలేదు. అక్బరు చరిత్రమునందు బైరంఖాను, భారతమునఁ గర్ణుని వంటివాఁడు. శత్రురాజుల యార్భాటముల విప్లవములు - రాజద్రోహములు - అంతఃకలహములుఁ త్రిరాజ్యాభిలాషలు - మొదలగువానితో దేశమంతయు కల్లోలముగానున్న స్థితిలో, బైరంఖాను కడు నేర్పుతో వానినన్నింటినిఁ జక్కఁబఱచి శత్రువుల నడఁగఁద్రొక్కి — అప్పటికిఁ బదుమూఁడేండ్ల బాలుఁడైయున్న యక్బరునకుఁ బట్టాభిషేకము చేసి, పేరుకతఁడు చక్రవర్తిగాఁ దానే రాజ్యమును బరిపాలించుచుండెను. చక్రవర్తియుఁ దన్నుద్ధరించిన ఖానును దైవమువలెఁ బూజించుచు రాజ్యమునందలి సర్వాధికారమును వానికే విడిచిపెట్టెను. ఆయధికార గర్వమున ఖాను మిన్నుమన్నుంగానక

సంచరించుచు మితిమీరిన రాజ్యక్షోభ గలిగింపసాగెను. ప్రజాకంటకుఁడైన ప్రభు వెంతకాల మేలఁగలఁడు? వాని ధూర్తవర్తనములు, వాని సాధుహత్యలు, చక్రవర్తి యోర్చియోర్చి కడకుఁ బాప మతఁడు విచారించుచు వాని నధికార భ్రష్టునిఁ జేయవలసి వచ్చినది. ఎన్నిద్రోహములు చేసినను జక్రవర్తి వాని కృతజ్ఞత మఱువలేక యెన్నియో లక్షల ధన మొసంగి వానిని మక్కాకుఁ బంపివేసెను. కాని మార్గమధ్యముననే బైరంఖాను తన శత్రువుచే నడ్డగింపఁబడి బలవన్మరణ మొందవలసి వచ్చెను. అప్పటినుండియు వాని కుటుంబమును దన కడనే యుంచుకొని చక్రవర్తి పోషించుచుండెను. అప్పటికి మెహారున్నిసా మూఁడేండ్ల శిశువు. యుక్తవయసు వచ్చిన గామెకుఁ బెండ్లిచేయవలెనని చక్రవర్తి యనుకొను గాని, యామె ప్రవర్తన మామె తండ్రిప్రవర్తన మఱల నందఱకు జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను. చెప్పిన వెంటనే తనపని చేయలేదని యంతఃపురములో నిప్పటి కిరువురు ముదుసలి దాసీల నామె కడ తేర్చినది. ప్రాణములపై నాశ గల యెవరుఁ డట్టి వధువును బెండ్లాడఁ గలఁడు? ఇంతవఱకు దామోదరసింగుపై నామెకిష్టములేదు గాని చిత్తూరు రాజ్యాధికారమును దలంచి యిప్పుడించుక తలయూచుచున్నది.

ఆనాఁటి మధ్యాహ్నమున రేవాదేవికోరికపై మెహారున్నిసా వెంటనే యా మోతీమహాలునుండి బయలుదేరెను.



సకల విషయములయందును దేవితో సమానమైన యాధిక్యమును బొందవలెనని కోరుచున్న దగుటచే, రేవాదేవి మోతీమహాలు, దేవి నజరుమహాలుకంటె, నెట్టి వైభవమునందును దక్కువ కాదనియు, నందుఁ గలవిశేషములన్నియు నిందుండక తప్పవనియుఁ జదువరులు సూక్ష్మముగా గ్రహింపఁ గలరు. మెహారున్నిసా వెడలిపోయిన వెంటనే యామె దేదీప్యమానమగు తన శయ్యా మందిరమునఁ బ్రవేశించి, పచ్చలు పొదిగిన బంగారు చట్రముగల నిలువుటద్దము కడ నిలిచి తన యాకారము నొక్కమాఱు చూచుకొనెను. అప్పుడామె, కేవలము మహమ్మదీయస్త్రీవేషముతోడనే యుండెను. ఆ పాదమస్తకము వ్రేలాడు పసుపు పచ్చని పాట్నా మేలిముసుంగు — ఆకుపచ్చని సూరత్ ఫాయ్జమా — పట్టుతోఁ జేయఁబడిన మెత్తని ఢిల్లీ పాపూసులును దీసివేసి యామె గులాబిరంగుగల యహమ్మదాబాదు పట్టు చీర ధరించినది. గులాబిపూవులన్నను గులాబిరంగన్నను జక్రవర్తికి మక్కువ యెక్కువ. ఆ చీరపై జరీబుటాలతో నొప్పు నల్లని మఖమల్ రవిక తొడగినది. ఆ సమ్మేళనముగూడఁ జక్రవర్తి మెచ్చుచుండునదియే. తన మేలిముసుఁగు మాత్రము మఱల వహింపలేదు. చక్రవర్తియెదుటఁ బాదములకు 'పాపూసులు'గాని శిరమున మేలిముసుఁగు గాని రాణులు వహింపరు. మొత్తముపైఁ జక్రవర్తిని జయింపఁగల సాధనము లన్నియు నప్పుడామె పూర్తిగా ధరించి

మఱల నిలువుటద్దము కడకు వచ్చెను. రాణులందఱిలో రేవా దేవియే యెక్కుడు లావుగా నుండునని చెప్పుకొనుచుందురు. ఆమె కొంచెము పొట్టిదగుటచే నట్లు తోచునేకాని, యామె శరీర మంతలావైనది కాదు. కుదురైన యవయవములతో నామె విగ్రహము చూచుకొలఁదిఁ జూడవలయు ననియే యుండును. చామనచాయగల మేనిచాయమాత్రము ఆమె హృదయ క్రౌర్యము రక్తనాళములలోఁ గలిసి శరీరమునిండఁ బ్రవహించుచున్నదాయను భీతి పుట్టించునేకాని, చక్రవర్తికి భార్యయై యుండుటకుఁ దగిన సౌందర్య మామెకు లేక పోలేదు.

చక్రవర్తి వచ్చుసరికిఁ దాను గూర్చుండి విచార మభినయించుచుండ వలెనా ? పరుండి నిద్ర యభినయించు చుండ వలెనా ? ఈ విచక్షణలో నామె కొంతవఱకుఁ గడపి, హంస తూలికా తల్పమున నొకమాఱు శయనించెను. వెంటనే లేచి యచ్చటి మఖమల్ సోఫాపై నొక మాఱు కూర్చుండెను. కర్తవ్యము మాత్ర మింకను స్థిరపరచు కొనలేదు. స్థిరపడు లోపున నాలుగైదు మారులు శయనించుట లేచుట కూర్చుండుట జరిగినవి. తా నెట్టి యవస్థలో నున్నట్లు కబురంపినదో చక్రవర్తి వచ్చుసరి కట్టి యవస్థయం దుండుటయే యుక్తమని తుదకామె నిశ్చయించుకొనినది. నిశ్చయించుకొని దట్టముగ వ్రేలాడుచున్న ముత్యాల జాలరులనుండి పట్టుపరుపులపై నెక్కి-



యందు మెల్లఁగ శరీరమును వాల్చెను. వెల్లకిలఁ బరుండి కన్నులు మూసికొని యామె కపట నిద్రాభినయము ప్రారంభించినది. కన్నులు మూసికొనినను, అది జాగ్రదవస్థ యందలి సుషుప్తి యగుటచే మానసిక వ్యాపారమునకు భంగముండదు. కదా ? చక్రవర్తి వచ్చి తన్నేమని ప్రశ్నించునో, తానే మన వలయునో, తనకడ నతఁ డెట్లభినయించునో, తా నెట్లభిన యింపవలెనో, మొదలగు తలంపులతో నామె మనసు లేడిపిల్లవలె గంతులు వేయుచుండెను. చక్రవర్తి వచ్చునఁట! వచ్చి మెల్లఁగఁ దనప్రక్కనే కూర్చుండు నఁట! కూర్చుండి తనకోమల మృణాళ బాహువులయందు హస్తములఁ జొనుపు నఁట! చొనిపి మెల్లఁగఁ దన్నుఁ బిలుచు నఁట! తాను బలుకదఁట! మఱలఁ బిలుచు నఁట! అప్పటికిని బలుకదఁట! మూఁడవసారి తనపైఁ గొంచెమువ్రాలి, మోముపై మోముచేర్చి మఱికొంచెము గట్టిగఁ బిలుచుఁ నఁట ! అప్పుడు మాత్రము తాను గన్నులు విప్పిచూచి తటాలున వానిమెడఁ గౌఁగిలించుకొను నఁట ! ఇది రేవాదేవి భావనా ప్రపంచమునందలి కపటనాటకములోని ప్రథమాంక ప్రథమరంగము. ఈ ప్రథమ రంగ మామె హృదయరంగము నందు మూఁడుసారులు ప్రదర్శింపఁబడినది. ప్రదర్శింపఁబడిన ప్పుడెల్ల నెట్లు కనులు విప్పవలయునో యెంత త్వరగాఁ గౌఁగిలించుకొనవలయునో తనలోఁ దానె యభినయించి చూచుకొనినది. మఱలఁ గనులుమూసి నాలవమాఱు గూడ

నామె యారంగమును బ్రదర్శించెను. ప్రదర్శించి యథాప్రకారము కన్నులువిప్పి కౌఁగిలింపఁ బోవుసరికి, భావనా ప్రపంచమునందలి కల్పిత చక్రవర్తిగాక, బాహ్యప్రపంచమునందలి నిజమైన చక్రవర్తియే యిప్పు డామె సందిటిలోఁ జిక్కియుండెను. పాపము రేవాదేవి తత్తరపాటుతోఁ దటాలున లేచిపోయినది. ఆమె యనుకొన్న దొకటి. జరిగిన దింకొకటి.

చక్రవర్తియుఁ జామనచాయ మేనివాఁడే. విగ్రహము కొంచెము పొడవుగా నుండినను నందుకుఁదగిన లావు గలవాఁడగుటచే వానియాకారము గంభీరముగా నుండును. ఎప్పుడును గలకలలాడుచుఁ దేజోవంతమైయుండు ముఖము - ముఖమున కింపైన నల్లని కనుబొమ్మలు - కనుబొమలక్రింద నెడమవైపునఁజిన్న పులిపిరి- మిట్ట నుదురు- విశాలమైన వక్షము. దీర్ఘములగు బాహువులు వానిని స్ఫురద్రూపులయందే చేర్చుచున్నవి. తెల్లని పాయిజామాయును, పాయిజామాపై సగము వఱకు వ్రేలాడు తెల్లని యంగీయును, నంగీపై నెఱ్ఱని ముఖమల్ కబాయియుఁ దలపై నాకుపచ్చని కుచ్చులపగిడీయును గలిగి, సామాన్య వేషముతోడనేయున్న చక్రవర్తి రేవాదేవిప్రక్కఁ గూర్చుండి యెన్నియో యమూల్యాభరణాంబరములను ధరించిన నెంతయు మనోహరుఁడై యుండెను. తటాలునఁ గూర్చుండిన రేవాభుజముపై వామహస్తమును జేర్చి దక్షిణకరంబున నామె



చెక్కుటద్దములు నొక్కుచుఁ దత్కపటరోగమునకుఁ దానును గపటాందోళన మభినయించుచు—

"ప్రియా! ప్రియా! ఇప్పుడుకొంచెము సుళువుగా నున్నదికదా?"

"సుళువుగా నుండకేమి? పొగరెక్కి యున్నదానికి సంకటముకూడనా?"

"ఇందుకా నన్నుఁ బ్రత్యేకముగా రప్పించితివి! నీయుపోద్ఘాత మవసరములేకయే మఱల దేవితో నీకేదో జట్టీవచ్చిన ట్లూహించితిని. ఏమి? నిజమేనా?"

"దేవితో నాకు జట్టీయెందుకు? ఆమె పట్టపురాణి - నేనామెను గెలువఁగలనా?"

"గెలువలేకేమి? నీయంతదానవు నీవు. ప్రధాన విషయమేదో చెప్పు."

"అడుగవలసినదేకాని చెప్పుట కేమియులేదు. రాజ్యాంగ విషయములలో నాకు రెండుసందేహములున్నవి. అవి మీరు తీర్పవలెను."

"రాజ్యాంగవిషయములే! స్త్రీలకుఁగూడ రాజ్యాంగ విషయములయందు శ్రద్ధపొడమినయెడల నింకఁ బురుషుల కేమి కష్టము లుండును? ఏదీ! చెప్పు! చెప్పు!"

"మీరు తఱచుగా నాగ్రాలోనే యుందురుకదా యీ దేశమంతయు నెవరు పాలించుచున్నట్లు?"

"ఓహోహో! ఏమిసందేహము! ఇంత చిక్కు ప్రశ్నకు నేను సమాధానము చెప్పఁగలనా?"

"తరువాత వెక్కిరింపవచ్చును. మొదట సమాధానము చెప్పుఁడు."

"వెఱ్ఱిదానా! నేనాగ్రాలోనేయున్నను నాప్రతినిధులు ప్రతిరాష్ట్రమునందు నున్నారు. వారి పరిపాలనము నాపరిపాలనము కాదా?"

"ఆలాగునా? అట్లయిన నొకసందేహముతీరినది. ఇంక రెండపదికూడ మనవిచేసికొనెదను. ఒకరాజు తనసైన్యములను శత్రురాజుపైకిఁ బంపును. శత్రురాజోడిపోయినప్పుడు లోకులు సైన్యములు గెలిచెనని చెప్పుకొందురా! రాజు గెలిచెనని చెప్పుకొందురా?"

"రాజు గెలిచెననియే చెప్పుకొందురు. ఆసైన్యములెవరివి? రాజువేకదా? ఓడినను గెల్చినను రాజునే చెప్పుకొందురు."

"అట్లయినఁ బ్రతాపునిఁ బట్టుకొన్నవారు సైనికులా! దామోదరసింగా?"

"శబాస్! ప్రియా! ఇంతవఱకుఁ దెలివితక్కువ ప్రశ్నలనుకొంటిని గాని నీయుక్తికిప్పుడు సంతసించితిని. ఇంతవఱకు నేనాలోచించుచున్నదియు నీవిప్పుడడుగుచున్నదియు నొక్కటియే యైనది."

"మీరాలోచించుచున్నదేమి?"



"నీతమ్ముని రాజ్యాభిషేకమును గూర్చియే నాకేమి యుఁదోచకున్నట. మతిపోయినట్లున్నది."

"పాపము! నాతమ్మునిఁగూర్చి మీకు నిద్రాహారములుగూడ లేవుకాఁబోలు! అంత విచారింపవలసిన యావసరమేమివచ్చినదో?"

"ప్రతాపునిఁ బట్టుకొన్నవాఁడగుటచే స్యాలకునకుఁ జిత్తూరురాజ్యాభిషేకము తప్పదుకదా? అది యీయుత్సవ సందర్భమున జరుగునో లేదోయని విచారించుచున్నాను."

"ఎందుచేత? దేవి కిష్టములేదనియా? మఱేమైనఁ గారణముండునా?"

"అబ్బా! ఇప్పుడు దేవిప్రసంగమెందుకు? ప్రతికార్యము నామె నడిగియే చేయుచుందుననుకొంటివా? ఎప్పుడైన నీతోఁ బ్రసంగింతును గాని రాజ్యాంగవిషయము లామెతో నెన్నఁడు నాలోచింపను. ఉన్నయాటంకమేదో విను. విని నీవే యాలోచనము చెప్పు. ఉన్నతాధికారము లొసంగునప్పుడు దర్బారులో నాయాజ్ఞాపత్రములను జదువుచుండువారెవరో నీవే చెప్పు!"

"మానసింగు"

"దుర్గావతీరాణిని జయించి వచ్చినతరువాత నాసఫ్ ఖానునకు లావాదుర్గాధిపత్యమొసంగిన నాఁడు నాయాజ్ఞాపత్రము చదివిన వారెవరు?"

"మానసింగే."

"ఇప్పుడు మానసింగెట్టి యవస్థలో నున్నాఁడో యెఱుగుదువుకదా? నీతమ్ముని రాజ్యాధికార పత్రము దర్బారులో నెవరు చదివెదరు?"

"పృథ్వీరాజాదు లెవరును జదువఁగూడదా?"

"కూడదు. చదివినను జెల్లదు"

"మీరు స్వయముగా—"

"తప్పు! తప్పు! అట్లనఁకూడదు. అట్టి యాచారము లేదు."

"అట్లైన నీయుత్సవములో నిది జరుగనే జరుగదా?"

"నన్నెందు కడిగెదవు? నీవే చెప్పు!"

"ఇంకేమి చెప్పఁగలను? దేవియే గెలిచినది. నేనే యోడిపోయితిని. మీకోరికకూడ నంతియే కదా? అందుకే యిన్ని విఘ్నములు. మానసింగు లేనియెడల మఱి రాజ్యవ్యవహారములు జరుగనే జరుగవా? మీ పరిపాలన మంతయు నాతని తోడనే యున్నదా? ఒకప్పు డాతఁడు గతించిన—"

"అబ్బబ్బా! ఎంతకఠోరముగాఁ బలికితివి? ప్రియా! ఇట్టి మాట నీవాడవచ్చునా?"

"ఇట్టిమాటలు మీరాడవచ్చునా? మీ రాజ్యాంగ తంత్రమంతయు నాయెదుటనే చూపుచున్నారా?"

"ఇందులో లేశమును దంత్రములేదు. యథార్థమునే-"

"తంత్రము లేనియెడల నాయెదుట నిప్పుడే యాజ్ఞాపత్రమును వ్రాసి నాకొసంగుఁడు. నాయిష్టము వచ్చినట్లు చేసికొందును?"



"ఎంతసేపు వ్రాయవలెను? క్షణముపట్టదు. కాని యేమిచేసెదవు?"

"రాజ్యాభిషేక సమయములయందు మంత్రము లుచ్చరించు మన మతగురువు దేవదాసు లేఁడా? వానిచేఁ జదివించెదను."

"బాగున్నదికాని - హిందువులకు మహమ్మదీయులకే కాక సకలమతములవారికిని దేవదాసిప్పుడు గర్భశత్రువై యున్నాఁడు. ప్రతి గురువారమును మతవివాదసభలో ఘోరకలహములు జరుగుచున్నవి. అట్టివానిచేఁ జదివించినఁ బ్రజ లిష్టపడరు."

"ఇంతకు మీ రిష్టపడకున్నారు. పోనిండు! మీయిష్టమే కానిండు! దేవినే గెలువనిండు! ముద్దుకు లేనివానివలె నా నిర్భాగ్యుఁ డిక్కడఁ జేరుకొనుటవలనఁగదా నా కీతలవంపు. వాని నిప్పుడే మాయింటికిఁ బంపివేసెదను. మీరును మీ రాణులునుగూడ—"

అని గద్గదస్వరముతోఁ బలుకుచు మఱిమాటాడలేక, దుఃఖాతిశయమున భోరున నొక్కమాఱు అఱచి తటాలునఁ జక్రవర్తి యొడిలోవ్రాలి రెండుచేతులు మొగముపైనిడికొని వెక్కివెక్కి యేడువసాగెను. అది బ్రహ్మాస్త్రము! ఆబ్రహ్మాస్త్రమున కెంతటి చక్రవర్తియైనను బద్ధుఁడు కాకతప్పదు. అందుచే నతఁడు వెంటనే యాజ్ఞాపత్రమును వ్రాసి రేవాదేవికి సమర్పించుకొనెనని యిచ్చట వ్రాయవలయునా?



# పదమూఁడవ ప్రకరణము.

## ఉత్సవ ప్రయత్నములు.

ఆసేతుహిమాచలముగల భారతవర్షమునఁ బ్రతాపసింహు నెఱుఁగనివారు లేరు. రాజులు రాజప్రతినిధులు నున్నతోద్యోగస్థులు, సామాన్యప్రజలు మొదలగువారిలో ననేకుల హృదయములు ప్రతాపునియందే పక్షబుద్ధి వహించి యుండెను. అట్టివారికెల్లఁ జక్రవర్తియందు గౌరవభావము లేదని మాత్రము మన మూహింపరాదు. ప్రతాపసింహుఁడు పట్టువడెనన్నవార్త దేశమునం దంతట బహిరంగముగఁ బ్రకటించినయెడల, రాజ్యమునం దెట్టి విప్లవములు కలుగునో, ప్రజలహృదయము లెట్లు మాఱునో, రాజపుత్రరాజుల కెప్పటికెట్టి దుర్బుద్ధిపుట్టునో, యను సంశయములు మొదటినుండియుఁ జక్రవర్తిని మిక్కిలి బాధించుచుండెను. ప్రసిద్ధులైన నాయకులను ఖైదుచేసినప్పుడు దూరాలోచనముగల పాలకుల కిట్టియాందోళన ముండకతప్పదు కదా! ఈవిషయమును గూర్చి చక్రవర్తి పృథ్వీరాజాదులతో దీర్ఘముగ నాలోచించి యాలోచించి యావార్త విదేశములయందుఁ బ్రకటింపలేదు. ఆంతరంగికులు తప్ప నాయుత్సవమునకు ఏదేశ ప్రతినిధులును నాహ్వానింపఁబడుట కవకాశము కలుగలేదు. నిండుదర్బారులోఁ దాను దులాభారమును దూగి తనప్రక్కనే ప్రతాపసింహుని రత్నసింహాసనాసీనునిం గావించి "ప్రతాప



సింహుఁడు గూడ నేఁడు నా స్వాధీనమం దున్నాఁడు. ఆర్యావర్తములో నింక నాకు వశముకాని రాజులేఁడు, రాజ్యమును లేదు. భారతవర్ష చక్రవర్తినగు నేను బ్రతాపసింహుని క్షమించి మేవాడరాజ్యమునకుఁ బునరభిషిక్తునిగాఁ జేయుచున్నాను." అని ప్రకటింపవలె నని చక్రవర్తిసంకల్పము. ఈ రహస్య సంకల్పము నతఁ డెవ్వరితోడను జెప్పలేదు. చక్రవర్తి తుదకుఁ బ్రతాపసింహు నేమిచేయునో యేమిచేయునో యని పృథ్వీరాజాదులుఁ గూడ గుసగుసలాడుకొనుచుండిరి. ప్రతాపుఁడు పట్టువడెనన్న వార్తయుఁ బట్టువడి యిట్లు గౌరవింపఁ బడెనన్న వార్తయు నొక్కమాఱే దేశమునం దంతట బహిరంగముగాఁ బ్రకటింపఁ బడవలెనని సార్వభౌముని ముఖ్యాశయము.

తెల్లవారినది. అదే యుత్సవదినము! పదిగంటలకే తులాభార సుముహూర్తమని ఫైజీప్రముఖులు గణించి నిర్ణయించిరి. ప్రాతఃకాలముననే హిందూదేవాలయములయందును, మొగలాయి మసీదులయందును, క్రైస్తవ చర్చులయందును, జైనవిహారములయందును, బౌద్ధారామములయందును దైవప్రార్థనములు ప్రారంభింపఁబడినవి. అంతఃపురమున రాణులు సుస్నాతలై పురోహితప్రోక్త మంత్రపూర్వకముగ నిష్టదేవతారాధనములు గావించుచుండిరి. సెలవుదినమగుటచే బడిపిల్లలుఁ గలాశాలా విద్యార్థులు పెందలకడఁ జల్దులారగించి, కలకలమని కిలకిలమని యాడుచుఁ బాడుచుఁ

గేరుచుఁ బురవీధులయందుఁ దిరుగుచుండిరి. ఆస్థాన కవిశేఖరుఁడైనఁ బృథ్వీరాజు చక్రవర్తిపై నాశీర్వచనపద్యము లల్లుచుండెను. కాని పాపము వాని యేకాగ్రదృష్టికిఁ గరుణా జోసీభాయి లంతరాయమును గలిగించిరి. అతఁడు తనగదిలోఁ గూర్చుండి దీర్ఘముగ నాలోచించుచుండఁ దటాలున గదితలుపులు తెఱచుకొని వారు ప్రవేశించుటచేత నాతని దృష్టి చెదరిపోయినది. వచ్చినంతనే వారొక కాగితమును బృథ్వీరాజు చేతికొసంగి, యొండొరులఁ జూచి నవ్వుకొనుచుండిరి. వృద్ధుఁడయ్యును జత్వారావస్థ తప్పినవాఁడగుటచే నతఁడా కాగితము నిట్లు చదువఁగలిగెను.

ఉ॥ వేటకు మేటియైన పృథివీపతి సాధుఁడు మాంసభోజి గాఁ
డేటికి చింతనొందెదు మృగేశ్వర! దైవవిధాన మేరికిన్
దాటఁగరాదు; నీవువలఁదప్పిచరింతు ప్రక్రిమ్మఱన్ మహో
గ్రాటవులందు; ధైర్యము రవంత మనంబునఁజిక్కఁబట్టుమా!

తనమన సన్యథా వర్తించుచుండుటచే నొక్కమారు చదివినంతమాత్రమున నాపద్యములోని భావము పృథ్వీరాజుకు స్ఫురింపలేదు. అతఁడు మఱలమఱలఁ జదివి యందలి ధ్వన్యర్థమును గ్రహించి నవ్వుకొనుచు వారితో నిట్లు ప్రసంగించెను.

పృథ్వీ—జోసీ! యీపద్యమును నీవే వ్రాసితివా ?

జోసీ—నేనుగాదు. కరుణ వ్రాసినది.



కరుణ—నేనుగాదు, పిన్నిగారే వ్రాసినారు.

పృథ్వీ—"సరే! ఇద్దరును గలిసి వ్రాసియుందురు. కాని యిది ప్రతాపసింహునిఁ గూర్చి వ్రాయఁబడిన ట్లున్నది. ఇంతకంటెఁ జక్రవర్తి నాశీర్వదించుచు నొకపద్యమును వ్రాయలేక పోయిరా?"

కరుణ—బాబా! ఇందుఁ జక్రవర్తిపై దూషణ మేదైన నున్నదా?

పృథ్వీ—లేదమ్మా! దూషణములేదు.

జోసీ—దూషణము లేకపోవుటయే కాక భూషణముగూడ నున్నదేమో ?

పృథ్వీ—ఔను, వేటకు మేటియైన పృథివీపతి సాధుఁడనియు, మాంసభోజి కాఁడనియు, మృగేశ్వరా! నీవు ధైర్యము వహింపవలయుననియు నన్యాపదేశము చక్కఁగానే రచింపఁబడినది. కాని నేనుజెప్పినట్లు వ్రాయరాదా?

జోసీ—ఎందుకు వ్రాయవలెను? చక్రవర్తి నభినందించుటకు మీయాస్థానకవులు నూటయిరువది మందియుఁ జాలరా! లోకమంతయు వానినే పొగడిన యెడలఁ బ్రతాపసింహు నెవరు పొగడెదరు?

పృథ్వీ—నిజమేకాని యెవ్వారికిని బుట్టనిబుద్ధి మీకేల పుట్టవలయును ?

కరుణ—బాబా! ఎవ్వరికిని స్ఫురింపనిది కవికి స్ఫురించు

నని యు, నదియే కవిత్వమనియు మీరొకమారు సెలవీయలేదా?

పృథ్వీ—నరేకాని యీపద్యము నేమిచేసెదరు? ఎక్కడఁ జదివెదరు?

జోసీ—ప్రతాపసింహునకుఁ బంపెదము?

పృథ్వీ—(ఆశ్చర్యముతో) ఎట్లు పంపెదరు?

జోసీ—దిళేర్ఖాను చేతికిచ్చి—

పృథ్వీ—(భయముతో) వద్దుసుమా! ఏమిప్రమాదించునో?

జోసీ—జోధాభాయికి వినిపించి యామెచేఁగూడ సంతకము చేయించి పంపెదము. ప్రతాపసింహుని చుట్టరిక మామెకుమాత్రము లేదా?

అందుకుఁ బృథ్వీరాజేమియు సమాధానము చెప్పక కొంచెము సేపూరకుండి కరుణతో నిట్లనియె.

"అమ్మాయీ! చిత్రపటము లన్నియు నిన్నటి సాయంకాలముననే నాకందినవి. నీచిత్రపటము నేమిచేసితివి? పూర్తియైనదా?"

"పూర్తియైనది. పిన్నిగారితో నిప్పుడు బయలుదేరుచున్నానుగదా? జోధాభాయికే యిచ్చివేసెదను. ఆమె నా చిత్రపటమును దన మహాలునందే యుంచుకొనునఁట. కాని బాబాజీ! మీకందిన చిత్రపటము లన్నియు నేమి చేసిరి?"

"అప్పుడే నగరులోనికిఁ బంపివేసితిని. నాకెందుకు?"



"అదికాదు. నేనొకమాఱు చూడవలయునని యనుకొంటిని"

"ఆచిత్రపటము లిప్పటికింకను దర్బారుమందిరములో వ్రేలఁగట్టింపఁబడి యుండునని నే ననుకొనను. నీవిప్పుడే బయలుదేరుచున్నావుగదా! ఉన్నయెడల నంతఃపురములోఁ జూడఁగలవేమో?"

ఇట్లు మాటాడుచుండ భూమ్యాకాశములు బ్రద్దలు సేయునంతటి భయంకరధ్వానములతో ఫిరంగుల మ్రోతలును ఢంకానగారాల వాద్యములును వినవచ్చెను. చక్రవర్తి మంగళస్నానమునకు బ్రారంభించెనని వారు తెలిసికొని ప్రయాణ సన్నద్ధులైరి. ఉచితాంబరాభరణాలంకృతయై యాదివరకే జోసీభాయి సిద్ధముగ నుండుటచే నామె వెంటనే కరుణతోఁగూడ బల్లకిలోఁ గూర్చుండి బయలుదేరెను. వారు బయలుదేరిన కొంచెముసేపునకే పృథ్వీరాజుగూడ వాకిట వేచియున్న గుఱ్ఱపుబండి నెక్కి కోటకుఁ బ్రయాణమయ్యెను. కవిరాజగు పృథ్వీరాజు రథారోహణము గావించుటయే తడవుగ గంధవహబాంధవములగు తత్సైంధవములు క్షణమాత్రములో దర్బారుమందిరమున కనతిదూరమున వచ్చి యాగినవి. తోడనే భుజములపైనుండి తెల్లని వలిపంపు టుత్తరీయము నేలకు జీరాడుచుండ బండినుండి తటాలున దిగి యుత్ఫుల్ల పుష్పవల్లిక లల్లిబిల్లిగ నల్లుకొనిన యత్యున్నతములగు నెల

రాల చలువపందిటి నీడలనుండి పాదచారియై వచ్చి, సర్వ
సంపత్పరిపూరితంబును సర్వాలంకార శోభితంబును, ఢక్కా
భేరికా ఢంకా శంఖాద్యనేక సముద్య ద్వాద్యంబును నగు
దర్బారుమందిరమునఁ బ్రవేశించెను. ఆసమస్త సభాస్థాన
విస్తీర్ణం బెంతయో యిదమిత్థమని నిర్ణయించుట యసాధ్యంబై
నను, ఒక చివరనున్నవా రింకొక చివరనున్నవా రెవరో పో
ల్చుకొనుట దుర్లభమనిమాత్రము చెప్పఁగలము. అడుగున
గల నెలరాల నేల లేశమును గానరాకుండ నాసభాభవనము
నంవంతట, సూరత్పట్టణపుఁ బట్టుతివాసీలు వేయఁబడియుండెను.
వానిపై సభాస్తారులగువారికి దారికి నడ్డములేకుండ, కుదు
రుగ వేయఁబడిన మఖమల్ పరుపుల యాసనముల వరు
సలు వేలో లక్షలో యెవరు గణింపఁగలరు? అయ్యాసనముల
మధ్యనుండి పురోభాగంబునకు బోవంబోవ తత్సభాభవనశిరో
భాగంబునఁ గొంచె మెత్తుగ విశాలంబగు నొక చంద్రకాంత
శిలారంగంబు గలదు. ఆరంగస్థలం బెల్ల లక్షలకొలఁది
విలువగల బంగారు జరీఫర్షుతోఁ గప్పఁబడి యుండెను.
తన్మధ్యంబున మహాదీర్ఘ స్వర్ణభూషణ ప్రకీర్ణంబును,
నానావిధ నూత్నరత్నప్రభాభాసమానంబును నగు సార్వ
భౌముని సింహాసనము చూపరుల చూపులకు మిఱుమిట్లు
గొలుపుచుండెను. సువర్ణస్వామియైన మేరునగాధినాథుండును-
ధనాధినాథుండగు కుబేరుండును- రత్నాకరుండైన సముద్రుం
డును- దేవతా శిల్పకారుఁడగు మయుని, మంచిచేసికొని



చేయించిన యా రతనాల బంగరు గద్దియ నేసందర్భమునఁ
జక్రవర్తికి సమర్పించుకొనిరోఁ మనకుఁ దెలియదు. హర్యక్ష
నామంబులు సార్థకంబులుగఁ బచ్చలతో దీర్చిన కనుగ్రుడ్లును,
బంగరు జూలుతో నమర్చిన కేసరంబులును, నిశితవక్రగోమే
ధికంబులం గూర్చిన నఖంబులును, మదకుంభి కుంభ విదారణ
దారుణ క్రియారంభ సంరంభమును సూచించు భయావహం
బులగు ముఖంబులును- గలిగి చుఱుకుచుఱుకునఁ జూచు కఱకుఁ
జూపులతోఁ జూపరులపై కుఱుకునో యనితోఁచు నాలుగు
వెండి కొదమసింగంబు లాసింగంపు గద్దియకు నలుప్రక్కలఁ
జక్కఁగఁ జెక్క బడి, మంచి ముత్యాల జాలరులు వ్రేలాడు
నొక బంగరు మేలికట్టును మోయుచుండెను. ఆ సింహాసనము
నకు ముందే యైదారడుగుల పొడవును నేడెనిమి దడుగుల
వెడల్పును గల బంగారు త్రాసు వ్రేలాడుచుండెను.

ఆహా! ఆనాఁ డా త్రాసునకుఁ గట్టెదుట, నా చంద్ర
కాంత శిలారంగంబుపైఁ బ్రత్యక్షముగఁ గానవచ్చుచుండిన
భారత రాజ్యలక్ష్మిని, భారతీయులు మఱల నేయుగమునం
దును జూడలేక పోయిరికదా! ఒక్కొక్కరాశి యొక్కొక్క
గజము పొడవునకుఁ దక్కువకాకుండ వజ్రములు- వైడూర్య
ములు- గోమేధికములు- పుష్యరాగములు- మాణిక్యములు-
నీలములు- మరకతములు, ప్రవాళములు, మంచిముత్యములు,
బంగారు చేటలతోఁ గుప్పకుప్పలుగఁ గ్రుమ్మరింపఁ బడినప

కఱఁగిపోసిన బంగారపు టచ్చులు విచ్చలవిడిఁగాఁ బేర్చఁబడి నవి! ఆ రాసులన్నియుఁ దుదకేమగునో యని చదువరు లూహించుచున్నారా? ఆ బంగారు రాసులు! ఆ రతనాల రాసులు! ఆ ముత్యాలరాసులు! తులాభారానంతరమున మఱల యథాక్రమముగ భాండారములకుఁ గొనిపోఁబడునని తలంచుచున్నారా? హరహరా! కాదు. కాదు. చక్రవర్తి యాశయ మదికాదు. "ఓ భారతీయులారా! ఇదిగో! మీ సామ్రాజ్య లక్ష్మి! దీనికి నే నొక్కఁడనే వారసుఁడనుగాను. ఇది మీనుండి సేకరించినదియే గాని నేను సృష్టించినది కాదు. దీనిని నే నెచ్చటకుఁ గొనిపోఁగలను? ఎంతని యనుభవింపఁ గలను. మీమీ యైశ్వర్యముల మీరే యనుభవింపుఁడు! మీరే సుఖింపుఁడు! మీరే యానందింపుఁడు! అప్పుడే పరమేశ్వరుఁడు నన్ననుగ్రహింపఁ గలఁడు!" అని సార్వభౌముఁడు తన పరిపాలనాశయమ్ములు భారతీయులకు సూచించు తెఱంగున, నారాసులన్నియు గుప్పిళ్ళతోఁ బ్రజామధ్యంబున నిర్లక్ష్యముగా వెదజల్లించును. ఆహా! ఆదినము లేనాటివో కదా! సార్వభౌమా! ధన్యుఁడవు! ధన్యుఁడవు! అల్లాహో అక్బర్!!!!!

చదువరులారత్నరాసుల నెంతకని చూడఁగలరు? చూచి యిప్పు డేమనుభవింపఁ గలరు? మీరును నాటిదినంబు లలో సరదారులో వజీరులో హమీరులో మన్సబ్‌దారులో



సామాన్యప్రజలో వైయుండి యేకోట నట్టి రత్నరాసులు గుప్పిళ్ల కొలఁది నేరుకొని తెచ్చుకొని యెంత యానందించిరో యెంత సుఖించిరో? యెంత యనుభవించిరో తెలిసికొనుటకు సర్వేశ్వరుఁడు పూర్వజ్ఞానమైనఁ బ్రసాదింపఁడయ్యె! ఏమి చేయఁగలరు? రండు! ప్రస్తుత కథాక్రమం బనుసరింపుఁడు!

పృథ్వీరా జచ్చటకు వచ్చుసరికిఁ దులాభార సుముహూర్తమున కింకను నొకగంట వ్యవధియుండుటచే నా సభామందిరమున నెందఱో వచ్చియుండలేదు. చేయవలసిన యొకటి రెండు ప్రయత్నములుగూడ నప్పటికి మిగిలియేయుండెను. విచ్చుకత్తులతోఁగొందఱు సిపాయిలు రత్నరాసులకు పహరా యొసంగుచుండిరి. తోడరుమల్లు- భగవాన్ దాసు - అబుల్ ఫజలు - ఫైజీ మున్నగు నున్నతోద్యోగస్థులు మాత్రము కొందఱు వచ్చి సింహాసనమునకుఁ గట్టెదుటనున్న యాసనములపైఁ గూర్చుండి యేమేమో మాటాడుకొనుచుండిరి. పృథ్వీరాజు వారిని సమీపించి కూర్చుండిన తరువాత వారికీ క్రింది సంభాషణము జరిగెను.

పృథ్వీ—ప్రయత్నములన్నియుఁ బూర్తియైనట్లేనా?

అబుల్—ఆహా! పూర్తియైనట్లే:

తోడ—(స్మృతి నభినయించి) అన్నట్లు మఱచితిని! చిత్రపటములేవి! వాని నీమందిరమున వ్రేలాడఁ గట్టించ వలయునఁట కదా?

పృథ్వీ—నిజమేకాని నేను వానిని నిన్ననే చక్రవర్తికిఁ బంపి వేసితిని. ఆపని యెవరికి నియోగింపఁబడినదో నాకుఁ దెలియదు.

తోడ—సరే! తొందర యెందుకు? దిలేర్ఖాను వచ్చినఁ దెలియఁగలదు.

ఫైజీ—ప్రతాపసింహుని గూర్చి చక్రవర్తి యేమాలోచించెనో!

పృథ్వీ—నాకుఁ దెలియదు. విశేషమేమైన నున్న యెడల మనలో నెవ్వరికిని దెలియకుండునా?

ఇట్లు ప్రసంగించుచుండ దివ్యాంబరాభరణాలంకృతులై యొండొరుల భుజములపైఁ జేతులు వేసికొని రాజకుమారుఁడైన సలీమును రాజస్యాలకుఁడైన దామోదరసింగును నచ్చటకు వచ్చిరి. వచ్చుటయే తడవుగ దామోదరుఁడు సలీమును విడిచి యబుల్ ఫజలును సమీపించి,

"గురూజీ! చిన్నసందేహము! నేఁడు నాకుఁ బట్టాభిషేకముగదా? రేపటినుండి పాఠశాలకుఁ బోవలసి యుండునా?"

"ఇంత ప్రయోజకుఁడవైన తరువాత నింకను బాఠశాల యెందుకు? మఱి యవసరము లేదు?"

"ఆఁ—గురూజీ! దివ్యదృష్టియున్నట్లు నామనసులోని మాట చెప్పినారు. సరేకాని నేను చిత్తూరుమహారాణా నగుచున్నానుగదా! మీరందఱు నాకేదైన నొకబిరుదు సమర్పించుకొనరాదా?"

*



"నీకుఁదగిన బిరుదమిదివరకే సిద్ధముచేసి యుంచితిమి!"

"ఏదీ! ఏదీ! గురూజీ వెంటనే సెలవిచ్చుకొనుఁడు!"

"శకారుఁడు—"

"శకారుఁడా? శకారస్యాలక— శ-కా-ర-స్యా-ల-క-దా-మోదర-సింగ-బాగున్నది గురూజీ! యతిప్రాసలు పోలేదు. ఇందుకే మీరుగొప్ప కవిచెప్పెదరని వాడుక! ఓసభ్యులారా! నాకీ బిరుదమునకు మీరందఱు సమ్మతించినట్లే కదా?"

పృథ్వీరాజాదులును, నీలోపుగవచ్చిన మఱికొందఱు సభ్యులును వాని వికారచేష్టలకు నవ్వుకొనుచుండ నింతలో దిలేర్ఖాను వచ్చెను. తోడనే పృథ్వీరాజు వానినిఁ జెంతకుఁ బిలిచి,

"దిలేర్ఖా! చిత్రపటములేవి? ముహూర్తము సమీపించుచున్నది. ప్రభువువారు సిద్ధముగ నున్నట్లేనా?"

"మంగళస్నానములైనవి. పూల్బాగులోని విహారమందిరమున నున్నారు. పటములుగూడ నచ్చటనేయున్నవి. కాని రాణులెల్లరుఁ జుట్టును గుమిగూడియుండుటచేఁ దెచ్చుటకు వీలులేకపోయినది. వారు కొంచెము తొలఁగినంతనే తీసికొని వచ్చెదను."

"ఔనుగాని—మఱియొకమాట — ప్రతాపసింహుని గూర్చి—"

"ఏమికనుఁగొనుటకైన వీలులేకున్నది. దేవిగారు చెంతనే నిలువఁబడి యేమేమో ప్రసంగించుచున్నారు. అవకాశము కలిగినవెంటనే యన్నిసంగతులు కనుఁగొనివచ్చెదను."

అని పలికి దిలేర్ఖాను నిష్క్రమించెను. అబుల్ ఫజల్ ప్రముఖులు మఱల దామోదరసింగుతోఁ గొంత వినోదింపవలెనని వానివంకఁ దిరిగిరి. వాని హాస్యప్రసంగమును వినుటయందు వారి కింకను తృప్తితీరలేదు. అబుల్ ఫజ లిట్లు ప్రారంభించెను.

"శకారప్రభువువారి పట్టాభిషేక మెప్పుడు నిర్ణయింపఁబడెను."

"మొన్నటి మధ్యాహ్నమున—"

"ఎవరు నిర్ణయించిరి?"

"మాయక్క—"

"ఎట్లు నిర్ణయించెను?"

"మాబావయొద్ద ఏడ్చి—"

"సరే! అట్లైన నిశ్చయమన్నమాటే! ఇంకేమి కావలెను?"

ఆహా! నిశ్చయమన్నమాటే! దివాకరుఁ డుదయించినను, నిశాకరుఁ డస్తమించినను దప్పదు. ఉత్సవమునకైన భంగ ముండవచ్చునుగాని నాపట్టాభిషేకము మాత్రము జరుగవలసినదే!"

ఇంతలోనే యత్యాతురతతోఁ బఱువెత్తి వచ్చుచుండిన దిలేర్ఖానును వారు చూచిరి. ఇంతత్వరలోనే యతఁడు



ఖిన్నవదనుఁడై వచ్చుచుండుటకుఁ గారణ మేమైయుండునా యని వా రూహించుచుండ, దిలేర్ఖాను సమీపించి యబుల్ ఫజలును జూచి, 'గురూజీమహారాజ్! వెంటనే యుత్సవప్రయత్నము లెక్కడివక్కడ నాపివేయవలెనని సార్వభౌముని యాజ్ఞ యైనదని చెప్పెను. ఆమాటవినుటయే తడవుగఁ జిత్రప్రతిమలవలె వారందఱు నిశ్చేష్టితులైరి. కారణ మేమని వా రెంతయాతురతతో నడిగినను దిలేర్ఖాను తన కేమియుఁ దెలియదని చెప్పి ఖిన్నవదనుఁడై యుండెను. తన పట్టాభిషేకప్రయత్నమునకుఁ గూడ భంగము కలుగునేమోయను భయంబున శకారుఁ డంతఃపురమువైపు పరువెత్తసాగెను.



## పదునాల్గవ ప్రకరణము.



### విచారములో నవ్వు

నిశ్చలమైన యేకేశ్వరధ్యానమును నత్యవసరమైన రాజ్యాంగ విషయచింతనమును, పూల్బాగులోని విహారమందిరమునందే చక్రవర్తి తఱుచు గావించుచుండును. ఏకాలమునను రాణులందరితో నుండఁగోరినప్పుడు గూడ వాని కదియే యుచితస్థలము. అది చక్రవర్తి స్వాంతవిహారమందిర మగుటచేత నచ్చటకు వచ్చుటకు రాణుల కెవ్వరికి నభ్యంతర

ముండదు. నందనవనంబుంబోలు నుద్యానవన మధ్యంబునం దైందవ గోళాకల్పితంబగు నాసుందర మందిర మందలి ముందరి చావడిలోఁ జక్రవర్తి యిప్పుడు సుఖాసీనుఁడై యున్నాఁడు. వానిచేత నొక చిత్రపటమున్నది. ముఖమునందు వైచిత్ర్యము సూచింపఁబడుచున్నది. ప్రక్కనే నిలువఁబడి దేవి యేమేమో మనవిచేసికొనుచున్నది. నిర్విణ్ణవదనలై రాణులెల్లరును జుట్టు ప్రక్కల నిలువఁబడియే యున్నారు. క్రీడావిహారసమయములయందు జక్రవర్తియెడ వారి కెంత చనవో కార్యాలోచనాసమయములయం దంతభయము. పాపము వారిలో రేవాదేవి మొగమున రక్తమే లేదు. వారందఱు నేమైన నాలోచించుచుండిరో యెవరికొఱకైన నెదురు చూచుచుండిరో మనకుఁ దెలియదుగాని నోట నెవరికిని మాటలు మాత్రములేవు. తాను జెప్పఁదలంచిన దంతయుఁ జెప్పి దేవియుఁ మౌనము వహించెను. దృష్టియంతయుఁ జేతఁ గల చిత్రపటమునందే యుంచి సార్వభౌముఁడు శిరఃకంపనము సేయుచు నెదురుగానున్న ద్వారముకడఁ జేతులు జోడించుకొని వేచియున్న దిలేర్ఖానునిఁజూచి, "దిలేర్ఖాన్! పృథ్వీరాజు అబుల్‌ఫజల్‌తోగూడ నేగి ఖైదీని దీసికొనివచ్చి దర్బారులోఁ గూర్చుండఁ బెట్టవలయును." అని యాజ్ఞాపించెను. 'చిత్తము మహాప్రభూ' యని సలాముచేసి, ఖానా స్థలము వెంటనే విడిచిపోయెను.



మఱికొంచెము సేపున కాద్వారమునుండియే బంగరు సలాకుం బోని పచ్చని మేనికాంతులతో, ఆభరణ రహితయయ్యు ననేకాభరణాధికంబగు సహజ సౌందర్య లావణ్యవైభవంబుతో, పతి నెడబాసిన రతియో కాంతుని పైనలిగిన రమాకాంతయో యన నొక కాంతారత్నము, ముందు వచ్చు దాసీజనము చూపుమార్గమున నా మందిరము ప్రవేశించెను. తోడనే యందున్న వారి దృష్టులన్నియు నొక్కమాఱే యామెయందుఁ బ్రసరించినవి. తనవంకఁ గాంచిన చక్రవర్తికి నమస్కరించి యా వక్రకుంతల నయభయంబులతో నట్లే నిలిచిపోయినది. అప్పుడు దేవి వచ్చి యామె భుజముపైఁ జేయివైచి సార్వభౌముని కట్టెదుటకుం గొనిపోవ, నత డాదరాయత్తమ్ములగు మెత్తని మాటలతో నమ్మత్తకాశిని కిట్లనియె.

"కరుణా! నీ చిత్రపటము చూచితిని. తక్కిన చిత్రపటములకంటె నెంతో భిన్నముగా నున్నది. భిన్నముగా నుండుటయే కాదు, నీ వభ్యసించిన చిత్రకళ పొట్టకూటికై నేర్చు విద్యలవంటిది కాక, నేడొక చక్రవర్తి గౌరవమును గాపాడఁ గలిగినది. నీ వలన నీ రహస్యము వెలువడకుండెనా మేమెంతయో నవ్వులపాలు కావలసి వచ్చును. జరిగినదానికే యెంతయో విచారించుచున్నాను. చిత్రపటము లన్నియుఁ బరిశీలించి నీవు దేవితోఁ జెప్పిన సంగతి నీ నోటనే వినవలయునని నిన్నిక్కడకు రప్పించితిని."

"మహాప్రభూ! క్షమింపవలయును. ఏలినవారి యుత్సవమునకు భంగపాటు" అని యేమో చెప్పుచుండఁ జక్రవర్తి నవ్వుచు—

"ఉత్సవమునకు భంగపాటు గలిగింపలేదు. ఉత్సవానంతరమున మాకుఁ గలుగఁబోవు భంగపాటు తప్పించితివి. చెప్పు చెప్పు."

"దేవా! ఏలినవారి చిత్రకారులందఱిచేఁ జిత్రింపఁబడినవాఁడు ప్రతాపసింహుఁడు కాఁడు. వాని సవతితమ్ముఁడైన జగమల్లు."

"జగమల్లును నీవు బాగుగా నెఱుఁగుదువా?"

"చిన్నప్పటినుండియు నెఱుఁగుదును. ప్రతాపసింహు నంతకంటె బాగుగా నెఱుంగుదును. నేను జిత్రించి సమర్పించుకొనినదియే యథార్థమైన ప్రతాపస్వరూపము. తక్కినవి జగమల్లు రూపములు. ఆ రెండురూపములయం దన్నదమ్ముల పోలిక లున్నట్లు కనిపెట్టవచ్చును."

"ఔనౌను. ఆపోలికలు స్పష్టముగనే కానవచ్చుచున్నవి. ......కరుణా! నాగౌరవమును గాపాడితివి. నిజముగా నాగౌరవమును గాపాడితివి! నీవు గతభర్తృకవు. నీఋణ మేమొసంగి తీర్చుకొనఁగలను? అంబరములా? ఆభరణములా? ధనరాసులా? కోటలా? ఏమియొసంగెద నన్నను నీ వంగీకరింపవు కదా? ఈసందర్భమున నీపతి యేయుండినయెడలఁ జిత్తూరు రాజ్యమును మీకు ధారపోసియుండనా! ఇప్పుడైనను—"



"దేవా! ఏరాజ్యములైనను నేలినవారి కటాక్షవీక్షణములకంటె నాకధికములు గావు. నాకేమియు నక్కఱలేదు. నన్ను క్షమింపుఁడు."

ఇట్లు మాటాడుచుండ నొకయంతఃపురదాసి- వెనుకకు విఱిచికట్టిన చేలాగ్రములతోడను- చేతనొక తోలుకమ్చాతోడను నప్పుడే గుఱ్ఱము దిగివచ్చినట్లు వచ్చి- అత్యాయాసమును సూచించు నుచ్ఛ్వాస నిశ్వాసము లెడములేకుండఁ దీయుచు నొడలెల్లఁ జెమటతోఁ దడిసియుండ నత్యాతురతతో నమ్మందిరద్వారము సమీపించి యచ్చటి దాసీ లడ్డగించుటచేఁ దటాలున నాగిపోయినది. ఆగిపోయినను నామె వికారాకారము చక్రవర్తికంటఁ బడినది. అందుచే నామె తానువచ్చినపనిపై ద్వారముకడ వేచియుండవలసిన యవసరము లేకయే యించుక లోనఁ బ్రవేశించ గలిగినది. చక్రవర్తిసెలవైనంతనే తనచేతంగల చర్మప్రతోదమును గ్రింద జారవిడిచి చేతులుజోడించి ద్వారమునందుఁ బ్రవేశించి గడగడవడకు నొడలితోడను గద్గదస్వరముతోడను "మహాప్రభూ! సిక్రీపట్టణములో దేవదాసు నెవ్వరో చంపివేసిరి" అని మొఱపెట్టుకొనెను. పిడుగువడిన మహావృక్షమువలె నావార్త చెవిని బడినంతనే చక్రవర్తి నిశ్చేష్టితుఁడై యాసనముపై నట్లే వెనుకకు వ్రాలిపోయెను. 'హరహరా! ఎంతఘోర' మని రాణులెల్లరుఁ జెవులు మూసికొనిరి. దయార్ద్రహృదయుండగు

సార్వభౌముఁడు తనకన్నీరు గానరాకుండ దుడుచుకొని గద్గదికపడకుండ గొంతుక సవరించుకొని—

"ఓసీ! దేవదాసు నెవరు చంపిరి? ఎప్పుడు చంపిరి?"

"ఎవరు చంపిరో యెప్పుడు చంపిరో తెలియదు. మహాప్రభూ! తెల్లవారుసరికి—కత్తిపోటులనుండికారు రక్తధారలతో నతఁడు మంచముమీదనే మరణించి యుండెను."

"ఇంత యుదయముననే నీ వచ్చటి కేలపోయితివి?"

"మహాప్రభూ! రేవాదేవిగారి సెలవుపైఁ— దామోదరసింగుమహారాజుగారికిఁ బట్టాభిషేక మనియు— దేవదాసుని—"

"చాలు—చాలు— మఱి చెప్పనక్కఱలేదు. పో!"

వెంటనే దాసి యచ్చటనుండి తొలఁగిపోయెను. అంత విచారములో నున్నను "దామోదరసింగు మహారాజుగారికిఁ బట్టాభిషేక"మను మాట విన్నంతనే రాణుల కెల్లరకు నవ్వు వచ్చినది. వారి నవ్వులు చూచినప్పుడు రేవాదేవికిఁ గలిగిన హృదయవేదనము నెవరు వర్ణింపఁ గలరు! సార్వభౌముఁడు మాత్రము వారి ముసిముసి నవ్వులు కనిపెట్టలేదు. క్రోధ విషాద సూచకములగు ముఖలక్షణములతోఁ గొంచెము సేపు మాత్రమే కూర్చుండి, యతఁ డెవ్వరితోడను జెప్పక యచ్చట నుండి తటాలున లేచి పోయెను.

## పదునేనవ ప్రకరణము.

### దర్బారులోని ఖైదీ.

"ఫైజీగురూజీ! మతము లన్నిటినుండియు నుత్తమ సిద్ధాంతములను గ్రహించి, మతసామరస్యమునకు మనము పూనుకొంటిమి. ప్రతిమతమువారును దమకు న్యాయమనియు యుక్తమనియును దోచునెడ నితరులకు నష్టము గలిగింపని ప్రతివిషయమును స్వేచ్ఛగా నవలంబింప వచ్చునని సర్వస్వాతంత్ర్య మొసంగితిమి. స్వార్థపరులగు కొందఱు మతగురువులు తమ దుర్బోధలచేఁ బ్రజల వంచించుచుండుట గనిపెట్టి, సేవకుఁడు మొదలు రాజాధిరాజు వఱకుఁగల యన్నితరగతుల వారిని సమదృష్టితోఁ బాలించుచుండు సర్వేశ్వరుఁడే సర్వగురుండని బోధించి, కుమతాచార్యుల దుర్బోధనాశృంఖలముల ఖండించితిమి. బ్రాహ్మణులు, బౌద్ధులు, చార్వాకులు, జైనులు, యూదులు, పారసీకులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగు సర్వమతముల వారికిని మన 'ఇబదత్ఖానా'లో నాసనము లొసంగి స్వేచ్ఛావాదంబులకు సెలవొసంగితిమి. సర్వమతసార సంగ్రహంబునకును, సకలమతసమత్వంబునకును, ధూర్తమతాచార నివారణంబునకును, పరమేశ్వర స్వరూప నిరూపణంబునకును మన మింతవఱకుఁ గావించుచుండిన ప్రయత్నములకెల్ల నేడు పర్యవసానము గానవచ్చినది. 'దీన్ ఇలాహి.

మతతత్వ వేత్తయైన మన దేవదాసు నెవ్వరో దారుణమైన బలవన్మరణము నొందించిరఁట! మతవిరోధులే కాక యీవృద్ధ బ్రాహ్మణున కింకెవ్వరు శత్రువు లున్నారు? ఫైజీ గురూజీ! ఇంతకాలమునుండి యిన్నివిధముల బోధించుచుండినను, ఈ మూర్ఖప్రజల కేల వివేకము కలుగదు? భారతవర్షంబునం దెల్ల జాతిభేదములు మతవిరోధములు లేకుండ భారతీయు లెల్లరు నొక్క తల్లికడుపునఁ బుట్టిన యొక్కజాతి యన్నదమ్ములను సంపూర్ణ విశ్వాస మాసేతుహిమాచలమును గల ప్రజలలో వ్యాపింపఁ జేయఁగలుగువఱకు నాకాయువు గటాక్షింపుమని నిరంతరము పరమేశ్వరునిఁ బ్రార్థించుచుందును. కాని, పరమేశ్వరుఁడు నాప్రార్థనము మన్నించి నాకు వేయేండ్లాయువొసంగినను నాప్రయత్నము కొనసాగునని తోచదు. ఇంక భారతీయుల భవిష్యద్దురవస్థ యెట్లుండునో మీరే యూహింపుఁడు. * * * * గురూజీ!
మీరిప్పుడు కొంచెము శ్రమపడవలెను. వెంటనే సిక్రీకి దయచేసి, భక్తాగ్రగణ్యుఁడైన తులసీదాసు నోదార్చి వానిచేఁ దండ్రి కుత్తరక్రియలు చేయించి, వీలైనయెడల హంతకు లెవ్వరో కనుగొనుటకుఁ బ్రయత్నింప వలెను. లెండు! తగిన పరివారముతో వెంటనే బయలుదేరుఁడు!"

ఇట్లు దర్బారుమందిరమునందలి రత్నసింహాసనము నుండి పలికిన సార్వభౌముని పలుకులు విని సభ్యులెల్లరు దేవదాసు మరణంబునకు ఖేదంబొందుచు, ప్రజానురాగ పూరితంబగు వాని విశాలహృదయంబున కెంతయుఁ గొనియాడ దొడంగిరి. చక్రవర్తి యాజ్ఞాప్రకారము వెంటనే ఫైజీ లేచి తనపనిపై బయలుదేరెను. అంతవరకును దేవదాసు మరణవార్త సభ్యులెవ్వరును వినియుండలేదు. రాణుల మధ్యనుండి తటాలున బయలుదేరి చక్రవర్తి వెంటనే దర్బారుమందిరమునకు విచ్చేయుటచేత నావార్త యింతవఱకు వ్యాపించుట కవకాశము లేకపోయినది. చెప్పవలసినది చెప్పుటయు ఫైజీ వెడలిపోవుటయు జరిగిన తరువాతఁ గూడ సార్వభౌముఁడు తనశీతల కటాక్షవీక్షణముల సభాభవనంబునం దంతటఁ బ్రసరింపఁ జేయక చింతాక్రాంతచిత్తుఁడై కొంతవఱ కేకాగ్రదృష్టితోడ యుండెను. అందుచేతనే వాని యాజ్ఞాప్రకారము తీసికొనిరాఁబడిన ఖైదీ యింకను వానికంటఁ బడలేదు.

ఆనాడు లాల్‌మహాలునం దా ఖైదీని మనమెట్టివేషమునఁ జూచితిమో యిప్పుడును నాతఁ డట్టివేషముననే యుండెను. సింహాసనమునకుఁ గట్టెదుటంగల ప్రథమపంక్తి యందే యాతఁ డొకయాసనమునం దున్నాఁడు. వానికిఁ జెరియొకవైపున నబుల్‌ఫజలు పృథ్వీరాజు, నాసీనులైరి. ఆపంక్తికిమాత్రము రెండుకొనలయందును విచ్చుకత్తులతో సిపాయిలు నిలిచియుండిరి. ఉత్సవ మాగిపోయినదని యెఱింగియుఁ దత్సందర్శనాగత పౌరవారంబులు దర్బారుమందిరము చుట్టును గ్రిక్కిరిసి

యుండెను. తన్మధ్యంబునంగల యాసనంబులును రాజోద్యోగస్థులచే నలంకరింపఁబడినవి. పలువిధములగు దర్బారు దుస్తులతో గంభీరముగఁ గానవచ్చు నాసభ్యులయెదుట జేగురు చెడ్డీతోనున్న యాఖైదీ యెల్లరకు వింతగాఁ గానవచ్చుచుండెను. ప్రారంభమునుండియు మొగమువంచుకొనియే కూర్చుండియుండినను వాని ముఖలక్షణములయందు భయముగాని, లజ్జగాని లేశమును సూచింపఁబడలేదు. అతఁడొకవిచిత్రవ్యక్తివలెఁ బృథ్వీరాజాదులకుఁ దోచుచుండెను. కొంతసేపునకు సార్వభౌముని యేకాగ్రదృష్టికి మార్పుకలిగినది. ఖైదీపహారా నిమిత్త మీవల నావలఁగాచియున్న సిపాయిల నచ్చటినుండి పొమ్మని చేసంజ్ఞలతో నాజ్ఞాపించి ఖైదీ నుద్దేశించి శంఖారావముంబోలు గంభీరస్వరముతోఁ జక్రవర్తి యిట్లుపలికెను.

“రాజోత్తమా! మీ రెవ్వరో మాకుఁ దెలియదు. మీరే ప్రతాపసింహుఁ డని మాసిపాయిలు మిమ్ముఁబట్టి తీసికొనివచ్చిరి. అది పొరపాటైనయెడల నజ్ఞానులైన సిపాయిలను క్షమింపుఁడు! మమ్మన్యథా భావింపకుఁడు. మీ రెవ్వరో మీ వృత్తాంతమును దెలిపినయెడ మిమ్మెట్లు సత్కరింపవలెనో మాకుఁ దెలియఁగలదు.”

“సార్వభౌమా! మొగలాయిరాజ్య నిర్మూలనంబునకుఁ గంకణము గట్టుకొనిన ప్రతాపసింహుఁడను నేనే. అసహాయుండనై యేకాంతముగ మీసిపాయిలచేఁ బట్టువడితిని. నన్నిప్పుడు ఖైదునుండి ముక్తునిఁ జేసి మఱల మీపై యథేచ్ఛగా విజృంభించి పగసాధించుకొనుటకు నాకవకాశము గలిగింపుఁడు. నిజముగా నన్ను సత్కరింపఁ దలచితిరేని నిదియే తగిన విధానము.”



ఆమాటలయందలి ధైర్యసాహసములకుఁ జక్రవర్తి నిశ్చేష్టితుఁ డయ్యెను. సభ్యులెల్లరు నత్యాశ్చర్య మొందిరి. సభాభవనంబెల్ల నిశ్శబ్దం బయ్యెను. అప్పుడు సార్వభౌముఁడు శిరము పంకించి “మీరు స్వయముగాఁ గోరుచున్నప్పుడు మిమ్మట్లే సత్కరించెదము. మీరే ప్రతాపసింహులైనయెడల మాయం దింతటి దీర్ఘశత్రుత్వమును వహించుటకుఁ గారణమడుగ వలసియున్నది. ఆశత్రుభావంబెల్ల నేటితో సంపూర్ణముగ వర్జించి మాకు విధేయులై యుండుట కీ దర్బారులో ఖరారుచేసి మేవాడరాజ్యంబునకు మాచేతఁ బునరభిషిక్తులు కాఁగూడదా?”

ఆమాటలకు ఖైదీ వెడవెడ నవ్వులు నవ్వుచు—

“సార్వభౌమా! ఇంతటి దయార్ద్రహృదయులగు మీరు కఠినచిత్తుఁడైన ప్రతాపు నెన్నాళ్ళకు సాధింపఁగలరు? ఎట్లు సాధింపఁగలరు? ఓప్రభూ! ఆధూర్తుఁడను నేను గాను. నా ప్రారబ్ధవశమున నాదుష్టచేతస్కునకు సవతితమ్ముఁడ నైనాఁడను. నన్ను జగమల్లుఁ డందురు. నా కాప్రతాపుఁడు గర్భశత్రువుఁడు. నిజముగాఁ బ్రతాపుఁడే మీకుఁ బట్టువడినయెడలఁ

గఠినకారాగారమునఁ జేర్చి కండకండలుగ ఖండింపక— దివ్యసౌధంబునం జేర్చి రాజోపచారములతో నిన్నిదినంబులు నిట్లే సత్కరింతురుగదా? ఇంతటి సాధుచక్రవర్తులకు దుష్టశత్రుసంహారము సాధ్యపడునా? మీ రాతనికి భయపడుచుండిరా?"

"జగమల్! మీవాస్తవము మా కిప్పుడు తెలిసినది. మే మా ప్రతాపునకు భయపడుచుండలేదు. ఇంతవఱకు మా కతఁడు వశుఁడుకాకుండుటయు వాస్తవమే. మీరును మా వలెనే ప్రతాపసింహుని శత్రుకోటిలోనివార మని చెప్పుచున్నారు- మీ మీ శత్రుత్వకారణంబులు మేము వినఁదగినవేనా?"

"అవశ్యముగ వినఁదగినవే! ప్రయోజన మున్నయెడఁ జెప్పదగినవే!"

"ప్రయోజనము లేకేమి? వలసినన్నివిధముల మీకు మేము తోడుపడఁగలము. మాకును మీరు తోడుపడవచ్చును."

"దేవా! ఇంక నా విషాదకథావిధానంబును సావకాశముగ నవధరింపుఁడు! పూర్వజన్మకర్మవిశేషమున నేను శత్రుకుటుంబములో జన్మించితిని. నాకుఁ దండ్రియు శత్రువే, అన్నదమ్ములును శత్రువులే! మాతండ్రియైన యుదయసింగురాణా యెక్కుడుగాఁ బ్రేమించు పట్టపుదేవికిఁ బ్రతాపసింహుఁడు జన్మించెను. రెండవభార్యకు నేను జన్మించితిని. ప్రధానులు-



సేనానులు-సామాన్య ప్రజలు మొదలగువారిలోఁ గొందఱు మా సవతితల్లిపక్షము. కొందఱు మాతల్లిపక్షము. ఎట్లైనను మా సవతితల్లిపక్షమే ప్రబలముగా నుండెను. ఇట్లుండ మా తల్లి నవమాసంబులు మోసి నా కొకసోదరునిఁ బ్రసాదించినది. వాఁడు పుట్టినంతనే మాసవతితల్లిపక్షమువారగు జ్యోతిష్కులు మాసమేషములు లెక్కవెట్టి గ్రహచారములఁ జూచి నోరు చప్పరించి యీ బాలుఁడు స్వదేశమునకు శత్రుఁడగుటయేకాక స్వకులమును గూడ నిర్మూలముచేయు నని చెప్పిరి. ఆమాటలు నమ్మి మాతండ్రి యప్పటినుండియు నా బాలునియం దసూయతోడనే సంచరించుచుండెను. వాఁడు క్రమక్రముగా నైదేండ్ల యీడుగలవాఁడై ఒకనాడు తండ్రి కడ నాడుచుండఁగా లోహకారుఁ డొకఁడు పదునైన కత్తిని దెచ్చి రాణాకు సమర్పించెను. అది వాడిగలదో లేదో చూచుటకు మాతండ్రి దానితో దూదిబుంగ నఱికి 'పదునైనదే' యని సంతసించి యక్కడ నుంచెను. వెంటనే నాచిన్ని తమ్ముఁడా ఖడ్గమును బట్టుకొని 'కత్తులు మనుష్యుల నఱకుటకుఁగాని దూది నఱకుటకుఁగా' వని పలుకుచు నొక్కయేటున నెముక కనఁబడునట్లు తన చేయి నఱకుకొనెను. ఆచేతినుండి కొన్నెత్తురు జొటజొట గారి నేలఁబఱచిన రత్నకంబళమును దడిపి చూపరకన్నులకు వెఱపు గొలుపుచున్నను బాలుఁడు మాత్రము బెదరక నొప్పి యని యేడ్వక యెప్పటియట్ల నిశ్చలుఁడై

నిలిచెను. వట్టి పిఱికియైన రాణా వాని మహాసాహసమును జూచి సహింపలేక యాయీడు బాలునియందంత వైపరీత్యము గానవచ్చుట దేశమున కరిష్టమని భావించి వానిని వధించుటకు వెంటనే తలారుల కప్పగించెను. నా[illegible]తమ్ము నా తలవరులు ఖండించి పారవేసిరి......"

జగమల్లు చెప్పిన యాఘోరవార్త విని సభ్యులెల్లరు నా డాదారుణకృత్యము తమయెదుట జరిగినట్లెంతయుఁ గటకట పడిరి. చక్రవర్తియు మిక్కిలి ఖేదపడి.—

"జగమల్ల! పాప మాబాలుఁడే బ్రతికియున్నఁ బ్రతాపునికంటెను మహావీరుఁడు కావలసినఁ వాఁడుగదా?"

"ప్రతాపుఁ డేమి వీరుఁడు మహాప్రభూ! వాఁడు వట్టి దొంగ - ద్రోహి - కపటచిత్తుఁడు - నాతమ్ముఁడే యున్న వాని తలపైఁ దన్ను వీరుఁడు కాఁ దగినవాఁడు."

"సరే! తరువాతి వృత్తాంతము నెఱింగింపుఁడు."

"సార్వభౌమా! ఇట్టి దారుణకృత్యమును గావించి తజ్జనిత పాపఫలానుభవంబో యన రాణా యచిరకాలంబుననే కాలము చేసెను. మాతల్లిపక్షమువారు నాకును, సవతితల్లి పక్షమువారు ప్రతాపసింహునకును రాజ్యాభిషేక మొనర్పవలెనని యత్నించుచుండిరి. నేనే రాజ్యాభిషిక్తుడను గావలసినదని రాణా మరణకాలమున వచించినట్లు కొందరు సామంతరాజులు చెప్పుచు ముహూర్తనిర్ణయము గావించి నన్ను గద్దె



నెక్కింపబోయిరి. పట్టాభిషేక సమయమునఁ గులవృద్ధులు రాజపుత్రుని నడుమునకు గత్తికట్టవలసిన యాచారము కలదు. ఆయాచారముప్రకారము నాకుఁ గత్తిగట్టునట్లభినయించుచు ఖలబుద్ధులైన కులవృద్ధులు నానడుమును బట్టుకొని నన్నావల కీడ్చుకొని పోవఁ బక్కనే సిద్ధముగనున్న ప్రతాపుఁడు. గద్దె నెక్కి తన పక్షమువారిచే నభిషిక్తుఁడు కాఁబడెను."

"అభిషిక్తుఁడై యేమనుభవించెను? రాజ్యభ్రష్టుఁడై నాటినుండి నేటివఱకు నరణ్యావాసమే కదా? అందుచే మీరు విచారింప నవసరము లేదు."

"దేవా! ఆ యరణ్యావాసమునందే పశ్చాత్తాపచిత్తుఁడై నన్ను బ్రతిమాలుటచేతను, నాభార్యపట్టుదలచేతను నేను గొంతకాలము ప్రతాపునితోడనే కలిసి యుండవలసివచ్చినది. ఇంతలో విధివశమున నా భార్య మసూచివ్యాధిపీడితయై మరణించుటయు, వచ్చియురాని ముద్దుమాటలఁ బెంపారు నాబిడ్డ- నాయైదేండ్ల చక్కని చుక్క- నా బంగారు బొమ్మ- నాప్రాణము- నాప్రాణముకంటె నధికమైన ప్రాణము, 'అమ్మా! అమ్మా' యని తల్లికొఱ కేడ్చి యేడ్చి తుదకు దల్లికడకే వెడలి పోయినది."

అని పలికి సముద్రతరంగమువలె నొక్కమా రుప్పొంగిన దుఃఖము నాపుకొనలేక పాపము జగమల్లుఁ డా దర్బారులో బావురుమని యొక్కమా రేడ్చెను. వాని యేడుపు చూచి

చక్రవర్తియు సభ్యులును గూడఁ గన్నీరు విడిచిరి. సార్వభౌముఁడు వాని నోదార్చి—

"జగమల్! విధివిధాన మెట్లో యట్లు జరుగక తప్పదు. మీకుఁ గలిగిన కష్టము మాకును గలిగినది. ఎవ్వరమైన ననుభవింప వలసినదే. అంబయను పేరఁ బ్రతాపునకుఁ గూడ నొక కూఁతు రున్నది కాఁబోలు!"

"దేవా! భార్యాపుత్రికలు గతించిన పిమ్మటఁ గూడఁ బరమశత్రువైన నన్నకడ మఱికొంతకాల ముండుట కా యంబా బాలికయే కారణము. తండ్రికడకంటె నా బాలికకు నామెడనే చనవెక్కువ. నా కుమారిక గతించిన పిమ్మట ఆ బాలికయే నా కుమారిక యనుకొని నా దుఃఖమును గొంత దిగమ్రింగుకొనఁ గలిగితిని. ఆహార నిద్రా క్రీడాదులు నిరంతరము నాయొద్దనే జరుపుచు 'తతాజీ! తతాజీ!' యని నాకంఠమును గౌఁగిలించుకొని, తల్లి పిలిచినను దండ్రి పిలిచినను క్షణమైన నన్ను విడువకుండుటచే, నా బాలికయందలి మమకారమున నే నా దుష్టునికడ నుండవలసి వచ్చినది."

"అట్లైనఁ గడకు మీ రాతని నెట్లు పరిత్యజింప గలిగితిరి?"

"దేవా! వసంతకాలములో నడవిపందుల వేటాడుట మా రాజపుత్రులయాచారము. ఆ యాచారమువనుసరించియొక వసంత సమయమునఁ బ్రతాపుని పరివారముతో నేనును వేటకు



బయలుదేఱితిని. ఒక్క యడవిపందినైన నేయక మఱలిపోవుట యశుభ సూచకంబగుటచే, నేనును బ్రతాపుఁడునుగూడఁ బర్వతారణ్య ప్రదేశములు పరిశోధించుచుండ, విధివశంబున భీకరాకారంబుతో నొక సూకరంబు మాకు గోచరంబైనది. నాకంటె నతఁడును నతనికంటె నేనును ముమ్ముందుగ నా పందిని మ్రందింపవలె నను నాందోళనమున నమ్ములపొదినుండి శలుకుటమ్ముల నెంచి వింట సంధించి, యొక్కమాటే ప్రయోగించితిమి. మా యిరుపురిశరంబులు నిరువంకలం దాఁక, శరనిధిమథనంబునఁ దిరిగిన మందరగిరింబోలె నా వరాహము గిరగిరం దిరిగి నేలఁ గూలినది. తోడనే తద్వధాకర్తృత్వమును గూర్చి మాకు వివాదము తటస్థించినది. ఆ వివాదము క్రమక్రమముగాఁ బరస్పరగౌరవముల నతిక్రమించినది. జ్యేష్ఠుని మాట చెల్లింపవలయు నని ప్రతాపుని పరివారమువారు నాకు బోధింప సాగిరి. కనిష్ఠునిమాట చెల్లింపు మని ప్రతాపునకు బోధించుటకు నాపక్ష మెవ్వరును లేకపోయిరి. వయసునందుఁ గంటె భుజపరాక్రమమునందు నాకు జ్యేష్ఠుఁడవు గమ్మని నే నాతని ద్వంద్వయుద్ధమునకుఁ బురికొల్పితిని. ఉత్తుంగ రోషతరంగితాంతరంగంబులతోఁ దురంగారూఢులమై— వాడి బల్లెంబుల నొండొరులం బొడుచుకొన నుద్యమించినంతనే— 'వలదు వల'దని ప్రతాపపురోహితుం డొకఁడు కేకలిడిచుఁ బరువెత్తుకొని వచ్చి— మా యుద్యమము మేము మాననందున

మా మధ్యం జొచ్చి - విచ్చుకత్తిని బోరలోఁ గుచ్చుకొని యచ్చటనే చచ్చెను. తోడనే ప్రతాపుఁడు గుఱ్ఱము నుండిదిగి గురుమరణదుఃఖంబంతయు నాయందే చూపుచు- “నీవు నాకడ నుండఁదగవు. నారాజ్యమునుండి పొమ్మని” నన్ను గెంటించెను. ఆపరాభవ క్లేశంబున మేవాడరాజ్యాభిషేకవాంఛ మఱల నాహృదయంబున నావరించినన్నుఁ బ్రోత్సహించుచుండఁ దిరిప మెత్తువానివలె నెల్లెడలఁ దిరుగుచుఁ గొంతకాలమునకు మీాసిపాయి లచేఁ బట్టువడితిని.”

అని తనకథ ముగించెను. కథ ముగిసినతోడనే చక్రవర్తి యొకనిట్టూర్పు విడిచి కొంచెము సేపూరకుండి —

“జగమల్! మీావిచిత్రజీవిత కథావిధానము మహాకావ్యమువలె నవరసభరితంబైయున్నది. మీారు మాసిపాయి లచేఁ బట్టువడుట మీావాంఛ యీాడేరుటకే యని తలంపవలెను. ప్రస్తుతము మాకొలువునందు మీా రేయుద్యోగము సమ్మతింతురు ?”

“దేవా! మీాయంతఃపురబాలికల నెత్తుకొని యాడించుపని నాకుఁ గటాక్షింపఁగోరుచున్నాను.”

“పాపము! బాలికలయందలి మమకారమే మిమ్మిట్లడిగించినది. మీాకు “పంచహజారీ మనస్ఫదార్” పదవి ననుగ్రహించితిమి. పృథ్వీరాజాదులు మీాకుఁ దగిన వసతు లేర్పరుపఁ



గలరు. మీారు వెంటనే లేచి మే మొసంగు నంబరాభరణంబుల ధరింపుఁడు.”

“దేవా! ధన్యుఁడను.”

---

## పదునాఱవ ప్రకరణము.

—* ఐదవ వంట *—

“ అరే! అక్బర్! మహాసైన్యసమేతుఁడవై మేవాడ రాజ్యమును జయించి సంపూర్ణ సామ్రాజ్యాధిపత్యమును బొందఁగలిగితి నని విఱ్ఱవీగకుము. మారాజ్యలక్ష్మి నిన్ను వరింపదు. నీ కింకను వశపడలేదు. ఎన్నఁడును వశపడదు. మాకోట కొమ్మలపై మీాచంద్రధ్వజములు నెలకొల్పినంతమాత్రమున విజయలక్ష్మి సమాలింగితుండ వైతి నని గర్వింపకుము! అదుగో! మాస్వరాజ్య లక్ష్మి మాకడనే యున్నది. ఏతత్పర్వతప్రాంత కాంతారాంతర విహారయోగ్యంబగు వేషంబుతో స్వాతంత్ర్య సింహాసనంబున సుఖాసీనయై నిండుకొలువుండి. కన్నులున్న వారి కెల్లఁ బ్రత్యక్షదర్శనం బొసఁగుచున్నది! సావధానచిత్తయై కమల కల్హార సుధాసార నీహార వారిపూరంబు లగు కాసారతీరంబులఁ యందలి నీలకంఠకలకంఠకల వింక శుక కీర కలాలాపంబులఁ జిత్తగింపుచున్నది. చతుర్ముఖ ముఖగహ్వరాంతర్వినిర్గళదోంకారంబునుంబోలు మరంధ్రఘోష

మదవదిందిందిరఝంకారంబు లవధరింపుచున్నది. నిజోదగ్రశిఖరప్రచుంబితాంబరంబులై సకలధాతు నిర్ఝరసమాక్రాంతసానుమంతంబులగు నీసానుమంతంబుల మందహాసభాసురంబగు ముఖారవింద మెత్తి క్రేఁగంట విలోకించుచున్నది! మందగంధవహుండు సమర్పించుకొనుచుండు నిర్మల వాహినీ శీతల శీకరపరంపరాతారహారము లంగీకరించుచున్నది. వివిధౌషధీరత్నప్రభాభాసమానంబులగు నీ ధరాధర కందర సుందర మందిరముల సదా విహార మొనర్చుచుఁ బూర్వముకంటెను నధిక సౌందర్య సౌకుమార్య లావణ్యాదుల విరాజిల్లుచున్నది. దుర్గమంబులగు నీపర్వతగుహాలే దుర్గంబులుగ, అననుగమ్యంబులగు నీయరణ్యభూములే రణభూములుగ, మే మేలుచున్న యీనూతన రాజ్యమును నీ వెట్లు భేదింపఁగలవు? .........

................................ అక్బర్!

నీసైనికులచే మమ్మెంతకాలము వెంటఁ దరిమించెదవు? తఱిమించి యేమిపడయఁగలవు? ఇన్నికోట లాక్రమించుకొని యిదివఱకే మనుభవించితివి? సకల పల్లీపట్టణ దుర్గగ్రామములయందును గల ప్రసిద్ధరాజకుటుంబము లెన్నియో మా సైన్యములోనే చేరుకొనినవి. తక్కిన రాజపుత్రకుటుంబములనుగూడఁ గొలఁది కాలములోనే మా కొండరాజ్యమునకుఁ గొనివచ్చి, నీవు జయించుకొన్న మేవాడరాజ్యభాగమంతయు నిర్మానుష్యము గావించెదను. కడకు గ్రామమున కొక



యింటియందైన దీపము వెలిఁగించువారు లేకుండ, కోటలయందును, పేటలయందును బట్టపగలే కొఱవిదయ్యములచే నాట్యమాడించెదను. ఆపిశాచములనుండియే నీ వికఁ గప్పము లాసించు చుండవలయును. నిశాతకంటక తరుశాఖావికీర్యమాణ సూర్యాతపంబు లగు మహారణ్యములు పెరిగి, బక కాక ఘూక గృధ్ర గండభేరుండములకును, గండక వేదండ వరాహ వ్యాఘ్ర భల్లుక లులాయక సృగాలంబులకును నాలవాలంబులై యూరులును, దారులును రూపురేఖలు లేకుండఁ జేసెదను. ఆ యడవిమృగములనే నీ వికఁ బరిపాలించుచుండవలయును. స్వాతంత్ర్య సంరక్షణమునకై నాజన్మభూమిని నాసుందర మేవాడభూమిని గడకు స్మశానభూమిగా నొనరించి, యందుండి నీఖజానా కొక చిల్లిగవ్వ యేనియుఁ జెల్లనీయను. ... ... ... ... ఆహా! తల్లీ! మేవాడమాతా! నన్ను క్షమింపుము! ఇట్టి వికృతాకారమును నీకుఁ గల్పించు నన్ను క్షమింపుము! స్వాతంత్ర్య సింహాసన భ్రష్టత్వము నీకుఁ గలుగకుండుటకు నే నేమి చేసినను క్షమింపుము! కాలము తప్పివచ్చినది! ఇంచుక యోదార్చుకొనుము. పరవీర మారణ క్రియాచణంబగు 'చండికా' ఖడ్గంబునుదాల్చి—యుచ్చైశ్శ్రవాపరావతారంబగు 'కైటక' తురంగంబు నెక్కి—సంగ్రామ మధ్యంబున దుర్మదాంధ పరిపంధి సందోహంబుల నెల్లఁ జంచి చెండాడి- సంపూర్ణ విజ

యానందమున నిన్ను యథాక్రమంబుగ నిఖిల వైభవంబులతో—సమస్తైశ్వర్యములతో—సకలాలంకారములతో నలంకరించెదను! తప్పక యలంకరించెదను! ఏనాటికైన నలంకరించి తీరెదను! అమ్మా! నాజీవిత కాలములో నాకిది యసాధ్యంబయ్యెనా నీకీ వికృతాకృతియే మేలు! మొగలాయిలకుఁ జరణచేటికవై యుండుటకంటె శ్మశానవాటికపై యుండుటయే మేలు! ... ... ... ”

అని పరిపరి విధంబులఁ దనలోఁ దలంచుకొనుచు, ఆకలిబాధచే నేడ్చియేడ్చి తన భుజముపై నిద్రించుచుండిన ‘అంబా’ బాలిక నొకచేత జోకొట్టుచు నుదయపుర ప్రాంత కాంతారాంతరమునఁ జుట్టును జిన్నచిన్న గుట్టలు గల వటవృక్షముక్రింద నొకనాటి సాయంసమయారంభమునఁ బ్రతాపసింహుఁడు పచారుసేయుచుండెను. ఆ మఱ్ఱిచెట్టు నకువలెనే యాతనికినిఁ దలనిండ జడలు వ్రేలాడుచుండెను. తత్తరుశాఖలంబోలి యాతని బాహువులును గడు దీర్ఘములైనవి. అమ్మహీరుహావరణంబును నాతని వక్షంబునుగూడ మిక్కిలి విశాలమైనవియే. చిరంతన వనవాస సూచకంబగు గంభీరాకార ముభయత్ర గానవచ్చుచుండెను. ఆకసమున వలయాకారముగఁ దిరిగి తిరిగి వచ్చి వ్రాలిన తెల్లని కొంగల బారులతో రంగారుచు, సంజకెంజాయలం గ్రొంజాయ వహించిన తచ్ఛాఖాసముదాయంబును, ధవళయజ్ఞోపవీతోపేతంబై



పగలెల్ల నెండవేడిమిం గడుంగడుం గందిన నాతని కాయంబును; మఱింత స్వరూప సామ్యము నొందుచుండెను. మోకాళ్ళవఱకు వ్రేలాడు జేగురురంగు నారగుడ్డ ‘లుంగీ’ గా ధరించి-స్వరాజ్య నిర్మాణ పర్యంత దీక్షానియమంబులలో నొక్కటియైన చిక్కని గడ్డంబుతోఁ బ్రతాపసింహుఁడు సర్వరాజర్షి లక్షణ లక్షితుండై కానవచ్చుచుండెను. శరత్కాల చంద్రసఖంబగు ముఖంబుపై ముంగురులు ముద్దుగొలుపుచుండ, గండు తుమ్మెదలం బోలు కన్నులనుండి గారు కన్నీరు పాలబుగ్గలనుండి తన భుజములపై జారుచుండ, మలమల మాడుచుండిన కడుపుతో ‘బువ్వాబువ్వా’ యని యేడ్చిన తన కుమారికనెడమచేత నెత్తికొని కుడిచేత వీపుపై జోకొట్టుచుఁ బిచ్చిపట్టినట్లు లమ్మహానీయుఁడా చెట్టుక్రింద నిటునటు దిరుగుచుండెను.

ఆశ్రమానికిఁ బదిబారల దూరంబుననే గుడిసెవలెనమరి యుండిన రెండు గుట్టల నడుమ నెదురుగాలి కడ్డముగ నొకచాప వ్రేలాడఁగట్టి యందుఁ బ్రతాపసింహుని పట్టమహిషి వంట సేయుచుండెను. ఎండుటాకులు సన్నని చిదుకులు సేరితెచ్చి కొందఱు భిల్లులాచాపక్రింద నుండి లోనికిఁ దోసివేయుచుండిరి. ఆగుట్టల చుట్టును బఱచి యుండిన ఱాపలపై మఱికొందఱు భిల్లులాయాసము దీర విశ్రమించుచుండిరి. చెమటచేఁ దడిసి యలసి సొలసి యున్న గుడ్డములు కట్టిన.. జీనుల

తోడను- వ్రేలాడు కళ్ళెములతోడను—సమీపముననే యు త్యాతురతతోఁ బచ్చిక మేయుచున్నవి. ఇంచుమించుగ నిరువదిమంది వఱకుఁ గల యాభిల్లులలో నొక్కొక్కనికడ నొక్కొక బల్లెమును నొక్కొక కత్తియుఁ గలవు. బుట్టలు—తట్టలు—చాపచుట్టలు—మూటలు—కుండలు—నేలఁబడియున్న—చేదుత్రాళ్ళ కావడిబద్దలును దప్ప మనమచ్చటఁ జూడఁదగిన వింకేమియును లేవు. ఆవంటగుట్టలకుఁ గట్టెదుటనేయున్న చెట్టుకొమ్మకు వ్రేలాడఁ గట్టఁబడిన యుయ్యాలలో నొక శిశువు నిద్రించుచుండెను. ఆచెంతనే యొక భిల్లకాంత విస్తరాకులు కుట్టుచుఁ గూర్చుండి శిశువు కదలినప్పుడెల్ల నుయ్యెల నూపుచుండెను. ఆ యుయ్యెలకుఁ బ్రక్కనే మఱియొక కొమ్మకు వ్రేలాడుచుండిన పొడవైన వెదురుబుట్టలో రెండేండ్ల యీడుగల బాలుఁడొకఁడు పాపము సొమ్మసిల్లినట్లు పడియుండెను. వానివంకఁ జూచువారే లేకపోయిరి. ఆహా! ఇదంతయుఁ ప్రతాపసింహునివంటి మహారాజు సంతానమునకుఁ గలిగిన దుర్గతి!

చక్రవర్తిచే బంపఁబడి యాసఫ్‌ఖానుఁ డుదయపురారణ్యములలోఁ బ్రవేశించిన యీ యారుమాసములనుండియుఁ గూడఁ బ్రతాపసింహుఁడు తన కుటుంబముతో నెంతెంతకష్టములో యనుభవించుచుండెను. పులులు వసించు పొదలు సింగంబులుండు గుహాంతరములును దఱుచుగ నామహారాజు



నకు విడిదులగుచుండెను. ఇట్లు సదా మహారణ్య మృగమధ్యంబుననే నివసించుచుండు వాఁడగుట నయ్యడవిమృగంబులవలెనే యాతఁడును బొంచియుండుటయు వంచించుటయుఁ దగిన యదనెఱింగి తటాలున శత్రువులపైకి దుముకుటయు మొదలగు లక్షణము లభ్యసించెను. ఒకప్పుడు రాణా, చాలదూరమున నున్నాఁడను వదంతి పుట్టించి - యందువలన నిర్భయముగ సాగుచుండు మొగలాయిసేనలపై నాకస్మికముగఁ బొదపొదలనుండియు—మూలమూలనుండియుఁ దన సైనికులచే బాణవర్షమును గురియించుచుఁ నతఁడు భంగపఱచుచుండెను.

*ఈవిధముగ వారిం దప్పుదారులఁ బెట్టుచు నొకమాఱు ప్రతాపుఁడు మొగల్ సేనలలో నొక పెద్దభాగమునే పట్టుకొని నిశ్శేషముగ సంహరించెను. వనవాసులగు భిల్లులు విధేయులై మిత్రులై వానికి గన్నులట్లు చెవులట్లు నుపచరించిరి. ఒకానొకప్పుడతఁడు పలాయితుఁడగుటకు వీలులేనపుడు దైవమే వానికి సాయముఁ జేయుచునచ్చె. అదియెట్లన, నయ్యడవిలో నాకస్మికముగఁ గాఱుమబ్బులుపొడమ, జడివానలు దిమ్మరించి మొత్తుచుండును. అందుచే వాఁగులు, నేఱులు, కొండకాలువలు నిండి మార్గ మరికట్టుటయె గాక దేశమంతయు జలమయమైయుండును. చక్రవర్తిసైన్యము లాకారణమునఁ బ్రతాపసింహుని విడువవలసి వచ్చుచుండును.

* రాజస్థాన కథావళి— పే 150 చి-లం-న.

ప్రతాపుఁ డెక్కడనున్న నక్కడనే యాతని కొలువుండును. రాజ్యపరిపాలనము సేయుచున్నప్పుడు భ్రష్టుఁడై తిరుగుచున్నప్పుడు గృహమునం దున్నప్పుడు, గహనమునం దున్నప్పుడు గూడఁ బ్రతాపుఁడు రాచరికమే చేయుచుండెను. సింహాసనముమీఁద నున్నప్పు డెంత గౌరవమో నిరాధారముగఁ జెట్టుక్రిందఁ గూర్చున్నపుడు వానియెడ వాని యనుచరులకంతే గౌరవ ముండెను. చెట్లనుండి కోసినపండ్లు—బీడుగడ్డితోఁ జేసిన రొట్టె తప్ప వారికి వేరాహారమేదియు లేదు. రాణా తనకొలఁదియాహారములోనుండి యొక భాగమును దీసి దయతో సేనాధిపతికైన నిచ్చెనేని తొల్లి మహదైశ్వర్య సంపన్నులైననాడు దయచే నిచ్చినబహుమానముల కెంత సంతసించుచువచ్చెనో యిప్పుడు నతఁడంతియ సంతసమొందుచుండును. కడుపునిండఁ గూడులేక, కట్ట సరియైన గుడ్డలేక, తలఁ దాచుకొనుటకుఁ దావులేక యరచేతఁ బ్రాణము లుంచుకొని యొకయడవినుండి యొకయడవికిఁ దిరుగు నాశూరశిఖామణులవద్దఁ గనఁబడు పరస్పరప్రేమము, గౌరవము వేఱొండు తావునఁ గనఁబడుట యరిది. అతని యనుచరు లీ కష్టములఁ బడుటకంటెఁ జక్రవర్తికి లోబడితి మని యొక్కమాట నోట నుచ్చరించినఁ జాలు. వెంటనే వారి కేలుట కూళ్ళు—నడుపుటకు సేనలు—వహించుటకు బిరుదులు కావలసినన్ని వచ్చిపడియుండును. కాని యైశ్వర్యము రానీ—రాకపోనీ—యున్న



ముండనీ— లేకపోనీ వా రామాట మాత్ర మనరు. రాణా వారియెడ దయగా నున్నన్నినాళ్లు వారు వానియెడఁ గృతజ్ఞులైయుందురు. ఈ కష్టములకు, నపాయములకుఁ దోడుగఁ బ్రతాపుని యాలుబిడ్డలును వానియొద్దనే యుండవలసివచ్చినది. బంగరుతొట్లలో నూగవలసిన యా మహారాజుచిన్నిపాపలు చెట్లకొమ్మలకు వ్రేలఁగట్టిన గుడ్డయుయ్యెలలో నూగవలసి వచ్చె. ఒకప్పుడు మగవారు యుద్ధములకుఁ బోయిన సమయమునను, నాడువాండ్రు పగతురకు జంకి పొదలలో దాగొన్న సమయమునను, జిన్నబిడ్డలను బులులు తీసికొని పోకుండ బుట్టలలోఁ బెట్టి చెట్లకొమ్మలకుఁ గట్టి వేయుచుందురు. శత్రుభీతిచే మగవాండ్రు నాడువాండ్రు పరుగులెత్తవలసివచ్చినప్పు డొకమాఱు ప్రతాపుఁడు తన బిడ్డలను దనతోఁ దీసికొనిపోవుటకు వీలులేకపోయెను. అప్పుడు భిల్లులు కొందఱు కనికరము పూని, యా శిశువులను గంపలలోఁ బెట్టి తీసికొనిపోయి తగరపు గనులలో దాచి శత్రువులు దాటిపోవువఱకుఁ బాలుపోసి పెంచి మఱలఁ దలిదండ్రుల కప్పజెప్పిరి."

ఆనాడు ప్రతాపసింహుఁ డట్టి యవస్థతోడనే సకుటుంబముగ నా చెట్టుక్రిందకుఁ బరుగెత్తి వచ్చెను. అప్పటికొకమాసముదినములనుండి యాసఫ్‌ఖానుఁడు తత్పూర్వముకంటెను నతితీవ్రముగఁ బోరాడుచుండిన వాఁ డగుటచేత, నా నెలదినములనుండియుఁ బ్రతాపుఁ డాలిబిడ్డలతో నొక్క

క్షణమైన నొకచో నిర్భయముగా నుండు యోగ్యత లేక, పడరానిపాట్లు పడుచుండెను. తమ తమ రాజ్యములు, తమ తమ కుటుంబములు, తమతమ యైశ్వర్యములు సంపూర్ణముగ విడిచి, స్వరాజ్యరక్షాదీక్షా దక్షుండైన ప్రతాపు ననుసరించిన రాజపుత్రులు రాజపుత్రసేనలతోడను భిల్లసేనలతోడను శత్రుసేనలపైఁబడి పోరాడుచు నసంఖ్యములగు శత్రుసేనల విజృంభణము నడపలేక యుపద్రవము కలుగునని యనుమానము కలిగినప్పుడెల్లఁ దక్షణమే కుటుంబముతోఁ దొలంగిపోవలయునని రాణాకుఁ గబురంపుచుండిరి. తోడనే నిద్రించుచున్న బిడ్డ నిద్రింపకుండ—పాలు త్రాగుచుండిన శిశువు పాలు త్రాగకుండ—రాణా తనకుటుంబ రక్షణార్థమై యచ్చట నుండి పాఱిపోవుచుండెను. మొన్న మొన్నటివఱకును రాణా తానును రణరంగములయందే విహరించుచుండెను గాని, తన సేనలోఁ జాలభాగము క్షీణించిపోవుటచేతను, తన కుటుంబ రక్షణము కొఱ కేర్పడిన యైదువందల సైనికులను గూడ యుద్ధమునకుఁ బంపవలసివచ్చుటచేతను, తా నాలిబిడ్డలకడ నుండవలసి వచ్చినది.

ఉదయపుర రాజ్యారణ్యములలో దండు విడిసి చాల కాలమగుటయు, రాజపుత్ర భిల్లసైనికుల వాడికోలలపాలై మొగలాయిసైనికు లనేకులు గతించుటయు, వచ్చినకార్యమును జెచ్చెర నిర్వహించుకొని యాగ్రాపట్టణమునకుఁ దిరిగి



పోవలయుననియు—ప్రతాపసింహునిఁబట్టి చక్రవర్తి కప్పగించి-లావాదుర్గముతోఁబాటు చిత్తూరుదుర్గమునుగూడ సంపాదింపవలయు ననియు— అసఫ్ఖానుఁడు నిశ్చయించి, రాత్రియనక పగలనక యెండయనక వానయనక ధర్మమనక యధర్మమనక యుక్తమనక యయుక్తమనక పెట్టరాని కష్టములఁ బెట్టుచు రాజపుత్రుల వెంటఁదఱుముచుండెను. అట్లు వెంటఁదఱుముచుండుటచేతనే యానాఁడు ప్రతాపసింహునకును వానికుటుంబమునకును గూడ నుదయారంభమునుండియు నొక్కమాత్రైనను భోజనమే లేదు. ఆనాటి యుదయమునఁ బ్రతాపుని పట్టమహిషియగు పాటేశ్వరి పెందలకడనే బిడ్డలకును భర్తకును వంటకము చేసిపెట్టవలయునని, యెట్టిదుర్ముహూర్తమునఁ జంద్రభాగానదీజలంబుల గొనివచ్చినదో కాని వంట సిద్ధమగుసరికి 'మహోపద్రవము! మహోపద్రవము! తక్షణమే తొలఁగిపోవలె' నని భిల్లచారులు కేకలు వేయుచుఁ బఱుగెత్తివచ్చి చెప్పుటచేత వారందఱా వంటకము నట్లేవిడిచి పాఱిపోవలసినవారైరి. అట్లు మూఁడుమైళ్ళవరకుఁ బఱువెత్తిపోయి, యాకీకారణ్యములో నొకరహస్యప్రదేశమున నాగి మఱల వంట ప్రారంభించిరి. కానియప్పుడును నట్టియాటంకమే కలిగినది. మూఁడవసారి వంటయు నిష్ప్రయోజన మైనది. నాలవసారి వంటయుఁ బ్రాప్తము లేకపోయినది. ఇట్లు పగలెల్ల నెండవేడిమిలో మిక్కిలి యలసిసొలసి, చంటిపాపకుఁ బాలిచ్చుటకేని

వీలు చిక్కక, మలమల మాడుచుండిన పసిబిడ్డలపాట్లు చూచి యూరక దుఃఖించుచు, నలునివెంట నేగిన దమయంతికంటెను, హరిశ్చంద్రువెంటనంటిన చంద్రమతికంటెను మహాపతివ్రత యనందగిన పాటేశ్వరి భర్తతోఁగూడ సాయంకాలమున కాచెట్టుక్రిందఁ జేరుకొనెను. ఇప్పు డా సాధ్వీమణి వండుచున్న దైవవవంట !!!

---

## పదునేడవ ప్రకరణము.



### వ్యవధి లేదు.

ఆనాటిసాయంకాలమున నా వటవృక్షముక్రిందఁ ప్రతాపుఁడట్లు పచారు సేయుచుండ, గొంచెము సేపునకు భుజముపై నున్న బాలిక యించుక కదలినట్లయినది. ఆమె మేలుకొని మఱల రోదనమును బ్రారంభించినయెడల నోదార్పఁ గలుగుట యసాధ్యమని యెంచి త్వరలో వంటసేయుమని భార్యను దొందర వెట్టుటకుఁ గాఁబోలు పచారుసేయుచుండిన ప్రతాపసింహుఁడు వంటగుట్టలకడకు వచ్చెను. లోన దట్టముగఁ గ్రమ్ముకొనిన పొగయం దుండఁజాలక, యెఱ్ఱవారిన మొగమును వంచుకొని నీరుగారు కన్నులు నులుముకొనుచు నెదురుగాలి కడ్డుగఁ గట్టఁబడిన చాప తప్పించుకొని పాటేశ్వరియు నీవలకు వచ్చెను. దారిద్ర్యసూచకంబుగ



నామె యవయవము లెంత శుష్కించి యుండినను, భవిష్యత్సామ్రాజ్య లక్ష్మీకళ లామె ముఖమునందును గన్నులయందును బ్రత్యక్షముగఁ గానవచ్చుచున్నవి. పాపము మంగళసూత్రము తప్ప నెట్టి యాభరణములును లేని యామె బంగారు శరీరమున నామెధరించిన జేగురురంగు నారచీరయే వేయి మణిభూషణములపెట్టు. ఆ పాతివ్రత్యమే యామెకు సామ్రాజ్యైశ్వర్యము. ఆ నిర్మల దేశభక్తియే యామెకు బ్రహ్మానందము. చిత్తూరు రాజధాని విడిచి యనేక సంవత్సరములనుండి పాటేశ్వరి భర్తవెంటఁ బర్వతారణ్యముల యందే సంచరించుచుండినను బ్రస్తుతము నొందుచుండిన కష్టములుమాత్ర మెన్నఁడును బొంది యెఱుఁగదు. ఒక్క కోటయైన లేకుండఁ బ్రతాపసింహుఁ డిదివర కెన్నఁడును నిరాధారుఁడై యుండలేదు. ఆసఫ్‌ఖానుఁడు దండెత్తి వచ్చిన యీ యారుమాసములలో నతఁడు తనస్వాధీనములోనున్న కొలఁదిదుర్గములను గోలుపోవుటచేఁ బాపము పాటేశ్వరి యిప్పుడు నిలువనీడలేక తన పసిపిల్లలతోఁ గూడ నొక్కొక్కప్పుడు పల్లెలయందును నొక్కొక్కప్పుడు గుహలయందును, నొక్కొక్కప్పుడు చెట్లక్రిందను నివసించుచుఁ బడయురాని కష్టములు పడయుచుండెను.

వంటగుట్టలనుండి వెలుపలికి వచ్చినతోడనే యాసాధ్వీమణి భర్తనుజూచి యిట్లు ప్రసంగింపఁ దొడఁగెను.

"అంబ నిద్రపోయినది కాఁబోలు!"

"ఆకలిచే నేడ్చియేడ్చి యిప్పుడే నిద్రపోయినది. వంటయగుచున్నదా?"

"అగుచున్నది గాని ప్రాప్తమున్నదో లేదో? ఇప్పటికి నాలుగువంటలైనవి, ఈవంటకూడ దక్కనియెడల నేటిరాత్రి పసిపిల్లలగతి యేమి? తెల్లవారుసరి కూపిరియుండునో లేదో! ఉదయమునుండియు మనతోఁగూడఁ దీవ్రమగు నెండవేడిమిలో మలమలమాడి సొమ్మసిల్లిన యీపసికూనలు రాత్రియైనను జల్లవడిన కడుపులతో హాయిగ నిద్రింపఁగలరో లేదో? ఇచ్చిన పచ్చికాయలనెల్ల నమలుచు దారిపొడవునఁ గంటఁబడిన బావిలోనెల్ల నీరుద్రావుచు, ప్రొద్దుననుండియు మన యంబ క్షుద్బాధచేఁ బడుచుండిన క్షోభ తలంచుకొన నా కడుపు దహించుకొనిపోవుచున్నది. ప్రాణేశ్వరా! ఏమిసాధనము? ఈ యాసఫ్‌ఖానుని దాడి యిల్లెంతకాలముండును? ఇంకెంతని భరింపఁగలము? ఏమిదారి? ఏదైన నుపాయమాలోచించిరా?"

ప్రతాపసింహుఁడు దీనవదనుఁడై కొంచెముసేపూరకుండి యొక నిట్టూర్పు విడిచి——

"ఆలోచించుట కేమి యుపాయమున్నది? పరమేశ్వర యనుగ్రహము తప్పినప్పుడు మన యుపాయము లేమియుఁ బనికిరావు."



"పనికిరావని యూరకుండఁగలమా? పిల్లలు బ్రదుకు సాధనము చూడవలదా?"

"ఇదిగో! ఆసఫ్‌ఖానుని విజృంభణము కొంచె మడఁగినంతనే రహస్యముగ నేపల్లెయందో నీవును నీపిల్లలును గూడఁ గొంతకాలము సుఖముగ నుండు నేర్పాటు చేసెదను."

"నాసుఖము మాట కేమి? ఈ విజృంభణ మడఁగువఱకు వీరు జీవించెదరా? ప్రాణేశ్వరా! ఈయంబ యేడుపు నేను జూడలేను. నా కేమిదారి?"

అని దుఃఖమును నాపుకొనలేక వలవల నేడ్చుచు నొకమాఱు వంటచూచుకొనుటకు లోనికిఁ బోయెను. పసిపిల్లల దురవస్థం దలంచి— భార్యయేడుపుఁ జూచి పాపము ప్రతాపసింహుఁడుగూడ ధైర్యముచెడి కంటనీరుపెట్టుకొనసాగెను. కొంచెము సేపులోనే పాటేశ్వరి మఱల వచ్చినది.

"చావో బ్రతుకో యీసమయములో నందఱ మొకచో నుండకుండ నబ్బాయి దాటిపోయినాఁడు. వాఁడు కంటఁబడువఱకు.—"

"అబ్బాయి కేమిభయము? మనకంటె వాఁ డదృష్టవంతుఁడే. ఈపఱుగులు నీయుపవాసములు లేకుండ హాయిగా నున్నాఁడు."

"అక్కడనే యున్నాఁడో, సాహసించి బయలుదేరినాఁడో? బయలుదేరెనా, మఱల మనకంటఁ బడుట దుర్లభము."

"ఎప్పుడును బయలు దేరఁడు. . వాఁడు బయలుదేర నెంచినను 'భామాసా' వానిని బయలు దేరనీయఁడు. వట్టియమాయకురాలవుగాని, స్త్రీమోహములోఁ దగులుకొన్నవానికిఁ దల్లిదండ్రులు, నన్నదమ్ములు జ్ఞప్తియుందురా? వారికిఁ దోడు పడవలెనను జ్ఞానము కలుగునా? ఏమియు భయము లేదు. వాఁడచ్చటనే యుండును. నీవు తఱచుగా 'నాథద్వారము' నకుఁ బోవుచుండవలదని నేనెన్నిమాఱులు బోధించినను, వాఁడేదో మిష కల్పించుకొని- యుప్పుగావలెను- పప్పులు తేవలెను- బట్టలు కొనవలెను- అని నన్ను నమ్మించి యాకన్యకొఱకుఁ బోవుచుండును. ఇప్పుడు శత్రువులు మార్గమరికట్టుట- రాకపోకలకు వీలులేకపోవుట- యమరసింహున కెంతో యనుకూలమైనవి. దుర్మోహమునఁబడి కుమారుఁడును, దురాగ్రహంబునఁ బడి తమ్ముఁడును నాకుఁ బరమశత్రువులైరి. ఒక విధముననే కాదు, మన మన్నివిధముల నిర్భాగ్యులమే!"

"నిజముగా నిర్భాగ్యులమే. ఎంత నిర్భాగ్యులము కాకున్న నొక వ్యభిచారిణికిఁ బుట్టిన కన్యకను మోహించు దుర్బుద్ధి యబ్బాయి కేల కలుగును? ఆకన్యకతల్లికిని భామాసాకును సంబంధమున్నట్లు లోకమంతయుఁ గోడియై కూయుచున్నది. ఇఁకమీఁద మన మా భామాసాతో వ్యవహారము మానివేసిన బాగుండును."

"ఎట్లు మానివేయఁగలము? ఆతఁడుండఁబట్టియే యిన్నాళ్ళు మనయాటలు సాగినవి. కోటలున్నప్పుడు లేనప్పుడు



గూడ సంశయింపక వందలు వేలు ఋణం బొసఁగినాఁడు. అడిగిన దేదియు లేదనఁడు. ఋణ మెట్లుతీరునో యని సంశయింపఁడు. ఆగ్రావర్తకులను గొల్లఁగొట్టి యాసామగ్రిల క్రిందఁ గొంత ఋణము తీర్చితిని. శేషించిన యప్పునుగూర్చి యింత కాలమైనను నోరువిప్పి యడుగలేదు."

ఆమాటలకుఁ బాటేశ్వరి యేమియుఁ బ్రత్యుత్తరమీయక నేల బొటనవ్రేల రాయుచు మొగము వంచుకొని యట్లే నిలిచియుండెను. రాణాయును గొంచెము సేపూరకుండి "నీ వనవసర విచారములలోఁ బడి గుండె బ్రద్దలు చేసికొనకుము. ఏది యెట్లు కానున్నదో యట్లు కాకమానదు. చప్పున వంటకానిమ్ము. మఱియొక్క క్షణమున కేమి వచ్చునో చెప్పలేము. ఈదినమువంటి పాపిష్ఠిదినము మనజీవితములో నెన్నఁడును రాలే" దని పలికెను. పాటేశ్వరియు నందుండక వెంటనే వంటపనిపై మఱల గుట్టలలోని కేగెను. ఆమె కావించిన ప్రసంగము వలనఁ బ్రతాపసింహుని మనసంతయుఁ జెదరిపోయినది. రాజ్యముగోలుపోయిన తరువాత నెన్నియో కష్టములు తటస్థించెను గాని, యంతదీనముగ నామె, భర్తతో నెన్నఁడును బ్రసంగింపలేదు. సమయము వచ్చినప్పుడు తనతో సమానముగ గుఱ్ఱమెక్కి కత్తిపట్టి శత్రువులతోఁ బోరాడవలసిన పాటేశ్వరి - తిండిలేక మలమల మాడుచుండిన పసిపిల్లల దురవస్థ చూడలేకయే నేడింత యధైర్యప్రసంగము గావించిన దని

యనుకొనుచు నేమిచేయుటకుఁ దోచక రాణా పిచ్చిపట్టినట్టు లిటునటు తిరుగుచుండెను.

ఇంతలో నుయ్యాలలో నున్న శిశువులేచి యేడువ నారంభించెను. ఆ యేడుపుచే నిద్రాభంగము నొంది ప్రక్క నున్న వెదురుబుట్టలోని బాలుఁడును లేచి మఱింత రోదనము చేయుచుండెను. ఆ యిరువురి రోదనములును రాణా భుజముపై నిద్రించుచుండిన బాలికను మాత్రము మేలుకొలుపకుండునా? చిన్నపిల్లల నిరువురను జెంతనున్న భిల్లకాంత తీసి చేరియొక ప్రక్క నెత్తుకొని మెల్లఁగా నెగుర వేయుచు, 'వో, వో వో' యని యఱచుచు నూరడించుటకుఁ బ్రయత్నించుచుండెను. తన భుజముపై నేడ్చుచుండిన బాలిక నోదార్చుటకుఁ బ్రతాపుఁడును బ్రయత్నించుచుండెను. పిల్లలు మువ్వురు నొక్కమాటే యేడ్చుచుండుటచేత మతిచెడి మఱలఁ బాళేశ్వరి వెలుపలికి వచ్చినది. వచ్చి పిల్లల నందుకొనఁ బోవుచుండఁగా— ఆహా! పరమేశ్వరుని విలాస మెంత విచిత్రమైనది. సర్వదయాళుండయ్యు నొక్కొక్కప్పుడు దీనుల కెంత కఠిన చిత్తుఁడుగాఁ దోచుచుండును! నిద్రనుండి నో రెండిపోయి లేచిన పిల్లల కడుపులు చల్లపడకుండ— "వచ్చిపడె—వచ్చిపడె -త్వరపడుఁడు! మహారాజా! త్వరపడుఁడు! వ్యవధిలేదు" అని గంభీరస్వరముతోఁ గొండగుహాలు ప్రతిధ్వనించునట్లు పెద్ద బొబ్బలిడుచు, రాజపుత్రులగు నిరువురు రౌతులు పరుగు పరుగున వచ్చి— యల్లంతదూరముననే గుఱ్ఱములనుండి



దిగి రాణాను సమీపించి నమస్కరించి— కట్టెదుట నిలువంబడిరి. ఆభయంకరవార్త వినినతోడనే పిడుగుపడినట్లు దిగులుపడి పాళేశ్వరి భిల్లకాంతచేతనున్న పిల్లలఁ దటాలున నందుకొని బిగ్గరగఁ గౌఁగిలించుకొనెను. చాపలపై నిద్రించుచుండిన భిల్లులెల్లరుఁ దుల్లిపడిలేచి—చాపలు చుట్టువారును మూటలుగట్టువారును నై తత్తరపడుచుండిరి. చెట్లకొమ్మలకుఁ గట్టిన యుయ్యాలలను భిల్లకాంత చప్పుచప్పున విప్పివేయుచుండెను. మఱికొందఱు భిల్లులు చుట్టుప్రక్కల మేయుచుండిన గుఱ్ఱముల నెల్లఁ గొనివచ్చి క్షణమాత్రములో నచ్చట సిద్ధపరచిరి. ప్రయాణ సన్నద్ధులగుచు నింద ఱిన్నివిధములఁ దత్తరపడుచుండఁ బ్రతాపసింహుఁడు మాత్రము మహాపర్వతము వలె లేశమును జలింపక, నిశ్చేష్టితుఁడై కొంతవఱకు నిలిచి, తనకట్టెదుట నున్న రాజపుత్రులం గాంచి— "రాజమల్లా! విక్రమజిత్తూ! మీ రింక నెందు కున్నారు? మీరు వచ్చినపని మిగిలియున్నదా?" యని యడిగెను. ఆమాటలకు విక్రమజిత్తు చేతులుజోడించి భయకంపితంబైన స్వరముతో;—

"మహారాజా! సెలవైనయెడలఁ జిన్న సందేశమున్నది."

"ఎవరి సందేశము?"

"ఆసఫ్ ఖానుని సందేశము—"

"ఏమని?—"

"తనకు వశపడిన ట్లంగీకరించినయెడల—"

"ఛీఛీ! వానినోటికి బుద్ధిచెప్పలేకపోయితివా? ఆ నీచుని నాలుక యింతలింతలుగా ఖండింపక ప్రత్యేకముగ నీరాయబారమును మోసికొని వచ్చుటకు నీకు లజ్జ లేకపోయెనా? లెండు! నాయెదుట నుండక మీ రిరువురునుగూడ వెంటనే బయలుదేరిపొండు! రాజమల్లూ! శత్రుసైన్య మెంతదూరమున నుండును."

"మహాప్రభూ! ఇప్పటికి మూఁడుమైళ్ళ దూరములో నుండును. ఏలినవారు త్వరపడవలయును. వ్యవధిలేదు."

## పదునెనిమిదవ ప్రకరణము.

### మహారణ్య పర్యటనము.

సూర్యాస్తమయ మైనది. మాతృదేశ స్వాతంత్ర్య సంరక్షణమునందు బద్ధకంకణులైన మహాత్ములకా యిట్టి యనివార్యకష్టపరంపరలు విధించెద వని విరిఞ్చినిఁ బ్రశ్నించుటకుఁ గాఁబోలు లోకబాంధవుఁడు తన కోపకషాయదీధితులు దిక్కులఁ బిక్కటిల్ల నిష్క్రమించెను. ఉత్తమప్రభుత్వానంతరమ్మునఁ గ్రమ్ము దురాచారమ్ములువోలె నంధకార మెల్లయెడలఁ గ్రమ్ముకొన దొడంగెను. వేలకొలంది విహంగకులంబులు బారులుగట్టి గగనమార్గమున వలసపోవున ట్లెందేనియుఁ బోవంబొచ్చె.



నాటిరాత్రి కటికచీఁకటి నటిగా సమయసూత్రధారుఁడు భయానకరసప్రధానంబగు విషాదాంతనాటక ప్రదర్శనమును బ్రారంభించెను. ఆనాటకమునకు భయావహంబులగు కొండలు గుహలు గుట్టలు గట్టులు మిట్టలు చెట్టులు దప్ప జనసంచార సూచకంబులగు ప్రదేశములు చుట్టుపట్టుల నేతట్టునం గానరాని యుదయపురప్రాంత కాంతారాంతర సీమలే రంగస్థలంబులు. పొదలచాటునుండియు భూరంధ్రములనుండియు సృగాలములు బహువిధసంకుల నిస్వనంబుల నాందికార్యమును నిర్వహించినవి. నేపథ్యమునుండి గిరిగుహాకుహరాంతర సుప్తోత్థశార్దూలాది భీకరారణ్య మృగభయంకరారావములు గుండెలు బ్రద్దలు సేయుచుండెను. విష్కంభపాత్రలంబోలె బెబ్బులులరణ్య వీథులయం దొండొంటికెదురై పరస్పరముఖస్పర్శనమును గావించుకొనుచు, "రాజ్యభ్రష్టులై పరతంత్రవృత్తి నేవగించి యాలుబిడ్డలతోఁ గూడ మనయరణ్యములకు వలసవచ్చి కొందఱు దేశీయనాయకులు శత్రుభీతిచే నిగూఢవృత్తి నిందు సంచరించుచున్నారు. ఓ నెచ్చెలి పులికొదమలారా! స్వాతంత్ర్య సంపాదనార్థము వినియోగించుచుండిన వారి రక్తమాంసములను మన మాసింపవచ్చునా, కూడదా" యని కాఁబోలు ప్రసంగించుకొనుచున్నవి! విష్కంభానంతరమున నందు సూచింపఁబడినట్లే, తద్విషాదాంత నాటక కథానాయకుండును మన కథానాయకుఁడును మేవాడదేశనాయకుఁడును

నగు ప్రతాపసింహుఁడు తురంగారూఢుఁడై, తురంగారూఢులైన పరివారజనములతో నక్కాంతారాంతరరంగమునఁ బ్రవేశించి పరిక్రమించుచుండెను.

ఎడమచేతులయందు గుఱ్ఱపుఁ గళ్ళెములును, కుడిచేతులయం దెత్తిపట్టుకొనిన పొడవైన దివిటీలును గలిగి ముందుగా నైదుగురు భిల్లులు సాగుచుండిరి. భగభగ మండుచుండిన వారి దివటీలమంట లాపరివారమున కెల్ల వలసినంత వెలుంగు నొసంగుచుండెను. ఇంకొక యేవురు భిల్లులు కటారులు సీటెలు మున్నగు సాధనములతో ముందువారి ననుసరించియే తమ గుఱ్ఱములు నడిపించుచుండిరి. వారివెనుక నొక యాశ్వికుఁడును నిరువురాశ్వికురాండ్రును నొకరిప్రక్క నొకరు వరుసగ వచ్చుచుండిరి. నడుమనున్న పాటేశ్వరికిఁ గుడివైపున వచ్చుచుండిన రౌతు ప్రతాపసింహుఁడు. ఎడమవైపున వచ్చుచున్నది భిల్లకాంత. శిశువును బాటేశ్వరియు, బాలకుని భిల్లకాంతయుఁ దమకడుపులపై నెడమ భుజమునుండి కుడి ప్రక్కవఱకుఁ జేరవేసికొని యెఱుకరాండ్రతెఱంగునఁ జీరకొంగులతో భద్రముగ నుయ్యాల కట్టుకట్టి కడుజాగరూకతతోఁ గాపాడుచుండిరి. గర్భము వెలువడి వచ్చినను, మహాకష్టభూయిష్ఠులైన తల్లిదండ్రులప్రావు నిరాశ చేసికొని, నిమీలితలోచనులై పరమేశ్వరుని ధ్యానించుచుండిరో యనఁ బాపమా పసిపాపలిరువురును వేటకట్టులంబోలు చేలాంచలబంధ



నంబులయందుఁ గరచరణంబులు ముడుచుకొని వెల్లకిలఁ బరుండి నిద్రించుచు గర్భాంతరస్థితావస్థను స్ఫురింపఁజేయుచుండిరి. ఇంక మిగిలిన యంబాబాలిక ప్రతాపసింహునికడనే యుండెను. ఆమె రారాపులను దల్లి భరింపలేదు. కడుపునిండ మాటలే. ఆమాటలకెల్లఁ దండ్రియే ప్రత్యుత్తర మిచ్చుచుండవలెను. లేదా పినతండ్రి సమాధానము చెప్పుచుండవలెను. కాని జగమల్లు వెడలిపోయినప్పటినుండియుఁ గూడఁ బాపమా బాలికకు ముద్దుముచ్చటలయందును, సంరక్షణమునందును గొంతకొరంత గలిగిన దనియే చెప్పవచ్చును. ఆనాఁ డామె కైటకముపై గట్టఁబడిన వెదురు బుట్టలోఁ గూర్చుండి వెనుకనున్న తండ్రికడుపు నానుకొని ప్రక్కవాలుపు మొగంబుతో నిద్రించుచున్నది. విశాలముగఁ గూర్చుండుటకుమాత్రమే యాబుట్ట తగియున్నదికాని పండుకొనుటకుఁ జాలదు. నాలుగైదేండ్ల బాలిక పండుకొనుటకుఁ దగినంత బుట్టను గుఱ్ఱముపైఁ గట్టియుంచుటయు నసాధ్యమే. ఆచిన్నబుట్టయైనను దురంగగమనవేగంబున నిటు నటు నొరిగిపోకుండ నడుగునుండియుఁ మీఁదనుండియుఁ బ్రక్కలనుండియుఁ గూడఁ దోలుపట్టెలతో భద్రముగఁ జుట్టఁబడి గుఱ్ఱమునకు మెడక్రిందను నడుముక్రిందను గట్టిగ ముడివేయఁబడినది. ఆబుట్టలో నట్టడుగున గడ్డియు, గడ్డిపై నొక బట్టయు వేయఁబడియుండుటచేత రాయిడివలని గఱుకుతనంబులేక యంబా

బాలిక యందు సుఖాసీనయయియే యుండెను. గుఱ్ఱపుఁ బఱుగువలని కుదుపుచే నామె తుళ్లిపడి నేలఁబడకుండ, కళ్ళెమును బూనిన తన యెడమచేతి నాబాలికకడుపునంజేర్చి ప్రతాపసింహుడు కడుజాగరూకతతో నంటి పట్టుకొనియే యుండెను.

ఆహా! నాఁటిసాయంకాలమున క్షుద్బాధాతిశయమున నాబాలిక వచ్చియు రాని ముద్దుమాటలతో నేడ్చుచుండగనే యట్లు గుఱ్ఱముపై బలవంతముగఁ జేర్పఁబడినది. ఆతల్లిదండ్రు లెంతటి కఠినచిత్తులు! తల్లిదండ్రులు కాదు, పరమేశ్వరుఁడే కఠినచిత్తుఁడు. అట్టి ప్రాణోపద్రవసమయంబున వారంతకంటె నేమిచేయఁగలరు? గమనవేగంబునఁ గాలికి ఱాయియో అప్పయో తగిలి కుంటువడి యాగుఱ్ఱ మొకించుక ముందునకుఁ గ్రుంకినప్పుడెల్ల నాబాలిక తుళ్ళిపడుచు మేలుకొనుచు 'బాబాజీ' యని యొకమారును, 'మాతాజీ' యని యొక మాఱును, తల్లిదండ్రులను బిలుచుచు నేడ్చుచుండెను. "కాల్లు నొప్పెత్తాయందీ బాబాజీ! ఒక్కమా లెత్తుకొందీ!" యని యొకమాఱును — "బొబ్బ తాతానందీ" యని యొకమాఱును — "మాతాజీ దగ్గిల బజ్జుకుంతానందీ" యని యొకమాఱును — "ఆకలేత్తుంతే మలి యెలాగందీ" యని యొకమాఱును — "తతాజీ దగ్గిలి కెలిపోతానందీ" యని యొకవాఱును నాఁటిరాత్రి దారిపొడవునఁ బాప మంబ యేడ్చుచునే యున్నది, 'చచాజీ' యను పదమునకు 'తతాజీ' యనునది బాలికాభాషా రూపాంతరము



ఆమాటకుఁ బినతండ్రి యని యర్థము. ఆమాటలకెల్ల నేవో సమాధానములు చెప్పుచు - మెల్లగఁ బుజ్జగించుచు- బొజ్జపై జోకొట్టుచుఁ గుమారిక నోదార్చుటకును, నోదార్చి నిద్రపట్టించుటకును ప్రతాపుఁడు సర్వవిధములఁ బ్రయత్నించుచుండెను.

పాటేశ్వరికడ నున్న శిశువునకు మూఁడు నాలుగు మాసములకంటె నెక్కుడు వయ సుండదు. భిల్లకాంతకడ నున్న బాలకునకు రెండేండ్లు గడచి మూఁడవయేఁడు నడచుచున్నది. ఆసఫ్ఖానుఁడు దండువిడిసియున్న కష్టకాల మగు నీ యారు మాసములలోనే యుదయించిన యా మగశిశువు మహారాజకుమారుం డయ్యు నాగర్భసంపన్నుఁడుగాక పాప మాగర్భాపన్నుఁడగుచుండెను. ఆశిశు వుదయించినప్పటినుండియుఁ గూడ భిల్లకాంత తనకడ నున్న బాలకునిఁ దన సంరక్షణమునందే యుంచుకొనుచుండెను. దరిద్రావస్థయందే సంతాన సంఘటన మఁట! సంపద లున్నచోట నపత్యరాహిత్యమఁట! ఇవి సర్వేశ్వరుని విచిత్రసంకల్పములు.

ప్రతాపుని పరివారములోని తక్కిన భిల్లసేవకు లెల్లరు నతిజాగరూకతతో మాటిమాటికి దిక్కులెల్లఁ బరికించుచు నాతని వెంటనే వచ్చుచుంగిరి. ముం దున్న కరదీపికాధరు లగు భిల్లులు దివ్వటీలు సన్నగిల్లినప్పుడెల్లఁ దమ గుఱ్ఱములపై జీనులకు వ్రేలాడఁగట్టిన తోలుతిత్తులను దీసి యందున్న తైలమును

బోయుచుండిరి. ఆకటికిఁజీఁకటులలో— ఆ కాఱడవులలో— ఆ దివటీలమంటల వెలుఁగులోఁబోవుచుండిన యత్యల్పసంఖ్యాకంబగు నాపరివారము దూరమునుండి చూచునెడ నొక చిన్న సైన్యమువలెనే కానవచ్చును. ప్రయాణమును బ్రారంభించిన తరువాత నారాతులెల్లరుఁ జాలసేపువఱకుఁ దమతమ గుఱ్ఱముల నతిజవంబునఁ బఱువెత్తించి వాని కిప్పుడు స్వచ్ఛంద గమనాధికారము నొసంగిరి. అందుచేఁ గడుబడలికవడినయవ్వారువంబు లిప్పుడు మందగతినే వహియించి ప్రాంతభూముల నుండి క్రూరమృగారావములు వినినప్పుడుమాత్రమే తమ నాయకుల కళ్ళెంపు సడలింపు లవసరములేక యొక్కయూపునఁ బఱువెత్తుచుండెను. ఆ దివటీల కాంతులను, ఆగుఱ్ఱములను, ఆ పరివారమును జూచి ప్రాణభయముచేతనో, పాపభయముచేతనో కాని యడవిమృగములు వారి ప్రయాణమునకవరోధమును గలిగింపవయ్యె.

ఎంత మందగతిని బ్రయాణము చేసినను శత్రుసేనలా కాఱడవులలో నాఁటి నిశీథినిఁ దమ్ముఁ గలిసికొనఁ గల వనుననుమానము ప్రతాపున కావంతయు లేదు. చిరపరిచయులకుఁ దప్పఁ గ్రొత్తవారల కయ్యడవిపట్టులు పట్టపగలే దుర్గమంబులు. అందులో వారేగుచున్నవి సన్ననితప్పుదారులు. కొండపక్కల జల జల బాఱుసెలయేటి కెలంకులు. పుట్టల చుట్టును దట్టముగఁ బెరిగిన ముండ్లడొంకలు గల జీబునేలలు, బుస



బుసమని విసము గ్రక్కు పెనుబాముల కాటపట్టులగుచు గాబువాఱిన మిట్ట పల్లములు, కొండవారలకేని గండములుగాఁ దోచు కొండవారలు, నిశాత శిలాకంటకవ్రాత సమాకలిత గుహాకుహరాంతరములు, సాంద్రతర తరు వార మధ్యస్థిత పంకిల స్థలంబులు, ఝిల్లీముఖాఖిల కీటకచ్ఛటా కర్ణకఠోరారావసంకులంబులు, పరస్పర సమరసంరంభ విజృంభమాణ వేదండ పుండరీకానేక వైరిమృగ భయంకర ఘీంకారదురాపంబులు.

అయినను నాసఫ్ఖానుఁడు మిక్కిలి క్రూరుఁడును సాహసికుఁడు నగుటచే స్వరక్షణమునం దేమఱరా దని యెంచి, యర్ధరాత్రము దాటినను బ్రయాణమును మానలేదు. శత్రుసేనలు వెంటఁ దఱుముచుండ నా దండయాత్రలోఁ బ్రతాపసింహుఁడు పఱుగిడుచు వచ్చిన యరణ్యప్రదేశము మొత్తముపై నిరువది మైళ్ళకంటె నధిక ముండదు. చుట్టు త్రోవలనుండియు నడ్డుదారుల నుండియు వచ్చినచోటికే వచ్చుచుఁ బోయినమార్గముననే పోవుచు నా స్వల్పప్రదేశమునందే శత్రుసేనలు ప్రతాపునిచే గానుగెద్దులవలెఁ ద్రిప్పఁబడుచుండెను. తాను వందలకొలఁది మైళ్ళు తఱుముకొని వచ్చినట్లాసఫ్ఖానుఁడుమాత్రము భ్రాంతిపడుచుండెను.

భయప్రదంబగు నాఁటి రాత్రి నెట్టి మహోపద్రవములును దటస్థింపకుండఁ గాపాడుఁడని పాటేశ్వరీ ప్రతాప

సింహులు పార్వతీపరమేశ్వరులను బ్రార్థించుచుండ, వెనుక నున్న భిల్లులలో నొకఁడు ఛంగునఁ దన గుఱ్ఱము నొక్క దాటు దాటించి ప్రతాపుని సమీపించి—

"మహాప్రభూ! వెనుకతట్టు కనుచూపు మేరలో దివటీల వెలుఁగు గానవచ్చుచున్నది. ఆ వెలుఁగులోఁ గొంచెము కొంచెముగఁ గాన్పించుచుండిన గుఱ్ఱపురౌతు లెవ్వరో యెందఱో లేశమును గుర్తింప లే" మని పలికెను. నిశ్శబ్దముగఁ బోవుచుండిన ప్రతాపుఁడును దక్కటివారును నామాటలు విని తుల్లిపడి యొక్కమాఱుగ వెనుకకుఁ దిరిగి నిదానింపసాగిరి. నిదానించుకొలఁదిఁ గటిక చీఁకటిలో నైక్యమొందిన యమ్మహారణ్యమునందుఁ గరదీపికాధరు లగు కొందఱు గుఱ్ఱపురౌతులు వారి కందఱకుఁ గాన్పించుచుండిరి. చెట్ల చాటుననుండియు గుట్టల నడుమనుండియుఁ గాన్పించుచుండిన దివటీల వెలుఁగులో, గుఱ్ఱాల పఱుగులు తప్ప రౌతుల యాకారవిశేషములు స్పష్టముగఁ గానరానందున వారెవ్వరో గుర్తించుటకుఁ బ్రతాపాదులకు వీలు కలుగలేదు. ఆ దివ్వటులెల్ల నొక్కచోటనే యుండక తెగిన హారములోని మణుల తెఱంగున నందందుఁ జెదరి మిణుగురు పురువుల వడువునఁ దోఁచుచుండుటచేఁ దత్పరివారసంఖ్యయు నిర్ణయించుట యసాధ్యము. ప్రతాపసింహుఁడు కొంచెము సేపువఱకుఁ గడు జాగరూకతతో నిదానించి భిల్లునిఁ గాంచి—



"ఓరీ! వారు మొగలాయి సైనికు లనియేనా నీయూహ!"

"మహాప్రభూ! నిశ్చయముగా మొగలాయి సైనికు లిట్టి సాహసమును వహింప లేరు. ఆ వచ్చువారు మన సైనికులే కావలయును. కాని కాలము వ్యతిరేకముగ నున్నది. ఈ చెడు దినములలో మన కెట్టి ముప్పులైన రావచ్చును. అందుచే వారు మన శత్రువు లని యెంచి జాగ్రతపడుటయే భావ్యము."

ఆమాటలకుఁ బ్రతాపుఁడుఁ బ్రత్యుత్తర మీయక మఱియొకసారి వెనుకకుఁ దిరిగి నిదానించి—

"ఓరీ! చూడు- చూడు- ఇప్పుడు వారి గమనవేగ మధికమైన ట్లున్నది. ఇంతవఱకును జెట్లచాటునుండియు గుట్టల చాటునుండియు నెంతోసేపునకుఁ గాని బయలుపడని దివ్వటుల కాంతు లిప్పుడట్టి విళంబనము లేక యతిత్వరితగతి సూచించుచున్నవి. వారెవ్వరైనను మనలను జూచియే గమనవేగమును హెచ్చించి యుందురు. వారు మన రాజపుత్రులేల కాఁగూడదు?"

"కావచ్చును. కాని మహాప్రభూ! అట్లు విశ్వసించి యూరకుండఁ గలమా?"

"ఊరకుండక మన మిప్పు డేమి చేయఁగలము? దినమెల్ల విధివిరామము లేకుండఁ బఱువెత్తి పఱువెత్తి డస్సియున్న యీపేదగుఱ్ఱములు మనకీ ముప్పునెట్లు తప్పింపఁగలవు?"

ఇట్లు ప్రసంగించుచుండ వారెల్లరుఁ దుల్లిపడునట్లు వెనుక వచ్చుచుండిన పరివారమునుండి యాకస్మికముగ 'ధా'

మ్మను తుపాకి మోత వినవచ్చెను. దడదడఁ గొట్టుకొన సాగిన గుండెలతో వారెల్లరు నొక్కమాఱు వెనుకకుఁ దిరిగిచూచిరి. వారి ప్రయత్న మక్కఱలేకయే వారి గుఱ్ఱము లాధ్వని విని తమ గమన వేగమును హెచ్చింప సాగినవి. అప్పుడు పాటేశ్వరి ప్రతాపసింహునిఁ జూచి—

“ప్రాణేశ్వరా! ఇంక మనము సంశయింపవలసిన పని లేదు. శత్రువులు మనలఁ జుట్టుముట్టు లోపుననే ప్రాణభయము లేకుండఁ బిల్లల నెందైన భద్రపరచుటకుఁ బ్రయత్నింపవలయును. లేనియెడ క్రూరుఁడైన యాసఫ్‌ఖానుఁడు కంసునివలె వీరినిఁ జిత్రవధ గావింపక మానఁడు. పసిపాపలకుఁ బ్రాణసంరక్షణము గావింపఁ గలిగితిమా, మన మింక నిర్భయముగ శత్రుసైనికుల నెదుర్కొని నిర్విచారముగఁ బోరాడఁగలము.”

“నిజమేగాని శత్రుసేనల నెదుర్కొనుటకు నీ వేల, మేము చాలమా? పసిపాపలతోఁగూడ నీ వెందైనఁదల దాచుకొనుము. నీవు లేకున్న వారి కెవ్వరు దిక్కు?”

“అంబాదేవియే దిక్కు. ఇదియే మనకుఁ గడసారి రణరంగవిహారము. మాతృదేశస్వాతంత్ర్యమునకై మన మింక నెట్టి యిక్కట్టులు పొందనక్కఱలేకయే నేఁ డీ మహారణ్యమధ్యమునఁ బరమేశ్వరి మనలఁ దుదముట్టింప నెంచినది. ప్రాణేశ్వరా! శత్రుసేన లంతకంతకుఁ దఱుముకొని



వచ్చుచున్నవి. ఇంకఁ బఱువెత్తఁజాలము. ఋణానుబంధ సంబంధమగు నీసంతానముతో నా కింకఁ బనిలేదు. వీరక్షత్రియ ఖడ్గమును దాల్చి సుందరమేవాడరాజ్యలక్ష్మికొఱకు మీయందఱితోఁ గూడ నాప్రాణంబులను సమర్పించుకొనెదను. నా కనుజ్ఞ దయచేయుఁడు. పిల్లల నెందైనఁ బంపివేయుఁడు.”

పాపము ప్రతాపుఁడు నిశ్చలుఁడై నోట నేమాటయు నాడలేక యట్లే యుండిపోయెను. ‘మేలు! పాటేశ్వరీ! మేలు! నీమాతృదేశారాధనాదీక్ష మెచ్చఁదగిన’ దని వేలుపులామెను వేనోళ్ల శ్లాఘించుచుండిరో యన మింటనుండి ఫెళఫెళమని యుఱుము చప్పుడు వారికప్పుడు వినవచ్చెను. పరధ్యానమున మునిఁగియున్న వారందఱుఁ దటాలునఁ దుళ్ళిపడి మొగము లెత్తి యాకసమువంక విలోకింప సాగిరి. వారువిలోకించుసరికి గగనమండలము సగముకంటె నెక్కుడుగ గాఢ జీమూతవ్రాత సమావృతంబై యుండెను. తక్కినభాగమున వజ్రపు రవలవలెఁ దారకలు తళతళలాడుచు, శత్రుసేనవలె వెంటఁ దఱుముకొని వచ్చుచుండిన కాఱుమబ్బులచేఁ గప్పఁబడుటకు సిద్ధముగ నుండెను. ఈదురవస్థల కెల్లఁ దోడుగ నింక వర్షపాతము గూడఁ బ్రారంభించునా యని వారెల్లరు దిగులుపడి చూచుచుండ నంబరమునుండి మఱల ఫెళఫెళారావములు వినరా దొడంగెను. వానికిఁ దోడుగ వెనుకనుండి ‘ధాంధా’మ్మను తుపాకిమ్రోతలును హెచ్చుపెరిగినవి. వేటకాండ్రని భ్రమసి కాఁ

బోలు స్వచ్ఛందవృత్తిని విహరించుచుండిన వనమృగంబులెల్ల బెదరి కుదురుసెడి భయంకర ఘీంకారారావములతో వడివడి నిటు నటుఁ బఱుగులిడసాగెను. కర్ణపుటంబులు భేదించు నిమ్మహాధ్వనులచే నిద్రానిమగ్నులైయున్న పసిపాపలు మేలుకొని రోదనము సేయసాగిరి. ప్రతాపునకు మఱింత మతిపోయినది. పాటేశ్వరికి బ్రతుకుపై నాశయే లేదు. భిల్లులెల్లరుఁ గర్తవ్యము నూహింపసాగిరి. "అమాయకులైన దేశీయనాయకుల కిట్టి యిక్కట్టులు రాఁదగినవి కావు కా"వని తలలూపుచున్నవో యన, నంతవఱకు నిశ్చలంబులై యున్న మహావృక్షములు వాయువశంబున నిటు నటు నూగదొడంగెను. పరస్పర శాఖా సంఘట్టనములచే వంశవృక్షములనుండి వెలువడు పటపటధ్వనులతోడనే చిటపట చినుకులును బ్రారంభమయ్యెను. చెదలు పురువు లంటకుండఁ దారుపూసినట్టు లొకచుక్కయేనియుఁ గానరాకుండ మిన్నెల్ల సాంద్రమేఘ సంఛన్నమై యుండెను. గాలియును ఘెల్లుగ వీవఁ బొచ్చెను. యాతాయాతవాతాహతులచేఁ గరదీపిక లారిపోకుండ భద్రపఱుప వలెనని భిలు లెంత ప్రయత్నించినను గార్యము గానరాదయ్యె. మహావాయువశంబున నూపిరి యాడదేమో యని తమచేలాంచలబంధనముల నున్న కసుకందులను బాటేశ్వరియు భిల్లకాంతయు మఱింత యధికముగ నక్కున గదియించుకొనుచుండిరి. అట్టి విషాదసమయంబునఁ బ్రతాపుఁడు పాటేశ్వరి నుద్దేశించి—



"సుందరీ! వెనుకనుండి శత్రుసేన లేకాదు. పంచభూతములుసైతము నేడు మనపై దండెత్తుచున్నవి. ప్రపంచమంతయు నొక్కటి, మన మొక్కటియు నైతిమి."

"ప్రాణేశ్వరా! ఎన్ని ప్రపంచములొక్కటియైనను పంచభూతములే కాక యింద్రాది దేవతలును మనల నెదుర్కొనినను అంబాదేవి మనపక్షముననే యుండెనా, మనమే గెలువఁగలిగి యుందుము. ఆమెయనుగ్రహము తప్పినది. నిర్భాగ్యులమైన మనల నాదేవి విడిచినది. మనము మాత్ర మాజగన్మాతపాదములను విడువఁగూడదు. ఏమి కానున్నదో కానిండు. జయంబైనను నపజయంబైనను శత్రువ్రాతములతోడను, బంచభూతములతోడను మేవాడరాజ్యముకొఱకు నేడు పోరాడి తీరుదము. జీవితాశ కలవారికిఁగదా యుపద్రవములవలన భయము?"

పాటేశ్వరిపలికిన వీరాలాపములకు రోసముజెంది వాయుభట్టారకుఁడే మొట్టమొదట రణక్రియ నుపక్రమించెను. అవసానదశయం దున్నవాని గుండియలుంబోలె దడదడఁగొట్టుకొనుచుండిన దివ్వటులు రివ్వన నొక్కయూపున వచ్చిన వాతాహతిచే జప్పున నారిపోయినవి. ఇవి చెట్టులు, నివిగట్టులు, నివిమిట్టలు, నివిపల్లములు నని లేశమును వేఱుపఱుప నవకాశము లేకుండ వారికంటికి బ్రహ్మాండమంతయుఁ గాటుక పూసినట్లున్నది. ఇంతనఱకుఁ జిటపట చినుకులతోడనే చిఱుకయ్యమాడుచుండిన

వరుణదేవుఁడు వాయుభట్టారకుని ప్రోత్సాహమునఁ బ్రతాపములపై నిప్పుడఖండ ధారావృష్టిఁ వర్షింపసాగెను. క్షణమాత్రములోఁ దల్లులుతడిసి ముద్దయైరి. పిల్లలు ఘొల్లున నేడువసాగిరి. భిల్లులు వడవడ వడకుచుండిరి. ఆహా! గర్భనిర్భేదకంబులగు ఫెళఫెళధ్వనులు! కన్నులకు మిఱుమిట్లుగొలుపుచు బ్రహ్మాండమును భగ్గున వెలిగించు భయంకరములగు మెఱుపులు! మహావృక్షముల సైతము డొల్లగించు ఝంఝామారుతము! నిశాతశిలావృష్టింబోలె దుర్భరంబైన శిరోవేదనము గలిగించు నఖండవర్షపాతము! ఏవంక విలోకించినను గుండెలు బ్రద్దలు చేయుచుండిన యవిచ్ఛిన్న బంధురాంధకారము! క్రూర సత్త్వసమన్వితంబై కంటక వల్మీక పాషాణ నిమ్నోన్నతంబైన మహారణ్యమధ్యము! క్షణక్షణంబును— హృదయవేదనము గలిగించు శత్రుభయము! ఇన్నిటికిఁదోడు నాకలిచేఁ గటకటలాడుచుండిన పసిపాపలు! మహావైభవంబున రాజ్యభోగము లనుభవింపఁదగిన సుకుమారయగునిల్లాలు! ప్రతాపా! నీవెంత సాహసవంతుఁడవోయి! నీమాతృదేశారాధన మెంత ప్రసగింపఁ దగినదోయి! స్వాతంత్ర్యసంపాదనమున నీ వెంత బద్ధకంకణుఁడవోయి! నిశ్చయంబుగ నీవే యదృష్టవంతుఁడవు! నీవే ధన్యుఁడవు! ధన్యుఁడవు ధన్యుఁడవు.



## రొట్టెముక్క.

"అంబా! చూడు.చూడు. ఆ పిట్టలు చూడు ఎట్లు పాఱిపోవుచున్నవో! నీ కొకపిట్ట కావలెనా? పిట్టతో ఆడుకొందువా? అమ్మయ్యో! ఎన్నిపిట్టలో! ఆ పిట్టలన్నీ నీకేనా? చెప్పవమ్మా మఱి! అంబా! చెప్పు! చెప్పు!"

"అబ్బ! నే నిప్పు లాలుకోనందీ! బువ్వ తినీచీ ఆలుకుంతాను. లందీ—లందీ! బువ్వ తిందాం—లందీ-"

"బువ్వేనా? నువ్వెంతబువ్వ తినఁగలవు? ఇంత బువ్వ తినఁగలవా? దాద్దూయి కనఁబడదేమి? అంబా! దాద్దూయి నేమిచేసితివి?"

"దద్దూయి — బువ్వతింటానికి- అల్లమ్మాజీ దగ్గిఱి కెళ్ళిపోయిందందీ! నేనుకూలా బువ్వతినేత్తానందీ. అమ్మాజీ దగ్గిఱి కెళ్ళిపోదాం - లందీ! లందీ!"

"అంబా! ఏదీ! ఏదీ! అల్ల పాటపాడు! పాడవమ్మా! పాడుమఱి! ఒక్కమాఱు పాడు. ఏదీ! ఎలాగు?

నిరతము నీమృదు చరణ స్మరణము-మఱువని వారలమంబా!
కరుణఁజూపి నీ చరణదాసులకు-శరణ మొసఁగుమో యంబా!

ఇలాగేనా! ఏదీ! ఏదీ! నువ్వుకూడ పాడు!"

"బువ్వతినీ చేచి పాత్తానందీ బాబాజీ! ఇప్పు లాకలేత్తున్నాదందీ. నా కలుపు చూచాలా?"

"ఏమి చూడఁగలనమ్మా! నాకు కళ్ళులేవు. కొంచెము సేపుండు. అదుగో! అమ్మాజీ బువ్వ వండుచున్నది చూడు. వండగానే బువ్వ తిందువుగాని—"

"బాబాజీ! మూలా-మనం - గబగబ-పలుగెత్తి పాలిపోవాలికదండీ! ఈ మాలు బువ్వతినీచి పాలిపోదాం వండీ?—"

"అక్కరలేదమ్మా! మఱి పఱుగెత్త నక్కరలేదు."

"ఈమాలు— ఈమాలు— నన్ను బుుత్తలో పెత్తేత్తే నేనొప్పుకోనండీ! మీా లెత్తుకొనే పలుగెత్తాలి............. బాబాజీ! బువ్వతిందాం లండీ— పోసీ తతాజీ దగ్గిలి కెలిపోతానండీ......"

"చచాజీ- వేటకు వెళ్ళినాఁడు— నీకు— పళ్లు— కాయలు— పువ్వులు—"

"అబ్బ! అబ్బ! నా కవొద్దండీ- అత్తమానం కాయలే?"

"అంబా! నాభుజముమీాఁద బజ్జుకొందువా? పాడుచు జోకొట్టెదను. బజ్జుకో.........అలా బజ్జుకో......

దిక్కులేని నాయీాలుబిడ్డలకు— దిక్కుఁక నీవే యంబా
అక్కటకట! నీ వింత కఠినమతి - వైతి వేటికోయంబా!
కొండలఁ గోనల గుహలఁ గానలను - గ్రుమ్మఱుచున్నా మంబా
భండనంబునన్ రిపులఁగూల్చి యీ -బాధ లడపుమో యంబా॥
ఈజన్మంబున నీ నిర్భాగ్యుల - కింకేనాగతి యంబా!
ఏజన్మంబున మారాజ్యము మే - మేలుకొందు మోయంబా॥"



"బాబాజీ! బువ్వతినీచీ— బజ్జుకుంతానండీ— ఆకలేత్తుంతే ఎలా బజ్జుకోలం? అబ్బ! నా కిప్పులే పెత్తెయ్యాలి— ఊఁ— ఊఁ— ఊఁ—"

అని యన్నముకొఱ కేడ్చుచుండిన యంబాబాలికను బలువిధముల బుజ్జగించుచుండిన ప్రతాపసింహుఁ డిప్పుడు సపరివారముగ నొక పర్వతోపరితలంబున విడిసియుండెను. గత రాత్రియెల్లఁ దెల్లవారువఱకు నామహారణ్యములో నాకటిక చీకటులలో నాగాలివానలో నాలుబిడ్డలతోడను భిల్లులతోడను శత్రుభీతిచే నెందును నాగక మహాకష్టముతో వచ్చివచ్చి తెల్లవారుసరికతఁ డాపర్వతమునఁ జేరుకొనెను. ఉదయపురమున కుత్తరముగాఁ బండ్రెండు మైళ్ళదూరమున నున్న యాకొండ దాదాపుగ నొకమైలు పొడవును బొడవునకుఁ దగిన వెడల్పును గలిగి చుట్టును మహావృక్షములచేఁ జుట్టబడియుండుటచేత తన్మధ్యంబునం గలవారికి మార్గస్థు లగపడుటయెగాని మార్గస్థుల కందలివారు కానరారు. తాను శత్రువుల కంటఁబడకుండుటకును, శత్రువులు తనకంటఁబడుటకును దత్పర్వతోపరితలము ప్రతాపున కెంతయో యనుకూలముగ లభించినది. ఆపర్వతాగ్రముపైఁ బ్రవేశించుటయె తడవుగఁ బాటేశ్వరి నీరుగారుచుండిన తనబట్టను గట్టిగఁ బిడుచుకొని వడివడి వంటయత్నమునే ప్రారంభించెను. ఆకొండపైఁ జెట్లక్రింద విశాలములగు పెద్దపెద్ద బండరాళ్ళుండుటచేత వంటకుఁ

గాని విశ్రమించుటకుఁ గాని పంకమువలని యాటంకము కలుగలేదు. భిల్లులు క్రిందకుఁబోయి తత్పర్వతగుహాంతరములం జొరఁబడి యందు వర్షమునఁ దడియని యెండుపొదలను ఖండించి మోపులుగట్టి తెచ్చి పడవేసిరి. ఆపుల్లలతోఁ బాలేశ్వరి యొక చెట్టుచాటున నున్నని రాతినేలపై రాళ్ళమర్చి వంట సేయుచుండెను.

అప్పుడు జాము ప్రొద్దెక్కినది. కొందఱు భిల్లులు చెట్లమీఁదను, ఎండపడుచుండిన బండరాళ్ళమీఁదను దడిసిన బట్టల నారవేసికొనుచుండిరి. గుఱ్ఱములపైఁ గట్టఁబడిన సామానులు తడిసి ముద్దయగుటచేత మఱికొందఱు భిల్లులు వానిని భద్రపరచుచుండిరి. మేతకై గుఱ్ఱములు స్వేచ్ఛగా విడువఁబడినవి. యథాక్రమంబుగ భిల్లకాంత చెట్టుకొమ్మల కుయ్యెలలు గట్టి పసిపిల్లలఁ బరుండ బెట్టెను. నివాసయోగ్యంబులగు తక్కిన యేర్పాటులన్నియుఁ గ్రిందమజిలీయందువలెనే గావింపఁబడినవి. వంటసేయనీక తల్లి నల్లరిపెట్టునని యం బాబాలిక నెత్తుకొని ప్రతాపుఁడు కొంచెము దూరములో నొక చెట్టుక్రింద నామెను బుజ్జగించి యాడించుచుండ నాకస్మికముగ నాతని దృష్టి కట్టెదుటనున్న దట్టమగు చెట్లగుంపు వంక నెందుచేతనో యాకర్షింపఁబడెను. ఆచెట్లగుంపునుండి కొంతదూరమేగిన యెడల నాకొండ చివర కాన్పించును. ప్రతాపుఁడు తన పరివారముతోఁ గూడ నామార్గముననే యా



పర్వతముపైఁ బ్రవేశించెను. ఆతఁ డట్లు చూచుచుండఁగనే యాచెట్లగుంపునుండి తురంగారూఢుఁ డగు నొకభిల్లుఁడు వెలువడి వచ్చి వానికంటఁ బడెను. తోడనే ప్రతాపున కొకవిధమైన యాతురత జనించినది. గతరాత్రి యరణ్యమధ్యమునఁ దనకంటఁబడిన దివటీలవారు శత్రుసైనికులో తన సైనికులో యను ననుమానము తనకుఁ దీరనందున మార్గమధ్యమున రహస్యముగ నెందేనిఁ బొంచియుండి కనిపెట్టి శత్రుసైనికులైన యెడల మున్ముందుగఁ బఱుగున వచ్చి తనకెఱింగింపవలయు ననియుఁ దనసైనికులే యైనయెడల వారి నాపర్వతముపైకిఁ గొనిరావలయు ననియు నతఁ డాభిల్లునకు నియోగించెను. అందుచే నాభిల్లుఁడు కంటఁబడినంతనే యతఁ డెట్టివార్త చెప్పునో యని ప్రతాపుఁడు కొంత యాందోళన పడెను. గాని, మరొక్కక్షణముననే వాని వెంట నాచెట్లగుంపునుండి వెలువడి వచ్చిన హయాధిరూఢులగు పదుగురు రాజపుత్రులను జూచి వాని మనసు స్వస్థపడినది. స్వస్థపడినను వారి యాగమన కారణమెట్టిదియై యుండునో యను దిగులు మాత్ర మాతనికి లేకపోలేదు. ఇంతలో నాపదుగురు రాజపుత్రులును దూరము నుండియే గుఱ్ఱములనుండి దిగి సమీపించి వినయవిధేయులై నమస్కరించి వాని కట్టెదుట నిలువఁబడిరి. తోడనే ప్రతాపుఁడును వారి నమస్కృతుల నందుకొని యుండొక్కనిం గాంచి—

"యుగ్రసేనా! సేనాధ్యక్షుండవు నీవే రణరంగమును విడిచి వచ్చితివా? సైన్యముల నెవ్వరి కప్పగించితివి?"

"మహాప్రభూ! పరమేశ్వరి కప్పగించితిని."

"పరమేశ్వరి కేల యప్పగించితివి? ఇప్పుడు దేవి మన పక్షమున లేను. అందుచేతనే మన కిన్ని కష్టములు తటసించు చున్నవి. ఆసఫ్‌ఖానుఁడు మోసకాఁడని యెఱింగియు నీవు సేనల విడిచివచ్చుట మిక్కిలి పొరపాటు."

"రాజేంద్రా! ఇం కెక్కడి సేనలు? సేన లుండినఁగదా సేనాధ్యక్షుఁడు!"

"ఏమీ! ఉండక—మన సేన లేమైనవి?"

"దేవా! అప్రియము నెట్లు మనవిచేసికొనఁగలను?"

"ఉగ్రసేనా! నీ ముఖవైఖరియు నీ మాటలతీరును నా కమితాందోళనము గలిగించుచున్నవి. అప్రియ మను చున్నా వేమి? నిన్న సాయంకాలముననే కదా విక్రమజిత్తు రాజమలులు నాకడకు వచ్చి వెడలిపోయిరి! వా రిట్టి ప్రసంగ మేమియు నాతోఁ గావింపలేదే! ఈ తెల్లవారు లోపుననే యంత యుపద్రవ మేమి తటస్థించినది?"

"మహాపద్రవమే తటస్థించినది. విక్రమజిత్తురాజ మల్లు లేలినవారికడ సెలవు గైకొని తిరిగి వచ్చునరి కే యంత వఱకుఁ దీవ్రముగఁ బోరాడుచుండిన యాసఫ్‌ఖానుఁ డాకస్మికముగ యుద్ధ మాపివేసెను. నిన్నటిసాయంకాలమువఱకు



నాతఁడు కావించిన రణక్రియావిధానమునుబట్టి, రాత్రిపడినను నే డితఁడు యుద్ధము మానఁడని మే మనుకొనుచుంటిమి. అంత పట్టుదలతోనున్న యాసఫ్‌ఖానుఁ డొక్కమాఱుగఁ బోరు నిలిపివేయుటచేత నిం దేమైనఁ గృత్రిమ ముండవలయు నని యెంచి, కడు బడలిన సైనికుల కెల్ల స్వేచ్ఛగా భుజించి విశ్రమించుటకు సెలవొసంగి, శత్రువర్తనమును గుర్తించుటకు మేము పదుగురము గూడ మొగలాయిల పటకుటీర ప్రాంతముల రహస్యవృత్తిని సంచరింపఁ గడంగితిమి. వంటలు చేసికొని భుజించి సిపాయిలెల్లరు హాయిగ నిద్రించువఱకు మే మందే యుండి, యింక నెట్టిమోసము నుండదని యనుకొని తిరిగి మనసేనావారమునకు వచ్చి చేరితిమి..."

"అప్పుడు మన సైన్యములన్నియు నెచ్చట విడిసి యుండెను?"

"మహాప్రభూ! హ్లాళిగట్టున కైదుమైళ్ళ దూరములో నొక సరోవరమును దత్సమీపముననే యొక పర్వతమును గలవు కదా! ఆయుష్మంతులైన భిల్లు లెల్లరు నా పర్వతంబుపై విడిసిరి. నిర్భాగ్యులైన రాజపుత్రులుమాత్ర మా సరోవరతీరంబునం జేరి, యందలి యుదకంబుతో వంటచేసికొని భుజించి, యాయుదకంబులనే త్రావి మేము వచ్చునరికి గర్భనిర్భేదకంబుగ నందఱును ఘోరనిద్రానిమగ్నులై పడియుండిరి..."

"హర! హర! హర! ఉగ్రసేనా! యెంతటి ఘోర వార్త వింటిని! అమాయకులైన రాజపుత్రులకు నిష్కారణ

ముగ నీట్టి యాకస్మిక మరణము నంబాదేవి యేల కలిగించి నదో కదా? హర! హర!"

"దేవా! ఏలినవారికీ ఘోరవార్త నెఱింగించుటకే యంబాదేవి మమ్ము మిగిల్చినది. కుతంత్రపరాయణుండైన యూసఫ్‌ఖానుఁ డేక్షణమున నెవ్వరిచే నా సరోవరమున విషము గలిపించెనో లేశమును గుర్తింపలేకపోయితిమి."

నోట నేమాటయు రాని ప్రతాపుఁడు నిశ్చేష్టితుఁడై కన్నీరు మున్నీరుగా వగచుచుఁ జేరువనే యున్న యెత్తైన బండరాతిపైఁ జతికిలఁబడెను. ఇంతవఱకు భుజముపై నున్న యంబాబాలిక యిప్పుడు తొడపైఁ గూర్చుండి తండ్రి మొగమును వింతగాఁ జూడసాగెను. అవనతముఖులై ముకుళితహస్తులై యుగ్రసేనాదులైన రాజపుత్రులు పదుగురును జిత్రప్రతిమలవలె నట్లే నిలిచి యుండిరి. కొంతసేపునకుఁ బ్రతాపసింహుఁడు తన కట్టిన కాషాయచేలాంచలమునఁ గన్నీ రొత్తుకొనుచు నొక్క నిట్టూర్పు విడిచి—

"ఉగ్రసేనా! యింకమీఁద నీ వెట్లు సేనాధ్యక్షుఁడవు కావో నేనుఁగూడ నట్లే రాజును గాఁజాలను. సైన్యమే లేనప్పుడు మనకీ పదవులు హాస్యాస్పదములే కదా? అందుచే సామాన్య గృహస్థుల మనియే మన మిఁకపైఁ జెప్పుకొనుచుందము."

"మహాప్రభూ! ఇంతమాత్రమునకే యేలినవా రింత నిరుత్సాహపడినయెడల నింక మాబోటిపామరులకు ధైర్యము



చెప్పువా రెవ్వరు? ఏనూర్వురు రాజపుత్రకులు గతించినను మేవాడరాజ్యలక్ష్మికి అంగరక్షకులుగ వేలకొలఁది భిల్లసైనికు లుండనే యున్నారు. గతరాత్రి జరిగిన మహోపద్రవమును దత్సేనాధ్యక్షుం డగు చందున కెఱిగించియే వచ్చితిమి. ప్రచండతేజోజితచండకరుం డగు చందుఁడు తన భిల్లసేనల నెల్లఁ బురికొల్పుకొని శత్రుసేనల నీసరికే సరిసరి యనిపించి యుండును."

"ఉగ్రసేనా! ఇవన్నియు నాత్మసంతుష్టికై మనలో మన మనుకొనవలసిన మాటలేగాని యింక మనకు జయ మెక్కడ? పాపాత్ముఁడ నగు నాకారణమున నేనూర్వురు రాజపుత్రకళత్రంబులు గతభర్తృకలై ఘొల్లున రోదనము సేయుచుండ నా కెట్టిశుభంబైన నేల కలుగును? ఎందఱు భిల్లులున్న నేమి? పేరున కొక్క రాజపుత్రుఁడైన మనపక్షమున మిగిలియుండలేదుగదా? స్వాతంత్ర్యసంపాదనం బను పేరాస గలిగించి యనేక రాజపుత్ర కుటుంబములను రణభూమికి బలి యిచ్చిన యీప్రతాపునికంటెఁ బాషాణహృదయుఁ డింకెవ్వఁ డున్నాఁడు? ఉగ్రసేనా! అన్యులమాట కేమి? కట్టుకొనిన యిల్లాలికిని, కడుపునఁబుట్టిన పసిపాపలకును రెండుదినములకొక్క పూటయైనఁ గడుపునిండ నాహారముపెట్టక — యాఁకలిచే మలమల మాడ్చివేయుచుండిన దయాదాక్షిణ్యశూన్యుఁడగు నీరక్కసున కేదైవము తోడుపడునోయి! ..............."

అని కడునిష్ఠురముగఁ బలుకుచుండిన ప్రతాపుని మాటల కుగ్రసేనాదు లేమియు మాఱుపలుకలేక మతిపోయినట్లు

నిశ్చేష్టితులై యేకాగ్రదృష్టులతో నట్లేయుండిరి. ఆమాటలలో నాకలియనుమాట చెవిని బడినంతనే తొడపైనున్న యంబాబాలిక తండ్రి మొగము చూచి—

"బాబాజీ! నాకూ—నాకూ—మల్లా ఆకలేత్తున్నాదండీ! చూచాలా నాకలుపు చూచాలా ఏలాగేలుత్తున్నాదో! లండీ! లండీ! అమ్మాజీ దగ్గిలికెలిపోదాం లండ!"

"తల్లీ! నీకుఁ గడుపునిండ బువ్వపెట్టలేకపోయితి ననియే యిట్లేడ్చుచున్నానమ్మా! అదుగో! అమ్మాజీ వండుచున్నది వండఁగానే బువ్వ తిం[illegible]వుగాని—"

అని పలుకుచుఁ దనయెదుట నున్న పదుగురు రాజపుత్రిలును దటాలునఁ జేతులు మోడ్చి యెదుటఁజూచుచు నమస్కరించినందునఁ బాలేశ్వరి యచ్చటకు వచ్చుచున్నట్లు గ్రహించి ప్రతాపుఁడు వెనుకకుఁ దిరిగి చూచెను. ఆకటఁగటకట పడుచుండిన యంబాబాలికపాలిట నంబాదేవివలెనే పాలేశ్వరి యప్పుడే పొయిమీదనుండి తీసినందువలనఁ బట్టుకొనుటకు వీలులేనంత వేడిగానున్న యొక రొట్టెను సన్ననిపుల్లకుఁ గ్రుచ్చి పట్టుకొని వచ్చుచు రాజపుత్రిల నమస్కారములు గౌరవాదరణములతో నందుకొనుచు భర్తను సమీపించెను. ఆహా! మెడలో మంగళసూత్రముతప్ప నెట్టి వైభవములు నెట్టి యాభరణములును లేక కేవలము పేద ముత్తైదువవలెనున్న పాలేశ్వరిపై నారాజపుత్రిల కెంతభక్తి? అది వట్టి



రాజభక్తి మాత్రమే కాదు. స్వరాజ్యస్వాతంత్ర్య సంపాదనముకొఱకు సంపూర్ణ స్వార్థత్యాగమును గావించిన లోకమాన్యులును దేశబంధువులు నగు మహాత్ముల పాదసేవచే జనించిన దేశభక్తి! ఆరాజపుత్రిలతో వచ్చినభిల్లుఁడు పాలేశ్వరి వెంటనే యామెతోఁగూడ నచ్చటకు వచ్చియున్నందున వినవలసినఘోరవార్త వానిముఖంబున నామె వినియే యుండు నని ప్రతాపుఁడు నిశ్చయించుకొనెను. అందుకనుగుణంబుగ నాసాధ్వీమణిమొగంబున నిరుత్సాహమును నిరాశయుఁ బ్రత్యక్షముగనే కాన్పించుచున్నవి.

ఇంక రొట్టెతోవచ్చిన తల్లినిఁ జూచినంతనే యంబాబాలికకుఁ గలిగిన యానంద మెవరు వర్ణింపగలరు? ఆరొట్టెను జూచినంతనే తండ్రితొడపైనుండి కెవ్వున నొక కేకవేసి యత్యాతురతతో నాబండరాతిపైనుండి క్రింద కుతికి యరటిమొవ్వులవంటితన లేతచేతులతోఁ దల్లికాళ్ళు కౌఁగిలించుకొనెను. పాలేశ్వరియుఁ గుమారిక నెడమసందిటఁ జేరఁదీసి భర్తవెనుకనా యున్నతశిలాతలంబునం గూర్చుండి సలసలలాడు తైలకణంబులతోడను, తైలకణంబులనుండి వెడలుపొగలతోడను నంటరాని యారొట్టెను జల్లారఁబెట్టుచుండెను. వెన్నముద్ద దొరకిన బాలకృష్ణునివలెఁ జిఱునాట్యము సేయుచు—మోకాళ్ళపైఁ గూర్చుండుచు మఱలలేచుచు—వెన్ననంటునట్లు తన ముద్దుల బొజ్జ నక్కళించుచు మఱల విడుచుచు—రెండుచేతులను గడు

వుపై నిడుకొనుచు—చుట్టును దిరుగుచు—మహానందభరితంబగు నవ్వుమొగంబుతోఁ దండ్రిం జూచి యారొట్టె తనకే యని చేసంజ్ఞలతో నెఱింగించుచు— తల్లినిఁజూచి తానును మధ్య మధ్య నారొట్టె నూదుచు — నోరు చప్పరించుచుఁ బాప యా బాలిక క్షుధాతురతచే రొట్టె చల్లారువఱకును, జల్లారి తినువఱకును మితిమీఱిన యాందోళన మొందుచుండెను. అప్పుడు ప్రతాపుఁడు పాటేశ్వరిదిక్కు మొగంబై గద్గదస్వరంబుతో దీనంబుగ నిట్లనియె.

“అబలా! మన [illegible]సేనాదుల రాకకుఁగల కారణము వింటివా?”

“వింటిని. శత్రుభీతిచేఁ బ్రాణంబులను దాచుకొనక తమరాజ్యముకొఱకు నిర్లక్ష్యముగఁ బరిత్యజించిన పవిత్రచరిత్రులగు నయ్యేనూర్వురు రాజపుత్రులును మనకంటె మిక్కిలి యదృష్టవంతులు. మనమే వట్టి నిర్భాగ్యులమై ప్రాణముపైఁగల మోహమును బాయలేక వ్యర్థమైన బ్రతుకు బ్రతుకుచు నిన్నికడగండ్లనుభవించుచున్నాము.”

“నిజమేగాని ప్రాణములపైఁగల మోహముచేఁగాదు. పిల్లలపైగల మోహముచేతనే యిన్నికడగండ్లనుభవించుచున్నాము.”

“ఇంతమోహమున్న మనవలన నీపసిపాప లేమిసుఖపడుచున్నారు? తగుదుమని స్వరాజ్యదీక్ష వహించినవారు



సమయము వచ్చినప్పు డెంతటి ప్రేమానుబంధమునైన బలవంతముగఁ ద్రెంచుకొనవలయును. ఎట్టి స్వార్థత్యాగమునకైన సిద్ధపడవలయును. పసిపాపలను గూర్చి యెన్నిమాఱులు మిమ్ము నేను బ్రార్థింపలేదు? ఇప్పుడైన నేమైనది? అబ్బాయి నాథద్వారములో నున్నాఁడుగదా? నేడే వీరి నచ్చటకుఁ బంపివేయుఁడు! భామాసా సైతము మనపిల్లలఁ దనపిల్లలంబోలెఁ బెంచి పెద్దవారినిఁ జేయఁగలఁడు? మనమింక నిర్భయంబుగ రణరంగమును జొచ్చి యేవ్రతంబు పూని సమస్తరాజ్యమును బరిత్యజించితిమో యావ్రతంబునకు ఉద్యాపనము గావించుకొందము. ఇంక నేనాటికిని గూడఁ జక్రవర్తిని సాధింపఁగలమను నాశ మన కింక లేనే లేదుకదా? ......”

ఆమాటలకుఁ బ్రతాపుఁడు లేశమును బ్రత్యుత్తరమీయక యేకాగ్రదృష్టితోఁ గట్టెదుటనున్న వృక్షమువంక వీక్షించుచు నేదో మహాసాహసంబునకు సమకట్టునట్లు సూచించు ముఖలక్షణములతో నతిదీర్ఘాలోచనానిమగ్నుఁడై యుండెను. ఈసంభాషణములో నారొట్టె సగము చల్లారినది. నాకలిబాధచే నంబాబాలిక త్వరపడుచుండుటచేత నామె యాందోళనమును జూచి సహింపలేక— ఆయున్న వేడితోఁ దినఁగలదో లేదో చూడవలయునని పాటేశ్వరి చిన్నముక్క విఱిచి పిల్ల నోటిలోఁ బెట్టెను. లక్కపిడతవంటి యొబ్బుని తన లేతనోటికి కాపాటివేడియు సహింపరానిదే యగుటచేతఁ బాపమా

బాలిక వగర్చుచు క్షుధాతురతచే నాలుక చఱుకుచుండినను నతికష్టముతో నాముక్కను నమలి మ్రింగి గంతులు వేయుచు—
"అమ్మాజీ! నోలు తులికిందండీ! మలొక్కమా లూధండి! ఊదేత్తే తినేత్తాను." అనిపలికి తననోటిలోని చొంగయా రొట్టెపై బడునట్లు తానుగూడ నూదసాగెను. మఱొక్క క్షణంబునకే తక్కిన వేడియుఁ జల్లారినది. తల్లి తననోటి కందించుచుండు ముక్కలను గొంతవఱకుఁ దిని యాబాలిక మిగిలిన రొట్టె నామెచేతులనుండి లాగికొని రెండుభాగములుగాఁ జేసి—

"అమ్మాజీ! ఇదిపళ్ళలు తినేత్తానండీ! ఇది దాతుకుంతానండీ!"

"ఎప్పటికి దాచుకొందువమ్మా! తినుతిను! కడుపు నిండ తిను."

"మలీ— మలీ— మనం పాలిపోతాం కదూ? అప్పాలు తింతానండీ! అమ్మాజీ! అమ్మాజీ! ఆతెత్తుమీాద దాచీయండీ!"

"మఱి పారిపోమమ్మా! నాతల్లీ! కడుపునిండ తిను."

"అబ్బ! అబ్బ! అప్పాలేలుత్తే వూలుకుంతాలూ—ఊఁ—ఊఁ—ఊ— దాతుకుంతానండీ! అమ్మాజీ! దాచీయండీ; దాచీయండీ!"

పిల్లలు తా మన్నది యగుపఱకు నెన్నఁడు విడువరుకదా? కుమారిక కోరిక ప్రకారము పాలేశ్వరి యొకముక్కను దీసి



కొని సమీపమునఁ గల చెట్టుకడ కేగి తన చేయెత్తు పొడవున నున్న తొఱ్ఱలో నారొట్టెముక్క నుంచి మఱల యథాక్రమంబుగ వచ్చి కూర్చుండెను. అంతతో నంబాబాలిక తృప్తిచెంది చేతిలో నున్నముక్కను గొఱుకుచుఁ దండ్రికడ కేగి వాని తొడపైఁ గూర్చుండెను. ప్రతాపుఁడు దీర్ఘాలోచనముననే మునిఁగి యుండినను నంతవఱకుఁ గుమారిక యవస్థ యంతయుఁ గనిపెట్టుచునే యుండి "అయ్యయ్యో! ఇట్టి చిఱుతకూనకుఁ గూడ రెండవపూట నాహార ముండునో యుండదో యనుదిగులు పుట్టించుచుండిన నాపాడుబ్రతుకు కింకేల" కని తనలోఁదానే తన్ను నిందించుకొనుచుండెను. తన దృష్టియంతయు రొట్టెముక్కగల చెట్టుతొఱ్ఱయందే యుంచి చేతంగల ముక్క కొఱికికొనుచు నంబాబాలిక యావంకకే విలోకించుచుండ, నింతలో నాకస్మికంబుగ విధివశంబున నొక నల్లని బావురుపిల్లి యా చెట్టు కొనకొమ్మనుండి కొమ్మలనెల్ల క్షణంబులో దాటుకొనుచు వచ్చి యా తొఱ్ఱలో నున్న రొట్టెముక్క నొక్క యూపున నందుకొని చివాలున మఱలఁ జెట్టెక్కి పోయెను. ఆవంకకే చూచుచుండిన యంబాబాలిక రోదన స్వరంబుతో "బాబాజీ! పిల్లండీ! పిల్లండీ! లొత్తిముక్కండీ! కొత్తీయండీ!" యని యాతురతతోఁ బలుకుచుఁ బెద్దపెట్టున రోదనము సేయుచు నారోదనముతోడనే పాపము చెట్టెక్కి పిల్లిని బట్టుకొ వలయు నని కాఁబోలు నెత్తైన బండరాతిపైఁగల తండ్రితొడ

నుండి క్రిందికొక్క గెంతు గెంతెను. గెంతుటయే తడవుగ నందొక్క నిశాతశిలాగ్రంబా బాలిక కోమల పాదపల్లవంబునం గుచ్చుకొనఁ బొటబొటఁగారు నెత్తురుతో నేలఁ జతికిలఁబడి యూపిరిపట్టనంతటి గుక్క పెట్టెను. ఆబాలిక క్రిందకుఱికినప్పుడే పడిపోవునేమో యను భయంబునఁ బట్టుకొనవలయు నని ప్రతాపుఁడును బాలేశ్వరియు నచ్చటి రాజపుత్రులును గూడఁ దటాలునఁ జెంతకు వచ్చిరి. కాని యేమి ప్రయోజనము? భర్తకంటెను ముందుఁగఁ దానే కుమారికను జప్పున నందుకొని యెత్తుకొని పాదమునఁ గారుచున్న నెత్తురు చీరకొంగుతో నొత్తుచు, పాపము పాలేశ్వరి వలవలఁ గన్నీరు గార్చుచు నూరక దుఃఖింపసాగెను.

"తల్లీ! నిర్భాగ్యులమైన మాకడుపున నీవేల పుట్టితివమ్మా! ఏపాపము నెఱుంగని పసికూన వగు నీపాలిటఁగూడఁ బరమేశ్వరి లేకపోయినది! అయ్యయ్యో! నీకడుపు నీవే చూచుకొనవలసిన యవస్థ తటస్థించినదా? తల్లీ! నీతలిదండ్రులు కఠినచిత్తులని నీరొట్టెను నీవే దాచుకొంటివా? అమ్మా! నీకుఁగావలసినన్ని రొట్టె లిచ్చెదను. ఇంక నూరకుండుము తల్లీ! ఇఁకమీఁద నిన్నెప్పుడు నాకలితో నుంచను. నామాట వినుము. ఊరకుండుము!"

# ఇరువదియవ ప్రకరణము

## లాభము లేదు సుమా!

"ఉగ్రసేనా! మా దురవస్థయంతయుఁ జూచుచుంటివా? నీవు బుద్ధిమంతుఁడవుగదా, నేనెంతకాల మిట్లు గడపవలసియుండునో చెప్పుము! ఎంతకాలము గడపినను నిశ్చితకార్యక్రమంబునఁ గృతకృత్యులము కాఁగల మను నాశ నీ కేమైన నున్నదా? స్వకుటుంబభారము నే భరింపఁజాలని నావంటి యప్రయోజకుఁడు స్వరాజ్యభారము నెట్లు నిర్వహింపఁగలఁడు? మహామహులు వహింపవలసిన స్వరాజ్యోద్యమమును, నాలుబిడ్డలఁ బోషించుకొనలేని యప్రయోజకులు నిర్వహింపఁగలరా? కావునఁ ద్వరగా నిర్ణయింపుము. మన కీపై స్వకుటుంబరక్షణమా? స్వరాజ్యరక్షణమా? తగుదు మని సాహసించి స్వరాజ్యోద్యమంబునఁ బ్రవేశించి సమస్తసామ్రాజ్యమును గోలుపోయి యడవులఁబట్టి యడవిమృగములలో నడవిమృగములవలెనే సంచరించుచున్నాము. అడవిమృగములకైన నాఁకలివేళ కాహారము లభించునుగాని, యన్నపానములులేక నాయాలుబిడ్డలు దినములకొలఁది మలమల మాడుచునే యుండురు. మఱికొంతకాల మిట్లేగడపితిమేని నే చెట్టుక్రిందనో యేకొండమీఁదనో, యెండు మ్రాకులవలె శుష్కించియుండిన వీరు పెచ్చుపెరిగిన యాఁకలిచిచ్చున కాహుతులై యే క్షణంబున నాకు శాశ్వత మనోదుఃఖమును గలిగింతురో! ప్రతాపుఁడు దేశము

నుద్ధరించెదనని బయలుదేరి కడకుఁ దన భార్యాపుత్రులనైనఁ బోషించుకొనలేక పాపాత్ముఁడై బలవంతముగఁ జంపుకొనెనను నపఖ్యాతి నానొసట వ్రాయఁబడి యున్నది కాబోలు! నరమాంసభక్షకుఁ డగు రక్కసుఁడును మాంసవిక్రేతయగు చండాలుఁడును నెన్నిప్రాణహింసలఁ గావించుచుండు వారైనను నాలుబిడ్డలప్రాణములు సుఖపెట్టువా రగుటచే నాకంటె వారే దయార్ద్రహృదయులు. అట్టి దయాదాక్షిణ్యములు లేశమును లేని నేనే రక్కసుఁడను! నేనే చండాలుఁడను! ఇట్టి వానికఁట! స్వరాజ్యోద్యమంబఁట! ఎంతహాస్యాస్పదము? నా యవివేకమునకు నాకే నవ్వువచ్చుచున్నది! ప్రాక్పశ్చిమసానుమంత సమాక్రాంతంబగు సమస్తమహీమండలంబునకును నాయకుం డగు చక్రవర్తి యెక్కడ? అడవులంబడి నిత్యోపవాసంబులచేఁ గృశించుచుండిన పరమదరిద్రుండనగు నే నెక్కడ? ఇంత మేవాడరాజ్యంబునకు స్వాతంత్ర్యం బెక్కడ? ఉగ్రసేనా! మన మెంతయవివేకుల మైతిమి? ఎంత తప్పుతలంచితిమి? మనయవివేకము మనలనే కాక యెన్ని రాజకుటుంబములను రూపురేకలులేకుండ నిర్మూలనము గావించినది? రాజస్థానమునందలి సాటిరాజపుత్రు లెందఱో చక్రవర్తితో మైత్రి గావించుకొని దారపుత్రాదులతో సుఖైశ్వర్యముల ననుభవించుచు హాయిగ జీవించుచుండఁ గటకటా! నా కిట్టి చెట్టతలం పేలపుట్టినది? రాజపుత్రులకెల్లఁ బూజ్యుండను మహాకవి



రాజు నగు పృథ్వీరాజు సామాన్యుఁడా? రాజ్యతంత్రమునం దప్రతిమ ప్రతిభామతి యైన మానసింహుఁ డల్పజ్ఞుఁడా? ఇట్టి మహామహులే దేశకాలపాత్రంబులు గుర్తించి యసాధ్యంబని స్వరాజ్యోద్యమమును బరిత్యజించిరి కదా? ఇందఱికంటె నే నేపాటివాఁడను? ఉగ్రసేనా! నిత్యోపవాసములచేఁ గృశించి కృశించి తూఁగాడుచుండిన మేనితో, భర్తకొఱకును బిడ్డలకొఱకును లేని ధైర్యమును, లేని శక్తియుఁ దెచ్చుకొని యెట్లో తిరుగాడుచుండిన యీపాటేశ్వరినిఁ జూడుము! వచ్చియు రాని ముద్దుపలుకులతోడనే గర్భనిర్భేదకంబు లగు పలుకులు పలుకుచు క్షుద్బాధ భరింపలేక యీడునకుఁదగని యిడుమలు పడుచుండిన యీయంబాబాలికను జూడుము! ఉయ్యెలలనుండి తీయఁబడి గుటగుటఁ బాలుద్రాగువఱకుఁ బ్రాణము లున్నవో లేవో యను ననుమానము నిత్యమును గలిగించుచుండు నాపసిపాపలం జూడుము! అబ్బబ్బా! ఈకుటుంబక్షోభ నింకఁ జూడఁజాల! చూడఁజాల! నాహృదయపాషాణ మిప్పుడు వ్రక్కలై పోవుచున్నది. ఒక్క మేవాడరాజ్యమే కాదు. భారతవర్షమంతయుఁ గూడ నింతకంటెఁ బరాక్రాంతమై నింతకంటెను హీనవృత్తుల నడుగంటి నశించుఁగాక! నేనేమి చేయఁగలను? రాజకీయకార్యాతురతచే, నాకడుపునఁ బుట్టిన బిడ్డల నేనే చంపుకొని యన్యశిశుఘాతుకుండైన కంసునికంటెను బాలఘాతుకుఁడను గావలయునా? ఇంతకును మేవాడరాజ్యో

ద్ధరణమును నానుదుట విరిఞ్చి రచించి యుండలేదు. రచించియే యుండెనా నాకీ మహాత్కార్య మిదివఱకే సాధ్యపడియుండును! లేదా సాధ్యపడుసూచనలైనఁ గాన్పించి యుండును. కోటలన్నియుఁ బరాక్రాంతములైనవి. వైభవములన్నియు నశించినవి. సేనలన్నియు క్షీణించినవి. అనేక రాజపుత్ర కుటుంబములు రూపుమాసినవి! అన్నోదకములు కఱవైపోయినవి! ఆలుబిడ్డలు ప్రాణమాత్రావశిష్టులై యున్నారు. ఉగ్రసేనా! ఇవియన్నియు జయసూచకములా? అరిష్టసూచకములా! నీవే చెప్పు! నీవైనను నేమి చెప్పఁగలవు? ఎవరు చెప్పినను నేటితో మనస్వరాజ్య వ్రతమున కుద్యాపనము చెప్పవలయు! మనరాజపుత్ర వీరగాథల కింతతో స్వస్తి చెప్పవలయు! మేవాడ స్వాతంత్ర్యనాటకమున కింక భరతవాక్యమును చెప్పవలయు! లెమ్ము! లెమ్ము! సత్వరముగా నొకభూర్జపత్రమును దెప్పింపుము! నీకువశమైతి నని చక్రవర్తి కిప్పుడే యుత్తరమును వ్రాసిపంపెదను!......"

దైన్యమును సూచించుచుండినను మేఘగంభీర భాషణంబులతోఁ బ్రతాపుఁడు పలుకుచుండినపలుకులు వినుచున్నంతవఱకుఁ గూడ నుగ్రసేనాదులైన రాజపుత్రులును బాలేశ్వరియు స్వప్నావస్థయం దున్నట్టులే యుండి, స్వప్నమందైన నాతనినోట నిట్టిమాటలు వెడలునా యని యత్యాశ్చర్యనిమగ్నులగుచుండిరి. చిక్కని గడ్డంబులతో విశాలఫాలభాగంబుతో



మొదలే భయంకరంబైన ప్రతాపుని ముఖమండలం బిప్పు డారక్తనేత్ర కాంతులచే నెఱ్ఱనారి మఱింత దుర్నిరీక్ష్యంబై యుండెను. వాని కేమి ప్రత్యుత్తర మొసంగవలయునో యుగ్రసేనునకుఁ గాని బాలేశ్వరికిఁ గాని వెంటనే స్ఫురింపలేదు. గాయముపడిన పాదమునకుఁ గట్టుకట్టి మఱియొకరొట్టె నిచ్చి- బాలేశ్వరి కుమారిక నోదార్చినది. ఆబాలికయుఁ గాలిబాధకంటె నధికం బగు నాకలిబాధచే రొట్టెసందడి నప్పుడే రోదనము మానివేసెను. ఇట్లాప్రదేశమంతయుఁ గొన్నినిముసములవఱకు నిశ్శబ్దముగా నుండ నప్పు డుగ్రసేనుఁడు చేమోడ్పుతో నయభయంబులఁ బ్రతాపున కిట్లనియె.

"మహారాజా! ఏలినవారి నోట నిట్టిమాటలు వెడలుట చండకరమండలమునుండి మంచుకణంబు లొలుకుట! మహాభూధరము లాఘవం బొందుట! వీతిహోత్రుఁడు చల్లారుట! దివాకరనిశాకరులు మార్గముతప్పుట! నేటితో హిందూస్థానమున మన రాజపుత్రస్థానమునకు స్థానమే లేక రాజపుత్రతేజంబంతయు రూపుమాసి రాజపుత్రు లూరుపేరులేని యనామధేయు లయ్యెదరు. చక్రవర్తికి లోఁబడిన రాజపుత్రులుఁ గూడ స్వాతంత్ర్యమునకై పోరాడుచుండిన యేలినవారిపేరు చెప్పుకొని గర్వించుచున్నారు. మహాప్రభూ! అశాశ్వతంబులైన తాత్కాలికకష్టంబుల భరింపలేక యశాశ్వతసౌఖ్యంబుల కాసించి తమవంటి మహామహులే యిట్టి మహాత్కార్యమును

బరిత్యజించినయెడల నింక మేవాడరాజ్యంబుననేకాక భారతవర్షమునం దెందునుగూడ నేయుగంబునందును నేలినవారినే తాత్కాలికముగాఁ గొనుచు దేశస్వాతంత్ర్య ప్రయత్నములెవ్వరును నిర్వహింప సాహసింపఁ జాలరు. అందుచే మన మార్యావర్తమున కంటికును గూడ శాశ్వతమైన మహోపకారమును గావించినవార మగుదుము. పేరాకటఁ గటకటపడుచుండిన యాలుబిడ్డలం జూచి ప్రస్తుత మేలినవారిచిత్త మూరక యుత్తలపాటు చెందుచున్నది. మార్గాయాసం బుపశమింపనించుక విశ్రమించి భార్యాపుత్రులతో హాయిగ భుజించి సావకాశముగ నీవిషయమును విచారించినయెడ నేలినవారే తప్పుతలంచినందుకు నొచ్చుకొనెదరు. లేదా! అప్పటికిని 'జితోఽస్మి' యనుటయే కర్తవ్య మని నిర్ణయించెదరా సెలవెట్టులో యట్టులే నడచుకొనెదము. క్షమించి యంతవఱకు గడువొసంగి మమ్మనుగ్రహింపుడు."

"ఉగ్రసేనా! చిరకాలమునుండి నన్నెఱింగియు నిట్లనుచున్నావేమి? నేనంతటి చంచలస్వభావుఁడనా? చంచలస్వభావుఁడనే యగునెడ నాకుటుంబమున కింతటి దురవస్థ యేల కలుగును? 'నీవు నాకు వశమైనట్లు నోటనుడివినంజాలు! సమస్త సామ్రాజ్యంబును యథాక్రమంబుగ నీ కప్పగించి నిన్ను నా చేతులతోడనే పునరభిషిక్తుం గావించెద'నని చక్రవర్తి యెన్నిమాఱులు నాకుఁ గబురంపలేదు? చంచలస్వభావుండనే యగునెడ నే నిదివఱకే యంగీకరించి యీకొండపై నీబండరాతిపైఁ గూర్చుండుటకు మాఱుగ నే నిదివఱకే మేవాడ సింహపీఠికపై నధిష్ఠించియుందును. కాని పట్టినపట్టువిడువని గట్టిమనసువాఁడనుగాఁబట్టియే నట్టడవుల నాయాలుబిడ్డల కెట్టిచెట్టలు తటస్థించినను సహించి యూరకుంటిని. ఇప్పుడా పట్టుదల పరిత్యజించుచున్నాఁడను. బలవన్మరణముపాలు కాకుండ స్వకుటుంబప్రాణసంరక్షణార్థమై — శిఖండిముంగట గాంగేయునిభంగి మొగలాయిలయెదుట నస్త్రసన్న్యాసమును గావించుచున్నాఁడను. ఇంక నెవ్వ రడ్డువెట్టినను నేమైనను విననుం. యుక్తమగుఁగాక, అయుక్త మగుఁగాక! ప్రతాపుని సంకల్పమున కడ్డులేదు. ఈ మట్టియూడల యుయ్యేలలు — చెట్టుకొమ్మలఁగట్టిన యీవెదురుబుట్టలు — ఈమృణ్మయభాండములు — ఈచాపచుటలు — ఈ వెదురుగడ్డిరొట్టెలు — ఇంతతోఁ జాలును! చిత్తూరుదుర్గమునందో మఱి యేయితరదుర్గమునందో లేదా కడ కొకపల్లెటూరియందో యుపవాసక్లేశములు లేకుండ నాకుటుంబమును హాయిగ సుఖింపఁజేసెదను. ఉగ్రసేనా! నీ వనవసర విచారములలోఁ బడకుము! సత్వరముగా భూర్జపత్రమును దెప్పింపుము!........................."

ప్రతాపుఁ డిట్లు పలికినంతనే వాని కడపటిపలుకులఁ దనపలుక నెంచిన పలుకులకు సందర్భమును గలిగించుకొని పాటేశ్వరి యిట్లనియె.

"ప్రాణేశ్వరా! యథాక్రమంబుగఁ జిత్తూరుసామ్రాజ్య వైభవంబులు మన మభిలషించినప్పుడుగదా యభిజాత్యమును బాటింపక నీకు వశమైతి మని చక్రవర్తి కుత్తరము వ్రాయుట? అట్టి యభిలాషయే లేక కడ కొక పల్లెయం దుండుటకైన నంగీకరించినప్పు డిట్టి తలవంపు తలంపేల తలంపవలయు? కడ కిట్లయిన ననుగ్రహింపుఁడు. కొండలయందలం గల భిల్లపల్లెలలో నే పల్లెయైనఁ జేరుకొని పోరును బ్రతిష్ఠయు లేకుండ మనకర్మంబున హాయిగా నివసించుచుందము. మున్న్యాశ్రమంబు తెఱంగున నొక యాశ్రమంబు నిర్మించుకొందము. అందు వానప్రస్థాశ్రమ ధర్మంబుతో జీవించుచుందము. మహేశ్వరీ చరణారవిందమరంద పానానంద కందళిత హృదయులమై యయ్యిందుధర సుందరీమణిం గూర్చి తపంబు గావింతము. దేవికి మనయం దనుగ్రహము తప్పె నని మనము తప్పు తలంచుచుంటిమే కాని యా జగన్మాత మనలఁ బరీక్షించుచున్న దేమో యూహింపఁజాల కున్నాము. కసుకందు లగు నీ పసిపాపలతో నట్టి విషమపరీక్షకు మన మాఁగలేక పోయినను దపంబుచేనైన దేవిని మెప్పించి వరములు వడయుదము. స్వాతంత్ర్య సంపాదనమునకుఁ బౌరుషప్రధాన మగు క్షాత్రం బొక్కటియే సాధనము గాదు. తపశ్చరణంబును నత్యుత్తమ సాధనము. అట్లు కావించితిమేని మన జీవిత మంతయు స్వాతంత్ర్యముకొఱకే వెచ్చించిన వార మగుదుము. మన



బ్రతుకు కేవలము నిరర్థకము గాక యట్టి యాత్మ సంతుష్టికైన నవకాశము కలిగించును. ప్రాణేశ్వరా! ఇంక బ్రతికిన నంతకాలము బ్రతుకము. మన జీవితకాలములో సగము కంటె నెక్కుడే గతించినది. ఇంతవఱకు రాజస్థానమే గాక హిందూస్థాన మంతయుఁ గూడ మేలు మేలని వేనోళ్ళ శ్లాఘించు పవిత్ర వర్తనంబున మెలంగితిమి. ఇంక మిగిలిన యీస్వల్ప జీవితకాలములో నతినీచ కార్యమునకు సమకట్టి యా చంద్రతారార్కముగ నపకీర్తి పాలయ్యెదరా! నాథా! మీ పాదములఁ బట్టుకొనెదను. మీరీయకార్యమును బరిత్యజింపుఁడు! మమ్ము రక్షింపుఁడు!"

అని పాటేశ్వరి వెంటనే వాని పాదములపైఁబడెను. పడుటయె తడవుగ నుగ్రసేనుఁడును దక్కిన రాజపుత్రులును గూడ "మహారాజా! మీరీ యకార్యమును బరిత్యజింపుఁడు! మమ్ము రక్షింపుఁడు" అని యేకగ్రీవముగఁ బలుకుచుఁ బ్రతాపుని పాదముల కడ సాగిలఁబడిరి. ప్రతాపుఁడును గౌరవాదరణములతో వారందఱిని లేవఁదీసి—

"పాటేశ్వరీ! ఉగ్రసేనా! రాజకుమారులారా! గోరుచుట్టుపై రోకటి పోటురీతి మొదలే కలఁతపడుచుండిన నాహృదయమును మఱింత బాధింపవచ్చునా? మీరెన్ని విధములఁ గాదన్నను నిశ్చితకార్యమును నేను విడువను! నాసంతానమ్మును బలిగోరుచుండిన స్వాతంత్ర్యదేవత నింక నుపాసింపను. పాటే

శ్వరీ! కృతయుగంబున జన్మింపవలసిన దాన వీకలియుగంబున జన్మించి తపశ్చరణంబున స్వారాజ్యమును బడయఁగోరుచుంటివా? ఎంత వెఱ్ఱిదానవు? ఎంత యమాయికురాలవు? వానప్రస్థాశ్రమమే కాదు. సన్యాసాశ్రమమును స్వీకరించినను వశమైతిమని వచించు వఱకుఁ జక్రవర్తి నానల విశ్వసించి విడిచిపెట్టడు. మీ తపశ్చరణమును నా కారాగారమునసే గావింపుఁడని సకుటుంబముగ మనలఁ జెరపట్టక మానఁడు. ఉగ్రసేనా! ఇది మూఁడవసారి. భూర్జపత్రమును దెప్పింపుము!"

"మహాప్రభూ! ఇంక నేలినవారి యాజ్ఞకు వ్యతిరేకము చెప్పను. సెలవైనయెడఁ జిన్న మనవిమాత్రము కలదు."

"నీమనవి నాసంకల్పమునకు వికల్పము గలిగింపదు కదా?"

"వ్యతిరేకము కాదని మొదటనే మనవి చేసికొంటిని."

"అట్టులయిన నవశ్యముగఁ జెప్పవచ్చును."

"'మహారాజా! తీవ్రసంగ్రామ మధ్యమునఁ దన యరదము భూమిలోఁ గ్రుంకినప్పుడు దానిం జక్కఁబెట్టువఱకు శరప్రయోగంబు గావింపక గడువొసంగవలయునని యత్యంత తేజశ్శాలియగు కర్ణుండు కిరీటిని గోరియుండెను గదా?"

"ఔను. ఇప్పు డా పురాణగాథతో మన కేమి పనియున్నది?"

"మహాప్ర[illegible]సమయము తప్పివచ్చినప్పుడు మహా



వీరులైన నిట్టి యవకాశమును గోరుట యాచారమై యుండుటచే నియ్యది పౌరుషహీనముగాఁ బరిగణింపఁబడదు."

"కావచ్చును. కాని నేటితో సర్వపౌరుషంబులును సంపూర్ణముగఁ బరిత్యజించుచుండిన మనకు— ఇది పౌరుషహీనము—ఇది పౌరుషజనకము నను విచారమెందుకు?"

"దేవా! 'నీకు నేను వశమైతి' నని చక్రవర్తి కేలినవారు వ్రాయఁదలంచిన వాక్యమునకు ముందుగ "ప్రస్తుత" మను మాట చేర్చి—"ప్రస్తుతము నీకు నేను వశమైతి" నని వ్రాయుటకు మాప్రార్థనము—"

"ఉగ్రసేనా! నీ కింకను నాశ విడువలేదా? ఇంకను స్వాతంత్ర్య ప్రయత్నమేనా! లేదు లేదు. లాభములేదు. ప్రస్తుత మను మాట కేవల మప్రస్తుతము."

"ప్రాణేశ్వరా! సర్వేశ్వరి యనుగ్రహించినయెడ తృణంబులోఁ దృణంబు మహామేరువగును. పరమేశ్వరి చిత్తవృత్తి యెప్పటికెట్లుండునో యెవరు చెప్పఁగలరు? అప్రస్తుతంబే యైనను ఈవిషయమునందైన మాప్రార్థనమును మన్నించి 'ప్రస్తుత' మనుమాట చేర్పుఁడు"

"మన్నించుట కేమున్నది? అట్లే చేర్చెదనుగాని లాభము లేదుసుమా!"

# ఇరువదియొకటవ ప్రకరణము.

## బంగారు జరీచీర.

అగ్రతనూజుఁడైన యమరసింహుఁ డొక కన్యయం దనురక్తుఁడై నాథ ద్వారమున నుండి పోయెనని పాఠేశ్వరి ప్రతాప సింహుల ప్రసంగములో నొకమాఱు విన్నట్లు చదువరులకు జ్ఞప్తి యుండవచ్చును. నాథద్వార ముదయపురమున కుత్తరముగా ముప్పదిమైళ్ళ దూరమున నున్నది. అనఁగాఁ బ్రస్తుతము ప్రతాపాదు లున్న పర్వతమునకుఁ బదునెనిమిది మైళ్ళ కంటె నెక్కుడు దూరములేదు. ఇటీవల నీ గ్రామము గొప్ప పట్టణమై మహోన్నత స్థితి వహించినది గాని మన కథాకాలము నాఁటికి మాత్రము సామాన్యపు కుగ్రామముగనే యుండెను. 'నాథ ద్వారీజీ' యను విష్ణుదేవుని యాలయ మా గ్రామమునందు సనాతనమునుండియు నుండుటంజేసి దానికి నాథద్వార మను పేరు వచ్చినదఁట! రాజపుత్రస్థానము లోని నదులలో సుప్రసిద్ధమగు 'వనాశా' నది యాగ్రామము నుండియే ప్రవహించు చుండెను. చుట్టు పట్టులం గల కుంభిళా దుర్గము లావాదుర్గము మాండలదుర్గము మొదలగు వానిలో నాథద్వార మంత ప్రసిద్ధమైనది కాకపోయినను దత్ప్రాంతమున కెల్లఁ బారిశ్రామిక వృత్తులకు ముఖ్యస్థాన మగుటచేత ననేక దుర్గములతోడను బట్టణములతోడను వలసినంత సం



బంధమును గలిగి యుండెను. భామాసా కాపురము వచ్చిన మూఁడు నాలుగేండ్లనుండియుఁగూడ నాగ్రామము పూర్వము కంటెను జేతిపనుల కెక్కుడు ఖ్యాతిగాంచినది. తమతమ పనుల యం దెక్కుడు చాకచక్యము కలవారనుట తప్ప, నంతవఱకు నాగ్రామమునందలి వర్తకులు కొంచెము కొంచెము మదుపులతో స్వల్ప సామగ్రులనే కావించి విక్రయించు చుండిరి. భామసావచ్చి నేతపనులు తనకెక్కువ మక్కువగలవియగుట చేత, నందలి నేతగాండ్రనెల్లఁ దనక్రింద జీతగాండ్రుగా నేర్పరచుకొని వేలకొలఁదిఁ బెట్టుబడిపెట్టి వర్తకమును బ్రారంభించెను. ఆతని కర్మాగారమునఁ బ్రతిదినమును రెండుపూటల వందలకొలఁదిఁ బనివాండ్రు పనిసేయుచుందురు. గ్రామవాసు లందఱిలో భామాసాయే గొప్పధనవంతు డగుటచే నతఁ డా గ్రామమునకుఁ గిరీటములేని రాజుగా నుండెను. కాని యొకటి రెండు విషయములలో మాత్ర మాతనికిఁ గళంకము వచ్చినది. భామాసా తాను గుజరత్ప్రాంతమునుండి వచ్చిన జైన రాజపుత్రుఁడ నని చెప్పుకొనుచుండుటచేత రాజపుత్రులు వానిని గులములో వెలిగా నుంచవలసి వచ్చినది. అప్పటికి రాజస్థానమున క్షీణించిపోయిన యీ మతమునకు గౌరవము లేదు. రాజపుత్రులనేకులు దేవ్యుపాసకులు, కొందఱు వైష్ణవ మతస్థులు సహపంక్తిభోజనసంబంధ బాంధవ్యములను జైనులతోఁగావింపరు.

భామాసా కింతకంటెను బ్రబలమైన కళంక మాతని శీలమునందు లోపము. యుక్తవయసుగల కుమారికగా నున్న యొక రాజపుత్ర స్త్రీ నతఁడు తెచ్చి తన యింట నుంచుకొనెను. అందుచేఁ బలువురు పలువిధముల నాతనిం గూర్చి చెప్పుకొనవలసి వచ్చుచుండెను. వాస్తవ మెట్లున్నను నిందారోపణమునందుఁ గొందఱి హృదయము లమందగతి గలవి కదా? ఆరాజపుత్ర స్త్రీయును నామె కుమారికయుఁ దప్ప భామాసాకు వేరు కుటుంబమే లేదు. వివాహమే కాలేదో భార్య సంతానరహితమై గతించెనో మనకుఁ దెలియదు. ఇంతకు నతడు గొప్పధనవంతుఁ డగుటచేత నతనిశీలము దుశ్శీలమో సుశీలమో మన మిప్పుడు పరిశీలింప నవసరము లేదు. ధనవంతుల కళంకములు చంద్రునిలోని కళంకమువలె లోకమున మన్నింపఁబడుచున్నవి కదా!

నాథద్వారమునం దాలయమువీథిలో భామాసా నివసించు భవనము విశాలమైన చతుశ్శాలాభవనము. దాని నంటియే పెరటివైపున నాతని కర్మాగారము నిర్మింపఁబడినది. ఇరువంకల నెత్తైనయరుగులు నీలిరంగుగోడలును గల తద్భవన వీథిద్వారంబు గడిచినంతనే యతివిశాల మగు నొకచావడి కలదు. నేలగానరాకుండఁ బెద్దది యగు నొక్క తివాసియే వేయఁబడిన యాచావడికి రెండువైపులఁగల గదిగుమ్మములకు రంగురంగుల పూవ్రులగుడ్డలు వ్రేలాడుచుండెను. వానిలో



నెడమవైపునఁ గల గదిగుమ్మమునకు ముందు ఆ తివాసిమీఁదను నలుచదరంబైన యొకనల్లని మఖమల్ పరుపును నెత్తని మఖమలు బాలీసును గలవు. ఆపరుపుపై నాబాలీసునకు ముందుగఁ బలువిధము లగు నగిషీపనులతో నొకదంతపుఁ జెతి పెట్టె చూచుకొలఁది ఖింతగొలుపుచుండును. చిత్రవిచిత్రము లగు చిత్రపటములతో నలంకరింపఁబడిన యాచావడియం దిర్వంకలం గల యద్దాలబీర్వాలలో విక్రయమునకు సిద్ధమైన పలువిధములగు పట్టుమార్తులు విలువగల నూలుమార్తులు చూచువారికిఁ గోరిక లీరిక లెత్తించుచుండును.

ఒకనాటి మధ్యాహ్నమునం దాచావడిలోని మఖమల్ పరుపుపై, సాక్షాత్కరించిన భామాసా ధనలక్ష్మివలె నిండు జవ్వని యగు నొక కన్యారత్నము, తెల్లని జరీచీరయు, నల్లని మఖమలు రవికయు, నుల్లిపొరకన్న సన్నమై పసుపువన్నెలఁ జెన్నొందెడు మేలిముసుంగును, దాల్చి, ముందున్న దంతపుఁ బెట్టెపై మోచేతి నానుకొని; బంగరురంగుల రంగారు వ్రేళ్ళ నడుమనుండి మణిద్యుతులంబోలె నధరబింబచ్ఛాయలును, ముక్తాఫలద్యుతులంబోలె దంతచ్ఛాయలును ఖింతగొలుపుచుండ నరచేత గడ్డము నిడికొని, చేరువనే తలుపులు తెరువఁబడిన బీరువాకడ నిలువఁబడియున్న రాజకుమారునితో మందహాస భాసుర ముఖారవిందయై సంభాషించుచుండెను. నూనూగు మీసంబు సొంపు దిలకింపఁ బడునెనిమిదేండ్లకు మించని వయ

నున్నట్లు గాన్పించని యారాజపుత్రుఁడు దరిద్రుఁడని యాతని ధరించిన జేగురురంగు దుస్తులవల్లనే తెల్లమగుచుండెను. మాసిన మాసికల షెరాయియు నందుపై నందందుఁ జినిఁగిన యంగీయు నారెండింటికిని జతయైన శిరోవేష్టనమును జూపరులకు వికారముగనే తోఁచుచుండవచ్చును గాని విశాలంబగు ఫాలముతోడను, కోమలములగు చెక్కిళ్లతోడను దళుకులొలుకుచుండిన యాతని లేతమొగముమాత్రము జాలిపుట్టించుచున్నది. మనసులు కరగించుచున్నది. వేషమెట్లున్నను సహజసౌందర్యమునకు లోటు లేదని చాటుచున్నది. దరిద్రునకుఁ గోరికలు మెండనునట్లు పాప మా రాజకుమారుఁడు పలువిధంబులగు విలువగల జరీబట్టల నొక్కొక్కటిగఁ దీయుచు నక్కజముతోఁ బరిశీలించుచు వాని మూల్యాదికముల నాబాలికామణి నడుగుచు నమూల్యాంబరధారణంబునఁ దనకుఁ గల కాంక్షలెల్ల వెల్లడించుచుండెను. ఆబాలికామణియు గొంతవఱకుచితగతినే వానికిఁ బ్రత్యుత్తరము లొసంగినది. కాని యాకస్మికముగ నారాజపుత్రుఁ డేదో యడుగఁదలంచి మఱచినవానివలెఁ దటాలున నామె వెనుకనున్న గదిలోనికిఁ బోయి, బంగారు జరీమయంబై తళతళలచేఁ గన్నులకు మిఱుమిట్లు గొలుపుచుండిన యమూల్యంబగు నొకచీరం గొనివచ్చి పైమడతను మాత్రమే విప్పి—

"మీరా! నిన్నన్నియోమాఱు లడుగ నెంచితిని. ఈచీరవెల యెంత? వేలా? వందలా?"



అనియడుగ మీరాభాయి తటాలున లేచి పాదములకుఁ దగులుకొనిన చీరకుచ్చెళ్లు చెచ్చెర వదలించుకొని చురచుర చూపులతో నాతని చేతంగల చీర లాగుకొని—

"అమరసింహా! ఇంత సూక్ష్మముగ దీని నెచ్చటనుండి తెచ్చితివి? ఇది పైకెట్లువచ్చినది? ఎవ్వరికంటఁ బడకూడదని యెంతోకాలమునుండి మందసములో నట్టడుగునఁ బడవేసి భద్రపరచియుంచిన బాబాజీవారు, ఇప్పుడువచ్చి చూచిరా దీనిని బైకిఁ దీసినందుకు నీకో నాకో పెండ్లితప్పదు........"

"నీకో నాకో యననేల? ఇద్దఱకును బెండ్లిచేసెదరు. ఆయనకోపము నే నెఱుఁగుదును."

"నీపరిహాసములకు వేళ లేదా యేమి? తఱుచుగ వచ్చుచుండువాఁడవు గదా యని మనసుకలిపి మాటాడుచుండుట చేతనే కదా యిట్లనుటకు సాహసించితివి? మఱియొకఁ డిట్లాడఁగలఁడా?......"

"మనసులు కలిసినట్లు నీవే యొప్పుకొంటివిగదా? ఇందేమి తప్పున్నది?"

"అమరసింహా! నీవ్యంగ్యాలాపములు నాకర్థము కావనుకొంటివా? అడవులలోనుండు నీకే యింత పాండిత్యము ముదిరినప్పు డూరిలోనుండు నేనేనా నిరక్షరకుక్షి నయ్యెదను? ఇది యతి పరిచయముచేఁ గలిగిన యవజ్ఞత. సరే! యికమీఁద నీవుండవలసినట్లు నీవుండుము! నేనుండవలసినట్లు నేనుండెదను."

"అట్లే యుండవచ్చునుగాని మీరా! ఈచీర వెల యెంతని యడిగినంతమాత్రమున నీ కింత కోపమేలవచ్చినది? వెల యెంతని యడుగువారిపై మీబాబాజీవా రిట్లే యాగ్రహింతురా?"

"ఆహా! నీవంటివా రడిగిన నిట్లే యాగ్రహింతురు. అడవులలోఁ గాయకసురు తిని జీవించువారికి వేలకొలఁది విలువగల యీచీర ప్రసంగ మెందుకు? చనవిచ్చితిమని యడుగనైన యడుగకుండఁ బెట్టెలు చక్కఁబెట్టి రహస్యవస్తువులు బైటకుఁ దీసికొనివచ్చుట మర్యాదయేనా?"

"మీరా! క్షమింపుము! ఇదియంత రహస్యవస్తువని నే నెఱుఁగను. నే నుదయమున మామయ్య— మీబాబాజీవారు మందసమును జక్కఁబెట్టుచుండ నేను జెంతనే యుండుటచే నాదురదృష్టవశమున నిది నాహృదయము నాకర్షించినది. నాకన్నులకు మిఱుమిట్లు గొలిపినది. మీబాబాజీగారు తమ పని పూర్తియైనంతనే తొందరతొందరగాఁ గర్మాగారమునకుఁ బోవుచు జాగ్రత్తగాఁ దాళము వేయుమని నాకుఁ జెప్పిరి. ప్రొద్దుననుండియుఁ దాళములు నాయొద్దనేయున్నవి. నీయెదుట నీ చీరను జూడవలయునను ముచ్చటచేత నే తెచ్చితినిగాని కొనుట కర్హుఁడననికాదు. నా చిన్నతనములో నించుమించుగ నిట్టి చీర నే మా మాతాజీవారు ధరించుచుండునట్లు నాకుఁ గొంచెము జ్ఞాపకమున్నది. ఆదినములు నా వైభవములు పోయినవి. నీ



వన్నట్లడవిలోఁ గాయకసురు దిని జీవించుచున్నాము. మాకిట్టి చీర లెందుకు? పోనిమ్ము. క్షమింపఁగూడదా? ఇప్పటికి క్షమింపఁగూడదా? ఇఁకమీఁద మీయింటికి దఱుచుగా రాను. క్షమింపుము... ....."

పాపము పట్టి యమాయకుఁడైన యమరసింహుని మాటలవలన మీరాభాయిమనసు వెన్నవలెఁ గరిగిపోయినది. తాను దొందరపడి మాటాడినందుకు నొచ్చుకొనినది. వాని మనసునకు నొప్పి కలిగినదిగదా యని వగచినది. లేశమును గళంకములేని వాని చిత్తమును రంజింపఁ జేయవలయునని యెంచినది. యెంచి యిట్లు ప్రసంగించినది—

"అమరసింహా! యథార్థము చెప్పవలసివచ్చుటచేత నీమనసు నొప్పించితిని. అందుచే క్షమింపవలసినవాఁడవు నీవుగాని నేనుగాను. ఒకసంవత్సరమున జరిగిన నౌరోజా యుత్సవములోఁ జక్రవర్తి యంతఃపురమునకు నజరానా పంపవలెనని బాబాజీవా రీచీరను నేయించిరఁట. కాని యేకారణముననో పంపుట జరుగలేదు. చిన్నచిన్న మంచిముత్యములును వజ్రపురవలును మణులును కన్నములు దొలువఁబడి బంగరు జరీదారముతో నీచీరనిండ వేలకొలఁదిగఁ బొదువఁబడినవి. అంతియేగాదు. అత్యద్భుతంబైన యీనగిషీపనులలోనందందు 'నౌరోజాఉర్సు— అల్లా హో అక్బర్' అను నక్షరము లెంత చిత్రముగాఁ జిత్రింపఁబడినవో చూడుము."

అని యాచీరయందలి యత్యద్భుత కలాకౌశలమును మడతలువిప్పి చూపుచు వానిచేతి కందిచ్చి—

"రాజకుమారా! ఈచీర సిద్ధమగుసరి కేబదివేల రూపాయలు మదుపైనదని బాబాజీవా రొకమాఱు చెప్పినారు. బహుమానపదార్థము పదుగురకంటఁబడినయెడల దానిగౌరవము తగ్గునని దీని నతిరహస్యముగా దాచుచున్నారు. పైకిఁదీయవద్దనియు నెవ్వరికంటఁ బెట్టవద్దనియు నెన్నోమాఱులు నాతోఁ జెప్పినారు. ఈమాటలకేమిగాని రాజకుమారా! నీ కీచీరయం దింత మక్కువ యేలకలిగినదో చెప్పు! దాచక చెప్పు! యబద్ధ మాడఁగూడదుసుమా!"

"చెప్పినయెడల నీ కాగ్రహము వచ్చునేమో?"

"ఆగ్రహమే కాదు. నా కేగ్రహమును రాదు చెప్పు!"

"ఈచీర ధరింపఁగా నిన్నుఁ జూడవలయునని నా కున్నది."

"ఆలాగునా? నిజమేనా? అమరసింహా! నా కేమికోరిక యున్నదో యడుగవుకదా? పోనిమ్ము! నీవడుగకపోయినను నేను జెప్పెదను. నీవు ఖడ్గహస్తుఁడవై యుండఁగా నిన్నుఁ జూడవలయునని నాకున్నది. కోపములేదుగదా? ఇంకను జెప్ప వచ్చునా? లోకైకవీరుఁడగు ప్రతాపసింహుని కుమారుఁడవై నందుకు నీవు గర్వపడవలసినవాఁడవు. చంద్రమతీ హరిశ్చంద్రులవలె నొక్కమాటపట్టుదలకొఱకు సమస్త సామ్రాజ్య



మును బరిత్యజించి యడవులఁ బడరాని యిడుములు పడుచుండిన తల్లిదండ్రులకు నీ వింత నిష్ప్రయోజకుఁడవై యుండవచ్చునా? కోపింపకుమా! సాటిరాజపుత్రులు నీప్రవర్తనమునుజూచి నవ్వరా! ఆగ్రహింపకుమా! ఇట్టి యప్రయోజకుండ వగునెడ నిన్నేకన్యక వరించును? క్షమింపవలయును జుమా! నీకు బహుమానముగా నొసంగవలయునని పెక్కుదినముల నుండి నే నొక యమూల్యవస్తువును దాచియుంచితిని. దాని నిప్పుడు పరిగ్రహింతువా!"

"అంత యమూల్యమైన వస్తు వేది? నీమనసా?"

"నా మనసు కంటెను నమూల్యమైనది."

"లోకములో నంతవిలువ గలది కలదా? దాని పేరేమి?"

"కాళికా ఖడ్గము. మీతండ్రి తాతల కడ మంత్రియై యుండిన మాతండ్రి దానితోడనే యెందఱినో మొగలాయి వీరుల నంత మొనరించెను."

"మీరా! నీకోపము తొలంగినది కదా? నీవు నన్ను క్షమించితివికదా? ఇంకను ఖడ్గ మెందుకు?............కాదు కాదు. తెమ్ము, ఇప్పుడు గాకపోయినను మఱి యొకప్పు డెప్పుడైన నుపయోగించుకొనవచ్చును.

"అదికాదు. నీకొక రహస్యమును జెప్పెదను వినుము. మొదటఁ గత్తినందుకొనుము. తరువాత నేఁ జెప్పునది వినుము! నీలో నెంత మార్పు వచ్చునో నీవే చూడఁగలవు! నీయంత నీవే వింతపడఁగలవు........"

అని పలుకుచు మీరాభాయి తళుక్కున మెఱసి మాయమగు మెఱపు తీగవలెఁ దటాలునఁ బటకవాటమును దొలంగించుకొని గదిలోనికేగెను. అమరసింహుఁ డొంటరిగనే చావడియం దుండెను. చీరయు నాతనిచేతులయందే యున్నది. ఒక్కొక్క మడత విప్పుచు మఱల వేయుచు, నందందుఁ గల బంగరు జరీనగిషీపనులఁ బరిశీలించుచు, నమరసింహుఁ డయ్యమూల్యాంబర పరిశీలనా వినోదంబునఁ దన్మయుండయియే యుండెను. అప్పుడు మఱియొక దృష్టియే వానికి లేకపోయినది. తన్ను తానే మఱచిపోయెను. చావడిలోనికి వచ్చిన వారెవరో, వచ్చుచుఁ బోవుచుండిన వారెవరో, పాప మెట్లు కనుఁగొనఁగలఁడు? ఎవరెవరిని బిలుచుచుండిరో యెట్లు వినగలఁడు? అందుచేతనే యాకస్మికముగ వచ్చిన షహాబజ్‌ఖానుఁ డాచావడిలోఁ బ్రవేశించి తన వీపుపైఁ దట్టువఱకు వానికి మేన స్మృతియే కలుగలేదు.!!!

తనవీపుపైఁ దట్టిన వారెవ్వరో యని యమరసింహుఁడు త్రుళ్ళిపడి తటాలున వెనుకకుఁ దిరిగి షహాబజ్‌ఖానుని భయంకరవిగ్రహమును జూచి సహజభీరుఁ డగుటచేతనో రహస్యవస్తువైన చీర వాని కంటఁబడుటచేతనో యూరక తత్తర పడసాగెను. వాని శరీరమును వడఁక దొడంగినది. ఖాను మాత్రము వాని యవస్థ యింకను గనిపెట్టలేదు. అమరసింహుని సమీపించినది మొదలు వాని దృష్టు లాచీర



యందే లగ్నమైనవి. అట్టి దృష్టితోడనే యతఁడు 'బచ్ఛా! భామాసాజీ యెక్కడ? లాహాదుర్గమునుండి షహంబజ్‌ఖాను వచ్చెనని చెప్పెదవా? ఏదీ? ఈ చీర నాచేతికిచ్చి నీవు త్వరగాఁ జెప్పిరమ్ము' అని పలుకుచు వాని చేతులనుండి దానిని లాగుకొనెను. తోడనే యమరసింహుని తత్తరపాటు మఱింత యధికమైనది. తడబడుమాటలతో నతఁడు గడగడ వడఁకుచు—

'ఈ - చీ - ర-ఈ-చీ-ర- రహస్యము! రహస్యము! చక్రవర్తి-చక్రవర్తి-ఇది-ఇది-- మీరుచూడఁ గూడదు.

"చక్రవర్తియా? చక్రవర్తికిని, ఈచీరకు నేమి సంబంధ మున్నది? సరే యేమి సంబంధమున్నదో కనుగొందము. భామాసాగారిని దీసికొనిరా."

ఇంతలో నాగదిలోనుండి భయకంపిత స్వరముతో "అమరసింహా! అమరసింహా! నాచీర నాకిచ్చివేసి సాహేబ్జీవారిని గర్భాగారముననున్న బాబాజీగారియొద్దకుఁ దీసికొని వెళ్ళు." అని మీరాభాయి పలికెను. ఆపలుకులు విని "హో హో కోకిల స్వరము! ఈ చీర కేమియు భయములేదు. నే నపహరింపను." అని ఖాను పలుకుచు రెండుమూఁడు మడతలు విప్పి "నౌరోజాఉర్స్! అల్లాహో అక్బర్" అను నక్షరములు చదివి గంభీరముగ శిరః కంపనముచేయుచు దీర్ఘముగ నాలోచింప సాగెను. ఆ సమయమున "అయ్యో! భామాసాగారున్నారా? మాకు మేలైన నాలుగు దుస్తులు కావలయు'

నని పలుకుచు నింకొక యువకుఁ డా చావడిలోఁ బ్రవేశించి ఖానుని జూచి నిర్ఘాంతపడి యట్లే నిలిచిపోయెను. ఖానుగూడ వానింజూచి తెల్లబోవుచు "శక్తిసింగ్! నీవేనా! ఎవరో యనుకొంటిని." అని తానే వానినిఁ బలుకరించెను. శక్తిసింగు చిరునవ్వు నవ్వుచు శిరమూపెను. అదియే యతఁ డొసంగిన ప్రత్యుత్తరము. ఇంతలో నమరసింహుఁడు వారికి దారిచూపుటకుఁ బ్రారంభించుటచేత ఖానుఁడు శక్తిసింగుతోఁ గూడఁ గర్మాగారమునకు బయలుదేరెను. చీరయు వాని చేతుల యందే యుండెను.

## ఇరువదిరెండవ ప్రకరణము.

### ఆగ్రాలోని విశేషములు.

పెక్కుదినములనుండి యాగ్రాపట్టణములోని విశేషములేమియుఁ జదువరులకుఁ దెలియలేదు. చక్రవర్తి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై జగమల్లు తన మన్సఫ్దార్పదవి యందుఁ గృతకృత్యుఁ డగుచుండుట మొదటి విశేషము. నిత్యోద్యోగ విధివిధానముల నతఁడు కడుఁ జాకచక్యముతో నెరవేర్చుకొనుచు నితఁ డింతకంటెను గొప్పపదవి కర్హుడని సాటియుద్యోగులచేతనే మెప్పువడయుచుండెను. ఆతని యధ్యక్షత క్రిందనున్న యైదువేలమంది సైనికులును గూడఁ దమనా



యకుఁ డత్యుత్తముఁ డనియుఁ దమకన్నివిధముల ననుకూలుఁ డనియు సంతసించుచు నాతని కనుసన్నల మెలంగుచుండిరి. అన్నివిధముల స్తోత్రపాత్రుఁడే యగుచున్నను జగమల్లుఁ డొక్కవిషయమునందుఁ మాత్రము హాస్యాస్పదుఁ డగుచున్నాఁడు. తనకార్యస్థానములోఁ బనిచేసికొనుచున్నప్పుడైనను, మఱియెప్పు డెక్కడ నెట్టితొందరపనిలోనున్నను, కడకు దర్బారులోఁ జక్రవర్తితో రాజకీయ కార్యాలోచనము సేయుచున్నప్పుడైనను సరియే తనహృదయము నాకర్షించు రూపురేకలు గల చిన్నపిల్లలెందైనఁ గంటఁబడిరా యెవ్వరేమనుకొందురో యని లేశమును శంకింపక తుఱ్ఱున వా[illegible] బరువెత్తి యొక్కమాఱెత్తుకొని ముద్దాడి మఱల యథాక్రమముగ వచ్చి కూర్చుండుచుండును. దర్బారునకుఁ గాని, సైనికకార్యస్థానమునకుఁ గాని యతఁడు తన రావలసిన వేళ నతిక్రమించి వచ్చినయెడలఁ గారణ మడుగనక్కరలేకయే త్రోవలో నెవరైన పిల్లలు వాని కంటఁబడియుందురని చక్రవర్తియు నుద్యోగస్థులును నిశ్చయించుకొనుచుందురు. పిల్లలపై నింత మోహముగలవాఁడవు నీవేల వివాహము చేసికొనఁ గూడదని చక్రవర్తియు స్నేహితులును గూడ నొకటి రెండుమాఱులు జగమల్లును బ్రోత్సహించిరి. కాని యతఁడు వివాహమునకు సమ్మతింపక, యేనాటికైన దనకుఁ బ్రబల విరోధియగు ప్రతాపుని సంహరించి, తత్కుమారికమైన యంబాబాలికను

పెంచుకొనవలయు నని యుద్దేశమున్నట్లు చెప్పుచుండెను. జగమల్లున కేర్పరుపఁబడిన నివాసమందిరము పృథ్వీరా జింటికిఁ బ్రక్కనే యుండుటచేతఁ జోధాభాయి కరుణతోఁగూడ నాతనినిఁ దఱుచుగా సందర్శించుచుండును. సందర్శించినపు డెల్ల నమాయకుఁడును నిరపరాధియు రాజ్యములేక యడవులలో నతిదీనుఁడై యాలుబిడ్డలతో బడరాని యిడుమలు పడుచున్నవాఁడును నిన్నింటి కంటె నగ్రజుండును నగు ప్రతాపునిపై నీకింత ద్వేషము తగదని బోధించుచు నాతని చిత్తవృత్తి మార్చుటకు జోధాభాయి ప్రయత్నించుచునే యుండెను. కాని యా ప్రయత్నము లేమియుఁ గొనసాగున ట్లామెకుఁ దోచలేదు.

ఇంక మనము తెలిసికొనవలసిన రెండవ విశేషము మానసింహుని రోగావస్థ. సరిసరియన్నంతవఱకు వచ్చిన రోగంబెల్ల నదృష్టవశమున నివారణంబగుటచే నతఁడిప్పుడు సంపూర్ణారోగ్యవంతుఁడై యున్నాఁడు. ఆరోగ్యస్నానము గూడ జరిగినది. గ్రహశాంతులు దేవతారాధనములు మ్రొక్కుబడులు మొదలగునవి యుచితగతిఁ గావింపఁబడినవి. యథాక్రమముగఁ దనయుద్యోగధర్మమును మరలఁ బ్రారంభించుటకు మానసింహుఁడు శుభదినము కొఱ కెదురు చూచుచుండెను. కడ కాశుభదినంబును వచ్చినది. ఆనా డాగ్రాలోనున్న రాజపుత్రకుటుంబముల కెల్లఁ దనయంతఃపురమున మానసింహుని చెల్లెలు విందు గావించుచుండెను. ఉదయమునుండి సాయంకాలమువఱకునుగూడ గుఱ్ఱపుబండ్లును బల్లకులు నెక్కి, వచ్చువారితోడను వెడలువారితోడను మిక్కిలి కలకలలాడుచు రాజమందిరంబెల్ల నత్యుత్సాహపూరితంబై యుండెను. నాటి సాయంకాలమున నంతఃపురమున ఘల్లుగ జరుగుచుండిన సంగీతములు నాట్యములు మంగళధ్వనులు మొదలగు వినోదములను జూచుటకు నమూల్యాంబరాభరణాలంకృతలై రాజపుత్రకాంత లనేకులు వచ్చుచుండిరి. నా డెక్కడఁజూచినను నుత్సవమే. ఎక్కడఁజూచినను సంతోషమే. అంతఃపురముననే గాక దర్బారుమందిర ప్రాంతమునఁ గూడఁ గలకలము హెచ్చుగనే యుండెను. నాటి సాయంకాల మేర్పరుపఁబడిన శుభముహూర్తమున మానసింహుఁ డొకమాఱు దర్బారునకు వచ్చి కూర్చుండి వెడలి పోవునఁట! చక్రవర్తితరువాత మానసింహుఁడే మొగలాయి సామ్రాజ్యమున కధినాథుఁ డగుటచేత సమస్త రాజోద్యోగస్థులును హాజ రగుచుండిరి. చక్రవర్తి కూడ వచ్చునని వదంతి పుట్టినది. నాలుగు మాసముల కానాడుమాత్రము దర్బారు చూడఁగలిగిన మానసింహునిఁ జూడఁ గలుగుదుమని పురవాసులును వచ్చుచుండిరి. యోగ్యులైన యధికారులు ప్రజాభిమానమేల పడయరు?

ఆనాటి సాయంకాలమున మేరీరాణిదాసియగు లూసీ యువరాజకుమారునివిహారమందిరద్వారముకడ నొక మధుపానకాచపాత్రఁ గొని నిలువఁబడియుండి, యొందుచేతనో

తత్తరపాటుతో గవాక్షముల నుండి లోనికిఁ జూడసాగెను. చూచుచుండుకొలఁది నామె యాందోళనము నధికమైనది. క్రమక్రమముగ నమ్మందిరాంతర్భాగమునుండి సన్నని కంఠస్వరముతో స్త్రీరోదనము వినరా దొడంగినది. ఆరోదన ధ్వని వినుటయే తడవుగఁ బాపము లూసీ మతిపోయిన దానివలె నిటునటుఁ బరువెత్తుచు మఱల గవాక్షముకడకు వచ్చి చూచుచు "రాజకుమారా! వలదు. వలదు. తప్పు తప్పని కేక లిడుచు నెందుచేతనోగాని యాకస్మికముగ నొక్కమాఱు తుళ్లిపడి, గవాక్షమువద్దనుండి యీవల కొక్కగెంతు గెంతి—తెల్లని మొగమునం గ్రమ్ము తామ్రవర్ణ శిరోజమ్ములఁ గొనగోళ్ళ నెగఁజిమ్ముకొనుచు—లేఁగాఁ నసియాడ గొనల్లలాడ—అందందుఁ గల మందిరంబుల నడుమనుండు సన్నని త్రోవలనుండి పఱుగిడుచు విశాల ప్రాంగణముగల యొక యంతఃపురద్వారము కడకు వచ్చెను. ఆద్వారముకడ నున్న ఫహారా సిపాయి, యూరిలోని పిల్లల నెత్తుకొని వచ్చి లోనికిఁ బోవ నుద్యమించిన దాసీల నడ్డగించుటచేత వారందఱు నాద్వారము ముందటి నున్నని గచ్చునేలపైఁ గూర్చుండి యచ్చటినుండియే వీథులైనంత వఱకు వినోదముల వీక్షించుచుండిరి. వారి చుట్టును వారెత్తుకొనివచ్చిన పిల్లలాడుకొనుచుండిరి. నడువఁగలవారును నడచియు నడువలేనివారును, నడువనే నడువలేనివారును నగు నందఱు బాల బాలిక లొక్కయెడనుండ నక్కడ జగమల్లుఁ



డుండునని చెప్ప నక్కరలేదుకదా? ఒకరి నాడించుచు నొకరిసి మాటలాడించుచు నొకరి నెత్తుకొనుచు నొకరిని ముద్దులాడుచు నానందపరవశుఁడై యున్న జగమల్లుం జూచి, లూసీ వెక్కి వెక్కి యేడ్చుచు—"మన్నస్థార్జీ! రక్షింపవలయు! రక్షింపవలయు! అతిదారుణముగ నొక యనాథస్త్రీ మానభంగము పాలగుచున్నది." అని పలికెను. తోడనే జగమల్లుఁ డక్కడి పిల్ల నక్కడనే విడిచి, విచారాశ్చర్యములతో "లూసీ! మానభంగమా? ఎక్కడెక్కడ? పద! పద!" అని యామెను ద్వారపెట్ట మార్గదర్శినియై లూసీ పఱుగిడ దొడంగెను. భీతకురంగి ననుసరించు గంధసింధురము భంగి నామె [illegible]కీడగు నడకతో క్షణములో జగమల్లుఁడు గమ్యస్థానమును జేరెను. చేరి, లూసీ చూపిన కనుసంజ్ఞల గవాక్షమును సమీపించెను. తోడనే యమ్మందిరమునుండి కామాతురుండగు నొక ధూర్తునకును, మానభంగ భయమ్మున గద్గదఖిన్న కంఠియైన యొక కలకంఠికిని జరుగుచుండిన సంభాషణము జగమల్లు కర్ణపుటంబుల విస్పష్టముగఁ బడ నారంభించెను.

"చెప్పు! చెప్పు! నిష్కారణముగఁ జచ్చిపోకు! చచ్చిపోయితివా మరి బ్రతుకవు నామాటవిను!"

"ఓరి మూర్ఖా! ఘృష్టఖడ్గంబగు నొడ్డాణమిప్పుడు నా మొలయం దుండిన నిన్నింత ప్రేలనిచ్చెదనురా? పాపాత్మా! నీ దురాచారంబెల్లఁ జక్రవర్తితోఁ జెప్పి నిన్నేమి చేయించెదనో చూడు!"

"అహ్హాహ్హా! కరుణా! నీవు బ్రతికి పైని బడినప్పుడు గదా? ఎవరితోనైన చెప్పకొనుట! భీముఁడు కుచేలుని నంత మొనరించినట్లు నిన్నిమారుమూలనే రెండవ కంటఁబడకుండ చంపివేసెదను. అట్టి చావు చావక నామాట విను. ఇఁకనైన నామాట విను."

"ఛీ! పశువా! నీ పాండిత్యము పండిపోయినట్లేయున్నది. ఓసీ! ముద్దా! మెహరున్నిసా! శిలావిగ్రహమువలె నామూల నిలువఁబడి మాటాడవేమే? ఈ దారుణకృత్యమును జూచుచు నూరకుందువేమే? అయ్యయ్యో! నన్నెంత మోసము జేసి చెప్పితివె?......"

కరుణా! మెహరున్నిసాను నీవేమన్నను నేనొప్పకొనను. నేను చిత్తూరు రాణానైనప్పుడు నాకామె పట్టపురాణి కాగలదు. అంతవరకు నీవు నాకు భార్యవు కావలయును. నాకనగా నాకే కాదు. మాకు. అనఁగా నాకును సలీమునకు నన్న మాట. ఇద్దరుపంచపాండవుల మున్నాము! ఈయిద్దరుపంచపాండవులకు నీవు సావిత్రివి కావలయు! రణమల్లుఁడు చావగా బ్రతికి వచ్చిన వాఁడను. బ్రతికియున్న జగమల్లును బట్టి తెచ్చిన వాఁడను. నాసంగతి జగత్ప్రసిద్ధమే కదా! ఇంక నితడు యువరాజ కుమారుఁడు! కాబోవు చక్రవర్తి! నీకెందుకు సంశయము?...."

ఇంతవఱకు నాప్రసంగమును వినుచున్న జగమల్లున కిప్పుడు శరీరముపై స్మృతియే లేదు. ఆగ్రహోదగ్రంబగు విగ్రహంబుతోఁ గన్నులనుండి యగ్నికణంబులు ఫాటపాట



రాలఁ బండ్లు పటపటఁ గొఱుకుచుఁ దటాలునఁ గవాటము కడకు లంఘించి, మూయఁబడియున్న సున్నితంబులగు సన్నని రెక్కతలుపులపై తనబలము కొలందిఁ గాలితో నొక్క తాపు తన్నెను. రెండవ తాపక్కరలేకుండ నా రెక్కతలుపులు రెండును గభిల్లున వ్రక్కలై వీడి ప్రక్కల కొరిగి పోయినవి. కేసరి కిశోరమ్మునుం బోలె జగమల్లత్యాకస్మికముగ లోని కుఱికి, చుట్టును బట్టు సోఫాలతోడను, చిత్రవిచిత్రంబులగు చిత్రపటములతోడను, నట్టనడుమ మధుపాన పూరితంబులగు హేమపాత్రంబు లుల్లసిల్లు నెత్తైన దంతపు బల్లలతోడను జూడ సొంపైన నవ్విహార మందిరవైభవంబుపై లక్ష్యమె లేక దంతపు మేజాలకుఁ బ్రక్కనే యొకమఖమల్ సోఫాపైఁ జేరఁబడి, ముందున్న మఱియొక్క సోఫాపైఁ గాళ్ళు నిగడఁదన్ని, పెదవులకడఁ బట్టియుంచిన హేమపాత్రము నందలి మధువును గొంచెము కొంచెముగఁ ద్రాగుచు వికారముగ నవ్వుచుండిన సలీము కుమారుని రాసికొని యందొకమూలఁ బాపము బల్లివలె గోడకంటుకొని ఫెల్లుగ దురపిల్లుచుండిన కరుణకుఁ గట్టెదుట నట్టిటు నాట్యమాడుచుండిన దాఘోదరుని వెనుక నుండియే సమీపించి తలుపుపైఁదన్నిన తాపున కేపుతీయని తాపు నొక్కయూపున నాతని వీపుపైఁ దన్నెను. మితి నతిక్రమించిన సురాపాన మత్తతచే గుర్తింపలేక పోయెనో, లూసీయే పైనుండి మోదుచున్నదని భ్రాంతిపడెనో గుభిల్లునఁ

గూలిన తలుపుచప్పుడుచే లేశమును జలింపకుండిన స్యాలకుఁ డాతాపుతో నడుము విఱిగి భోరుమను కేకతో జగమల్లుని పాదములకడ వెల్లకిలఁ దిరుగఁబడి, నడుమువిఱిగిన పామువలె గిజగిజఁ గొట్టుకొనసాగెను. సలీమునకుఁగూడ నప్పుడే మైమఱపు తొలంగి తెలివివచ్చుటచేతఁ దటాలున నాసనముపై నుండి లేచి భయకంపిత స్వరంబుతో "అరే! అరే! ఎవఁడవురా! ఎవఁడవురా?" అని కేకలిడుచుండ జగమల్లుఁ డాతని పైకుఱికి తన రెండుచేతుల నాతని రెండుదౌడలు దంతములూడిపడునట్లు గట్టిగనొక్కి శిరమువంచి యర్ధచంద్రప్రయోగముతో ముందునకొక్క త్రోపు త్రోసెను. ఆత్రోపుతో సలిముఁడు దామోదరునిపైఁబడి, గుటకలు మ్రింగుచు గడగడ వడకుచు వెఱ్ఱివానివలె నిటునటుఁ జూడసాగెను. వెల్లకిలఁ బడిన దామోదరుఁడును గద్గదస్వరముతో "ఎవఁడవురా? ఎవఁడవురా? ఎంత సాహసమురా!" యని యఱచుచుండ, జగమల్లుఁడు "నేనురా! నేనురా! కుచేలునిఁ చంపిన భీముఁడనురా? మీయిరువురు పంచపాండవులను జంపవచ్చితినిరా" అని పలుకుచు నాతని శిరంబునను,నురంబునను గూడఁ బ్రబలపాదప్రహారములఁబ్రయోగించెను. దామోదరునిపైఁదిరుగబడినప్పుడు వానిఁ మోకాలు శిరమునకుఁ దీవ్రముగఁ దగులుటచే మిక్కిలి బాధపడుచుండిన సలీమునెడఁగూడ జగమల్లుఁడు పక్షపాతము వహింపలేదు. నేలఁ బడియున్న వారిరువురిపై నతఁ డాగ్ర



హాతిశయంబున నోడలు మఱచి తాండవించుచుండఁ గరుణ కరుణారసభరితయై 'బాబాజీ! ఇంతతోఁ జాలును! ఇంక శాంతింపుఁడు. ఇంక శాంతింపుఁ' డని దీనముగ వేడుకొనదొడంగినది. నోటమాటలులేక కన్నీరు మున్నీరుగా నేడ్చుచు నేలఁబడియున్న యాదీను లిరువురును జేతులు మోడ్చి తమ్ము క్షమింపవలయునని సంజ్ఞలతోడనె జగమల్లునిఁ బ్రార్థింపసాగిరి. అంతతోఁ దన తాండవక్రియ చాలించి కరుణం జూచి 'అమ్మాయీ! వచ్చిన పని యైనది. ఇంకఁ బోవుదమా!' అని పలుకుచు నతఁడు కరుణతోఁ గూడ, ద్వారముకడకు వచ్చెను మృత్యుముఖము నుండి తప్పించుకొనినట్లు జగమల్లుబారినుండి [illegible] మెహరున్నిసా యేక్షణమున నేద్వారమునుండి జారిపోయినదో యెవ్వరును గనిపెట్టలేదు. జగమల్లుఁడు కరుణతోఁగూడ శిథిలకవాటముల కడకు వచ్చి లూసీకొఱ కిటు నటుఁ జూచుచుండ, లూసీకి బదులుగ దిలేర్ఖాను వాని కంటఁ బడెను. దిలేర్ఖాను గూడ నాతనినిఁ జూచి "మన్సఫ్ దార్జీ! ఇక్కడనా యున్నారు! మీకొఱ కెన్నియో స్థలములు వెదకి వెదకి మీ రీ ప్రాంతమునకు వచ్చిన ట్లెవ్వరో చెప్పినందున నిట్లు వచ్చితిని." అని పలుకుచు సమీపించి శిథిల కవాటములం గాంచి యాశ్చర్యపడి, "రాజాజీ! తలుపు లేమి యిట్లు బ్రద్దలై పోయినవి?" అని వింతగా నడిగెను. జగమల్లు నవ్వుచు వాని చేయి పట్టుకొని లోనికి లాగి, నేలఁ బడియున్న

స్త్యాలక సలీములను వ్రేలితో జూపించుచు—"దిలేర్ఖాఁ! చూడు! వీరిరువురుఁ జెడఁద్రాగి తలుపులు బ్రద్దలు చేసి కుమ్ములాడుకొని యెట్లు నేలఁ బడియున్నారో?" అని చెప్పెను. దిలేర్ఖాను నోరు కొట్టుకొనుచు వారిని సమీపించి యిరువురను జెరియొకచేత లేవఁ దీయంబోయి—

'జగమల్లు! లేవ లేకున్నారేమి?'

"తప్పఁ ద్రాగినవారెట్లు లేవఁగలరయ్యా?"

"ఔనుగాని—ఏడ్చుచున్నారేమి?"

"మీరు త్రాగుచున్నట్లు చక్రవర్తికిఁ జెప్పి వేసెద నంటిని —— నిజమే యనుకొని యేడ్చుచున్నారు. నిషా వదలిన తరువాత వారే లేచెదరు. నీవు రమ్ము!"

దిలేర్ఖాను వారిని విడిచి ముందుకు వచ్చి—

"తమరు త్వరగా దర్బారుమందిరమునకు దయచేయవలెను. నాతో మువ్వురు సిపాయిలు మీ కొఱకుఁ దిరుగుచున్నారు. ఎట్లున్న నట్లు హాజరు కావలయునని సెలవైనది."

"పాదుషావారు కూడ నున్నారా"

"అందఱు నున్నారు. తమరు త్వరగా దయ చేయవలెను."

"దిలేర్ఖాఁ! చెప్పు! చెప్పు! విశేషము లేమి?"

"దండయాత్రనుండి యాసఫ్ఖానుఁడు తిరిగి వచ్చిన సంగతి మీరు విన్నారు కదా?"



"వచ్చినట్లే కాదు. ప్రతాపుని వద్దనుండి యేదో యుత్తరము తెచ్చినట్లును విన్నాను."

"ఆ యుత్తరము కొఱకే యిప్పుడు మీ యవసరము. ప్రస్తుతము మీకు నేను వశమైతినని ప్రతాపుఁడేమో వ్రాసినాఁడఁట! అట్టి యుత్తర మతఁడు వ్రాయునా యని కొందఱు—వ్రాయఁడని కొందఱు—వ్రాయఁగూడదా యని కొందఱు—ననేకవిధములఁ జర్చించుచున్నారు. ఆ యుత్తరము నందలి సంతకము ప్రతాపుని దగునో కాదో మిమ్మడిగి తెలిసికొనవలయునని పాదుషావారు మీకొఱ కెదురు జూచుచున్నారు. మనము త్వరగా వెళ్ళవలయును."

ఈ సంభాషణములోనే కరుణకొఱకు స[illegible] వచ్చినది. అది లూసీ చేసిన యేర్పాటు. జగమల్లు తలుపులు పగులఁగొట్టి లోనఁ బ్రవేశించినప్పుడే యామె యచ్చటనుండి వెడలిపోయినది. కరుణ సవారిలోఁ గూర్చుండి యింటికి బయలుదేరెను. జగమల్లు దిలేర్ఖానుతో దర్బారుమందిరమునకుఁ బోయెను.

## ఇరువదిమూఁడవ ప్రకరణము

### రాజసింహుఁడు.

"మొగలాయి సార్వభౌమా!

నాకును నాకుటుంబమువారికిని గూడ శరీరము లస్వాస్థతయం దుండుటచేత, ప్రస్తుతము మీకు నేను వశమగుచు

న్నాను. సేనల మఱలించి మీ దండయాత్ర నింతతోఁ జాలించెదరుగాక!

రాణాప్రతాపసింగ్"

ఇట్లు వ్రాయఁబడిన యుత్తరమునందలి సంతకము ప్రతాపునిదే యని యెఱింగియు జగమల్లు చెప్పలేదు. చెప్పిన యెడల నట్లు వశపడిన తన యన్నపైఁ జక్రవర్తి దండయాత్ర చాలించుననియు, చాలించుటయేగాక యాతఁడు తనకుఁ బట్టుపడవలెనని మిక్కిలి పట్టుదలతో నున్న వాఁడగుటచే మితిమీరిన సంతోషాతిశయమునఁ బ్రతాపునకు మఱలఁ జిత్తూరు సామ్రాజ్యమే యొసఁగునో లేక మఱెట్టి మహోపకృతిఁ గావించునో యనియు, తన శత్రుత్వము తీర్చుకొనుట కవకాశములు తప్పు ననియు నెంచి 'మహాప్రభూ! ప్రతాపుని సంతక మిట్టులే యుండునుగాని, యక్షరముల పోలికను బట్టిచూడ నతఁడు స్వయముగాఁ జేవ్రాలుఁ జేసినట్లు గానరాదు. అందుచే నేను నిశ్చయముగాఁ జెప్పఁజాలను. ఈచేవ్రాలనుమానింప వలసినదేగాని రూఢిపరుప వలసినదిగాదు.' అని వానికిఁ బ్రత్యుత్తర మొసంగెను. ప్రతాపుని యుత్తర మని యుగ్రసేనుఁడు తెచ్చియిచ్చుట చేతఁ దాను విశ్వసించినట్లును, ప్రతాపుఁడు స్వయముగాఁ జేవ్రాలు చేయుట తాను జూడలేదనియును నాసఫ్ఖానుఁడు మనవిచేసికొనెను. మొత్తముపై నాయు



త్తరము ప్రతాపునిదగునా కాదా యను సందియము చక్రవర్తికిని సభ్యులకును గూడఁ గలిగినది. నాటి సాయంకాలమున జరిగిన దర్బారు కేవలము మానసింహుని సుముహూర్త ప్రవేశము కొఱకే నిర్ణయింపఁబడినదిగాని రాజకీయవిషయవిచారణమున కేర్పడినది కాదు. అందుచే సార్వభౌముఁ డాచర్చ నంతతోఁ జాలించి యాయుత్తరమును బృథ్వీరాజున కిచ్చి, చక్కగ నాలోచింపవలసిన దని సెలవిచ్చి సభ చాలించెను. పట్టుపడిన జగమల్లుఁడే ప్రతాపుఁడని భ్రాంతిపడి చక్రవర్తి తాను బడిన వ్యర్థప్రయాస మింకను మఱచిపోలేదు. అందుచేఁ బ్రతాపునిగూర్చి యెట్టివిషయమైనను దగినంత నిదర్శనము లేకయే యతఁడు సామాన్యముగా విశ్వసింపఁడు.

చక్రవర్తి యిచ్చిన యుత్తరము గైకొని పృథ్వీరాజింటికి వచ్చెను. నాటిరాత్రి చాలసేపువఱకు నతఁ డా యుత్తరముతో సంబంధించిన యాలోచనముతోడనే గడపెను. ప్రతాపుని సంతకముతో నుత్తరము లేమైనఁ దనవద్ద నుండునేమో యని పెట్టెలన్నియు వెదకెను. అట్టి యుత్తరము లేమైన మీ యొద్దనున్నవా యని కరుణాజోసీభాయిల నడిగెను. కాని పెట్టెల యందును లేవు. వారి యొద్దను లేవు. ఆసందర్భమునందే స్వాలక సలీముల వలన నాటి సాయంకాలమునఁ గరుణకుఁ దటస్థించిన దుస్థితి జోసీభాయివలన విని, పృథ్వీరాజు మిక్కిలి విచారించి యనునయవాక్యముల ధైర్యము గఱపుచుఁ గరుణ

నంతయు నోదార్చెను. పృథ్వీరాజువలెనే కరుణాజోసీభాయిలుగూడ నాటిరాత్రి ముందటి చావడి కిరువంకలంగల రెండు గదులలో నొక గదియందుఁ గూర్చుండి యేవిషయమును గూర్చియో దీర్ఘముగ నాలోచించుచుండిరి. రెండవ గదియందుఁ బృథ్వీరాజు కూర్చుండెను. పృథ్వీరాజువలెనే వారును నేదో యొక యుత్తరమును మాటిమాటికిఁ దమలోఁ జదువుకొనుచు నతిరహస్యముగ గుసగుస లాడుకొనఁ జొచ్చిరి. పృథ్వీరాజుకడ నున్న యుత్తరమును వారు చూచిరి. కాని వారికడనున్న యుత్తర మెట్టిదో యతఁ డెఱుఁగఁడు. ఆలోచనానిమగ్నుఁడై యొక్కొక్కప్పు డాసనముపైనుండి లేచి పచారు సేయుచు నతఁడు తమ వంకవచ్చునను ననుమానము తోఁచినప్పు డెల్ల వా రాయుత్తరమును దాచివేయుచుండిరి. నాటి సాయంకాలపు సంగతిని గూర్చియే వారంత దీర్ఘముగఁ బ్రసంగించుచుండిరని యెంచి పృథ్వీరాజు వారి నేమియుఁ బ్రశ్నింపలేదు. ఒకటి రెండు మాటలు మాత్రము చాలరాత్రియైనదిఁకఁ బండుకొనుఁడని హెచ్చరించెను. పృథ్వీరాజుకుఁ గూడఁ దెలియఁగూడదని యంతరహస్యముగ గుసగుసలాడుకొనుచుండిన కరుణా జోసీభాయిల ప్రసంగ మెట్టిదో, యాయుత్తర మెట్టిదియో కనుఁగొనఁ బ్రయత్నించుట మన కిప్పుడు న్యాయము గాదు. అందుచే వారి నట్లే విడిచి, మనము పృథ్వీరాజు సంగతి కొంత విచారింతము.



కూర్చుండుచు లేచుచుఁ బచారుసేయుచుఁ బ్రతాపసింహుఁ డిట్టి యుత్తరమును వ్రాసియుండునా యని యతఁడు తనలోఁ దానె ప్రశ్నించుకొనును. మాటమాత్రమునకు సకల వైభవములఁ బరిత్యజించిన యమ్మహామహుఁ డిట్టి యుత్తర మెన్నఁడును వ్రాయఁడని నిశ్చయించుకొనును. ఒకమానవుఁడు తనజీవితములో నిట్టి మార్పు చెందఁగూడదా యని సమర్థించుకొనును. అన్నోదకంబులు లేని యాలుబిడ్డలపాట్లు చూడలేక యిట్టి నైచ్యమునకుఁ బూనుకొనెనేమో యని యెంచి దారిద్ర్యప్రభావమును మెచ్చుకొనును. ఇట్టి తలంపులతోడ నతఁడా రాత్రి పండ్రెండు గంటలవఱకుఁ గడపెను. పర్యవసానమున సందేహము సందేహమువలెనే యుండ వానికి నిద్ర పట్టినది.

తెల్లవారినది. చాలఁ బ్రొద్దెక్కువఱకుఁ బృథ్వీరాజు మేల్కొనలేదు. పెందలకడ లేచిన కరుణాజోసీభాయిలు చావడిలో సుఖాసీనుఁడై యున్న యొక క్రొత్తపురుషునితో నేమో మాటాడుచుండిరి. ఆ పురుషుని కించుమించుగ నేఁబది యేండ్లుండును. వేషమును బట్టి రాజపుత్రునివలెనే తోఁచుచున్నాఁడు - మఱియుఁ జామన చాయ గల యాజానుబాహువిగ్రహుఁడు. ముంజేతుల యందలి కంకణములు, వ్రేళ్ళకుఁ గల వజ్రపు రవల యుంగరములు, తలపైఁ దళతళ లాడు బంగరు జరీ చెమ్లాయును నతఁడు గొప్ప ధనికుఁ డనుకొనుట

కవకాశ మిచ్చుచున్నవి. ఆ కాలపుఁ జేతినేతపనుల యందలి నేరుపు చూపుట కాతఁడు ధరించిన సన్నని తెల్ల దుస్తులు మచ్చుగాఁ గొనుటకుఁ బనికివచ్చును. వానితో సంభాషించుచున్నంతసేపును బాపము కరుణ యేడ్చుచునే యున్నది. ఆతఁడుఁ గూడ మాటిమాటికిఁ గంట నీరు పెట్టుకొనుచుండెను. జోసీభాయిమాత్రము ధైర్యముతోడనే యుండి వారికి దుఃఖోపశమన వాక్యములు కాఁబోలుఁ బలుకుచున్నది. సంభాషణ మంతయు ముగిసిన తరువాత నాపురుషుఁడు లేచి వెలుపలికి వచ్చి గుమ్మము మెట్లపై నిలువఁబడి మఱల వెనుకకుఁ దిరిగి చూచెను. కరుణ, జోసీభాయితోఁ గూడ గుమ్మము దాఁక వచ్చినద.

“అమ్మాయీ, కరుణా! నా కేమియు భయము లేదు. నా నిమిత్తము నీవు లేశమును విచారింపకుము. ఇంత జాలి గుండె గలదానవు గదా? తలపెట్టిన సాహస కార్యము నెట్లు నిర్వహించుకొనఁగలవో యని యిఁకమీఁద నాప్రాణము లన్నియు నీమీఁదనే యుండును.”

‘‘నా కట్టిసంశయము లేశమును లేదు. అయినను మీ కిష్టము లేనియెడల మానివేసెదను.’’

‘‘మీ పిన్నిగా రెట్లు చెప్పిన నీ వట్లు నడుచుకొన వలసినదే. ఆమె కున్న బుద్ధివిశేషము మనకు లేదు. ఆమె తలపెట్టిన కార్యము సాధారణముగ భంగము కాదని నా నమ్మ



కము. తల్లీ, జోసీభాయి! నాకు సెలవా? అమ్మా, కరుణా! నే నింకఁ బోయివచ్చెదను.”

మొగము వంచుకొని కరుణ కన్నీరు గార్చుచు—

“మఱల మి మ్మెప్పుడు చూడగలను?”

“అదుగో! అదే మానుమని నీకుఁ జెప్పుచున్నాను. నీ స్త్రీహృదయము నింకఁ బురుషహృదయముగా మార్చుకొని పురుషుల కుండఁదగిన ధైర్య సాహసముల వహింపుము. వెఱ్ఱిదానవుగాని నే నెవ్వరు, నీ వెవ్వరు? నీకు నాకు నేమి సంబంధ మున్నది?”

అని ప్రసంగించి, జోసీభాయియొద్ద మఱియొకమాఱు సెలవు పుచ్చుకొని, కరుణతో నింకొకమాఱు చెప్పి యాపురుషుఁడు వెడలిపోయెను. వా రిరువురును నేమేమో మాటాడుకొనుచు లోనికిఁ బోయిరి. అప్పటికిని బృథ్వీరాజు మేలుకొన నందున జోసీభాయి గదిలోనికేగి వానిని లేపివేసెను. కన్నులు నులుముకొనుచుఁ దెలివి తెచ్చుకొని, కన్నులు మూసికొనియే వెల్లకిలఁ బరుండిన పృథ్వీరాజు గుండెలపై రెండు చేతులు జోడించుకొని కొంతవఱకుఁ బరమేశ్వరిని ధ్యానించుకొని, వామహస్తాంతరమునఁ గుడి చూపుడువ్రేలితో ‘శ్రీ’ కారమును జుట్టి కన్నుల కద్దుకొనుచు లేచి కూర్చుండి—

‘‘జోసీ! చాలఁ బ్రొద్దెక్కినది కాఁబోలు! కోటలోనుండి పిలుపు రాలేదు కదా?’’

"రాలేదు. రాజసింహుఁడు మాత్రము వచ్చినాఁడు."

"రాజసింహుఁ డెవరు?"

"కరుణకుఁ బెదతండ్రి కుమారుఁడు."

"నే నెప్పుడు నతనిఁ జూడలేదు. ఎందుకు వచ్చినాఁడు? నా కొఱకేనా? ఇచ్చటికి రమ్మను."

"ఇప్పుడే వెళ్లిపోయినాఁడు. కోటలో మిమ్ముఁ గలిసికొని మాటాడునఁట! కరుణ నొకమాఱు తీసికొని వెళ్ళి కొంత కాలము చెంతనుంచుకొనఁగోరి వచ్చినాఁడఁట?"

"బస యెక్కడ? మన యింట నుండుమనలేదా?"

"చాలవఱకు బలవంతము చేసితిని. మఱల వచ్చెదనని చెప్పి వెళ్లిపోయినాఁడు."

"సరే! కోటలోఁ గలిసికొందుము గదా! మాటాడెదను."

అని పలికి పృథ్వీరాజు కాల్యకృత్యములు నిర్వర్తించుకొని, కృతస్నానుఁడై పూజాగృహంబునం జొచ్చి నిత్యాచార పూజాక్రమంబును యథాక్రమంబుగఁ గావించుకొని దర్బారు దుస్తులు ధరించి, యప్పటికి వాకిట సిద్ధముగనున్న గుఱ్ఱపు బండి నెక్కి సభాభవనంబునకు వచ్చెను. అతఁడు వచ్చుసరికి ఫైజీ ప్రముఖులగు నున్నతోద్యోగస్థులు మానసింహునిచుట్టు సుఖాసీనులై యతఁడు తన రోగ వృత్తాంతమును జెప్పుచుండ వింతగా వినుచుండిరి. తక్కిన మఱికొంద ఱుద్యోగస్థులక్క-



డక్కడఁ గూర్చుండిరి. మానసింహాదుల సమీపమునకే పోవలయు నని పృథ్వీరాజు తత్సభామధ్యస్థితాసన పంక్తులను దప్పించుకొని వచ్చుచుండ, నం దొకచోఁ గూర్చుండిన రాజపుత్రు డొకఁ డాతనిం జూచి తటాలున లేచి యెదురై నమస్కరించెను. తెల్లని పట్టుపెరాయి — సిక్రి పట్టణపు టున్ని బట్టతోఁ గుట్టఁబడిన పొడవగు నల్ల యంగీయు—ఆ యంగీపై నడుమునకుఁ జుట్టఁబడిన వెండిబిళ్ళల తోలుపటకా నంటి యెడమ వైపున వ్రేలాడుచుండిన యొరయందలి కత్తి—తలపై గన్నేరు పూవువన్నెల, జెన్నుమీఱెడు పట్టుపగిడీ— నూనూఁగు మీసం పేనిరాని లేజవ్వనంపు జిగిసొంపు దీపించు చక్కని మొగంబును గల యారాజపుత్రు నాపాదమస్తకము నాకవిరాజు క్షణమాత్రము వీక్షించి—నూటి కెక్కడనో గాని కానరాని వాని చక్కఁదనమున కక్కజపడుచు—

"అబ్బాయీ! నీవేనా రాజసింహుఁడవు?"

"ఔను. ఉదయముననే దర్శనమునకు వచ్చినాను. కాని—"

"ఔనఁట. విన్నాను — నీముఖమును గంఠస్వరమును కూడ నీవు కరుణకు సోదరుఁడవని చెప్పుచున్నవి! నీవు వచ్చిన కారణమును దెలిసినది." ..

అని కొంచము సేపూరకుండి—

"ప్రస్తుతము నీ వెవరియొద్ద నేమియుద్యోగములో నున్నావు?"

"నేను ప్రతాపసింహుని సేనలోని వాఁడను. మొన్ననే యుద్ధము ముగిసినందున మాసోదరికొఱ కిల్లు వచ్చితిని."

పృథ్వీరాజునకు విపరీతమైన యాశ్చర్యము కలిగినది. వెంటనే యతఁడు రాజసింహుని చేయిపట్టి యచ్చటి యాసనంబునఁ గూర్చుండఁజేసి తా నాప్రక్కనే యింకొక యాసనమునఁ గూర్చుండి—

"ఏమీ! నీవు ప్రతాపసింహుని సేనలలోని రాజపుత్రుఁడవా! అట్లైన నింతవఱకుఁ జెప్పవేమి? సమయమునకే వచ్చితివి? నీవలనఁ దెలియవలసిన విశేషములున్నవి. మొదట నీయుత్తరమును జదువు—"

అని తన జేబులో నున్న యుత్తరమును దీసి వానికిచ్చెను. రాజసింహుఁ డా యుత్తరమును జదివినంతనే పృథ్వీరాజు—

"ఈయుత్తరము ప్రతాపసింహుఁడు వ్రాసినదేనా? వ్రాసినట్లు నీవెఱుఁగుదువా?"

"ఈయుత్తరము వ్రాయుటచేతనే సంధి జరిగినది. ఇది మాప్రభువు వ్రాసినదే. నే నెఱుఁగుదును,"

"ఈసంతకము ప్రతాపునిదేనా? ఈయుత్తరము వ్రాయుచుండఁగా నీకన్నులతో నీవు చూచితివా?"

"నాకన్నులతో నేను జూడకపోయినంత మాత్రమున నీ యుత్తర మసత్య మగునా? ఎట్టి యవస్థలోఁ బ్రతాపసింహుఁడీ యుత్తరమును వ్రాసెనో తద్వృత్తాంత మంతయుఁ



దమరు సాంతముగ విన్నచో నిట్టి ప్రశ్న లడుగరు. ఈ యుత్తరమును గూర్చి సందేహమును గలుగదు."

"రాజసింహా! నీ వా వృత్తాంతమును నా కిప్పు డెఱిఁగింపవలయును."

"చక్రవర్తికే యెఱింగింపవలయునని నా కుతూహలము."

"సరే! మొదట నాతోఁ జెప్పు! తరువాత నాలోచింతము."

తోడనే రాజసింహుఁడు నలువంకలఁ జూచి చేరువగా నెవ్వరు లేకపోయినను నతి రహస్యముగఁ దాను జెప్పఁదలంచినది చెప్ప నారంభించెను. చక్రవర్తి యింకను రానందున నచ్చట మానసింహాదులును స్వేచ్ఛగాఁ బ్రసంగించుకొను చుండిరి. ఇంతలో న్యాసఫ్ఖానుఁడు వచ్చి మానసింగునకు సలాము చేసెను. మానసింహుఁ డందుకొని—

"మన్సఫ్‌దార్జీ! మీరు క్షేమముగా వచ్చినారా? ఈ మఱు మీ దండయాత్ర చాలఁగాలము పట్టినది."

"చిత్తము. అల్లే! ఇంతకాలమైనను గార్యము కొంత సాధింప గలుగుటచే సంతోషముతో వచ్చితిమి."

"కొంతవఱకేమి? బాగుగానే సాధించినారు! ప్రతాపసింహునిచే నిట్టి యుత్తరము వ్రాయించుటయే గొప్పప్రయోజకత్వమని నాతలంపు. ఈవిషయములో బాదుషావారు మిమ్ము మిక్కిలి శ్లాఘింపక పోరు."

అని మానసింహుఁ డనినంతనే చుట్టు ప్రక్కలనున్న యబుల్ ఫజల్, తోడర్ మాల్, ఫైజీ మొదలగు వారెల్లరును గూడ నాసఫ్‌ఖానుని గొంతవఱకుఁ బ్రశంసించి చక్రవర్తిచే గొప్ప బహుమానములను బడయఁగలఁ డని యేకగ్రీవముగా నుడివిరి. వారందరి స్తోత్ర వాక్యములచే ఖానుఁడును బ్రహ్మానందపరవశుఁడై యుండెను. మానసింహుఁడు మఱల వాని వంకఁ జూచి—

"సాహేబ్జీ! లావాదుర్గమునుండి మీషహాబ్ఖానుజీ కూడ వచ్చినారఁట! ఆయన విశేషము లేమి?"

"ఔను. కొంత కూపీ యేమో దొరకినదఁట! ఒక వర్తకుని వెంటఁ బెట్టుకొని వచ్చినాఁడు. ప్రస్తుత మదేచర్చ జరుగుచున్నది. అందుచేతనే ఫాదుషావారింకను రాలేదు."

"ఆలాగునా? లోనికే రప్పించిరా? వర్తకుఁడును హాజరయ్యెనా?"

"ఇద్దరును హాజరైరి. విచారణ రేవాదేవి యంతఃపురముననే జరుగుచున్నది."

ఈ మాటలలోనే సింహాసన మంటపమునకు వెనుకనున్న కాంచన కవాటములు తటాలునఁ దెఱువఁబడినవి. అది సార్వభౌముని రాకకు సూచకం బగుటచే నందున్న వారెల్లరుఁ దత్క్షణముననే లేచి నిలువఁబడిరి. వెనుకనున్న పృథ్వీరాజు రాజసింహునితోఁ బ్రసంగము చాలించి, బిరబిర మానసింహ



ముల కడకు వచ్చి యమ్మొదటి వరుసయందే తన యాసనము నేర్పరచుకొనెను. తెఱువఁబడిన హేమద్వారమునుండి సార్వభౌముండు ప్రవేశించి మంటపము నెక్కి తన్మధ్యంబునంగల రత్నపీఠిక నధిష్ఠించి యెల్లవారికిని గూర్చుండ సెలవొసంగెను. యథాక్రమంబుగ నందఱును సుఖాసీనులైరి. నిశ్శబ్దంబై యున్న సభాభవనం బెల్ల నొక్కమాఱు కలయ నీక్షించి చక్రవర్తి తనదృష్టి పృథ్వీరాజునందు నిలిపెను. ప్రభుదృష్టియందలి యర్థమును గ్రహించి యతఁడును సెలవుఁగొనుటకు నిరీక్షించుచుండెను. అప్పుడు చక్రవర్తి—

"పృథ్వీరాజ్! పర్యవసాన మేమైనఁ దెలిసదా? మన వారందఱు నేమనుచున్నారు?

"మహాప్రభూ! ఎవ్వరైనను నేమి మనవి చేసికొనఁగలరు? ఇంక మన మెన్ని చర్చలు చేసినను లాభ ముండదని నా మనవి. సెలవైనయెడ నొక్క సంగతి మనవి చేసికొనెదను."

"సందేహ మెందుకు?"

"ప్రతాపసింహుని సేనలోనివాఁడగు నొక రాజపుత్రుఁడు మన పట్టణమునకు వచ్చియున్నాఁడు. ప్రస్తుత మీ సభాభవనమందే యున్నాఁడు. కాని శత్రుపక్షము వానిచే దర్బారులో నేలినవారి యెదుట మాటాడించుటకు—"

"సంశయ మెందుకు? సత్యము నెట్టివారినుండి యైనఁ విఁ వచ్చును. ఇంతకు మనకింక శత్రువు లెవ్వరు? సంధియగుట

చేఁ బ్రతాపసింహుఁ డిప్పుడు మనకు మిత్రుఁ డేకదా? ఆరాజపుత్రుఁ డెవ్వఁడు? ఇచ్చట నాతని కెవ్వరున్నారు?"

"మహాప్రభూ! కరుణ కాతఁడు సోదరుఁడు. యుద్ధము ముగించుటచేఁ దన సోదరి నొకమాఱు తీసికొని వెళ్ళవలయునని వచ్చినాఁడు."

"కరుణకు సోదరుఁడే యగునెడ మఱియు సంతోషము. ఆతఁడు మనలోనివాఁడే! వానివలన మనకు యథార్థంబు తెలియుఁ గలదు. అతఁడు మాయెదుటకువచ్చి చెప్పఁ దలంచినది చెప్పవచ్చును."

పృథ్వీరాజు వెంటనె వెనుకకుఁ దిరిగి రాజసింహుని వంకఁజూచి రమ్మని సంజ్ఞ చేసెను. చక్రవర్తి యాజ్ఞ యైనంతనె సిద్ధముగ నున్న రాజసింహుఁడు పృథ్వీరాజు సంజ్ఞ గ్రహించి యాసనముల నడుమనుండి నయ భయంబులతోఁ జక్రవర్తి కట్టెదుటకు వచ్చుచుండెను. అప్పుడు సభ్యుల దృష్టులన్నియు నాతని వైపే ప్రసరింప దొడంగినవి. సింహాసనమంటపమునకు ముందు సార్వభౌముని కట్టెదుట నిలువంబడి, రాజసింహుఁడు, తలపైఁ గల పగిడీయందలి గన్నెరుపూ వన్నెలు తళతళలాడు చెక్కుటద్దములయందుఁ బ్రతిఫలించుచుండఁగను వినయంబుతో శిరమ్ము వంచి, వంగి, ముమ్మాఱు సలాము చేసి, ముకుళిత హస్తుఁడై, శిరీషకుసుమపేశల సుధామయోక్తుల నెల్లరు వినుచుండ సార్వభౌమున కిట్లనియె.

---



## అల్లాహో అక్బర్.

"దేవా! సమస్తభారత సామ్రాజ్య రత్నపీఠికయందుఁ బట్టభద్రులై యఖిల రాజన్య మకుట మణిప్రభా భాసమాన చరణులై — శాంతి సౌఖ్యప్రదంబు లగు జాత్యైకమత్యంబును సర్వమతసమన్వయమును సంతత సమచిత్తతయు ముఖ్యవ్రతంబులుగ, నేకచ్ఛత్రపరిపాలనంబు గావించు సకల ప్రజారంజకు లగు నేలినవారికిఁ బరమేశ్వరుఁడు చిరాయు రున్నతులు ప్రసాదించుగాక!"

"రాజసింహా! ప్రతాపుని పక్షము వాఁడ వయ్యుఁ గరుణకు సోదరుండవగుట మాయం దిట్టి గౌరవాభిమానములు నీకుండుట వింతగాదు. ఈమర్యాదల కేమి? ప్రధానాంశమును వివరింపుము. సంధి సందర్భమునఁ బ్రతాపసింహుఁడు మా కుత్తరము వ్రాయుట నీ వెఱుఁగుదువా? ఏమని వ్రాసెను?"

"ఎఱుఁగుదును. ఏలినవారికి వశమైనట్లే వ్రాసెను."

"ప్రతాపసింహుఁడే యిట్టి యుత్తరములు వ్రాయుట నీకు వింతగాఁ దోపలేదా?"

"లేదు. మహాప్రభూ! నాకు వింతగాఁ దోపలేదు."

"ఎందుచేత?"

"ఆతని యవస్థా విశేషములఁ గన్నులారఁ జూచుచుండినవాఁడ నగుటచేత —"

"ఔను. ఎంతో దురవస్థ తటస్థించినం గాని యంత వాఁడిట్టి యుత్తరమును వ్రాయఁడని మేమును ననుకొంటిమి. అయ్యవస్థా పరిస్థితులు మేము వినఁదగిన వేకదా? తానును దన కుటుంబమును గూడ ననారోగ్యమునం దున్నట్లు వ్రాసెను. ఇప్పుడు వారందఱు క్షేమముగ నున్నారా?"

"మహాప్రభూ! అందఱును క్షేమముగా నున్నారు. ఏలిన వారికి వశమగుటకుఁ గారణ మొక్క యనారోగ్యమే కాదు. అన్నోదకములులేక మలమలమాడుచుఁ బ్రాణమాత్రావ శిష్టులైయున్న భార్యాపుత్రులు."

"అయ్యయ్యో! పాప మాతని భార్యాపుత్రులంత దీన స్థితిలో నున్నారా? కోటలన్నియుఁ గోలుపోయిన వాఁడగుటచేఁ గష్టములయం దున్నట్లు వింటిమిగాని, కడకు నన్నోదకము లకుఁ గూడ లేనంత హీనస్థితికి వచ్చె నని యనుకొనలేదు."

"దేవా! వీరరస స్ఫురితంబును గరుణారస భరితంబును నగు ప్రతాపసింహుని విచిత్ర చరిత్రంబంతయు నేలినవారి దర్బారు కవులవంటి మహాకవులు రచింపఁదగినదియే గాని నావంటి యల్పజ్ఞుఁడు పొడిమాటలతో నుడువదగినది కాదు. అయినను శత్రువుల యోగక్షేమం బైనను బరీక్షించు కరుణా స్వభావులగు శ్రీవా రవకాశ మిచ్చినందున నమ్మహాచరిత్ర మందలి యొక్కనాటి కథమాత్రము విన్నవించుకొనెదను. మహాప్రభూ! మాంసవిక్రేతయగువాఁడు మృగసంహారము



గావించుపట్టునఁ దత్ప్రాణాపహరణమునం దధికబాధ కలుగ కుండ నొక్కవేటుననే కడతేర్చుచుండు. అట్టి చండాల వ్యాపారము నందైన దయాదాక్షిణ్యము లుండవచ్చును గాని రణ వ్యాపారమునందు మాత్రము లేశము నుండవు. కోటలు లేక— పేటలు లేక - నిలుచుటకునీడ లేక - నాథద్వారము - కుంభిళాదుర్గము మొదలగు చుట్టుపక్కల గ్రామములనుండి వచ్చు భోజన సామగ్రులను మొగలాయి సైనికు లడ్డగించి పరిగ్రహించుటచేఁ గడకుఁ దినుటకుఁ దిండియులేక—ఒక్కొక్కప్పుడు మూఁడేసి యుపవాసములుఁ గూడఁ జేయుచు శుష్కించుచుండిన తన కుటుంబము నేకొండగుహయందో యేకానకోన యందో భద్రపరచుచు క్షుద్బాధ భరింపలేక ప్రతాపసింహుఁడు క్రమక్రమముగా బీడు గడ్డితో రొట్టెలు చేసి తినుట యభ్యసింప నారంభించెను........."

"అబ్బబ్బా! ఎంతకష్ట మెంతకష్టము? ఇన్నిన్ని కష్టము లనుభవించుచుండియు నాత్మగౌరవమునం దింత పట్టుదల వహించిన ప్రతాపసింహుఁడే గొప్పధన్యుఁడు."

"మహారాజా! ఈకష్టములు కష్టములు గావు. వాని పిల్లల కష్టములే కష్టములు. మూఁడు నెలలపిల్ల! రెండేండ్లపిల్ల! యైదేండ్లపిల్ల! పాలుద్రాగు పిల్లలకుఁ బాలు లేవు. అన్నముతిను పిల్లల కన్నము లేదు. పసిపిల్లల నిమిత్త మిరుగు పొరుగు పల్లెల నుండి భిల్లపడుచులు దెచ్చు పాలకుండలు ప్రతిదినమును నీ

యారు మాసములలో నెన్ని బ్రిద్దలు కాఁబడినవో యాసఫ్ ఖానువారే లెక్క చెప్పఁగలరు? కిరకిరఁ జుట్టుకొనుచు—గిజగిజఁ గొట్టుకొనుచు పాలందక యాఁకలిబాధచే నొక్కొక్కప్పు డాపసిపాపలు పెట్టుచుండు ఘోషణ నారావళి పర్వత గుహాంతరస్థిత మహాపాషాణంబులుగూడఁ గఱగి నీరై పాఱుచుండెడివి."

ఆమాటలకుఁ జక్రవర్తి యొక్కసారి శిరము పంకించెను. వాని ముఖలక్షణములయం దంతవఱకు లేని యొకక్రొత్త మార్పు కలిగినది. సభ్యులును విషాదాశ్చర్యములతో నాసఫ్ఖానువంకఁ జూడసాగిరి. ఆసఫ్ఖాను నిశ్చేష్టితుఁడై యుండెను. రాజసింహుఁడు మఱల నిట్లు చెప్పదొడంగెను.

"రాజేంద్రా! క్రమక్రమంబుగ రాజపుత్ర సైన్యంబులు క్షీణించుటచే నంతవఱకు స్వయముగనే రణరంగ విహారమొనరించుచుండిన ప్రతాపసింహుఁడు స్వకుటుంబరక్షణమునకుఁగా నియోగించి యుంచిన యేనూర్వురు రాజపుత్రసైనికులను రణభూమికిఁ బంపివేసి, తానే కుటుంబ రక్షకుఁడుగా నుండి పోవుటచేత, ఆసంగతి ఖానుసాహేబు వారెట్టులో కనిపెట్టి—యప్పటినుండియుఁగూడఁ గుటుంబసమేతుఁడైయున్న రాణాను వెంటఁదఱుముటయే ప్రధానముగాఁ గొని, రాత్రియనక పగలనక, ఉన్నచోట నుండనీయక, తిన్నచోటఁ దిననీయక, పఱువెత్తించుచు—వశపడిన ట్లంగీకరింపవలయు



ననియు లేనియెడ నహోరాత్రంబు లిట్టులే పఱువెత్తింతుననియు—చేఁజిక్కిన చోటఁ జిత్రవధ పాలుకావలసి వచ్చుననియు—పసిపిల్లలనక తలకిందుగ గిరగిరఁ ద్రిప్పి డఁగొట్టెదమనియు నడుమనడుమ రాయబారము లంపుచుండెను."

గంభీరవదనుఁడై చక్రవర్తి పరధ్యానమునం దేమో చింతించుచున్నట్లు తోఁచుచు, మఱియొక్క క్షణమునకే. రాజసింహునిఁ జూచి—

"రాజసింహా! తరువాత నేమైనది?"

"సార్వభౌమా! విధివశంబున నొకప్పుడు చేఁజిక్కిన యెడ ఖానుసాహేబువారు కంసులై యేపాషాణములైఁ దన పసిపాపలఁ బట్టిగొట్టెదరోయని పుట్టెడు బెంగతోఁ గన్న సంతానమును జూచుకొని కన్నీరు మున్నీరుగ నిరంతరము దుఃఖించుచుండు చిత్తూరు సామ్రాజ్యపట్టమహిషి యగు పాటేశ్వరీ దేవి యొకనాటి యుదయంబున నొకయేటికడ వంటఁ బ్రారంభించెను. ఇంతలో మొగలాయి సేనలు తఱుముకొని వచ్చుచుండినట్లు వార్త వచ్చినందునఁ బ్రతాపసింహుఁడు భోజనాపేక్ష పరిత్యజించి వెంటనే యాలుబిడ్డలతో నచ్చటినుండి పఱువెత్తి పోయి కొంతదూరమునం దొక్కచో విడిసెను. అమ్మహాసాధ్వియు మఱల వంటసేయుటకుఁ బూనుకొనెను, కాని యా వంటయు మొదటివంటవంటిదే యైనది. ఇట్లా దినంబెల్ల నైదుచోట్ల నైదుమాఱులు వండుకొనియు నొకవంటయుం డెన

భుజించు భాగ్యము లేక నాటి రాత్రి శత్రుభీతిచే నంధకార బంధురంబగు నరణ్యమునుండి, ఘోరున వర్షించు వర్షంబునఁ బసిపాపలు తడిసి ముద్దయగుచుండఁ దెల్లవారువఱకుఁ బ్రయాణముచేసి కడకొక కొండకోనం జేరుకొనుసరికిఁ బరమేశ్వరున కప్పటికిని గూడ నా కుటుంబమునం దనుగ్రహము జనింప దయ్యెను.”

“ఏమీ? అప్పు డేమి యుపద్రవము తటస్థించినది?”

“మహాప్రభూ! ఖానుసాహేబువారు తమ యనుపమాన రణక్రియా కౌశలమును వెల్లడించి క్షణమాత్రములో మా రాజపుత్రుల నేనూర్వుర నొక్కమాఱు సంహరించుటచే మే మాదుర్వార్త వారి కెఱింగింప వలసివచ్చినది.”

“ఏమీ! ఏనూర్వురు రాజపుత్రుల నొక్కమాఱే సంహరింపఁబడిరా? ఇది యాసఫ్‌ఖానున కెట్లు సాధ్యమైనది? రాజపుత్రు లంత తేజోహీనులా?”

“మహారాజా! రాజపుత్రు లంతటి తేజోహీనులు కాకపోయినను ఖానుసాహేబువారి యందంత గొప్పవిద్య యున్నది. సాయంకాలమువఱకు దీవ్రమగు సంగ్రామము జరిపి యాకస్మికముగ యుద్ధ మాపి, యింక స్వేచ్ఛగా వండుకొని భుజించి విశ్రమింపవచ్చునని సాహేబువారు సెలవిచ్చుటచే మా రాజపుత్రులు తత్సమీపంబునంగల యొకసరోవరతీరంబున విడిసిరి. ఆసరోవరమునందు ఖానుసాహేబు వారేక్షణమునందు విషము కలి



పించిరో తెలియక యాయుదకంబులతోడనే వంటచేసికొని యా యుదకంబులనే త్రాగి యా యేనూర్వురు రాజపుత్రులును క్షణమాత్రములో లోకాంతరగతులైరి.........”

సభామధ్యమునుండి విచారసూచకంబులగు ‘చా’ కారంబులు ఘెల్లుగ వ్యాపించెను. చక్రవర్తియు విషాదాశ్చర్యములతో—

“విషమా? విషమా? విషముకలిపించెనా? నీ వెట్లు బ్రతుకఁ గలిగితివి?”

“ప్రభుచంద్రమా! ధర్మస్వరూపులగు నేలినవారికీ యధర్మవృత్తాంతమును విన్నవించుకొను మని పరమేశ్వరుఁడే నన్ను మిగిల్చెను. అంత, యాకస్మికముగ యుద్ధ మాపివేయుటచేత నిం దేమైన మోస ముండునేమో యని యనుమానించి ఖానుసాహేబువారి వర్తనమును గుర్తించుటకుఁ బదుగురు రాజపుత్రులు బయలుదేరిరి. ఆపదుగురిలో నే నొకఁడను. మేమే యీ దుర్వార్త రాణా కెఱింగించితిమి. ఈదుర్వార్తయే రాణాచే నిట్టియుత్తరము వ్రాయించినది. దేవా! కొన్ని భిల్లసేనలుదప్ప నొక్క రాజపుత్ర సైనికుఁడేని లేని దురవస్థలో నింతకంటె రాణా చేయవలసిన దేమున్నది?”

“రాజసింహా! ప్రతాపసింహుఁడు వశమైనందుకు మీ కింతఱకుఁ బొందుచుండిన సంతోష మంతయు నిప్పుడు తొలఁగిపోయినది. ఇది ధర్మసంగ్రామము గాదు. కృత్రిమ యుద్ధము. ఇట్టి జయంబువలన వీరపురుషుఁ డెన్నడు నానందింపఁడు....”

అని సభ్యులదిక్కు మొగంబై తన కట్టెదుటనే సుఖాసీనులై యున్న మానసింహాదులయందు దృష్టినిలిపి చక్రవర్తి మఱియు నిట్లనియె—

"వశ్యమైనట్లు నోట నుడివినం జాలునని మనమును అట్లెన్నటికిని నుడువనని ప్రతాపసింహుఁడును నొక్కమాటమాత్రమున కేగదా యిన్నిసంవత్సరములనుండియు నతితీవ్రముగఁ బోరాడుచున్నాము. ఎవరిధర్మములను వారు కాపాడుకొనుటయేగదా యుభయపక్షములవారికి నీఘోర సంగ్రామము నందలి ముఖ్యాశయము! మఱియు మహావీరు నెదిరించుపట్టున నాయుధంబు లేనియెడ నాయుధం బొసంగి యాకలియగునెడ నన్నంబు వెట్టి యెదిరించి సాధించి జయించిన జయమునందే శాశ్వతానంద మున్నది గాని యిట్టి కృత్రిమజయంబున నాచంద్రతారార్కం బగు నపకీర్తిగాక వేరే ముండును?"

అని తీవ్రదృష్టితో నాసఫ్ఖాను వంకజూచి—

"ఆసఫ్ఖాన్! నీ యధర్మప్రవర్తనమునకు నీ వేమి సమాధానము చెప్పుకొనఁగలవు?"

"మహాప్రభూ! కోట్లకొలఁది విలువగల సామగ్రిల మార్గమధ్యమున నడ్డగించి దోపించిన దోపిడిదొంగ యగు ప్రతాపసింగు నెడ నేలినవా రింతటి ధర్మాధర్మ విచారము గావించునెడ సేవకుఁ డేమి మనవి చేసికొనఁగలడు?"

"ఆదినుండియుఁ బ్రతియుద్ధముసందును వాని భోజన సామగ్రిలను మన మడ్డగించుచున్నాముగదా? దొరకినప్పుడు



మన సామగ్రిల నతఁ డేల కొల్లగొట్టఁడు?..........మాటాడ వేమి? నీవు కావించిన మోసకృత్యమునకుఁగాఁ బ్రతాపసింహునకుఁ బదివేలరూపాయి లపరాధముగాఁ జెల్లించుకొనుము!"

అని మానసింహుని వంకఁజూచి—

"మానసింగ్! ఏదైన నేమి? మనకు వశ్యమైనప్పుడు ప్రతాపసింహుఁడు మన ప్రజలలోనివాఁడేగదా? ఈయొక్కకుటుంబమైనను మన పరిపాలనమున నన్నోదకములు లేక యేల కృశించుచుండవలయును? కుటుంబ సంరక్షణము కొఱకుఁ గా మన ఖజానాలోనుండి యేబదివేల రూపాయిలను బ్రతాపసింహునకు సెలవుచేయింపుము!

అని రాజసింహునివైపు మొగము ద్రిప్పి—

"రాజసింహా! నీ విచ్చట నెన్నిదినము లుండెదవు?

"దేవా! నాసోదరిం గైకొని యొకటిరెండు దినములలోనే పోవలసినవాఁడను."

"అట్టులైన మాకార్యముగాఁ గాక నీప్రభుకార్యముగా నీ వీకార్యభారమును భరింపవలయును."

"ఎవ్వరికార్యంబైనను నే నొక్కఁడనే యంతటి ధనసంచయమును గొనిపోఁగలుగుటకు సమర్థుఁడనా?"

"నీకుఁ దగిన పరివారము తోడుగా నొసంగెదము."

"సార్వభౌమా! మహాప్రసాదము! అల్లాహో! అక్బర్!"

## యిరువదియైదవ ప్రకరణము

### పృథ్వీరాజు - జోసీభాయి.

రాజసింహుఁడు చెప్పిన వృత్తాంత మంతయు విన్న తరువాతఁ బృథ్వీరాజాదుల హృదయములు కఱఁగి ప్రతాపుని యెడఁ గడుజాలి వహించినవి. ఒక్క పృథ్వీరాజే కాక చక్రవర్తి కొలువునందలి యున్నతోద్యోగస్థులగు రాజపుత్రులనేకులు వానియెడ గౌరవాభిమానములు గలవారే. తాము మొగలాయి ప్రభువును సేవించుచుండినను స్వగౌరవ రాజ్య స్వాతంత్ర్యముల కొఱకు మానవశక్తికి భరింపరాని కష్టములనుభవించుచుండిన ప్రతాపునిఁ దలంచుకొని సందర్భము కలిగినప్పుడెల్ల రాజపుత్ర శౌర్యాగ్ని యింకను జల్లారలేదని గర్వించుచుందురు. కాని యట్టి వట్టిగర్వముతో నేమి ప్రయోజనము ? ప్రతాపసింహుని వలె సర్వస్వార్థత్యాగ మొనర్చినప్పుడు గదా వారు నిజమైన దేశభక్తులు !

ఆనాటి సాయంకాలమునఁ బృథ్వీరాజు చల్లగాలి ననుభవించుచుఁ దన మేడపై ముందరి వసారాలో నొక సోఫాపైఁ గూర్చుండి, కట్టెదుట సుఖాసీనలై యుండిన కరుణా జోసీభాయిలకుఁ దాను విన్న ప్రతాపచరిత్ర మంతయుఁ బూసగ్రుచ్చి నట్లు చెప్పుచుండెను. కరుణారసభరితం బగు నా వృత్తాంతమును వా రత్యాసక్తితో వినుచుండిరి. కడకుఁ జక్రవర్తి ప్రతాపునియెడఁ జూపించిన యౌదార్యమును బృథ్వీరా జెఱింగింప జోసీభాయికిఁ గలిగిన యానంద మింతింత యని చెప్పలేము. సుగుణ గణాలంకారుండగు సార్వభౌముని ధర్మచింతనమును గొనియాడుచుఁ బ్రతాపసింహుని చరిత్రాంశములను మఱల మఱలఁ జెప్పుకొనుచుఁ జాల సేపువఱకు వారు మువ్వురు నా విషయములను గూర్చియే ప్రసంగించుకొనుచుండిరి. ఇంతలోఁ జిరతల చప్పుడును జితారు మ్రోతయు, మనోహర కంఠస్వరంబుతో శ్రవణానందమును గలిగించు పాటయు నాకస్మికముగ వినవచ్చుటచేత, మేడపై నున్న వారు మువ్వురును దమ సంభాషణముల నట్లే చాలించి ముందరి కేగి జల్లి కట్టుపై నానుకొని రాజమార్గమును విలోకింప సాగిరి. అప్పు డొక విచిత్రవ్యక్తి వారి దృష్టిపథమునందుఁ బడెను. ఆ వింతపురుషుఁడు పాదములవఱకు వ్రేలాడు కాషాయ రంగుగల లుంగీ ధరించెను. అట్టి రంగుతోడనే యాతని యంగీ మోకాళ్ళ క్రిందివఱకు జీరాడుచున్నది. తలగుడ్డయుఁ గాషాయరంగు గలదే. మెడలో నసంఖ్యాకములై యున్న పేరులయందుఁ గొన్ని ఫకీరులు ధరించు రంగురంగుల పూసల పేరులు. కొన్ని హైందవ సన్న్యాసులు ధరించు రుద్రాక్ష మాలలు, కొన్ని తులసి పూసల దండలు. ఎడమవైపు భుజముపైనుండి జోలె వ్రేలాడుచున్నదిగాని యందులో నేమియు నున్నట్లు కానరాదు. చిఱుమువ్వలు గల నల్లని చిఱతలతో

నెడమచేత లయవేసికొనుచు నతఁడు కుడిచేతితోఁ జితారు తీగెను మీటుచుండెను. రెండుమూఁడు తీగెలతో సామాన్యముగ శ్రుతికిఁ బనికివచ్చునట్టిదియేగాని యాచితారు కేవల సంగీత ప్రదర్శనమున కొఱక సాధనముగాఁ బనికి వచ్చునట్టిది కాదు. తెల్లని మొగంబును నల్లని గడ్డమును గల యావింత పురుషునకు ముప్పది యేండ్లకు మించినప్రాయ ముండదు. విశాల మగు నాతని ఫాలమునందలి సిందూరతిలకము చెమటచేఁ జెదరియు స్పష్టముగనే కానవచ్చుచున్నది. మొత్తముపై నాతని వేషభాషలఁ బట్టి యాతఁడు హిందువుఁడో మహమ్మదీయుఁడో ఫకీరో సన్యాసియో తెలిసికొనుట కష్టసాధ్యముగనే యుండెను. మనోహర కంఠస్వరంబుతోడను దంత్రిస్వనంబుతోడను సమ్మిళితం బగు నీ పాట నతఁ డప్పుడు పాడుచుండెను.

"దీన్ ఇలాహీమత తత్వంబును-దెలిసికొని సుఖింపండీ
దీనికి మించిన యుత్తమమత మీ-త్రిభువనముల లేదండీ॥
మాధవుఁడన్న మహమ్మదన్న నీ-మతమున నొకఁడే నండీ
భేదమ్ములను వివాదమ్ములనువి-రోధమ్ముల మానండీ"

పాడిన చరణమే మఱల మఱలఁ బాడుచు నతఁడు పోవుచుండుటచేత నీ నాలుగుచరణముల కంటె నెక్కుడుగా నాతనిపాట వినుటకు వారి కవకాశము కలుగలేదు. ఈ చరణములు పూర్తియగుసరికే యాతఁడు వారి దృష్టిపథము



నుండి దాటిపోయెను. భిక్షుకు వచ్చువా రెన్నడు నట్టి పాటలు పాడుచుండగా వినియుండనందున నాపాట యింకను వినవలయు నని మాత్రము కరుణా జోసీభాయి లనుకొనిరి. వారు యథాక్రమంబుగ నాశీను లైనంతనే యమ్మువ్వురకు నీ సంభాషణము జరిగినది.

జోసీ—ప్రాణేశ్వరా! దీన్ ఇలాహీ యనునది చక్రవర్తి క్రొత్తగాఁ గల్పించిన మతముగదా? ఆమతమ్మును బ్రబోధించు నీపాట యీ భిక్షుగాని కెట్లు వచ్చినదో?

పృథ్వీ—జోసీ! వాఁడు భిక్షుగాఁడు కాఁడు. మతగురువులలో నొకఁడైన దేవదాసు కుమారుఁడు. తులసీదాసు. మహాకవిత్వ సంపన్నుఁడు. మతవిరోధులచేతఁ బాపమతని తండ్రి బలవంతముగఁ జంపఁబడుటచేతఁ దులసీదాసు సర్వమును బరిత్యజించి విరాగియై యింకఁ దన జీవితమెల్ల మతప్రబోధమునందే గడపవలె.నని యిట్లు బయలుదేరినాఁడు. దీన్ ఇలాహీ మతముపై వీనితండ్రికిని వీనికినిగూడ మక్కువ యెక్కువ.

కరు—బాబాజీ! ఇంతమాత్రమునఁ బ్రజలకీ మతముపై నమ్మకము కలుగునా?

పృథ్వీ—కలిగినవారికిఁ గలుగును. లేనివారికి లేదు. ఇంతకు నతఁడు మహాకవి. కవితాశక్తిచే సాధింపరాని దేమున్నది? రసభరితంబైన కవితాగీతములచేఁ శాపా

ణములు కఱగిపోవును. ఎండుమ్రాఁకులు చిగిరించును. గోడలపైఁ జిత్రింపఁబడిన చిత్రప్రతిమ లైనఁ దల లూపును. అచేతనంబులనెల్లఁ జేతనములుగా మార్చు శక్తి కవితయందే యున్నది. అందుచేతనే మహాకవులు లోకమం దింతపూజ్యు లగుచున్నారు.

జోసీ—ప్రాణేశ్వరా! ఇంత యెఱింగిన మీ రిట్లుపేక్షింతురా! చక్రవర్తి యాస్థానకవులలో నగ్రగణ్యు లని పేరొందిన మీరు ప్రతాపసింహుని యుత్తరమును జూచియు, నాతని దురవస్థ లెల్ల వినియు మీ కవితాశక్తిచే నాతనికి దుఃఖోపశమనంబు గావింప నేలతలంపరు? వాని ధైర్య సాహసములను బురికొల్పరాదా? వాని శౌర్యానలమును బ్రజ్వలింపఁ జేయఁగూడదా? కవిత కసాధ్యము లే దని యిప్పుడే సెలవిచ్చిరి కదా? మహా కష్ట భూయిష్ఠంబై యున్న యాతని చిత్తమునకు నూతన శౌర్యోత్సాహములు మీ రేల కలిగింప లేరు. ఎన్నియో వందలమైళ్ల దూరములో నున్న ప్రతాపసింహునకు మన మింతకంటె నేమి యుపకారము చేయఁగలము? మీ చేవ్రాలుతో నొక్క యుత్తరమే కదా?...............

పృథ్వి—జోసీ! సమయమునకుఁ జక్కఁగా స్ఫురింపఁ జేసితివి. నా కింతవఱకును దోచలేదు ప్రతాపుని యవస్థ విన్న



ప్పటినుండియు నాకు మతిపోయినది. మనవంతున కాతని కెంతధనము పంపవలయునో యని మాత్రమే యాలోచించు చుంటిని.

జోసీ—ధన సాహాయ్యము కంటె మీవంటి మహాకవులవాక్సాహాయ్యమే గొప్పది. మన వంతునకుఁ బంపవలసిన ధనమును గూర్చి నే నాలోచించెదను. మీరు వెంటనే యుత్తరమును బ్రారంభింపుఁడు!

పృథ్వి—తప్పక వ్రాసెదను. ఏఁడీ? రాజసింహుఁ డింకను రాలేదేమి! పాప మెప్పుడు వచ్చినను నే నింట లేనప్పుడే వచ్చి నాకొఱ కెదురు చూచుచుండును. (కరుణను జూచి) అమ్మాయీ! కరుణా! నీవు నిజముగా వెళ్లవలె నని యున్నదా? మీ తల్లిగా రచ్చట నున్నా రంటివి? నాథద్వారములోనా?

కరుణ—ఔను. మీ సెలవైనచో వెళ్లవలె ననియే యున్నది.

పృథ్వి—సరే! వెళ్ళవచ్చునుగాని — నాథద్వారములో — (అని కొంచెము సేపాలోచించి) ఇంతకు మన కేమి భయము? అయినను జెప్పుచున్నాను. నీవుగాని మీ తల్లిగాని యచ్చట నేమియు బట్టలు కొనవద్దు. నీకుఁ గావలసిన బట్ట లేవియో యిచ్చటనుండియే తీసికొనిపొమ్ము.

కరు—అదేమి? ఎందుచేత ?..

పృథ్వి—ప్రతాపసింహుఁడు కొల్లగొట్టిన విలువగల వస్తువులనెల్ల నాథద్వారమునందలి యొక వర్తకుఁ డేమో కొని విక్రయించుచున్నట్లు రుజువైనది.

కరు—బాబాజీ! ఎట్లు రుజువైనది? ఆవర్తకు నేమి చేసెదరు?

పృథ్వీ—రేవాదేవి ప్రత్యేకముగాఁ దనకొఱకు నేయించుకొన్న చీర వాని యొద్ద దొరకిన దఁట! మనయాసఫ్ ఖానుని తమ్ముఁడైన మహబజ్ ఖాను కనిపెట్టినాఁడు. కనిపెట్టి యాచీరతో నావర్తకుని గొందఱు సిపాయిలతోఁ గూడ జక్రవర్తికడకుఁ బంపించెను. ఆ వర్తకున కేమి శిక్షయగునో చెప్పలేను గాని ప్రస్తుతము మాత్రము సెలవు లేకుండ నీగ్రామము విడువఁ గూడదని యాజ్ఞయైనది.........సరే! యీ యనవసర ప్రసంగము మన కెందుకు? (జోసీభాయినిఁ జూచి) జోసీ! కలమును కాగితమును నాకుఁ దెచ్చి యిచ్చి మీయిద్దరును గ్రింద నుండుఁడు.

వెంటనే జోసీభాయి లేచి యట్లే గావించినది. పృథ్వీరాజు కాగితము కలము గొని యా వసారాలో నచ్చటనే యొంటరిగఁ గూర్చుండి యుత్తరమును వ్రాయుటకు బ్రారంభించెను.

---

## ఇరువదియాఱవ ప్రకరణము

---

ఆలయములో సంభాషింతురు.

"రాజకుమారా! ప్రాణదాతవగు నిన్ను మేము మరణపర్యంతము సేవింపక తప్పదు. నీయాజ్ఞల మెలంగక తప్పదు.



ఇంక నీ వెట్లు చెప్పిన నట్లు నడుచుకొనవలసిన వారమే. కాని లోకానుభవమ్ము లేని బాలకుండ వగుటచే సుప్రశస్తంబైన మన రాజస్థానమునకుఁ బ్రస్తుతము తటస్థించిన దుస్థితిని గుర్తింపఁజాలకున్నావు. ఆర్యావర్తమునందు రాజస్థాన మనామకమై రూపురేకలు లేకుండ నశించుటకు సిద్ధముగ నున్నది. తరతరంబులనుండియు రోదసీకుహరంబెల్ల నిండుకొని యఖండముగ మండుచుండిన రాజపుత్ర శౌర్యానల కీలికా మాలిక లెక్కడి వక్కడ చప్పునఁ జల్లారి పోవుచున్నవి. త్వరపడుము! నామాట మన్నింపుము! రమ్ము! రమ్ము! అనివార్యప్రతాపాధికుండైన ప్రతాపుని కడ కేగుదము రమ్ము!"

"రామభద్రా! వానితో నేకీభవించుటకే కాదు. వానిపే రుచ్చరించుటకైన నేను సమ్మతింపను. నిరర్థక నామధేయుండగు ప్రతాపుఁ డెక్కడ? నిర్వక్ర పరాక్రమ శక్తిసంపన్నుఁడగు నీశక్తిసింగెక్కడ? అట్టి పిఱికిపందతోడి మైత్రి మన కేమిలాభము? స్వరాజ్యం బనియు స్వాతంత్ర్యం బనియు స్వసామర్థ్యమును గణించుకొనలేక బిరుదులు పలికి, కడకు నేమియుఁ జేతకాక చక్రవర్తికి వశమగుటచేఁ బూర్వపు స్వల్పగౌరవముగూడ నా కిప్పు డాతనియందు లేదు. చేసిన ఖరారులుప్రకారము నాకుఁ దోడునీడలై మీరెల్లరు నాయుద్యమమునకుఁ దోడుపడెదరా, యచిరకాలములో నేనే యీ పర్వతారణ్యములలో నొక స్వతంత్రరాజ్యమును

స్థాపించి ప్రతాపునకు నీతిగఱపెదను. మన స్వతంత్రరాజ్య నిర్మాణమునకు శంకుస్థాపనము పొలిమేరనున్న లావాదుర్గముననే యగుఁగాక! రామభద్రా! ఎంతకాలమునుండి నా కా దుర్గముపై దృష్టియున్నదో మొన్న మొన్న వచ్చినవాఁడవు నీవే మెఱుంగుదువు? ఇట్టి మహోద్యమంబున నున్న నన్నుఁ గొనిపోయి పిఱికిపందయైన ప్రతాపుని పాదములపైఁ బడవేసెద ననుట నీకు న్యాయమేనా?"

"రాజకుమారా! లోకైక ప్రతాపుండగు ప్రతాపుని నీవట్లు నిందింపఁగూడదు. పుట్టిన దాదిగ నీమాతృకుండ గ్రామ పరిసర ప్రాంతములను విడిచి రాజ్యాంతరముల కెన్నఁడు నరుగని వాఁడ వగుట నిట్లనుచున్నావు. కాని రాజస్థానమునందే కాదు. ఆర్యావర్తనమునందంతట నాతనిపేరు విననివారు లేరు. వానిపేరు స్మరించినంతమాత్రమున శరీరములు పులకరింపనివా రుండరు. ప్రతి శుభకార్యారంభంబునందును ప్రప్రథమంబున విఘ్నేశ్వ రారాధనమ్ముంబోలె, రాజపుత్ర నాయకులేగాక భరతవర్షంబునంగల సకల దేశీయనాయకులును గూడ స్వారాజ్యోద్యమ ప్రారంభంబునందుఁ బ్రతాపసింహుని దలంచి నమస్కరించుట యీ యుగమునందును ముందు యుగములయందునుగూడ నాచారమ్ముగా జరుగవలసియున్నది. వేయేల? ఆమహాసింహుం డెంతటివాఁడుగాకున్న — ఎంతటి సమరవ్యాపారపారీణుఁడు గాకున్న — ఎంతటి



ధైర్య స్థైర్య శౌర్య సాహసాది వీరపురుష లక్షణ లక్షితుఁడు గాకున్న—ఇన్నింటికంటె నెంతటి మాననీయుఁడు గాకున్న— చక్రవర్తియంతవాఁడు — వశమైతి ననుమాటమాత్రముననే సకల మేవాడ సామ్రాజ్యమ్మును యథాక్రమమ్ముగఁ గ్రమ్మఱ వానికి ధారపోసెదనని ప్రతిన వట్టునా? విధి విరోధియగుట చేతఁ బరిసర పరిస్థితులు దుస్థితియం దుండుటచేతఁ బ్రస్తుత మతఁడు చక్రవర్తికి వశపడినట్లు నటించుచుండెనేగాని, యాకస్మికంబుగ నేక్షణంబుననో వాని కంబామహాదేవి వీరావేశమ్ము జనింపఁజేయక మానదు! ఒరయుం దిమిడ్చిన ప్రచండ 'చండికా' ఖడ్గమ్మతఁడు గ్రమ్మఱ నూడఁబెఱుకక మానఁడు! తత్ఖడ్గధారా విసర్గత తళత్తళత్కాంతులు మన నేత్రమ్ములకు మిఱుమిట్లు గొలుపక మానవు! శక్తిసింహా! విఖ్యాత చరిత్రులైన రాజపుత్రు లనేకులు స్వాతంత్ర్య దేవతాచరణ సమారాధనమునకుఁ దమతమ శిరఃకమలముల నర్పించి పోవుట చేత నిప్పుడు నిజముగా నీవే శక్తిసింహుఁడవు! సర్వశక్తి సంపన్నుఁడవును భిల్లసేనాసమన్వితుఁడవును నై నూతనయౌవనముతో నూతనోత్సాహముతో, నూతన ధైర్య సాహసములతో సానపట్టిన కత్తియట్టులె మెఱయుచున్నాఁడవు. మేవాడ రాజ్య స్వాతంత్ర్యభాగ్య మిప్పుడు నీకు హస్తగతమై యున్నది. అంతియేగాదు. రాజపుత్రులు శౌర్యమూర్తులను చిరంతనాగత ఖ్యాతియు నీహస్తమందే యున్నది. చేపట్టితివా యీ రెండును వర్ధిల్లఁగలవు! ఉపేక్షించితివా నశింపఁగలవు......

"ఎన్నటికిని నశింపవు. రాజపుత్రులు శౌర్యమూర్తులను ఖ్యాతి నేను నశింపనీయను. ఇంక మేవాడరాజ్య స్వాతంత్ర్యమందువా? దానితో నా కెంతమాత్రమును సంబంధము లేదు. నా రాజ్యము మేవాడరాజ్యము గాదు. నా క్రొత్త రాజ్యమునకు నేనే నూతననామకరణము గావించెదను. నిశ్చయముగాఁ బ్రతాపుఁడు వట్టి పిఱికిపంద! అప్రయోజకుఁడు! నిర్భాగ్యుఁడు! అట్టివాని నేనెన్నటికి నేకీభవింపను. ముమ్మాటికి నేకీభవింపను. ఒకప్పుడు నీవన్నట్లతఁడు మహామహుఁడే యయ్యెనా— విక్రమశాలియే యయ్యెనా — స్వాతంత్ర్యమంత్రనకై కృపాణపాణియై మఱల విజృంభించెనా— ఒక్క యొరయందు రెండు కత్తులు చిక్కియుండనట్లు ఏకఫలాపేక్షకుల మగు మా యిరువురకు సరిపడదు. పొందు పొసఁగదు. కయ్యంబు తప్పదు. రణరంగమధ్యంబునఁ బ్రతాపు నెదిరించి యోర్చితినా? నీవు పొగడిన ట్లంతటి ప్రతాపశాలిం గెల్చిన మహాప్రతాపశాలిని గాఁగలను. ఓడితినా? యప్పుడే వానితో నేకీభవింతును. ఇప్పుడు తొందర యేల? రామభద్రా! ఈ యప్రస్తుత ప్రసంగ మింకఁ జాలింపుము! ప్రస్తుతాంశమును వినుము! ఆరోగ్య స్నానములు చేసిన తరువాత మీయందఱికి వలయు నూతన వస్త్రములకై బాబాజీవారు నన్ను నాథద్వారమునకుఁ బంపిరి. ఆసందర్భమున నేను మహాబజ్ఖానుని భామాసా యింటఁ జూచితిని. పాప మా వర్తకునత డెం



తనో భయపెట్టి వాని యింటినుండి యమూల్యంబైన యొక బంగరు జరీచీరను ఖానుఁడు సంగ్రహించుకొని పోయినాఁడు. ఆచీర ప్రతాపసింహుఁడు గావించిన లూటీతో సంబంధించినదఁట!"

"ఔనౌను. బాబాజీవారు చెప్పఁగా విన్నాను. మహబజ్ఖానుఁడు కొందఱు సిపాయిలతో నావర్తకు నాగ్రపట్టణమునకుఁ బంపినట్లును దెలిసినది. కాని తరువాత నేమి జరిగినదో తెలియదు.? "

"సరియే కాని యానాటినుండియుఁ గూడ ఖానుఁడు తఱుచుగా నాథద్వారమున కేగుచున్నాఁడని మన భిల్లులు కొందఱు కనిపెట్టి చెప్పుచున్నారు. మన మిఁకమీఁద నాతని వర్తనమును జాగరూకతతో గుర్తించుచుండవలయును. సమయము దొరకినప్పు డొక్కమాఱు వానికి మన రణక్రియాకౌశలము రుచి చూపవలసియున్నది."

అని యొకనాఁటి మధ్యాహ్నమున మాతృకుండ గ్రామమునందలి రేణుకాదేవి యాలయములోని గర్భాలయమునకు ముందున్న నున్నని గచ్చుమంటపముపైఁ గూర్చుండి శక్తిసింహుఁడును రామభద్రుఁడును సంభాషించుచుండిరి. తక్కిన లక్ష్మణ భరత శత్రుఘ్నులు మువ్వురునుగూడ నొక్కొక్క రొక్కొక్క స్తంభమునకుఁ జేరఁబడి కూర్చుండి, వారి సంభాషణ మత్యాసక్తితో వినుచుండిరి. రామ లక్ష్మణ

భరత శత్రుఘ్నులను నీ పేరులు, నాటిరోగులకు రోగచికిత్సానుకూల్యమ్మునకై చందావతుఁ డేర్పరచుకొనిన సంకేతనామంబు లని చదువరులకు జ్ఞప్తి యుండవచ్చును. చందావతుని యమోఘౌషధీ ప్రభావంబుచేతను, శక్తిసింగు గావించిన యభిమానపూర్వక సంరక్షణము చేతను వారు నలువురును సంపూర్ణారోగ్యవంతులై యారోగ్యస్నానములు చేసి యిప్పటికి లోకములోనివారైరి. క్షీరభావళ్యంబుతో నొప్పు సన్నని దుస్తులును జరీకమ్ముల కుచ్చుల పగిడీలును గల యీ నలువురియందు నిప్పుడు సంపూర్ణ రాజపుత్రత్వము విస్పష్టముగఁ గానవచ్చుచున్నది. వారి కా సంకేతనామము లానాడు చాపలపై స్మృతితప్పి పడియున్నప్పటి క్రమమునుఁబట్టి పెట్టఁబడినవియేగాని వారివారి గుణాదిక క్రమమ్ము ననుసరించి యుంచఁబడినవి కావని చదువరు లెఱుఁగుదురు. అయినను నానలువురిలో రామునియందే మొదటినుండియు శక్తిసింగునకు స్నేహమధికము. చందావతుఁడుఁ గూడ వానినే మిక్కిలి ప్రేమించుచు 'రామభద్రా' యను ముద్దుపేరుతోఁ బిలుచుచుండును. ఇది వానిపేరుబలముచేతనో లేక వానియందున్న సహజమైన యాకర్షణశక్తిచేతనో మనము చెప్పలేము. చెప్పుటకుఁ బ్రయత్నముగూడ ననవసరము. పరస్పరముఖవీక్షణమాత్రముననే కొందఱిహృదయము లతిసూక్ష్మముగ నొండొరులచే నాకర్షింపఁబడి యవ్యాజమైన యనోన్యప్రేమ వహించు



చుండును. దినముల కొలంది కలిసి మెలంగుచుండినను గొందఱి హృదయములు కలియనే కలియవు. ఇవి మానవస్వభావమునందలి విశేషములు.

ఆనాడు వా రట్లు మాటాడుచుండఁగా నింతలో టప్పాటప్పున బాదుకల చప్పుడు వారి కప్పుడు వినవచ్చెను. "బాబాజీవారు సాయంకాల సంధ్యావందనమునకై వచ్చుచున్నా" రని వారిలో వారు గుసగుస లాడుకొనుచుఁ జాచియుంచిన కాళ్లు ముడుచుకొని నయ భయంబులతో ద్వారమువంకఁ జూచుచుండిరి. చందావతుఁడు గుండారు వోసికొని—భుజముపై నొకయంగవస్త్రము వేసికొని- చేతనొక కమండలముతో వారికిఁ బ్రత్యక్షమయ్యెను. వాని వెనుకనే యొక భిల్లుఁడును బాదములచప్పుడు వినఁబడకుండ నతిరహస్యముగ వచ్చుచుండెను. చందావతుఁడు దూరమైనంతనే శక్తిసింహాదుల కతఁ డేదో చెప్పవలయు నని కుతూహలపడుచుండినట్లు వాని ముఖలక్షణములవలనను జేష్టలవలనను స్పష్ట మగుచున్నది. చందావతుఁడును వారి నెవ్వరిఁ బలుకరింపక యీ మంటపము ప్రక్కనుండియే పోవుచు, మంటపము దాటి నాల్గైదడుగు లరిగి తటాలున నాగి వెనుకకుఁ దిరిగి "బాబా! నీతోఁ జెప్పవలయు నని యనుకొనుచు నెప్పటి కప్పుడే మఱచిపోవుచుంటిని. నాథద్వారములో నున్న భామాసావద్ద నెవ్వరు నెట్టి వస్తువులును గొనఁగూడ దని ఖానుసాహేబువారు తాఖీదు

పంపినారు. ఇఁక మీఁద నీవేమియు నయ్యంగడిలోఁ గొనకుము. కొనుటకే గాదు, ఎందుకును గూడ నీ వీపై నాథద్వారమునకుఁ బోఁగూడదు" అని పలికి శక్తిసింగునుండి ప్రత్యుత్తరము నభిలషింపకయే తన దారి నేగెను. అతఁడు తమ దృష్టిపథము నుండి తప్పినంతనే వారేవురు నొకరిమొగ మొకరు చూచుకొని నవ్వుకొన సాగిరి.

ఇంతలో నాప్రాంతమందున్న భిల్లుఁడు నక్కుచు వారిని సమీపించి శక్తిసింహునిఁ జూచి నమస్కరించి—

"మహాప్రభూ! ప్రయత్నములు జరుగుచున్నవి."

"ఏమి ప్రయత్నములు?"

"యుద్ధ ప్రయత్నములే."

"ఎవరిపైకి?"

"ఏమో నాకుఁ దెలియదు."

"అయిన నీ వేమి చూచితివి?"

"సిపాయిలందఱుఁ దత్తర పడుచున్నారు. తుపాకులలో మందుఁ గ్రుక్కఁ బడుచున్నది. కత్తులు సానపెట్టఁ బడుచున్నవి."

"ఖాను కోటలోనే యున్నాఁడా?"

"కోటలోనే యున్నాఁడు. ఆగ్రానుండి యేదో తాకీదు వచ్చినట్లును, అతఁడు తొందరపనిలో నున్నట్లును జెప్పుకొనుచున్నారు."



"సరే! అయిన మనమును వేఁటకొఱకు సిద్ధపడుదము. నీ వాప్రయత్నములు వెంటనే ప్రారంభింపుము."

"చిత్తము."

---

## ఇరువదియేడవ ప్రకరణము

### రాజసింహుఁడు.

ఉదయపురమున కుత్తరముగా నరువదిమైళ్ల దూరములోఁ జంద్రభాగానదీతీరమునఁ గొందఱు బాటసారులు విడిసియుండిరి. వారిలో నాయుధపాణులగు నేఁబదిమంది మొగలాయి సిపాయిలు నిరువురు మావటివాండ్రును నెనమండ్రు సేవకులును గలరు. వారితోఁ జిరతలు వేయుచుఁ జితారు మీటుచుఁ బాడుచుండిన యొకభిక్షుకుఁడును గలఁడు. మావటివాండ్రును సేవకులునుగూడ మొగలాయిలే. ఆపరివారమున కెల్ల నాయకుఁడగు వాఁ డొక్కఁడే రాజపుత్రుఁడు. ఆ రాజపుత్రుఁడు నాతని తురంగమునుగాక, యాసిపాయిలకందఱి కొక్కొక్కని కొక్కొక్క గుఱ్ఱము చొప్పున నేఁబదిగుఱ్ఱములు గలవు. సామానులు వేయుటకు రెండేనుఁగులుఁ గూడ నుండుటచేతఁ బ్రయాణకాలమున సేవకులు వానిపైనే కూర్చుందురు కాఁబోలు! ఈ పరివారసంఖ్యతో లేశమును సంబంధము లేకుండ నచ్చటికిఁ గొంచె మెడముగా నొక సవారియు దృఢ

కాయులైన యెనమండ్రు బోయీలును గలరు. అందుచే నాబాటసారులలో నొకస్త్రీకూడ నున్నట్లు మన మూహింపవచ్చును. ఆ సవారి కత్యంతసమీపముగా నొక గుడారమును బ్రక్కనే యింకొక గుడారమును వేయఁబడినవి. సవారి తలుపులు గుడారద్వారమున కంటియే యుండుటచేత నందున్న స్త్రీ రెండవకంటఁ బడనక్కరలేకయే యందుండి లోనికిఁ బోవచ్చును. ప్రక్కనున్న రెండవ గుడారములో రాజపుత్రుఁడు విడిసియుండెను. అందుచే నాస్త్రీయు నాతనితో సంబంధించినదే యని చెప్పనక్కరలేదు. ఇంకను జీకటిపడకున్నను బెందలకడనే వంటలుచేసికొని భుజించి, మార్గాయాసముచే బోయీలా గుడారముల చుట్టును జాపలు వేసికొని హాయిగా నిద్రించుచుండిరి. మొగలాయిసిపాయిలుఁ గూడ నానదీతీరమునం దందందుఁగల వృక్షములక్రింద గుంపుగుంపులుగాఁ గూడి వండుకొనువారును భుజించువారును నిద్రించువారు నై యుండిరి. కొందరు భిక్షుకునిచుట్టు గుమిగూడి కూర్చుండి వాని గానామృతము నాస్వాదించుచుండిరి. కొందఱు నీరు ద్రావించుటకై గుఱ్ఱములను నదీజలమ్ముకడకుఁ గొని పోవుచుండిరి. చెట్టెక్కి మావటివాండ్రు కొట్టిపడవేయుచున్న కొమ్మల నేనుఁగులు తొండములతో నందుకొనుచున్నవి.

ఆ రెండు గుడారద్వారములును నొండొంటి కభిముఖముగా నుండుటచేత రాజపుత్రుఁడు తన గుడారములోఁ



గ్రిందఁ జాపవేసికొని కూర్చుండి తన కట్టెదుటఁ గానవచ్చుచుండిన సవారివంక వీక్షించుచుండెను. అతఁ డేదియో దీర్ఘాలోచనమున మునిఁగియుండుటచేత నాతని చూపులు నిశ్చలములై యుండెను. అప్పుడే చిఱుచీకటులు ప్రారంభించుచున్నందున నొక సిపాయి రెండుచేతుల నఖండముగ మండుచుండిన రెండు దివ్వటులను గొనివచ్చి, యారెండు గుడారద్వారములకడఁ బాతి వెడలిపోవుటయు నతఁడు పరధ్యానముతోడనే కని పెట్టెను. ఇంతలో నింకొకసిపాయి వచ్చి నమస్కరించి;

"రాజాజీ ! పహారా కాజ్ఞ దయచేయఁ గోరుచున్నాము."

"నిన్నటిరాత్రి నిద్రించినవారిలోఁ బదిమందిని నేటి రాత్రి పహారాకు నియోగింపుము. జాగ్రత్తయని చెప్పుము. నాకు నిద్రవచ్చుచున్నది. ఇంకమీఁద నెవ్వరి నిచ్చటకు రానీయకుము. గురూజీవారిని బలవంతపెట్టి పాడింపవద్దు. వారిని హాయిగాఁ బరుండనిండు."

అని యాజ్ఞాపింప నాసిపాయి వెంటనే యచ్చటినుండి తొలఁగిపోయెను. ఆసిపాయి వెడలిపోయినంతనే యారాజపుత్రుఁడు మఱలఁ దన మానసికవ్యాపారమును బ్రారంభించెను. సిపాయిలెవ్వరును జేరరాకుండ నాజ్ఞాపించినందున నీసారి వాని దీర్ఘాలోచనమున కెట్టి యంతరాయమును గలుగలేదు. అందుచేఁ గ్రమక్రమముగా వానికిఁ దన్మయత్వము కలిగినది.

తన్మయత్వము కలిగినప్పుడు శరీరముపై జ్ఞానముండదు. అంతి యేగాక యాతన్మయత్వమునకుఁ గారణమైన విషయముతో సంబంధించినమాటలు నోట నప్రయత్నముగను నజ్ఞాతముగను వచ్చుచుండుట స్వభావసిద్ధము. ఆరాజపుత్రుని నోటనుండి కొన్నిమాటలు వెడలుచుండెనుగాని వానిలో నొకదాని కొకటి సందర్భ మున్నట్లు తోఁచదు. ఆమాటలఁబట్టి వాని యాలోచ నాంశములుగాని వాని చరిత్రాంశములుగాని గుర్తించుట కవ కాశమును లేదు. అయినను వినఁబడుచుండిన మాట లేల వినఁ గూడదు?

"ఈప్రదేశములన్నియు నాకుఁ బవిత్రక్షేత్రములు! .....................ఎట్లు గుర్తింపఁగలను? నా కంత భాగ్యమా?.................ఇంతకాలము నజ్ఞానములో మునిఁగి కర్తవ్యమునం దుపేక్ష చేసితిని. ............... ఇక్కడి కెంతదూరముండునో? ఏమో దాటియే వచ్చితినేమో? ......................అచ్చటనే యుండిపోవలసినది. లేదా చావవలసినది........................సహాసము ద్రమువలె నుప్పొంగుచుండిన యీ మనోవేదన మెట్లు భరింపఁ గలను? ఎట్లు మ్రింగఁగలను? ఎట్లు దాచియుంచఁగలను? ................"

కొన్నిమాటలు వానినోట వెలువడుటయె తడవుగ వాని కన్నులనుండి సంతత ధారావృష్టిగఁ గన్నీరు వలవలఁ గారఁ



జొచ్చెను. వెంటనే వీపుపై వ్రేలాడుచుండిన పగిడీ కొనలతోఁ గన్నులు దుడుచుకొనుచు నింతలో గుడారము వెనుకనుండి యెవ్వరో నడచినట్లు తన కనుమానము తోఁచినందున నిటు నటుఁ జూడసాగెను. చూచుకొలందిని వాని యనుమానము బలపడ సాగినది. అందుచే నతఁడు తన కంఠమును సవరించు కొని, మఱియొకమాఱు కన్నీరు తుడుచుకొని "ఎవరక్కడ?" అని బిగ్గరగా నడిగెను. ఆమాటకుఁ బ్రత్యుత్తరంబుగా నొక సిపాయి వచ్చి ద్వారముకడ నున్న దివ్వటి యొద్ద నిలువఁబడి సన్నని కంఠస్వరంబుతో "నేను సిపాయిని. ఒకసంగతి మనవి చేసికొన వలెనని వచ్చినాను." అని పలుకుచు మెల్లఁగా లోనఁ బ్రవేశించెను. రాజపుత్రుఁడు వాని రాకకుఁ జికాకును గోప మును గాంచి—

"పైనుండియే మాటాడవలయునుగాని లోనికి రాఁగూ డదని నే నాజ్ఞాపించుట నీ వెఱుఁగవాపకువా! లోని కేల వచ్చితివి?"

"ఎఱుఁగుదును. చెప్పవలసినది మిక్కిలి రహస్య మగుటచేత నితరులు వినఁగూడ దని వచ్చితిని. క్షమింప వలయును."

అని పలుకుచు వచ్చిన సిపాయి మెల్లఁగా మఠము వేసికొని కూర్చుండెను. రాజపుత్రుఁడు వాని సాహసమున కాశ్చర్యపడి యంతకంటెను నాగ్రహింపవలసియుండెనుగా

యతఁ డేదో రహస్య మనుచుండుటచే నావిశేష మెట్టిదియో వినవలయు నని కుతూహలపడి యాసిపాయితో నిట్లు ప్రసంగించెను.

"రహస్యమా? ఏమి రహస్యము? త్వరగాఁ జెప్పుము."

"మీతో సంబంధించిన రహస్యమే. మనము బయలు దేరినది మొదలుకొని మీ కా రహస్యము చెప్పవలయు నని నే నెన్నివిధములఁ బ్రయత్నించినను నొక్క మజిలీయందైన నా కవకాశము కలుగలేదు."

"సరే! ఇప్పు డవకాశము కలిగినదికదా! చెప్పవలసిన దింకఁ జెప్పవచ్చును."

"మీరానాడు దర్బారులోఁ జక్రవర్తితోఁ బ్రసంగించి సభ ముగిసిన తరువాతఁ జుట్టుప్రక్కలనున్న రాజమందిర విశేషములు విలోకించుచు నొంటరిగ వచ్చుచుండ నాకస్మికముగా నొక యంతఃపుర కన్యక మిమ్ముఁజూచి మీయందు బద్ధానురాగ యైనది.

"నాయందా? నాయందా! ఎంత వింత? నిజమేనా? ఆకన్య యెవరు?

"ఎవ రైన నేమి? మీచరణదాసి మీయర్ధాంగి."

"ఇంత యెఱిఁగినవాఁడ వామెపే రెఱుఁగవా?"

"ఎఱుఁగ కేమి? ఆమెపేరు మెహరున్నిసా."

"ఈరహస్యము నీ కెట్లు తెలిసినది?"



"ఆమె నన్ను మీకడకు రాయబారిగా నియోగించినది. కాని యాగ్రాలో మీ రున్నకాల మతిస్వల్ప మగుటచే నాకుఁగాని యామెకుఁగాని స్వయముగా మీతో మాటాడుట తటస్థింపలేదు. మీ రామెను జూచినారా?"

"చూచినట్లు నాకు జ్ఞాపకము లేదు."

"రాజసింహా! ఆమె చక్కఁదనమువంటి చక్కఁదన మంతఃపురస్త్రీలలో నెవ్వరికిఁగాని లేదు. మీ రామె నేల పరిగ్రహింపఁగూడదు?"

"ఆమె మొగలాయి స్త్రీకదా? ఆమెనెట్లు వివాహమాడఁగలను?"

"చక్రవర్తి రాజపుత్రస్త్రీలఁ బెండ్లాడుచున్నప్పు డీ యాచారమేనా యుండఁగూడదు. మీ రామెను జేపట్టిన యెడల నదియే యాచారము కాఁగలదు. ఆపై నిట్టి వివాహములు స్వేచ్ఛగా జరుగఁగలవు."

"నిజమేగాని నేనిప్పుడు మతసంస్కరణమునకై బయలుదేరలేదు. అది నాపనిగాదు. ఏదో కార్యాంతరముపై వచ్చి పోవుచున్న నే నెక్కడ? ఆమె యెక్కడ? నాకును నామెకును మధ్య నెన్నియో వందలమైళ్లు దూరమున్నది. తఱచుగ వచ్చువాఁడనా పోవువాఁడనా?"

"రాజసింహా! మనోగమనమునకు దూరమున నున్నదా? ఎన్నివందలమైళ్లైనను క్షణమాత్రములో దాటిపోఁగలదు. తా నాశ్రయించిన వ్యక్తిని దాటింపఁ గలదు."

"నీవు చెప్పవలసిన రహస్యమింతేకదా? సరే యింక వెళ్ళవచ్చును."

"పరిగ్రహించినట్లు మాట యిచ్చినఁగాని నేనిందుండి కదలను."

"నన్నింత నిర్బంధించుట కామె నీబంధుగురాలా యేమి?"

"ఏమైన నేమి? నాయందీకార్యభారమామె యుంచినది. నిర్వహించెదనని నేనును మాటయిచ్చితిని."

"నాహృదయము నడుగకుండ నెట్లు మాటయిచ్చితివి? నేనామె నెన్నఁడైనఁ బరిగ్రహింతుననుకొంటివా?"

"పరిగ్రహింపకున్న నిదిగో కరవాలము!"

"ఏమి చేసెదవు?"

"ఇచ్చటనే యాత్మహత్య గావించుకొనెదను. అచ్చట నామెయు నాత్మహత్య చేసికొనును."

ఆమాటలతో రాజసింహునకు శరీరము కంపమొంద సాగెను. మాటలనుబట్టి యాసిపాయి వట్టిమూర్ఖుఁడని గ్రహించి మంచిమాటలతోడనే వాని నందుండి పంపివేయనెంచి యిట్లనియె.

"ఓయీ! పరిగ్రహింపనియెడ నాత్మహత్య గావించుకొనునంతటి మోహమామెకు నాయందున్నదా? అయ్యో! పాపము! అంతటి యనురాగాతిశయముగల కన్యకతో ముచ్చటించుటకైన వీలులేకపోయెనుగదా?"



"వీలులేకపోయినదా? రాజసింహా! సంకల్ప మున్నప్పుడు వీ లుండకపోదు. మీహృదయము కఱఁగినదికదా? ఈ నిర్భాగ్యురాలిపై మీ కనుగ్రహము జనించినదికదా? అట్లైన నిదిగో మెహరున్నిసా - ఇచ్చటనే యున్నది."

అని పలుకుచు ధరించిన సిపాయిదుస్తులు తీసివేసినంతనే రాజసింహుఁడు మెహరున్నిసా నత్యాశ్చర్యముతోఁ జూచి విశ్చేష్టితుఁడయ్యెను.

---

## ఇరువదియెనిమిదవ ప్రకరణము

### గుట్టు చెప్పివేసెను.

"వీరమల్లూ! సోదరీభావంబున నాయం దింతటి యవ్యాజానుగ్రహము చూపించిన శక్తిసింహుని మహోపకారమును నాజన్మమధ్యమున మఱి మఱువఁజాలను. శత్రువుల రహస్యవర్తనమును గుర్తించుచు సమయము వచ్చినప్పుడు మాకుఁ దోడుపడ సిద్ధపడి యుండుటయు నాయదృష్టవిశేషమే. చేయవలసిన యేర్పాటులను గూర్చి మహాబాజీవారు మాకుఁ జెప్పియే వెళ్ళినారు. ఇన్ని దినంబులును మేము ప్రయత్నములయందే యుంటిమి. ధనము జవాహిరీ విలువగల సామానులును గైకొని మాతల్లిగారుదయముననే వెడలి,

పోయినారు. మిగిలిన సామానులు వీలైనంతవఱకు భద్రపరచు కొని యింక నేనును బయలుదేరెదను. మున్ముందుగ మా కీ వార్త మీ రెఱింగించినందున మఱింత జాగ్రత్తపడుట కవకాశము కలిగినది. ఇంక నే క్షణమున వచ్చినను మఱి భయము లేదు. వీరమల్లూ! ఎందుకైనను మంచిది. నీవు జాగు చేయక వెంటనే బయలు దేరుము. శక్తిసింహునకు నా నమస్కారము లెఱింగింపుము"

అని మీరాభాయి వీధిగుమ్మములో నిలుచబడి, వాకిట గుజ్జముపైఁ జేయివేసికొని ప్రయాణోన్ముఖుండై యున్న వీరమల్లుతోఁ జెప్పెను. వీరమల్లుడును గడు వినయముతో నామె పలుకులు విని నమస్కరించి సెలవుగైకొని చంగున నెగిరి తురంగారూఢుఁడై యున్నట్లైయుండి మాయమైన ట్లతిజవంబునం బోయెను. మీరాభాయి వెంటనే లోనికేగి వీధి తలుపులు గడియ వేసి పెరటిలో నున్న కర్మాగారమునకుఁ బోయెను.

భామాసా నిర్మించిన కర్మాగారమువంటి కర్మాగారమును సాధారణముగా మన మెచ్చటను జూచి యుండము. ఇంచుమించుగ నొక ఫర్లాంగు పొడవును నందుకుం దగు వెడల్పును గల విశాలప్రదేశమున వరుస వరుసలుగ నున్న పొడవైన సాలలలోని రాట్నము లెన్ని వందలుండునో యెవరు లెక్కింపఁగలరు? కొండల పిండుంబోలు ప్రత్తికాయలరాసులొకచోట- కాయలనుండి తీసిన యెత్తైన ప్రత్తిప్రోవు లొకచోట- ప్రత్తినుండి వేరైపడిన యత్యున్నతంబులగు గింజలకుప్ప లొకచోట- గింజలనుండి వేరై వడుకఁబడి యసాధారణంబులగు దారంపు బిండ లొకచోట- అచ్చటి విశాలశాలాంతరముల యం దెచ్చటఁ జూచినను విచ్చలవిడిగాఁ గానవచ్చుచుండెను. మకిలి గాకుండ నందందుఁ గడుభద్రముగ వ్రేలఁగట్టఁబడి పలురంగుల రంగారు పట్టుదారంపుఁ జుట్టలును, తళ తళ లాడుచుండిన జరీదారంపుఁ జుట్టలును గాంచునెడ నందలి పనివాం డ్రెంతటి విలువగల బట్టలనైన నేయుటయందు నేర్పరులని స్ఫురింపక తప్పదు. అంతియెగాక యా కర్మాగారమునందు వందలకొలఁదిఁ బడియుండిన కంబెలు - కదురులు మొ గ్గంబులును సామాన్యోపకరణంబులకంటె భిన్నంబులై యనేకములు చిత్రవిచిత్రములుగాఁ గానవచ్చుచున్నవి. నాథద్వారము సగము గ్రామ మా కర్మాగారముననే జీవించుచుండెననుట కంటె దాని ప్రయోజనము వేరు వివరింప నక్కరలేదు. సగము గ్రామముగాదు, నిండుగ్రామము గాదు. రాట్నము దేశమును బోషింపఁ గలదు! రాజ్యము లిప్పింపఁగలదు!

ఆనాటి మధ్యాహ్నమున మీరాభాయి పోవుసరి కచ్చటి పనివాండ్రందఱు సామానులు సర్దుచుండిరి. జరీదారములు పట్టుదారములు మొదలగు విలువగల వస్తువులు పెట్టెలలోఁ బెట్టి తాళములు వేయఁబడుచుండెను. ఆరబైటనున్న ప్రత్తిరాసులను గొందఱు పనివాండ్రు గంపలతో మోసికొని

పోయి సాలలోఁ బడవేయుచుండిరి. అందందుఁ బడియున్న కండెలు కమరులు మొదలగు సామగ్రిలను గొందఱు జాగ్రత పెట్టుచుండిరి. కొందఱు మగ్గములను విప్పి చుట్టివేసి సాలల లోని మాఱుమూలలఁ జేర్చుచుండిరి. అప్పుడు మీరాభాయి వచ్చి పనివాండ్రచే సామానులు సర్దించుచుండిన యమర సింహుని సమీపించి—

"రాజకుమారా! నీ వింతవఱకు నాకుఁ దోడుగా నున్నందు కెంతయో సంతోషించితిని. కాని యింతలో నీవు వెడలిపోయిన నా కింతకంటె నెక్కుడు సాహాయ్యము చేసిన వాఁడ వగుదువు."

"మీరా! అట్లనెద వేమి! నిన్నొంటరిగ విడిచిపోయిన యెడల మీ తల్లిగారు నాపై నాగ్రహింపరా? ముప్పైనను మెప్పైనను మన మిరువురమును బొందవలయు. సమయము వచ్చినప్పుడు నీతోడనె నేనును గృపాణ పాణినయ్యెద."

"ఆఁ—ఆఁ—కృపాణ పాణివయ్యెదవా? ఇవి నీనోటనుండి వచ్చిన మాటలేనా? అట్లైన నేఁడేదో యుపద్రవము తప్పదు. అమరసింహా! ఈపాటి ధైర్యసాహసము లా నాడే నీ కుండి యుండినయెడల మా కింతటి ముప్పు లేకపోయి యుండునుగదా? షహాబజ్ఖానుఁడు వచ్చుసరికిఁ జేతనున్న చీర తటాలున గదిలోఁ బారవేయవలయు నను నాలోచనయైనను నీకుఁ గలుగక పోయినది. ఇది యంతయు మా దురదృష్టము. నిన్ననవల సిన దేమున్నది?"



ఈ మాటలలోనే గడియలు వేయఁబడిన వీధితలుపులు బ్రద్దలగునంతటి మహాధ్వని ధ్వనింప సాగెను. ఆధ్వని విని మీరాభాయి తొట్రుపాటుతోఁ జావడిలోనికిఁ బరుగెత్తినది. అమరసింహుఁడుఁ గూడ నామె ననుసరించెను. కొట్టుకొను చుండిన గుండెలతోఁ, దొట్రుపడుచుండిన పాదములతో వడకు చుండిన చేతులతో మీరాభాయి గడియలు తీసి తలుపులు తెఱచినది. తోడనే భయంకరాకారముతో షహాబజ్ఖాను డామెకుఁ బ్రత్యక్షమయ్యెను. వాని వెనుక గుమ్మము పట్టి నంతవఱకు గుమిగూడిన సిపాయి లుండిరి. తుపాకులతోఁ దురంగారూఢులైన సైనికులు వాకిటనిండఁ గిటకిట లాడు చుండిరి. తలుపులు తెఱువఁబడినతోడనే షహాబజ్ఖానుఁడు మీరాభాయినిఁ జూచి, విద్యుల్లత తెఱంగునఁ దళుక్కున మెఱ సిన యామె శరీర లావణ్యము కన్నులకు మిఱుమిట్లు గొలుప నిశ్చేష్టితుఁడైన ట్లొక్కక్షణముమాత్ర మూరకుండి—

"అమ్మాయీ! మీయిల్లు జప్తు చేయవలసినదిగా హుజూరు నుండి నాకు సెలవైనది. ఇదిగో యాజ్ఞాపత్రము. ఇందుకు నీవుగాని నీతో సంబంధించిన వారుగాని మా కెట్టియాటంకమును గలిగింపఁ గూడదు."

"సాహెబ్జీ! మే మాటంకపెట్టిన పాదుషావారి యాజ్ఞ నిలిచిపోవునా? అవశ్యముగ మీరు వచ్చినపని గావింప

వచ్చును. కర్మాగారమున మా పనివాండ్రున్నారు. తనిఖీ చేయుటలో మీకు వలసినంత సాయము చేయఁగలరు. ఇంత మాత్రమునకై మీ రింత సైన్యముతో రావలయునా ?''

"ఆ-హా! మీ కర్మాగారమునందలి పనివాండ్రు వందలకొలఁది నున్నారు. వారందఱు నొక సైన్యమునకు సరిపడెదరు. ఆపై గ్రామస్థులందఱు సమయము వచ్చినప్పుడు మీకుఁ దోడుపడవలసినవారే. ఇందఱును గూడి మాపైఁ దిరుగఁబడిన మే మేమి చేయఁగలము! అమ్మాయీ! మఱియొక్కమాట! ఈ యాజ్ఞాపత్రములో నే మున్నదో యెఱుఁగుదువా? మీయొద్దనున్న లూటీ సరుకులు మీయంత మీరే తెచ్చి మా కప్పగించిన యెడల మీయింటిలోఁ బ్రవేశించుటకుఁగాని జప్తుచేయుటకుఁగాని మా కెట్టి యవసరము నుండదు. నీ వట్లు చేసెదవా?''

"అట్లు చేయవలసిన యవసరము మాకును లేదు. తనిఖీచేసి మీ కనుమానమున్న వస్తువులు గొనిపోవచ్చును."

అని మీరాభాయి పలికినంతనే షహాబఖానుఁడు వెనుకకుఁ జూచి చెంతనున్నవారితో నేమో గుసగుసలాడసాగెను. గుమ్మములోపల మార్గమున కడ్డముగ నున్న మీరాభాయియు నామె వెనుకనున్న యమరసింహుఁడునుగూడ నాచావడిలోఁ బ్రక్కకుఁ దొలఁగిపోయిరి. ఖానుఁడు వెంటనున్నవారితోఁ గూడ రివ్వున లోనఁ బ్రవేశించి తిన్నఁగాఁ గర్మాగారము



నకు నడువసాగెను. మీరాయమరసింహు లిరువురు నచ్చటినుండి వచ్చి వీధి యరుగుపై నిలువఁబడి, తమ వాకిటనుండి యా వీధిలో నెంతోదూరమువఱకు నిండియుండిన సైనిక నికాయంబును విలోకింపసాగిరి. అరుగులెక్కి యిండ్లెక్కి గోడలెక్కి చెట్లెక్కి వీధియెల్లెడ గ్రిక్కిరిసియుండిన యా సైన్యమును బురవాసులు వింతగాఁ జూచుచుండిరి. కేకలువేయక, యల్లరి చేయక వీధి పిల్లలుఁగూడ గడగడ లాడుచుండుటచేత, నంతటి సమ్మర్దముతో నిండియుండినను దత్ప్రాంత ప్రదేశంబంతయు నిశ్శబ్దముగనే యుండెను. ఇట్లు కొంతసేపు గడచిన తరువాత నగురుపైనున్న మీరాభాయికిఁ బెరటిలోనున్న కర్మాగారము నుండి యాకస్మికముగఁ గేకలు రోదనధ్వనులు వినరాదొడంగెను. మొలనున్న యొడ్డాణమును సవరించుకొనుచు మీరాభాయి - వలదు వలదని వారించుచుండిన యమరసింహుని వినక - యరుగుపైనుండి గుమ్మములోనికిని గుమ్మములోనుండి చావడిలోనికిని ఛంగున దాటుచుఁ బోయెను. అందుచే నరుగుపై నొంటరిగనుండిన యమరసింహునకిప్పుడు పూర్వపు ధైర్యము లేదు. అరుగుపై నుండలేఁడు, లోనికిఁ బోఁజాలఁడు. రోదనధ్వనులు వినుకొలఁది వానియందును రోదనచిహ్నములు గానవచ్చుచుండెను.

మీరాభాయి చావడిలోని కేగుసరికిఁ గట్టెమటనున్న గదిలోనుండి గుమ్మమునకు వ్రేలాడుచుండిన తెఱచాటునఁ

దొలంగించుకొని ధుమధుమ లాడుచుండిన మొగముతోడను, నిప్పు లొలుకుచుండిన కన్నులతోడను భీకర కంఠస్వరమ్మున నమ్మాయీ! అమ్మాయీ! యని పిలుచుచు వచ్చి ఖాను సాహే బామెకుఁ బ్రత్యక్షమయ్యెను. వాని భీకరాకారము నకు నిర్ఘాంతపడి యామె తటాలునఁ బ్రక్కకుఁ దొలఁగి పోయినది. ఆమె కంటఁబడినంతనే ఖానుఁడు పటపటఁ బండ్లు కొఱుకుచుఁ జేతనున్న బెత్త మాడించుచు—

"అమ్మాయీ! నీగౌరవమును గాపాడుకొనఁ దలంచితి వేని నీరుకు లెచ్చట దాచఁబడినవో చెప్పు!"

"సాహేబ్జీ! వచ్చినపని మీరు చేసికొనవలసినదే గాని మమ్మేమియుఁ బ్రశ్నింపఁ గూడదు. మేము స్త్రీలము."

"నీవు స్త్రీవో పురుషుఁడవో తెలియకున్నా ననియా నీ యుద్దేశము? ఓసి మూర్ఖచిత్తా! నోటికివచ్చినట్లు పేలక సరుకు లెక్కడనున్నవో చెప్పు! చెప్పకున్న నీ కిక్కడ దిక్కెవ్వరు నుండరు. జాగ్రత్త—"

"ఓరి పశువా! నాకు దిక్కులేకేమిరా? ......"

అని యాగ్రహాతిశయమునఁ గలిగిన నవ్వుతోఁ బలుకుచు, మొలయం దొడ్డాణమైయుండిన ఖడ్గమును దటాలునఁ గొలికి తప్పించి, కాలపాశమువలెఁ జేతనూని యాడించుచు–

"ఇదిగో! నాదిక్కు! ఇంక నీదిక్కు చూచుకొనుము."

"అరేరేరే!—చంపకు! చంపకు! మమ్ముఁజంపివేయకు!"



అని వ్యధికరణముతోఁ బలుకుచుఁ గన్నులెఱ్ఱఁ జేసి—

"చోర్! పద్మాష్! లుచ్ఛా! నిజము చెప్పవలెను; మాఖైదులోనుండు! ఉండుండు! నీపని ముందున్నది."

"నాపని ముందున్నదిగాని నీకాలము సమీపించినది నిన్నప్పుడే సన్నిపాతము ముంచివేసినది. అందుకే యింతగాఁ బేలుచున్నావు."

ఖా నామాటలు వినిపించుకొనక కోఱచూపులతో నామెవంకఁ దీవ్రముగా వీక్షించుచు నాచావడిదాటి మఱల నొకసారి వీధిగుమ్మములోనికి వచ్చెను. తోడనే శరీరమునఁ జలనములేక చిత్రప్రతిమవలె నరుగుపై నిలువఁబడియుండిన యమరసింహుఁడు వానికంటఁబడెను. వాని భయంకరాకృతి వీక్షించిన యమరసింహునకు శరీరమెల్లఁ దడిసిపోయినది. ఖాను సాహే బప్పు డరుగుపై కెక్కి యురుకుకి యమరసింహుని సమీపించి బెత్తమాడించుచు – 'నీవైనఁ జెప్పెదవా లేదా? చెప్పకున్న నేమిచేసెదనో చూడు! చెప్పు! చెప్పు! ఎక్కడ దాచినారు? ఏమిచేసినారు?' అని యడుగుచు నా కఠిన చిత్తుఁడు పాపము సుకుమారశరీరుఁడైన యారాజకుమారుని వీపుపై గట్టిగ బెత్తముతో వేసెను. తట్టుతేరిన యాదెబ్బతో నమరసింహుఁడు కోడిపిల్లవలెఁ గొట్టుకొనుచు లోలోననే యేడ్చుచుఁ దడబడు మాటలతో—

"ప్రొద్దున - బండ్లు - బండ్లు - సామాను - సామాను - "

"ప్రొద్దున బండ్లపై సామాను వేసి పంపివేసిరా ?"

"ఔను."

"ఎక్కడకుఁ బంపివేసిరి ?"

"తెలియదు - తెలియదు - నాకు - తెలియదు."

"ఛీ! దొంగా! నీ వెఱుఁగుదువు. చెప్పు! చెప్పకున్న—"

అని పళ్లుబిగించి ఖాను మఱల బెత్తమెత్తఁబోవుచుండ సమరసింహుఁ డేడ్చుచుఁ జేయడ్డు వెట్టుకొనుచు—

"ఉదయ - ఉదయ - ఉదయపురమువైపు వెళ్లినవి—"

ఇంతలోఁ దక్కిన సిపాయిలుగూడ లోపలినుండి వచ్చిరి. ఖాను వారినిఁ జూచి, "ఈ యిద్దరిని ఖైదీలుగాఁ బట్టుకొనుఁడు! తక్షణ ముదయపురమువైపు ప్రయాణము సాగింపుఁడు!" అని యాజ్ఞాపించెను.

—o—

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము



### ప్రతాపసింహుని నూతన కార్యక్రమము.

"పృథ్వీరాజా! నీకు నమస్కారము! తండ్రీ! నీకు నమస్కారము! ముమ్మాటికిని నమస్కారము! ఎంతటి యజ్ఞానాంధకారంబున మునింగి, ఎంతటి యవాచ్యంబు లుచ్చరించి,



ఎంతటి యకార్యంబున కొడిగట్టితిని? అబ్బబ్బా! తలంచుకొనుకొలంది గుండెలు వ్రయ్యలై పోవుచున్నవి! ఆచంద్రతారార్కం బగు నపయశంబున కాలవాలం బగు నానీచలేఖ నీప్రతాపుఁడే లిఖించెనా? పాటేశ్వరీ! నేను లిఖించితినా? ఉగ్రసేనా! నీ వేల నన్ను వారింపవైతివి? అట్టి పాపాతురంబులకుఁ గారణభూతంబులగు నీవ్రేళ్ళ నొక్కవ్రేటున నీ వేల తుత్రుళ్ళింపవైతివి? ఇంతటి దేశద్రోహమహాపాతకంబునకే శిక్ష చాలదనుకొంటివా?—అంబా! భవానీ! పటాలున నాశిరంబు వ్రక్కలగునట్లు నీ వేల శపింపలేదు? ధరాభారకారణంబైన యీ శరీరమునం దిన్నాళ్ళవఱకుఁ బ్రాణవాయువు లేల యుంచితివి? పర్వతారణ్య భూగర్భస్థితంబులగు సృగాలంబులకైన నారక్తమాంసము లుపచరించియుండునే?—అమ్మా! ఏమనుచున్నావు? దేశద్రోహియు మాతృఘాతుకుఁడు నగు నావంటి మ్రుక్కడివాని రక్తమును నక్కలేనియు ముట్టుకొనవనియా? నిజము తల్లీ! నిజము! ఎట్టి మహాపాపంబునకైనను బ్రాయశ్చిత్తవిధానము కర్మకాండయం దుండవచ్చునుగాని, మాతృద్రోహ పాతకమునకుమాత్ర మెందును విముక్తి యుండదు! మాతృభూమీ! మేవాడమాతా! నిన్ను మొగలాయిలకుఁ జరణదాసిగఁ జేసివేయఁ దలంచిన మహాపాతకుఁడను! ముక్కోటిదేవతలును ముప్వురు మూర్తులునుగూడ మఱలింపఁజాలని సుమతీదేవి శాపంబును గడకు సుమతియే క్రమ్మరింప

నట్లు నీవే నన్నుద్ధరింపవలయును ! నీయెడ ద్రోహబుద్ధి వహిం
చిన యీదుష్టబుద్ధిని నీవే క్షమించి పరిశుద్ధునిఁ గావింప
వలయు. కళంకవిముక్తునిఁ జేయువలయు. మఱల నీచరణార
విందసేవ కనుజ్ఞ దయసేయువలయు! అయ్యో! తల్లీ! కన్ను
రేల కార్చెదవమ్మా? నీకు భయము లేదు. నా కనుజ్ఞ దయ
సేయుము! సత్వరముగా దయసేయుము! దయచేసితివా?
ఇదిగో! మదారాతికంఠ విలుంఠనక్రియాదక్షం బగు చండికా
ఖడ్గము! ఇన్నిదినంబు లుపేక్షించిన నీఋణమును వడ్డితోఁ
గూడఁ దీర్పఁగలదు. భయపడకుము! మఱి భయపడకుము!
నీబ్రతు కింక పాడుదేవాలయంబుగా నుండదు. వీరారాతిశిరః
కమలహారంబులచే నీచరణముల ననేకసహస్రనామములతో
బూజించెదను. తత్కీలాలధారలతో నీ కభిషేకంబు చేసెదను.
రోదసీకుహరవ్యాప్తరణరంగపరాగంబుతో నీకు ధూపం బొసం
గెదను. ప్రతాపానలకీలికామాలికలచే నీకు దీపంబు వెలిగె
దను. స్వాతంత్ర్యప్రసాదంబును నీకు నైవేద్యంబు చేసెదను.
తల్లీ! ఇట్టి నాషోడశోపచారపూజావిధానంబులఁ బరిగ్రహించి
నన్ననుగ్రహింపవా? నా కాజ్ఞ దయసేయవా? ... ...
... ... ... ఆహాహా! పృథ్వీరాజా! నీ వెంతటి
మహత్తరశక్తి సంపన్నుఁడవోయి! నా చండికాఖడ్గంబుకంటెను
నీకవితాఖడ్గ మెంతవాడిగలదోయి! నాయనా! రాజసింహా!
కిన్నరులు మ్రోయు నీమనోహర కంఠస్వరంబుతో వీరరసా



కలిత కవితామృతంబైన యాయుత్తరము నిఁకొక్కమాఱు
వినిపింపవా?"

"మహారాజా! తమ సెల వగునెడ నెన్నిమాఱులైనఁ
జదివెదను. చిత్తగింపుఁడు—

"మేవాడరాజ్యస్వాతంత్ర్యప్రయోజనైకజన్మా! ప్రతాప
సింహా!"

"అబ్బబ్బా! నన్నట్లు సంబోధించుట శూలముతోఁ
గ్రుచ్చినట్లు కాదా?"

"మ॥ దశదిగ్గంధగజాళి కూల, దుడుసంతానంబునుర్వీరాల, ద
ర్కశశిద్వంద్వము త్రోవతప్ప, దఖిలక్ష్మాచక్రి మల్లాడ, డెం
దు శిఖవ్రాతము శీతమొందదు, భయార్తుంబోలె నీ వేటికిన్.
వశమైనట్టులు చక్రివర్తికి లిఖింపంగా? ధరాధీశ్వరా!"

"ఆహా! కవిశేఖరా! అట్టి మహోత్పాతంబులు
జనించినప్పుడేగాని యీ ప్రతాపుఁడు వశపడఁడని నన్నుఁ
గూర్చి భావించుచుంటివా? మహాత్మా! అప్రయోజకుఁడ
నైన నాయం దింత గౌరవభావము నీకున్నందుకు నాలో నేనే
సిగ్గుపడుచున్నాను."

"శా॥ స్వాతంత్ర్యంబును గోలుపోయి, యకటా సామంతులై నారప
ఖ్యాతిన్ హైందవచక్రవర్తులు తురుష్కస్వామికిన్ దుర్దశా
జాతంబౌ పరతంత్రవృత్తి నెటులో సైరించుచున్నాము; నీ
స్వాతంత్ర్యోద్యమమున్ ద్యజింతువె ప్రతాపా! యోప్రతా
పాధిపా"

"త్యజింపను! త్యజింపను! నాస్వాతంత్ర్యద్యమం బిఁక మీఁద నెన్నఁడును ద్యజింపను! జరిగినదానికి మాత్రము క్షమింపుము! కవిరాజా! విధివశంబునఁ బరతంత్రవృత్తియం దడఁగియుండినను, నీవంటి యున్నత రాజోద్యోగస్థు లెల్లరును గూడ స్వాతంత్ర్యము నభిలషించుచునే యున్నారని యిన్నాళ్ళకుఁ దెలిసికొనఁ గలిగితిని. హైందవ చక్రవర్తు లెల్లరుఁ దురుష్కస్వామికిఁ బాదాక్రాంతు లయ్యెదరుగాక! హిందూస్థానం బింతకంటెను బరాక్రాంతం బగుఁగాక! కాని నా జీవితమున మేవాడరాజ్యమునకుమాత్ర మట్టి కళంకమును రానీయను! నిశ్చయముగా రానీయను. ఎన్నటికి రానీయను."

"శా॥ ఆలుంబిడ్డలుఁ గూడుగుడ్డలును లేకాపన్నులై యుంటకుఁ
జాలింగంటె? యరణ్యదేవతలు భాస్వంతుండుఁజంద్రుండునీ
యాలుంబిడ్డలఁ బ్రోతు; రింక సమరవ్యాపారపారీణ శే
ఖాలీలోన్నతి సన్నుతింగనిన ఖడ్గం బూను ముర్వీశ్వరా!"

"మహాత్మా! నిజము గ్రహించితివి! స్వాతంత్ర్యదేవత నాయాలుబిడ్డల బలిగోరుచున్నదని భయంపడి యామెను బరిత్యజించితిని. కడచిన దినంబులు జ్ఞప్తికివచ్చునెడ— భయంకరంబగు నొక్కొక రాత్రి జ్ఞప్తికి వచ్చినయెడ – అబ్బబ్బా! అమ్మహారణ్య మధ్యములో – అట్టి సాంద్రతరాంధకారములో – వ్యాఘ్ర ప్రముఖానేక క్రూరమృగ సంచారములలో – ఝంఝామారుతోపేత మహావర్షపాతములో – రవంతయేనియుఁ బ్రాణాపాయంబు గలుగకుండ నరణ్యదేవతలును బంచభూతములును సూర్యచంద్రులునుగాక నాయాలుబిడ్డల నెవ్వరు కాపాడిరి? మాతృదేశోద్ధరణమునకై పాటుపడువారిని సమస్త దేవతులును సదా ప్రచ్ఛన్నవృత్తినిఁ గాపాడుచుందురను జ్ఞానము నాకప్పుడు కలుగదయ్యె..... రాజసింహా! తరువాతఁ జదువుము."

"సీ॥ ఆలుబిడ్డలఁ బ్రోతురఖిలదేవతలు నీ
విఁక శంకింపకుమీ కుమార!"

"లేదు. మహాత్మా! లేదు. మఱి శంకింపను."

"స్వాతంత్ర్యవిభవంబు సమకూరి తీరునీ
విఁకఁ గంకణ మూనుమీ నరేంద్ర!

"మహాకవుల వాక్యంబు లమోఘంబులే యగుఁగాక!"

"అంబికాదేవి నిన్ననుసరించి చరించు
నింక ఖడ్గము దాల్పుమీ నృపాల!"

"అంబా! జగన్మాతా! వృత్రాసురవధా సందర్భంబున మహావిష్ణుతేజంబు వజ్రాయుధంబునఁ జొచ్చినట్లు నీ తేజము నాకరవాలంబునం జొన్పి చండికాఖడ్గాభిధానంబు సార్థకంబు గావింపుము."

"మహిత స్వరాజ్య నిర్మాణంబు విధివ్రాసె
నింకఁ గైటక మెక్కుమీ మహాత్మ!"

"విధి వ్రాయక పోవుఁ గాక! లోకమున మానవ ప్రయత్నమున కసాధ్య మున్నదా!"

“గీ॥ వీరసంగ్రామ సామ్రాజ్య విజయలక్ష్మి
యింక వరియించు నిను నమ్ముమీ గుణాఢ్య!
మేలుకొను మింకఁ దెలవారె మేలుకొనుము
దళితవైరికలాప! ప్రతాప భూప!”

“కవిచంద్రమా! మేలుకొంటిని. అవివేకాంధ కారంబునుండి మేలుకొంటిని. అదిగో! నా కన్నుల యెదుటనే దివ్యజ్ఞాన భానుబింబం బుదయించు చున్నది! విజయ దుందుభి ధ్వానంబు లప్పుడే నాకు శ్రవణానందంబు గలిగించు చున్నవి. నీ యమోఘాశీర్వాద విశేషంబున వీర సంగ్రామ సామ్రాజ్య విజయలక్ష్మిని బడయఁగలిగితినా యాయశంబు నీ కవితా ఖడ్గంబునకే గాని, నాచండికాఖడ్గంబునకు రాదు.”

“ఉ॥ కట్టుము కంకణంబు, త్రిజగన్నుత వీర భయంకరాసి చేఁ
బట్టుము, సర్వరాజ్య విభవంబు నరాతుల నాజిఁ గెల్చి రాఁ
బట్టుము, నిల్పఁ బెట్టుము ప్రపంచమునన్ రసపుత్ర తేజ, మూ
కొట్టుము నాన యోక్తి, చెడఁ గొట్టకు మార్జితకీర్తిసంపదన్॥”

“ధన్యోస్మి! ధన్యోస్మి! మానసోద్రేక జనకంబులును శ్రవణానంద కరంబులు నగు నీ నీతి వాక్యములచే నా జన్మము తరించినది. ఉగ్రసేనా! ఇటు విను! ఉద్యాపనము చెప్పబడిన స్వాతంత్ర్య దేవతకు నేడు [illegible] నావాహనము గావించితిమి కదా? ఇంక—ప్రప్రథమంబునఁ గార్యక్రమంబున కుపక్రమింప వలసిన వాఁడవు నీవే! చక్రవర్తి



పంపిన యేబదివేల రూప్యములు నట్లే తిరిగి వానికిఁ బంపి వేయుము! ఇంక మోసకాఁడగు నాసఫ్‌ఖానునకు విధింపఁబడిన యపరాధ ధనంబగు పదివేలరూప్యములును మనము విధించిన యపరాధంబుగా భావించి పరిగ్రహింపుము. మహా పతివ్రత - దయార్ద్రచిత్త - పరమసాధ్వి - అంబా సమానయగు జోసీభాయి దయతో నొసంగిన నలువదివేల రూప్యంబులును వందనపూర్వకంబుగ నందుకొని కన్నుల కద్దుకొని మన స్వరాజ్యనిర్మాణంబునకు మూలధనంబుగా నుంచుము. ఇంకను విత్తంబు సమకూర్పవలయు! సేనలు వృద్ధిచేయవలయు! ఈ రెండే మన ప్రస్తుత కర్తవ్యములు. సామ వాక్యంబుల నుపన్యసించి - యనునయవాక్యముల బోధించి ప్రజలనుండి ధన సాహాయ్యమును సైనిక సాహాయ్యమును మన మెంతకాలమునకుఁ బడయఁ గలుగుదుము? ఇంచు మించుగఁ బండెండు సంవత్సరముల నుండి రాజ్యంబెల్ల నరాజకంబై యుండుటచేఁ బ్రజలకు భయభక్తులు పోయినవి. దుస్స్వాతంత్ర్యము పెరిగినది. సోమరితనము హెచ్చినది. రాజ్యాభిమానము నశించినది. అడవులలో నిన్ని యిడుములు పడుచుండిన మన విషయమ్మున లేశమును గ్లేశపడక - కేవల భోగ పరాయణులై యున్నవారు - మంచిమాటల మనకుఁ దోడు పడ నెంచెదరా? అందుచేఁ గొంతకాలమ్మువఱకు మనము క్రౌర్యమును వహించి యక్రౌర్యమును త్యజింపవలయు!

ప్రస్తుతము మనకున్న భిల్లసైన్యం బెల్ల రెండు భాగంబులుగా భాగింపుము. అందొకటి నీ కొఱకు! రెండవది నా కొఱకు! మొగలాయిల స్వాధీన మందున్న దుర్గంబులు ముట్టడించు పని నాయది! దయాదాక్షిణ్య శూన్యుండవై పల్లెలఁ బట్టణములను గొల్లఁగొట్టు పని నీయది! దుర్గము లాక్రమించుకొనుచు నందలి సేనలను సేనా పరికరములను గూడఁదీయుఁవాఁడను నేను! గ్రామంబులు ముట్టడించియు కొల్లఁగొట్టియు ముట్టించియుఁ బ్రజలనుండి విత్తమును సమకూర్చు వాఁడవు నీవు!

ఇన్నియు నిట్లుండ నీవంతు కర్తవ్యాంశంబైన ప్రధానాంశం బింకొకటి కలదు. నేటినుండియు శిస్తులు కప్పములు పన్నులును మేవాడరాజ్యాధీశ్వరుండైన ప్రతాపసింహునకే చెల్లింపవలయు ననియు, నట్లు చెల్లింపని వారు కఠినముగ శిక్షింపఁ బడెద రనియుఁ బ్రజలకెల్లఁ దెల్లంబగునటు రాజ్యంబునం దంతటఁ జాటఁ బంపుము! భిల్లసేనలతోఁ గ్రామంబులు కొల్లఁగొట్టుపట్టునఁ గేవల ధన ప్రధానుండవై నీ హృదయమును గఠిన పాషాణముగాఁ జేసికొనుము. క్రౌర్యంబుచే సాధింపఁబడునంత సూక్ష్మంబుగ నక్రౌర్యంబుచే రాజకార్యంబులు చక్కఁబడ నేరవు. అట్లని శిశు వృద్ధ స్త్రీ బధిర కుబ్జ రోగులకు మాత్ర మెట్టిహానియు ఘటింపనీయకుము. క్రౌర్యమునందు నీవు చూపవలసిన యక్రౌర్యము దొక్కటియే.

ఉగ్రసేనా! ఇట్లు కోట్లకొలఁది విత్తంబు మన కాయత్తంబైనను నదంతయు స్వరాజ్య నిర్మాణోద్యమంబునకే



వెచ్చింపుచుఁ బ్రస్తుత స్థితియందే మన జీవితములు గడుపవలయును గాని యెట్టి భోగంబులకు నాశింపరాదు. మనకు శరణంబులైన యంబాదేవి చరణంబులు ప్రమాణంబులుగా నీ విషయంబున నేను గావించు శపథంబులు మీరుఁ గూడఁ గావింప వలయు

"i మేవాడ రాజ్యంబునకు రాజధానియగు చిత్తూరు నగరమును సాధించి మన మెప్పటియట్లు స్వపరిపాలనంబు స్థాపించుకొనువఱకు నీ యరణ్యవాసంబునఁ బెరిగిన గడ్డంబులు కత్తిరించుకొనఁ గూడదు.

ii వెండి బంగారు పళ్ళెరంబులు విడనాడి విస్తరాకులయందే భుజింపవలయు.

iii హంసతూలికా తల్పము లవ్వలఁ బారవైచి నిరంతర మిట్టి గడ్డిపాన్పులయందే శయనింపవలయు.

iv కార్యము తుదముట్టువఱకు నీ సరోవరముకడ మనము గట్టుకొనిన యీ గడ్డిపాకలయందే నివసించుచుండవలయును గాని యిం కెట్టి భవన నిర్మాణంబునకును బ్రయత్నింపరాదు..............."

ప్రతాపసింహుఁడు ప్రస్తుతము నివసించుచుండిన స్థలముదయపురమునకు నాలుగుమైళ్ళ దూరములో నున్నది. మొగలాయిలతో సంధి చేసికొన్న వాఁడగుటచేత నింకఁ దన కుటుంబమున కెట్టి శత్రుభీతియు లేకుండఁ గొంతకాలము సుఖ

పెట్టవచ్చు నని యెంచి, యతఁ డానాటి మధ్యాహ్నము నసే మార్గాయాస ముపశమించుకొనిన తరువాతఁ బరివారముతో బయలుదేరి యాస్థలమునకు విచ్చేసెను. ఆ సరోవరతీరప్రాంత మంతయు మిక్కిలి విశాలంబై యందందుఁ బలువిధంబు లగు ఫలవృక్షములతోడను 'ఏకలింగజీ' యను పేరం బరఁగు శంకరుని యాలయంబు తోడను సర్వవిధంబుల నివాసయోగ్యంబుగా నుండుటచేఁ బ్రతాపసింహుఁ డచ్చటనే తన గడ్డిపాకలను నిర్మించుకొనెను. హతశేషులైన రాజపుత్రులును సైన్యములోని కొందఱు భిల్లులును గూడఁ దమతమ యావాసముల నచ్చటనే యేర్పరచుకొనుటచేత, వందలకొలఁదిఁగల పాకలతో నా ప్రదేశ మంతయు నొక చిన్న గ్రామమువలెనే యుండెను.

ఆనాటి ప్రాతఃకాలమునఁ బ్రతాపుఁడు తన యింటి ముందరనున్న మామిడిచెట్టుక్రింద నొక చాప వేసికొని కూర్చుండియుండెను. వానిచుట్టును భిల్లులును రాజపుత్రులును గూర్చుండియు నిలువఁబడియు గుమిగూడియుండి ప్రతాపుని వీరావేశమును నయ్యావేశంబున నాతఁడు నుడువుచుండిన పౌరుషోక్తులును నాజ్ఞాపించుచుండిన కార్యక్రమమును శ్రద్ధగా నిశ్శబ్దముగా వినుచుండిరి. క్షణక్షణమును నంబా బాలిక ముద్దులు మూటగట్టు తన చిన్ని బొజ్జపై రెండుచేతు లిడుకొనుచుఁ గలకలలాడు మొగంబునఁ బకపక నవ్వుచు



నింటిలోనుండి తటాలునఁ బఱువెత్తివచ్చి తండ్రి తొడపైఁ గూర్చుండుచుఁ మఱలఁ దుఱ్ఱునఁ దల్లికడకు బారిపోవుచు స్వేచ్ఛగా నాడుకొనుచుండెను. ఆమె కిప్పుడు పూర్వపుఁ గష్టములు లేవు. ఆ నూతనస్థలంబునఁ బృథ్వీరాజంపిన కవితాలేఖచే నూతనోత్సాహము నూతన ధైర్యము నూతన శౌర్యసాహసములును వహించి ప్రతాపుఁడు నూతన రాజ్య నిర్మాణక్రమంబును దన యనుచరుల కెఱింగించుచుండ, నూతన కంఠస్వరంబుతో నిదివఱ కెన్నఁడును వినని నూతన గీత మొకటి యాకస్మికముగ వాని కిట్లు వినవచ్చినది.

"పెక్కు దేశములు పెక్కు దైవములు-పెక్కు మతము లనకండీ
ఒక్క దేశమును నొక్క దైవమును-నొక్క మతమె నమ్మండీ॥
హరీ హరీహరి రాం రహీములకు-నంతర మది లేదండీ
ఖురాణ్ చూచిన పురాణ్ చూచినా-కొసకిదె సారంబండీ॥"

మధుర కవితా కలితంబగు నాగీతము తనకు శ్రవణానంద దాయకంబే యయ్యు నందలి యర్థముమాత్రము తనకు వెగటుగఁ దోచుటచేతఁ బ్రతాపసింహుఁడు కట్టెదుట నున్న రాజసింహునిఁ జూచి - "రాజసింహా! ఆసంగీత మెవరది? నీతోవచ్చిన మొగలాయి సిపాయిల బసలనుండి వినవచ్చుచున్నది."

"మహారాజా! తులసీదాసను నొక మహాకవి. బ్రాహ్మణుఁడు. గొప్ప భక్తుఁడు. సర్వమత మర్మజ్ఞుఁడు. భారతవర్షం

బునకెల్ల నొక్కటియే మతమనియు నొక్కటియే జాతియ
నియు నాతని మతము. ఆమతమును బ్రజలకు బోధించుట
కాతఁ డిట్లు దేశసంచారము చేయుచున్నాఁడు. ఆగ్రా విడిచిన
తరువాత మేము విడిసిన మొదటి మజిలీయందే యితఁడు
మమ్ముఁ గలిసికొని యప్పటినుండియు మాతోడనే వచ్చు
చున్నాఁడు."

"ఆలాగునా? అట్లైన మహామహుఁడని చెప్పక
తప్పదు. రాజసింహా! లోకోత్తరంబైన యియ్యుత్తరంబును
నమితంబగు నీ విత్తంబును నంత దూరంబునుండి భద్రంబుగఁ
గొనివచ్చి మా కొసంగిన నీ మహోపకారమును మే మెట్లు
మఱువఁగలము? కొంతకాలము మా సేనలోఁ బనిచేసినవాఁడ
వని నీవు చెప్పుచున్నాఁడవు గావున మాకు మఱియు మాన్యుఁడ
వగుచున్నావు. ఇప్పుడే యక్బరున కుత్తరము వ్రాసి యిచ్చె
దను. వచ్చిన మొగలాయి సిపాయిలకు సెలవిచ్చి వెంటనే
పంపివేయుము."

ఆమాటలకు రాజసింహుఁ డేమో ప్రత్యుత్తర మిచ్చుట
కుద్యుక్తుఁ డగుచుండ నింతలో నొక భిల్లుఁడు పఱుగు పఱు
గున వచ్చి ప్రతాపునకు నమస్కరించి — "మహాప్రభూ!
నాథద్వారమునుండి యొక రాజపుత్రస్త్రీ పదిబండ్ల సామా
నుతోవచ్చి యేలినవారి కీయుత్తరమును సమర్పించుకొను
చున్నది." అని పలుకుచుఁ దనచేతనున్న యుత్తరమును విన



యముతో వాని కందిచ్చెను. ప్రతాపుఁ డత్యాశ్చర్యముతో
నాయుత్తర మందుకొని "నాథద్వారము నుండియా? రాజ
పుత్రస్త్రీయా? అట్లైన భామాసాతో సంబంధించినదే కావ
లయు." అని యుత్తరమును విప్పుచు రాజసింహునిఁ జూచి —

"రాజసింహా! ఆగ్రాలో భామాసాను నీవు చూచి
తివా? చక్రవర్తి వాని కేమిశిక్ష విధించెనో నీవు వినలేదా?"

"మహారాజా! నేనువచ్చుసరికి సెలవైనదాక పట్టణము
విడిచి పోరా దను నిబంధము మాత్రమే జరిగినది. తరు
వాత నేమైనదో నాకుఁ దెలియదు."

ఆప్రత్యుత్తరము విని ప్రతాపుఁ డాయుత్తర మిట్లు
చదువసాగెను.

"మేవాడరాజ్యాధీశ్వరులైన శ్రీ శ్రీ ప్రతాపసింహా
మహారాణావారి పాదసన్నిధికి—

వందన పూర్వకంబుగ భామాసా వ్రాసికొను విన్నప
ములు—

మహారాజా!

దుష్టుఁడైన మహాబత్ఖానుని నిర్బంధముచేత నే నిప్పు
డాగ్రాపట్టణమునకుఁ బంపివేయఁ బడుచున్నాను. భావిగతు
లెట్లుండునో చెప్పఁజాలను. తమపూర్వమంత్రియైన జయ
పాలుఁడు గతించినప్పటినుండియు నాతని భార్యయుఁ గుమా
ర్తెయు నా సంరక్షణమునందే యున్నారు. జయపాలునియందు

నాకుఁగల యభేదభావంబుచే నాతని కుటుంబమును నే నింత కాలమునుండియుఁ బోషించుచుండినను, జైనరాజపుత్రుఁడ నగు నాచేత వారు జాతిభ్రష్టులు కాలేదు. ఈవిషయంబున నన్నేలినవారు విశ్వసింతురుగాక! తమ కేదైన నాపద సంభవించినప్పుడు వారీయుత్తరంబుతోడను నాకుఁగల సమస్తవిత్తంబుతోడను దమ పాదముల నాశ్రయింపఁగలరు. శ్రీవారు దయార్ద్రహృదయులై వారి కభయం బొసంగెదరుగాక!

దేవా! ప్రస్తుతము నాయొద్దనున్న విత్తంబంతయుఁ బదునైదులక్షలకుఁ దక్కువ యుండదు. దాని నంతయు నేలినవారు స్వవిత్తంబువలెఁ జిత్తగించి స్వేచ్ఛగా వెచ్చింపవచ్చు నని మనవి చేసికొనుచున్నాఁడను. ఇంకను మఱికొన్ని రహస్యములు గలవు. పునర్దర్శనభాగ్యము గలదేని స్వయముగనే మనవి చేసికొనెదను. కాలము వ్యతిరేకముగ నుండుటచేతనే నీయుత్తరములో వ్రాయుటకు సంశయించితిని.

చిత్తగింపవలెను.

భామాసా."

ప్రతాపుఁ డాయుత్తరమును జదువుచున్నంతసేపును నొక్క రాజసింహుఁడు తప్పఁ దక్కినవా రత్యాశ్చర్యముతో వినుచుండిరి. ఎందుచేతనో రాజసింహుని ముఖలక్షణముల యందుమాత్ర మెట్టి మార్పేమియుఁ గలుగలేదు. ఉత్తరము ముగించిన వెంటనే ప్రతాపుఁ డాభిల్లునిఁజూచి—



"ఓరీ! ఆతల్లికుమార్తె లిరువురును బండిలోనే యున్నారా? ఎదురుకొని లోనికిఁ దీసికొని రమ్మని మీదేవిగారితోఁ జెప్పుము."

"మహాప్రభూ! ఒక్కతల్లిగారే వచ్చినారు. ఆమె కుమార్తెయు మన యువరాజుగారును వెనుకనుండి వచ్చుచున్నారఁట!"

అని పలికి భిల్లుఁ డచ్చటినుండి తొలఁగిపోయెను. ప్రతాపసింహుఁడు వానికొసమాటలకు మొగము చిట్లించుకొనెను. అమరసింహుఁ డాకన్యకయందు బద్ధానురాగుఁడై యుండుట ప్రతాపునకును బాలేశ్వరికినిఁగూడ నిష్టములేదని చదువరు లిదివఱకే యెఱుంగుదురుకదా? మొగము చిట్లించుకొని ప్రతాపుఁ డప్పుడు తద్విషయవిచారమునందు మనసు చొరనీయక యుగ్రసేనునిఁ జూచి వానితో నిట్లనెను.

"ఉగ్రసేనా! సాధ్వీమణియైన జోసీభాయి కటాక్షించిన ధనమును మన స్వరాజ్యోద్యమమునకు మూలధనముగాఁ జేసికొనుటచేతఁ బ్రతిఫలము వెంటనే గాన్పించినది. భామాసా యొసంగిన పదునైదు లక్షలును మన ముచితముగాఁ బరిగ్రహింపక ఋణంబుగాఁ గైకొందము. దుష్టుఁడైన మహాబ్బఖానుఁడు లావాదుర్గంబున నుండుటచేతఁ జుట్టుపట్టుల నున్న వారికెందఱికో యిట్టి ముప్పు లనేకములు వాటిల్లుచున్నవి. లూటీ సామానులను బైటకుఁ దీయుట కాతఁ డీమధ్య విశ్వప్రయత్న

ములు గావించినాఁడఁట! ఆదుష్టుఁ డందున్నంతకాలమును మన ప్రయత్నముల కన్నింటికిని విఘాతములే తటస్థించుచుండును. అందుచే లావాదుర్గమే మనకుఁ దొలిముద్ద గావలయును. సేనల సిద్ధపరుపుము. రేపే ప్రయాణము!............" ఇంతలో వత్యాతురతతో సమరసింహుఁడు పఱువునవచ్చి 'బాబాజీ! బాబాజీ!' నావెంటఁ గొందరు భిల్లులఁ బంపవలెను. తుపాకులు బాకులుమున్నగు ననేకరణసామగ్రు లిప్పుడు మనకు లభింపనున్న వనిపలుక వాని మాటలకుఁ బ్రతాపాదు లాశ్చర్యపడసాగిరి.

## ముప్పదియవ ప్రకరణము

### సరోవర తీరము.

ఆనాటి మధ్యాహ్నమున షహాబజ్ఖానుఁడు భామాసా గృహమును బరీక్షించి, లూటీ వస్తువు లెవ్వియుఁ దనకుఁ గానరానందున విఫలమనోరథుఁడై, యాగ్రహాతిశయంబున మండిపడుచు, కర్మాగారమునందలి పనివాండ్ర నెల్లఁ బలువిధంబులఁ గొట్టి తిట్టి, మీరాభాయిని భయపెట్టి ఖైదుపెట్టి పిటికిపంద యగు సమరసింహునివలన గుట్టు కనిపెట్టి— మార్గమధ్యముననే యడ్డగించి బండ్లలోని సామానులు పరిగ్రహింపవలయునని యెంచి యుదయపురము వైపు సేనలతో బయలు వెడలినతరువాత, నాటి సాయంకాలముననే శక్తిసింహుఁడు తన భిల్లసేనలతో నాథద్వారమునకు వచ్చెను. కాని యేమిప్రయోజనము? పాప మాతఁడు వచ్చునరికే సర్వమును ముగిసినందునఁ దా ననుకొన్నట్లు భామాసా కుటుంబమును గాపాడలేకపోయినందుకు శక్తిసింహుఁడు మిక్కిలి నొచ్చుకొనసాగెను. తాను మీరాభాయికడకుఁ బంపిన భిల్లుఁడు తిరిగి వచ్చి వార్త చెప్పువఱకు వేచియుండుటచే నతఁ డింత జాగుచేయవలసి వచ్చినది. మీరాభాయికడ సెలవుగైకొని వెడలిపోయిన భిల్లుఁడు తన మార్గమధ్యముననే సేనాసమన్వితుండైన షహాబజ్ఖానునిఁ జూచి, చూచిన వెంటనే దారితప్పించి, తప్పుదారి నతిత్వరితగతిని మాతృకుండంబున కేగి శక్తిసింహునకు సర్వము నెఱింగించెను. అప్పటికి రెండు మూఁడు దినములనుండియుఁ గూడ వేట ప్రయత్నములో నున్నట్లు తండ్రికడ నటించుచుండిన శక్తిసింహుఁడు వెంటనే రామభద్రాదులతోడను భిల్లపరివారములతోడను బయలుదేరి చీకటు లారంభించునరికి నాథద్వారము ప్రవేశించెను. గాయములు తగిలిన యన్నలువురు రాజపుత్రులను నాలయములోనికి మోసికొనివచ్చిన దినము మొదలు నాటివఱకును శక్తిసింహుఁడు వేటకు వెళ్లలేదు. రెండుమాసములు లహర్నిశలుఁ జెంతనేయుండి యతఁడు వారిని సంరక్షించెను. అందుచే నాటి వేట ప్రయత్నమునందుఁ జందావతుఁడు కుమారుని వారింపలేదు.

తురంగారూఢులైన యేనూర్వురు భిల్లసైనికులతోడను నలువురు రాజపుత్రులతోడను గ్రామమునఁ బ్రవేశించిన శక్తిసింగును జూచి గ్రామవాసులు మొదట భయపడిరి. కాని మహాబజ్ఖాను సైన్యమువలె నాసైన్యము మొగలాయిసైన్యముగాక భిల్లసైన్యమైనందునను దత్సేనాధ్యక్షుఁడు రాజపుత్రుఁడైనందునను వారిరాక యంత భయపడివలసినదై యుండదని సమర్థించుకొని వారితో సంభాషించిరి. ఆ సంభాషణమున నాటి మధ్యాహ్నమున మహాబజ్ఖానుని ధూర్తవర్తనమును విని యా రాజపుత్రు లెంతయో విచారించిరి. పురవాసులును సమయమునకు రాఁజాలకపోయి రనియు వచ్చియుండినయెడ మహాబజ్ఖానుఁడు మీరాభాయి నట్లు ఖైదుచేసికొని పోవుట తటస్థింపకపోవు ననియు, దుష్టుఁడైన ఖానుఁ డా కన్యకయెడ నట్టి ద్రోహబుద్ధి వహించునో యనియు, నా రాజపుత్రులతోఁ జెప్పుచు స్త్రీలును బురుషులునుగూడఁ గన్నీరు మున్నీరుగా వగచిరి.

నాథద్వారము ప్రవేశించినది మొదలు రామభద్రుని ముఖలక్షణములయం దొకవింతమార్పు కలిగెను. రెండుమాసములు మంచము పట్టియుండి, యిన్నాళ్లకుఁ గత్తిపట్టి గుఱ్ఱమెక్కి బయలువేరు భాగ్యము తటస్థించినదికదా యని యెంతవఱకు నత్యుత్సాహముతోడనే వచ్చి యిప్పు డతఁ డెందుచేతనో దీనవదనుఁడై కన్నీరుగార్చుచు నితరుల కంటఁబడ



కుండఁ నటాలునఁ దుడిచివేసికొనుచు, మీరాభాయి యెవ్వ రనియు నామెకు వివాహమైనదా యనియు, నామెతల్లి బ్రతికి యున్నదాయనియు, శక్తిసింహునికంటెను దక్కిన రాజపుత్రుల కంటెను నత్యాతురతతోఁ బురవాసుల నెన్నియో ప్రశ్నలడుగుచు వచ్చెను. రామభద్రుని ప్రశ్నలయందలి యాతురతయు ముఖమునందలి విచారమును శక్తిసింహాదు లెవ్వరును గనిపెట్ట లేదు. పురవాసులతో సంభాషణము ముగియుసరికి సాయంకాలపుఁ జిఱుచీకటులు తొలంగఁ జంద్రుఁ డుదయించెను. అప్పుడు శక్తిసింహుఁడు రామభద్రునిఁ జూచి—

‘‘రామభద్రా! ఏమిచేయుటకును నాకుఁ దోపకున్నది. ఇంటికి మఱలుట తప్ప నీ విప్పు డేమి చేయుమన్నను నాకు సమ్మతమే.’’

‘‘అనఁగా? — నీయుద్దేశ మేమియో నాకుఁ దెలియ లేదు?’’

“మానవతీ మానరక్షణమా! నూతన రాజ్యస్థాపనమా?”

“ఇప్పుడు బొత్తిగా బోధపడలేదు.”

“రామభద్రా! నీదృష్టి వేరుగా నున్నట్లున్నది. ఖానుఁడు తన సేనలతో దుర్గమును విడిచి వచ్చినాఁడు. దుర్గసంరక్షకులై యున్న సైనికు లతిస్వల్పసంఖ్యాకులై యుందురు. అందుచే నాకస్మికముగా ముట్టడించి దుర్గము నాక్రమింతమా?

లేక మనము ఖానుపోయిన మార్గముననే పోయి మీరాఖాయిని దప్పించుటకుఁ బ్రయత్నింతమా? ఇందులో నీ కేది సమ్మతము? నాకంటె యుద్ధానుభవ మున్నవాఁడవు గదా! మన మెంతత్వరితగతిని బయలువెత్తినను ఖానుని కలిసి కొనఁ గలమా?"

"నీకుఁ గలిగిన సంశయము యుక్తమైనదే. కాని ఖానుఁడు లావాదుర్గమునుండి యెప్పుడు బయలుదేరి యుండును?"

"ఉదయముననే బయలుదేరి యుండును."

"ఔనుగదా! అప్పుడు భోజనము చేసియే బయలుదేరినాఁ డనుకొందము. ఈ మధ్యాహ్న మతనికి భోజనము లేదు. రాత్రియును మానివేయఁగలఁడా? అందుచే నేటి రాత్రి మార్గమధ్యమున నతఁ డెచ్చటనైన విడిసి వంట చేయించుకొని భుజింపక తప్పదు. కావున మనము జాగుచేయక బయలుదేరితిమా తప్పక కలిసికొనఁగలము?"

"రామభద్రా! కలిసికొనలేకపోయితిమా మనప్రయత్నమంతయు వ్యర్థమగును. మంచితరుణమునుగూడఁ బోఁగొట్టుకొన్నవార మగుదుము. అందుచే నిప్పట్టున దుర్గమును నాక్రమించు ప్రయత్నమే యుక్తమని—"

"తప్పు! తప్పు! నీ వట్లెన్నఁడుఁ దలంపరాదు. ఉత్తమ రాజపుత్రుఁడవైన నీవు దొంగతనముగఁ గోటలోఁ జొరఁబడెదవా? ఇం దేమి పౌరుష ముండును? విన్నవారు నవ్వెదరు.



గాని, నీ రణక్రియా కౌశలము నేమి శ్లాఘింతురు? కావున నిప్పు డున్నట్టులె బయలుదేరి, వాయు వేగంబునం జని, ఖానునిఁ గలిసికొని, బహిరంగముగా రణరంగమున నెదిరించి పోరాడుదము. మన మనుకొన్నట్టు లాతఁడే మన కంటఁబడెనా? లావాదుర్గము నీకుఁ దక్కినదే యనుకొనుము! ఇందువలన శత్రుసంహారము, మానవతీ మానరక్షణము, దుర్గలాభమును గూడ నొక్కమాటే సమకూరును."

"రామభద్రా! ఎంత యుక్తిగాఁ జెప్పితివి? ఎంత దూరాలోచనము గలవాఁడవు? నీయం దింకను నెంతటి ప్రతిభాశక్తి యున్నదో గదా! నే నవశ్యముగ నీవు చెప్పినట్టులే కావింతును. దుర్గాక్రమణమునందు మితిమీరిన యుత్సాహ మున్నవాఁడ నగుట నిట్లు తప్పతలంచితిని. నన్ను క్షమింపుము."

అని సంభాషించి - ముగించి - వారు మహోత్సాహముతో నుదయపురమార్గమును బట్టి పోవసాగిరి. అప్పటికిఁ బండువెన్నెల బ్రహ్మాండమునం దంతట మెండుగా నిండియుండెను. కన్నుల పండువుగ నుండిన యా నిండువెన్నెలలో నఖండజవంబునఁ బ్రయాణము సాగించుచుండు నా రాజపుత్రులకుఁ గొండ లన్నియు వెండికొండలుగఁ గన్పడుచుండెను. నదు లన్నియు గంగానదులుగఁ గానవచ్చుచుండెను. మహీజాతంబు లెల్లఁ బారిజాతంబులుగఁ దోఁచుచుండెను. రెండుమాసముల నుండి మృగయావినోదంబులేక కట్టుసాలలయందే కట్టువడి యుండి క్రొవ్వెక్కిన యా గుఱ్ఱంబులును వాలంబులు వెను

కను వదనంబులు ముందుకును నిగుడంజాచి — గమన వేగాతిశయంబున నాల్గుపాదంబులు నేలం బరచి — తమ కులదైవంబగు హయగ్రీవునకో - హయగ్రీవుని భార్యయగు వసుంధరా దేవికో - సాష్టాంగ నమస్కారంబులు గావించుచున్నట్లు గానవచ్చుచుండెను. రౌతులును రికాపుల నున్న తమ పాదంబులు నేలంగల రాలకుఁ దగులకుండ నించుక ముడుచుకొనుచుండిరి. పంచశత సంఖ్యాధికంబులగు నాతురంగములలోఁ బ్రతి తురంగంబునందును నొకదాని నొకటి యతిక్రమించి పఱువెత్తు నుత్సాహంబును గర్వంబును గానవచ్చుచుండెను. సహజంబుగ నల్లనియాకారంబులు గల యాభిల్లసైనికుల శరీరంబులెల్ల నవ్వెన్నెల కెరటంబులలో మునింగి, యభిషిక్త క్షీరంబులలోని శివలింగంబుల తెఱంగునఁ గానవచ్చు చుండెను.

మధుపానములో నున్న గుణము వెన్నెలలోఁ గూడ నున్నది కాఁబోలు! భిల్ల సైనికులుగాని యా రాజపుత్రులు గాని పరస్పర ప్రసంగములు లేశము నొనర్పక మౌనముద్ర తోడనే ప్రయాణము సేయుచు - వచ్చిన దూరమెంతయో-యైన రాత్రి యెంతయో గుర్తింపక - యనేక పర్వతారణ్యనదీనదాదికంబు లతిక్రమించుచు వచ్చుచుండఁ గొంతసేపునకు శక్తిసింహుఁడు రామభద్రునిం'జూచి—"రామభద్రా! కట్టెదుట శత్రువుల జాడలు గానవచ్చుచున్నవి. మన మొక్కమాటాగవలయు" నని తత్తరపాటుతోఁ బలికి, తటాలున వెను



కకు వీక్షించి యుక్తిప్రకరసంజ్ఞలతో భిల్లులకెల్ల నాగవలయు నని సూచించెను. తోడనే వాయువేగంబున. వచ్చుచుండిన యవ్వారువంబులెల్ల నొకదానిపై నొకటి జోగిపడున ట్లాకస్మికముగ నొక్కమాఱు ఆపివేయఁబడినవి. అప్పుడు వారందఱి దృష్టులు ముందువైపు ప్రతితీవ్రముగాఁ బ్రసరింప సాగినవి. ఎట్టయెదుటఁ గొంచెము దూరములో నొకపర్వతంబు గలదు. బండ రాళ్లకును ముండ్ల డొంకలకును నడుమ పాము మెలికలవలె వంకర వంకరగా, వెన్నెల కాంతిలోఁ దెల్ల తెల్లగాఁ గానవచ్చుచుండిన సన్నని దారి యా పర్వతమును సమీపించుచున్నది. ఆదారియు నాకొండయుమాత్రమే మొదట వారందఱును జూడఁగలిగిరి. రామభద్రుఁడుగూడ నంతియే చూచి—

"శక్తిసింహా! మా కెట్టిజాడలును గానరావేమి? నీవేమిచూచితివి?"

"అదిగో! ఆకొండప్రక్క నొక చెఱువు గానవచ్చుచున్నది. ఆచెఱువు నొడ్డున నెవ్వరో విడిసియున్నారు. మఱి కొంచెము ముందు కేగుదము రమ్ము."

అని పలుకుచు రామభద్రునితోఁ గూడ నతఁడు మఱింత ముందునకుఁ బోయెను. తక్కిన రాజపుత్రులును భిల్లులును వారివెంట ననుసరించిరి. అప్పుడు రామభద్రుఁడు మఱల నిదానించి—

"శక్తిసింహా! చక్కఁగా గుర్తించితివి. వారందఱు

మొగలాయి సిపాయిలే. మన మనుకొన్నట్లు ఖానుఁ డిక్కడ విడిసియున్నాఁడు."

"రామభద్రా! అందఱును శరీరములు వాల్చియే యున్నారు. నిద్రించుచున్నారు కాఁబోలు! నిలువఁబడియే నిద్రింపవలసిన గుఱ్ఱములుఁగూడ నేలపైనే నిద్రించుచున్న వేమి?"

"మార్గాయాసముచే సొమ్మసిల్లినవి కాఁబోలు! దీని కేమి? మనము తుపాకులను బేల్చి వీరందఱిని మేలుకొలుపుదము. అదియే యుద్ధధర్మము."

అని రామభద్రుఁడు పలుకుటయే తడవుగ వానిచెంత నున్న ముప్వురు రాజపుత్రులును దమ తుపాకులను సవరించుకొని కొండగుహాలు ప్రతిధ్వనించునట్లు మహాధ్వానముతో నొక్కమాఱు మ్రోయించిరి. ఆమహాధ్వానముతో నిద్రించుచుండిన సిపాయిలెల్లరు నొక్కమాఱుగ మేల్కాని తమతమ యాయుధంబులతో నతిత్వరితగతి యుద్ధసన్నద్ధు లయ్యెద రని భావించి భిల్లులును రాజపుత్రులునుగూడ వారి నెదుర్కొనవలయు నని సర్వసంసిద్ధులై యుండిరి. కాని నిద్రానిమగ్నులై యుండిన యామొగలాయిలగుంపులో లేశమును జలనమే కలుగలేదు. ఒక్కఁడైనను మేల్కొనఁడయ్యె! లేచిచూడఁడయ్యె! "రామభద్రా! ఇంక మన దోషము లేదు. దొంగవేషముల వీరు కపటనిద్ర నభినయించుచున్నారు. తుపాకి



యుద్ధంబుగాక వారి సంకల్పము ద్రొమ్మియుద్ధము జరుగవలె నని కాఁబోలు! మన మేల కాదనవలయు? ఆకస్మికముగ నాగుంపుపైఁబడి పిచ్చుకత్తులతోఁ బొడిచి మనమే మేలుకొలుపుదము రమ్ము!" అని పలుకుచు శక్తిసింహుఁడు ముందుగ దారి తీసెను. వాని వెన్నడనే రామభద్రుఁడును రాజపుత్రులును భిల్లులునుగూడ నడువఁజొచ్చిరి. అంతవఱకు బలవంతముగ నాపఁబడిన యాతురంగంబులు క్షణమాత్రములోనే వారి నాసరోవరతీరంబునకుఁ గొనిపోయినవి. కొనిపోవుటయే తడవుగ వెనుకనున్న భిల్లసైనికులు తమ నాయకుల యనుమతి ననుసరించి, నిద్రించుచుండిన సిపాయిలను దమగుఱ్ఱములచేఁ ద్రొక్కించుచు - మీఁదినుండి తాము తుపాకులతోడను గత్తిమొనలతోడను దీవ్రముగఁ బొడువసాగిరి. అప్పటికిని నొక్కఁడును మేల్కొనలేదు. యుద్ధాతురులైన శక్తిసింహాదులు కసిపెట్టలేకపోయిరి కాని యెన్నిపోట్లు పొడిచినను జచ్చినవారు మేలుకొనఁగలరా!!!

ఆ సరోవరతీరంబున నమ్మొగలాయిలు నిద్రించుచుండిన నిద్ర దీర్ఘనిద్రయేగాని గాఢనిద్రగా దని వారందఱు నిప్పటికి గ్రహింపఁ గలిగిరి. గ్రహించి కడుపులు చెక్కలగునట్లు పకపక నవ్వసాగిరి. చెంత నున్న హుక్కాగొట్టమునందలి యగ్ని వెల్లకిలఁబడియుండిన తన గుండెలపైఁ దిరుగఁబడుటచేత సగము కాలిన దుస్తులును గుండెయు గల షహబజ్ఖానునిఁ జూచి

నప్పుడు వా రందఱికి జనించిన యాశ్చర్య మింతింతకాదు. భీభత్స రససమగ్రంబగు నా ప్రదేశమంతయు వీక్షించిన తరువాత శక్తిసింహుఁడును రామభద్రుఁడు నిట్లు ప్రసంగించిరి.

"రామభద్రా! అత్యాశ్చర్య జనకంబగు వీ రందఱి మరణంబునకును గారణ మేమైన ట్లూహించుచున్నావు?"

"వీరు భుజించిన భోజనమునం దెట్లో విష సంపర్క ముండవలయు."

"బాగున్నది. కాని గుఱ్ఱములో? వీరి గుఱ్ఱములును గడ తేరినవే?"

"ఔ నౌను. అట్లైన నీ సరోవరమునందే యేదో విష ముండవలయును."

"రామభద్రా! ఏమైన నేమి? మీరాభాయి కేమియుఁ గీడు తటస్థించి యుండదుకదా? ఆమె తప్పించుకొనియే పోయి యుండునా?"

"సందేహ మేమి? ఈ సిపాయిల కత్తులుగాని తుపాకులు గాని యుండెందును గానరానందున, వీరు కడ తేరినంతనే మీరాభాయి వీరి యాయుధంబుల నెల్ల నెట్లో సంగ్రహించుకొనియే వెడలి పోయెనని నాయూహ."

"రామభద్రా! మనము సంగ్రహించుకొనవలసినది లావాదుర్గమే కదా లేక నీ వింకను నభ్యంతర పరచెదవా?"

"ఇంక నభ్యంతర మేమున్నది? నీవు సంకల్ప సిద్ధుఁడవు."



కృత్రిమ విధానంబున రాజపుత్రి సంహారమునకై యాసఫ్‌ఖానుఁడు విషము కలిపించిన యా సరోవర మెంత మంది నంత మొనరించినది! పాపము మహాబజ్ఖానుని మరణమునకుఁ గూడ. వాని యన్నపెట్టిన విషమే కారణము కావలసి వచ్చెను!

---

## ముప్పది యొకటవ ప్రకరణము

### ఆగ్రయందలి యుద్ధప్రయత్నములు.

"మొగలాయి సార్వభౌమా!

నేను వ్రాసిన యుత్తరమును జూచి నీవు నన్నుఁ దప్పు తలంచినట్లు భావించుచున్నాను. నీ సేనాధ్యక్షుండైన యాసఫ్ ఖాను గావించిన యధర్మ యుద్ధంబువలన మాకుఁ గలిగిన నష్టంబుచేతను, అప్పటికి నా కుటుంబ మస్వస్థతయం దుండుట చేతను, ధర్మపరిపాలనంబె నా ముఖ్యవ్రతం బని నీ వెల్లెడలఁ బ్రకటించుచున్న వాఁడ వగుటచేతను; ని న్నొక్కింత గదు వడిగితినే కాని శాశ్వతముగ వశపడవలసిన వాఁడను గాను. నన్ను శరణాగతునిగ భావించి యేబదివేల రూప్యంబు లంపుట యగౌరవించుట యనియే తలంచుచున్నాను. నన్ను గౌరవింపఁ దలంచెదవేని, పూర్వముకంటెను నధికసంఖ్యాక

ములగు సైన్యములను జన్యంబున కాయత్తపరచి, సత్వరంబుగ మా పర్వతారణ్య రాజ్యంబుపై దండెత్తఁ బంపుము !

"మొగలాయి సార్వభౌమా ! నేను జీవించి యున్నంత కాలమును నీవొక్క మొగలాయిలకే సార్వభౌముఁడవు గాని తక్కిన హైందవజాతుల కెన్నటికిని జక్రవర్తివి కాఁజాలవు ! నిర్భాగ్యులైన కొందఱు రాజపుత్రులు తమ నీచశరీరంబులను సుఖపెట్టఁ గోరి - యైహిక భోగంబుల కాసించి - నీకు శరణాగతు లగుటచేత, నిజమైన రాజపుత్రజాతియందలి నిష్కళంక శౌర్య విక్రమ కళాకౌశలమును నీ వెన్నఁడును జవిచూడని వాఁడవై యిట్లు భ్రాంతిపడుచున్నావు. ఈ సారి నీవు స్వయముగనే సమస్త సేనాసమన్వితుండవై దండెత్తి వచ్చునెడ, చిరకాలమునుండి నిన్నుఁ బీడించుచుండిన భ్రాంతి నచిర కాలంబులోనే తొలంగించి - నీ చిత్తంబున కెట్టి రాజకీయాందోళనంబును లేకుండ సుఖపెట్టి పంపివేసెదను. రారాజవు గదా నీ వట్లు బయలుదేరి రారాదా ?

"మోగల్ చక్రవర్తీ! మాకుఁ బండ్రెండేం డ్లరణ్యవాసము నిదివరకే ముగించినది. నీ కుత్తరము వ్రాసి యిప్పటికైన యీ మూఁడుమాసములే మా కజ్ఞాతవాసము ! మేమిప్పుడు సర్వసన్నద్ధులమై సంగ్రామమ్ము కొఱ కెదురుచూచుచున్నారము. మీ ఫిరంగి గుండ్లను బూలబంతులవలె నందుకొనుటకు మా కొండలన్నియు సిద్ధముగ నున్నవి. తన్మహా



ధ్వానంబులు విని సమమ్ముగఁ బ్రతిధ్వనించుటకు గుహాముఖంబులు కాచియున్నవి. మీ విషద్రావకంబులఁ బరిగ్రహించుటకు మా సరోవరంబు లన్నియు సంపూర్ణ వారిపూరంబులై యున్నవి. ఇంకేలమ్ము ! సత్వరంబుగ బయలుదేరి రమ్ము ! సార్వభౌమత్వము కొఱకు నీవును, స్వాతంత్ర్యముకొఱకు నేనును బహిరంగముగా రణరంగమున నెదురుకొని పోరాడుదము! మీకును మాకునుగూడ నిదియే కడసారి పోరాటంబగుఁగాక !..................."

ఇది ప్రతాపసింహుఁడు చక్రవర్తికి వ్రాసి పంపిన ప్రత్యుత్తరము. ఈ ప్రత్యుత్తర మచిరకాలంబులోనే రాజస్థానమునందును నాగ్రపట్టణమునందును నూతన చైతన్యమును బుట్టించినది. చక్రవర్తికిఁ గప్పమ్ములు గట్టుచుండిన మండలాధిపతులైన రాజపుత్రులును సామాన్య రాజపుత్రులును నేతత్ప్రత్యుత్తరాంశంబులు విని - 'అటా - ఇటా' - యను సంకోచంబునంబడి యతి తీవ్రదృష్టితో వితర్కింపసాగిరి. బుద్ధిపూర్వకంబుగఁ గొందఱును బలవంతముగఁ గొందఱును నాయుధపాణులై వచ్చుచుండుటచేతఁ బ్రతాపుని సేనలు దినదినాభివృద్ధిఁ గాంచఁజొచ్చెను. తెలిసినవారినిఁ దెలిసియుఁ దెలియనివారినిఁ దప్ప, ఏమియుఁ దెలియనివారిని సుఖముగా నంగీకరింపఁ జేయవచ్చును గావున, నట్టి సామాన్య ప్రజల నెల్ల నుగ్రసేనుఁ డతి సూక్ష్మముగా వశపరచుకొని వారి

ధనంబులను వారి శరీరంబులను గూడఁ బ్రతిదినంబును వేల కొలందిఁ బ్రతాపునికడకుఁ బంపివేయుచుండెను. రాణావారి యాజ్ఞ శిరసావహించి జను లనేకులు నేలదున్నక పొలములఁ బైరుసేయక, తమ తమ పశుగణంబుల నెల్ల, శత్రువుల కనను గమ్యంబులగు నారావళీ పర్వతంబులకుఁ ద్రోలి తాము ప్రతాపసింహుని నాశ్రయించిరి. అందుచే ననేక పట్టణములును బల్లెలును నిర్జనములై భయంకరాకృతితోఁ గానవచ్చుచున్నవి! మహారణ్యములనుండి వెలువడివచ్చిన ఘాతుకమృగములు రాజపుత్రవీరులు వసించుచుండిన ప్రదేశముల సంచరింపఁ జొచ్చెను. బాటసారులు రాక, రాకపోకలు లేక, రాత్రుల యందే గాక, మార్గములెల్లఁ బట్టపగలే గుండెలు బ్రద్దలగు నంత భయప్రదంబులుగా మాఱిపోయినవి. రాణావారి యాజ్ఞ తిరస్కరించిన యనేక మందభాగ్యుల శిరంబు లుగ్రసేనునిచేతను భిల్లనాయకుల చేతను ఖండింపఁబడి, కొమ్మకును గొమ్మకును గట్టఁబడిన త్రాళ్లనడుమ ముడివేయఁబడి—పర్వతప్రాంతాయాత వాతాహతులచే నుయ్యాలలంబోలె నూగుచు వీక్షణమాత్రముననే చూపరుల స్వరాజ్యసేవకుఁ బ్రబోధించుచుండెను.

ఇంక నాగ్రపట్టణంబునఁ బుట్టిన వింత లెట్టివో కనుఁగొందము. ప్రతాపసింహుని ప్రత్యుత్తరము చూచినంతనే చక్రవర్తి నిశ్చేష్టితుఁడయ్యెను. వాని మనసు మిక్కిలి క్లేశ



పడెను. వాని యుత్సాహం బంతయుఁ దొలంగిపోయెను. గౌరవ భావంబుతోఁ దా నంపిన విత్తంబును రాణా తృణీకరించుటచే నయ్యది తన కవమానంబని తలంచెను. ఆ యవమానంబుచే రోషంబు జనించెను. రోషంబు వెంటనే రణోత్సాహంబు పుట్టెను. ఆ రణోత్సాహంబుతో నీసారి కొనచూచువఱకు విడువనని ప్రతిజ్ఞపట్టెను. ఆప్రతిజ్ఞతో నతఁడు తన పరివార వారంబును దర్బారునకు రావించి, ప్రత్యుత్తరం బంతయు సాంతముగ వినిపించి—

"ప్రతాపసింహున కిప్పటికి బుద్ధివచ్చిన దనుకొని, మనము మోసపోయితిమి. దేశంబున శాంతిస్థాపనమునకును జాత్యైకమత్యంబునకును మనము గావించు ప్రయత్నము లెల్ల నీరాణామూలమున వ్యర్థమగుచున్నవి. తాను జీవించి యున్నంతవఱకు మా సార్వభౌమత్వము చెల్లనేరదఁట! అందుచే సార్వభౌమత్వ సంస్థాపనంబునకై వాని నిప్పుడు కడతేర్పక తప్పదుకదా? నిరపరాధులైన యాతని యాలుబిడ్డల కష్టంబులకు నిశ్చయముగ నాహృదయం బిప్పటికిని గఱగి పోవుచున్నది! ఏమిచేయఁ గలము? పోనిమ్మని దాక్షిణ్యము వహించి త్యజించితినేని భారతవర్షమునందలి జాతీయనాయకు లెల్లరునుగూడఁ బ్రతాపునే దృష్టాంతముగాఁ గొని శాంతికి భంగము గలిగింపక మానరు. ప్రతాపుఁ డంతటి స్వాతంత్ర్యాభిరతుం డగుటకు మా పరిపాలనంబే విషయంబునందు సౌఖ్య

హాని కలిగించుచున్నది? పూర్వము కంటెను బన్నులను కూలంబుగా నుండునట్లు తగ్గింపఁబడినవి కదా? శిస్తులు చెల్లించుటలోఁ బూర్వము కంటెను రైతులకు స్వేచ్ఛయొసంగఁబడెనుగదా? మతములయందును విద్యలయందును బ్రజలకు సర్వస్వాతంత్ర్యములు నీయఁబడెనుగదా? స్వజాతి పక్షపాతంబను మాత్రమును లేక సకలజాతులవారికి నున్నతోద్యోగంబులు కల్పింపఁబడుచుండెనుగదా? భారతవర్ష స్వాతంత్ర్యంబున కిప్పుడు గలిగిన భంగ మేమున్నది? ప్రతాపుని పట్టుదలయు స్వాతంత్ర్యాభిరతియు శ్లాఘాపాత్రంబులే యైనను నీయుగంబున మెచ్చఁదగినవి కావు. మాపరిపాలనంబున వహింపవలసినవి కావు.....................ఏమైన నేమి? సంగ్రామంబు నిశ్చయింపఁబడినది. ప్రతాపుఁడు కోరిన ట్లీసారి నేను స్వయముగనే సర్వసైన్యాధిపత్యమును వహించి బయలుదేరెదను. మానసింహ పృథ్వీరాజు లిరువురు నాతో రావలసినవారు. నూతనసేనాని యగు జగమల్లుఁడు తన సేనలతో రేపే బయలుదేరి శత్రుభూములయందు దండువిడిసి యుండవలయును. తక్కిన సేనల నాసఫ్‌ఖానుఁడు కొలఁదిదినములలోనే సర్వసిద్ధము గావింపవలయు! శతఘ్నికాయంత్ర నిర్మాణకుశలుండైన 'ఆల్మీడా' యీసారి స్వయముగనే ఫిరంగుల నుపయోగింపవలయు. ఆతఁడు వచ్చువఱకు 'న్యూనిస్' వాని యుద్యోగమునం దుండఁగలఁడు!............"



అని యాజ్ఞాపించి చక్రవర్తి సమరకార్యక్రమంబును నూతన క్రమంబున నిర్ణయించెను. నాఁడు మొదలుగ నతఁడు గావించుచుండిన యుద్ధప్రయత్నములఁ జూచి యీమాఱు ప్రతాపసింహునకును సార్వభౌమునకును మహాసంగ్రామంబు జరుగఁగలదనియుఁ జూడఁగలవారిదే యదృష్టమనియు నాగ్రాపట్టణమునందలి సామాన్య ప్రజలేగాక యున్నతోద్యోగస్థులుఁ గూడ ననుకొనుచుండిరి. ఆ రణంబు చూచు వేడ్కతోఁ దమరాక నంగీకరింపవలయు నని యంతఃపురరాణు లనుదినంబును జక్రవర్తిని నిర్బంధింపసాగిరి! జోసీభాయియుఁ బృథ్వీరాజును బ్రార్థింపఁజొచ్చెను. స్వాతంత్ర్యముకొఱకు జరుగు నాపవిత్రయుద్ధమును వర్ణించు వేడ్కతోఁ జక్రవర్తి యాస్థానకవులలో బాదాని యను కవీశ్వరుఁడు సెల ప్రదరఖాస్తు పెట్టి యాసఫ్‌ఖానుతో బయలుదేరెనఁట!



## ముప్పదిరెండవ ప్రకరణము



### దూరముగాఁ బోయి మాటాడెదరు.

లావాదుర్గమునకు సమీపముననే తూర్పువైపున నున్న యరణ్యప్రదేశమున నేకఫలాపేక్షకులైన శక్తిసింహుఁడును బ్రతాపసింహుఁడును దమతమ భిల్లసైన్యములతో వచ్చి యొండొరుల నెదుర్కొనుటకు సిద్ధముగా నుండిరి. పర్వతో

పరితలంబున నున్న తద్దుర్గప్రాకారము లచ్చటి యుభయపక్షములవారికిని స్పష్టముగనే కానవచ్చుచున్నవి. ఆ యుభయపక్ష సైన్యంబులును భిల్లసైన్యములే. ఉభయపక్షనాయకులును రాజపుత్రులే! భిల్లులతో భిల్లులును రాజపుత్రులతో రాజపుత్రులును బోరాడవలసివచ్చుట యిరుతెగలవారికిని వ్యగ్రతగనే తోచుచుండెను. షహాబ్‌ఖానుఁడు గతించుటచేత నింక లావాదుర్గ మెవ్వరి దైనను మనకు విచారములేదనియు, జాతివైరంబు మాని మనము వెనుకకు మఱలుట యుక్తమనియుఁ బ్రతాపసింహుని యనుచరులు ప్రతాపసింహునకును, రామభద్రాదులు శక్తిసింహునకును బలువిధముల బోధింపసాగిరి. కాని యెన్నివిధముల బోధించినను నారాజపుత్రవీరు లిరువురు దుర్గాక్రమణమునందలి తమతమ పట్టుదలలును బంతములును వీడరయ్యె. వీడక తత్క్షణమే రణక్రియ కుపక్రమింపవలయు నని యయ్యుభయనాయకులును సేనల కాజ్ఞాపింపఁ దొడంగిరి. నాయకులచే నాజ్ఞాపింపఁబడియు నిరుతెగల భిల్లసైనికులును బరస్పరముఖవీక్షణములతోఁ గాలము గడపుచుండిరేగాని వడివడి నొండొరులఁ దలపడఁ జాలుపడరైరి. భిల్లులును భిల్లులును బోరాడుట పాపము వారదివర కెన్నఁడును వినలేదు. కనలేదు. మఱియొకమాఱు తమ నాయకులు తీవ్రదృష్టితో నాజ్ఞాపించియుండినయెడల వాఱు తలపడియుందురేమోకాని యింతలో శక్తిసింహుఁడు, రామభద్రాదులు



వలదు వలదని వారించుచుండినను వినక, యత్యంత సాహసంబుతోఁ దనతురంగంబు నొక్కయూపున ముందునకు లంఘింపఁజేసి గొంతెత్తి బిగ్గరగఁ బ్రతాపసింహుని సంబోధించుచు వానితో ద్వంద్వయుద్ధమ్మునకుఁ దలపడెను. తురంగారూఢుఁడై కృపాణపాణియై భీకరమూర్తియై యున్న ప్రతాపసింహుఁడు శక్తిసింహుని సమీపించి, తనకంటెనత్యల్పవయస్కుఁడును సుకుమారగాత్రుండునగు నారాజకుమారునిపైఁ దన నిశాతకృపాణధారాహతులు ప్రయోగించుటకుఁ జాపము సంశయించుచుండెను. చెంతనున్న వీరమల్లుతో నేమో గుసగుసలాడి రామభద్రుఁడును బ్రతాపునిఁదలపడ సిద్ధపడుచున్న శక్తిసింహుని సమీపించెను. ఆరాజపుత్రవీరు లేమి కావింతురోయని యిరుకెలంకులం గల భిల్లపరంపర లత్యాతురతతో వారిని వీక్షింపసాగెను. నరునిఁజేరిన నారాయణుని తెఱంగున రామభద్రుండు తన్ను సమీపించినంతనే శౌర్యసముద్రుం డగు శక్తిసింహుఁడు ప్రతాపసింహున కిట్లనియె.—

“అయ్యా! మే మీ సమీపంబుననే యున్న మాతృకుండ గ్రామవాస్తవ్యులము. చిరకాలమునుండి యీ లావాదుర్గము నాక్రమించు నభిలాషగలవారము. ఆకస్మికముగ నెక్కడనుండియో వచ్చిన మీకంటె మా కెక్కుడు హక్కుండుటచే నిప్పట్టున మీరు తొలఁగిపోవుటయే న్యాయము!”

“రాజకుమారా! నే నెవ్వఁడనో యెఱుంగక నీ విట్టి

యభ్యంతరమును గల్పించుచున్నాఁడవు! మేవాడ రాజ్యాధీశ్వరుండనైన ప్రతాపసింహుఁడను నేనే! ఇప్పుడైనను నన్ను గౌరవించుట నీకు న్యాయము."

"మిమ్ముఁ దెలియక మాటాడలేదు. మీరు ప్రతాపసింహులనియు నొకప్పుడు మేవాడ రాజ్యాధీశ్వరులై యుండిరనియుఁ గూడ నెఱుంగుదును. చక్రవర్తికి వశపడుటకంటె సాటి రాజపుత్రుల మగు మాకు వశపడుట మీ కవమానకారణము కాఁ జాలదు గదా? అందుచే మీరు తొలఁగిపోవుటయే యుక్తము."

"అబ్బాయీ! ఈడునకు మించిన మాటలాడకుము. తెలియని సంగతులయందుఁ జొరఁబోకుము! ఒకప్పుడే కాదు. ఇప్పుడును నెప్పుడును గూడ నేనే మేవాడరాజ్యమున కధీశ్వరుఁడను. ఈదుర్గము నారాజ్యములోనిదే! నీవును నా ప్రజలలోని వాఁడవే. అందుచే నాయాజ్ఞ మన్నింపక తప్పదు."

"ఎవరి రాజ్యములోనిదైనను నేనీ లావాదుర్గము నాక్రమింపక తప్పను. నే నొకరి రాజ్యములోని వాఁడను గాను. నా రాజ్యము వేరు, నా ప్రజలు వేరు. ఈ భిల్లులు నీ గ్రామ వాస్తవ్యులు నా పరిపాలనములోనివారు. ఈ దుర్గమే నాస్వతంత్ర రాజ్యమునకు రాజధాని కాఁగలదు. మీ రకారణంబుగ మాతో వైరంబు తెచ్చుకొనక, మనరాజ్యంబులు సోదర రాజ్యంబులుగ నుండఁగోరి యిందుండి తొలంగిపొండు!"



"రాజకుమారా! నీ మాటల కానందింతునా? ఆగ్రహింతునా? ఉత్తమ రాజపుత్రుఁడవై పుట్టిన నీ సంకల్పములును నీ మహోద్యమములును నత్యంత శ్లాఘాపాత్రంబులనక తప్పదు. నేఁడు గాకపోయినను ముందు ముందు నీ వంతవాఁడ వగునట్లు నిన్ను మనఃపూర్వకంబుగ నాశీర్వదించుచున్నాను. నీయట్టి తేజశ్శాలియైన కుమారుఁడు గాని సోదరుఁడు గాని నాకుండి యుండునెడ నే నెంత గర్వించియుందును? నాయనా! న న్నేమి చేయుమందువు? నిన్ను వారింపక తప్పదు. నా దుర్గము నాక్రమించుకొని నా రాజ్యంబున నీ వొక నూతన రాజ్యము నెట్లు స్థాపింపఁ గలవు? ఇది నీ కెన్నటికైన సాధ్యపడునా? విన్నవారైనను హర్షింతురా?"

"అయ్యా! మీ రెన్ని మంచిమాటలాడినను దుర్గప్రవేశమునకు మీకు మార్గం బొసంగను. పోరాటము చేతనే గాక మాటలచేఁ గోట లాక్రమింప వచ్చునా? నావంటి వాఁడు కుమారుఁడో సోదరుఁడో యైనందుకు మీరు గర్వింప నక్కఱలేదు. సోదరు నింటనుండి గెంటిన మీవంటి వానికి సోదరుఁడనో కుమారుఁడనో యై నేను దుఃఖింప నక్కఱలేదు. ఇది మొగలాయి రాజ్యముగాని మీరాజ్యము గాదు. నన్నెదిరింప వలసినవాఁడు చక్రవర్తియే కాని మీ కిం కెట్టి ప్రసక్తియు లేదు. అందుచే సత్వరముగాఁ దొలఁగి పొండు."

"ఇంత యౌవనగర్వంబున నున్నవాఁడవు నా సామవాక్యంబు లాలింపవని మొదటనే యెఱుంగుదును. అయినను

ముఖవీక్షణ మాత్రంబుననే నీయందు జనించిన యవ్యాజ ప్రేమాతిశయంబున నింతగాఁ జెప్పవలసివచ్చినది. ఇంకొక్కమాఱు నిన్ను బ్రతిమాలెదను. నామాట విని కోట విడిచి పెట్టుము!

"బ్రతిమాలుకొనుచు నెన్నికోటలని సంపాదింపఁగలరు? బ్రతిమాలినంతమాత్రమున సేనలు మఱలించుకొని పోవుటకుఁ జక్రవర్తి కున్నంత యౌదార్యము మాకు లేదు..................."

"ఓరి పశువా! నోటికి వచ్చినట్టెల్లఁ బేలకుము! పెద్దవారెవ్వరును నీకులేరా? నీకు నీవే పెద్దవా? మహావీర శిరఃఖండనంబునం దారితీరిన యీ ఖడ్గంబును నరటి మోఁపువంటి నీకోమలశరీరంబుపై నుపయోగింప సాహసింపలేక నీ కింతవఱ కాయు వొసంగితిని. చావఁదలంచితివేని యింక జాగుసేయను. కాచుకొమ్ము."

"నీవంటి పిఱికిపందతోఁ బోరాడుట యుత్తమ రాజపుత్రునకుఁ గీర్తిదాయకంబు గాదని నేనును జాగుచేసితిని. నీవే కాచుకొమ్ము."

అని శక్తిసింహుఁడు పలికినంతనే ప్రతాపసింహుఁ డాగ్రహోదగ్ర విగ్రహుండై పండ్లు పటపటఁ గొఱుకుచుఁ గాలపాశంబునుం బోలె నత్యంత భయప్రదంబగు తన కరవాలంబు ఝళిపించుచుఁ దురంగము నొక్కింత ముందునకుఁ



బోనిచ్చెను. లేశమును జలింపని శౌర్య సాహసంబులతో శక్తిసింహుఁడును మితిమీఱిన రణోత్సాహంబున ద్వంద్వయుద్ధంబున కుద్యుక్తుండయ్యె. ఇరువంకలనున్న భిల్లసైనికులును దమతమ నాయకుల నత్యాతురతతో విలోకించుచుండిరి. రామభద్రుఁడు ఖిన్నవదనుండై శక్తిసింహుని వారించు టసాధ్యంబని నిరాశచేసికొని మాటిమాటికి వెనుకకుఁ దిరిగిచూచుచు నేమియుందోచక యించుక ప్రక్కకుఁదొలంగెను. తురంగమును ముందు కుఱికించిన తనపై శక్తిసింహుఁడు కరవాలం బెత్తుచుండ నాకస్మికముగఁ జిఱుతల లయతోడను చితారు శ్రుతితోడను —

"ఎన్నటికిని నీ యజ్ఞానాంబుధి - నీదుచు నుందురటండీ
అన్నదమ్ములై యుండియు నిటు పో-రాటమాడఁ దగదండీ!
పేరులు వేరయినంతమాత్రమున - భిన్నబుద్ధి గొనకండీ!"
పేరులు వేరుగఁ దల్లిపుత్రులను-బిలుచుచునుండ దటండీ."

అని పాడుచుండిన మహాత్ముని గీతామృతము వారికి వినరాఁదొడంగెను. అప్పుడు ప్రతాపుం డందుచేతనో యాగు మాగు మని వానిని వారించి తానించుక వెనుకకు మఱలి- "ఓరీ! డింభకా! ఈ నీచప్రదేశమును విడిచి యొండొక చోటికేగుదము రమ్ము! ఇందొకప్పుడు రాజ్యకాంక్షచే నిరువు రన్నదమ్ము లతిఘోరంబుగఁ బోరాడఁ దలఁపడి యకారణంబుగఁ దమ పురోహితుండైన యొక బ్రాహ్మణుని మరణంబు

నకుఁ గారకులైరి. సోదర వైరంబునకును సాధుబ్రాహ్మణుని బలవన్మరణంబునకును స్థానంబైన యీ క్షుద్రస్థానంబును బరిత్యజించి—" అని యింక నేమేమియో పలుకుచుండ వాని మాటల మధ్యముననే 'ప్రతాపా! వలదు! వలదు! అచ్చట నుండి తొలంగవలదు. నాడు మీ పురోహితునకుం బోలె నేడు మీసోదరులు నాకుఁగూడ నిందు ముక్తి కలిగింపుఁడు' అని తొట్రుపడు కంఠస్వరంబుతోఁ బలుకుచుఁ గన్నీ రొత్తుకొనుచు నత్యాతురతతోఁ బఱుగు పఱుగున వచ్చి చందావతుఁడు వారి గుఱ్ఱములకు నడుమ నిలిచెను. ఇరువురును నిశ్చేష్టితులైరి. ప్రతాపసింహుఁడు వాని మొగంబును దేరి పారఁ జూచి తటాలున నేలపై కుఱికి— వింతగా;

"చందావజ్జీ! —

"ఔను. నేను జందావతుఁడనే! బొటనవ్రేలు కోసికొనినంత మాత్రమున మీ తండ్రి చంప నియోగించిన యీ బాలకుని దలవరులనుండి గ్రహించి, యపుత్రకుండ నగుట నింతకాలము నుండియు నీ మాతృకుండగ్రామములోఁ బెంచుకొనుచుంటిని. మీ రిరువురును సోదరులు! ఎత్తినకత్తు లింతతోఁ దింపి వేయుఁడు!"

అని పలికినంతనే ప్రతాపసింహుఁడు నోటఁ మాటలేక చేతనున్న ఖడ్గము నట్లే దిగజార్చి రెండుచేతులు మొగమ్మున నిడికొని, సంతత ధారావృష్టిగ వెడలు కన్నీటితో క్షణము మాత్రము దుఃఖించి, నిశ్చేష్టితుఁడై వెలవెలఁబోయి చూచుచుండిన శక్తిసింహునిఁ దటాలున గుఱ్ఱముపైనుండి యందుకొని, పసిబాలకునింబోలె నెత్తుకొని వాని వదనంబునఁ దన వదనంబుఁ జేర్చి రెండుచేతుల బిగ్గరఁ గౌగిలించుకొని యట్లే యుండిపోయెను. ఇరుతెగలయందలి భిల్లులును నత్యాశ్చర్యానందములతో నిలుచుటకుఁ జోటులేకుండ నొండొరులఁ ద్రోసికొనుచు వచ్చి చుట్టును గుమిగూడిరి. అప్పుడు చందావతుఁడు ప్రతాపునిఁజూచి—'కుమారా! నీసోదరుని నీ కొక్కమాఱు నమస్కరింపనీయవా' యని పలికెను. తోడనే శక్తిసింహుఁడును ప్రతాపుని కౌఁగిటనుండి క్రిందకు జారి వాని పాదంబులపై వ్రాలి మౌనముతో నెంతకును లేవఁడయ్యె. ప్రతాపుఁ డాతని లేవనెత్తి చెంతకుఁ జేర్చి వాని కన్నీరొత్తుచు బుగ్గలు నొక్కుచుఁ జందావంతునిఁ జూచి—



"చందావజ్జీ! తలంచుకొను నప్పుడెల్ల గుండెలు బ్రద్దలు సేయుచుండిన నాటి శిశుమరణంబును దప్పించి పెంచి నాతమ్ము నింతవానిగా నొనర్చిరా? ఆహా! నేడు మేవాడరాజకుటుంబమున కెంతటి నూతనతేజంబు కలిగినది? మహాత్మా! మీ యుపకృతికిఁ బ్రత్యుపకృతిలేదా?"

"ప్రతాపా! నీసోదరుని నీవు క్రమ్మఱఁ బరిగ్రహించుటయే ప్రత్యుపకృతి. నా డీబాలకుని మరణదండనమును వారించుటచే మీతండ్రి నాపై నాగ్రహించినందున నేనుద్యో

గమును జాలించుకొని యిప్పటినుండియు వీనితో నీమాతృకుండ గ్రామముననే నివసించుచుంటిని. నేటియుదయమున నేను దేవాలయమునుండి వచ్చుచుండ వీరమల్లుఁ డను భిల్లుఁడు వచ్చి మహబత్ఖానుని మరణవార్తయు మీ రణవార్తయు నాకెఱింగింప నున్నట్టులె పఱుగెత్తివచ్చితిని."

"మహాత్మా! మీరు రానియెడల మాగతి యీపాటికెట్లుండి యుండునో కదా? మీకన్నుల యెదుటనే నా సోదరున కీలాహాదుర్గమున నే బట్టాభిషేకము గావించెదను."

"ప్రతాపా! ఈవిషయంబున నీ వెఱుఁగవలసిన రహస్యములు కొన్ని గలవు. దూరముగాఁబోయి మాటాడుకొందము రమ్ము."

## ముప్పదిమూఁడవ ప్రకరణము.

### జగమల్లుఁడు మూర్ఛిల్లెను.

చక్రవర్తియాజ్ఞానుసారముగ జగమల్లుఁడు తన యైదువేలసైన్యముతో బయలుదేరి వచ్చి గోగుండగ్రామ సమీపంబున నొక విశాల ప్రదేశంబున నాదండుతో విడిసి యుండెను. అచ్చటికిఁ బ్రతాపసింహుని నివాసస్థానము వడిగల గుఱ్ఱపురౌతున కొకగంట ప్రయాణములో నున్నది. ఆ పర్వతారణ్య సంచారమునం దెక్కువ యనుభవ మున్నవాఁ



డగుటచేఁ దనకు నివాసోచితస్థలంబును సూక్ష్మంబుగా నిర్ణయింపఁగలఁ డనియుఁ బ్రతాపునిపైఁ బగసాధింప నున్నవాఁ డగుటచేఁ బ్రారంభము నుండియు వానిని జిక్కుపెట్టుటకు మొదలుపెట్టు నని యెంచి చక్రవర్తి జగమల్లునే ప్రథమంబునఁ బంపవలసి వచ్చినది. జగమల్లచ్చట దండువిడిసిన తరువాత నొకవారము దినములలోనే తత్ప్రాంత ప్రదేశంబంతయు సార్వభౌముని పటకుటీరనిర్మాణంబున కనుకూలంబుగాఁ జేయించెను. ప్రతిదినంబును జక్రవర్తి యాగమనముకొఱకును యుద్ధప్రారంభముకొఱకును నిరీక్షించుచుండుటతప్ప వానికి విధింపఁబడిన కార్యము లింకెవ్వియును లేవు. వానిసిపాయిలును దమతమ వసతు లేర్పరచుకొని, యుద్ధ మింకను బ్రారంభింపఁ బడకుండుటచేతను, తమ నాయకుఁ డన్నివిధంబులఁ దమ కనుకూలుఁ డగుటచేతను, స్వేచ్ఛగా వినోదించుచుఁ గాలక్షేపము గడపుచుండిరే కాని దండయాత్రలోఁ బాటింపవలసిన సైనిక విధి విధానముల నంతగాఁ బాటించు చుండుట లేదు.

ఒకనాటి మధ్యాహ్నమున జగమల్లుఁ డొంటరిగఁ దన గుడారములోఁ గూర్చుండి కట్టెదుటఁ గానవచ్చుచున్న ప్రకృతిని వీక్షించుచుండెను. కాని యా ప్రకృతి వానియం దేమియు వికృతి పుట్టింపలేదు. వాని కంటఁబడుచుండిన కొండలన్నియు నాతఁ డెక్కినవే. గుహలన్నియు నాతఁడు సంచ

రించినవే. అరణ్య ప్రదేశము లాతఁడు వేటాడినవే. ప్రవాహంబులన్నియు నాతఁడు గ్రుంకినవే. సుఖాసీనుఁడై కూర్చుండినంతనే యేదో సంగతి వానికి జ్ఞప్తికి వచ్చినందునఁ దద్విషయవిచారమునందు మునిఁగియుండెనే కాని వానియేకాగ్రదృష్టికి వేరు కారణముండదు, ఆతఁ డట్లు తదేకధ్యాననిమగ్నుఁడై యుండఁ గొంత సేపునకొక రాజకుమారుఁడు, ఆకులతోఁ గట్టిన యొక పెద్ద పొట్లమును బట్టుకొని, తటాలున లోనఁ బ్రవేశించి వానిని సమీపించి నమస్కరించి కట్టెదుట నిలువఁబడెను. జగమల్లు వానినిఁ జూచి నిర్ఘాంతపడి వాని నమస్కారమును దయాపూర్వకంబుగ నందుకొని నోటమాట లేకయే తటాలునఁ గౌఁగిలించుకొని కౌఁగిటనుండఁగనే వానితో నిట్లు ప్రసంగింపఁ దొడఁగెను.

"నాయనా! అమరసింహా! నీ వొంటరిగ నేలవచ్చితివి? నాతండ్రీ! నిన్నెన్నాళ్లకుఁ జూచితినోయి! కుమారా! మన యంబా బాలిక——"

అని మఱిమాటాడలేక కన్నీరు వరదగా వెక్కివెక్కి యేడువ నారంభించెను. అమరసింహుఁడును శిరమువంచుకొని కొంచెము సేపూరకుండి—

చచాజీ! మీ రేడువకుఁడు! అంబాబాలిక క్షేమముగనేయున్నది. మీరిచ్చట దండుతో విడిసియుండిరని బాబాజీగారును మాతాజీగారును జెప్పుకొనుచుండఁగా విని, మీ



యొద్దకు దిగబెట్టవలెనని ప్రాణములు కొఱికివేయుచున్నది."

"పోనిమ్ము! ఒక్కమాఱు గుఱ్ఱముపైఁ గూర్చుండఁ బెట్టి నీతో! దీసికొని రాలేకపోయితివా? యుద్ధ మారంభమైన తరువాతే. నెట్లును వీలుండదు కదా?— కుమారా! నీచేతిలోనున్న పొట్ల మేమి? అది యెవరికి?"

"మీకొఱకే— నేడు మన యంబ పుట్టినదినము. మాతాజీవారు మీకీ భక్ష్యముల నిచ్చిరమ్మని నాకు సెలవిచ్చి పంపినారు."

"అంబ పుట్టినదినమా? యైదవయేడు వచ్చినది కాఁబోలు! నాయనా! ఎన్నాళ్లకు మీ మాతాజీవారిని స్మరింపఁ గంటినోయీ! ఆమె క్షేమముగ నున్నారా? నీతమ్ముల కిద్దరకుఁ గుశలమేనా?"

అని జగమల్లుఁ డాతురతతో నడుగుచుండిన ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర రూపంబున నమరసింహుఁ డూకొట్టుచుఁ జేతనున్న పొట్లమును విప్పి వాని కట్టెదుటఁ బెట్టెను. నేలపైనున్న చాపపై జగమల్లుఁ డమరసింహునితోఁ గూర్చుండి యా భక్ష్యము లొక్కటొక్కటియే భక్షించుచుండెను. వాని ప్రోద్బలమున నమరసింహుఁడును వేరొక [illegible] గొన్ని వేసికొని కొంచెము కొంచెముగఁ దినసాగెను.

"అమరసింహా! మాతాజీవారి చేతిపాకము నా కెన్నాళ్ళకు లభించినదోయీ! ఆమె హృదయము నామె

మాటలు నెంత మధురమైనవో యామె వంటలును నంత మధురముగ నుండును. నాయనా ! నా నమస్కారము లామె కెఱింగించెదవా ?"

"తప్పక యెఱింగించెదను. మీరు వచ్చిరని విన్నప్పటి నుండియు నిద్రాహారములు లేక మిమ్మే తలఁచుకొనుచు నిరంతరము వగచుచున్నారు. చచాజీ ! మీఱు మఱి మాయింటికి రానే రారా ?"

"ఎట్లు రాఁగలను దండ్రీ? ఆ ఋణానుబంధమును మీ తండ్రి త్రెంపివేసినాఁడు ! ఇప్పు డా ప్రసంగ మెందుకు ? అంబకుఁ గ్రొత్తమాట లేమైన వచ్చినవా ? నన్ను మఱచి పోలేదుకదా ?"

"క్రొత్తమాటలా! కడుపునిండ మాటలే. వసదాగిన చిలుకవలె నెప్పుడు నేదో వాగుచునే యుండును. కోపము వచ్చినప్పుడెల్ల—'తతాజీ దగ్గలి కెళిపోతా' నని యేడ్చుచునే యుండును. ఇన్నాళ్ళవఱకు నంబను జూడకుండ నుండఁ గలిగిన మీ హృదయము కఠినపాషాణమా యని మాతాజీ వారు మిమ్మడుగుచున్నారు."

అప్పుడే నోటిలో నొకయుండ పెట్టుకొనఁబోవుచుండిన జగమల్లుఁ డా మాటవిని చేయిదించి మొగము వంచి మఱుఁ గన్నీరు గార్చుచు నట్లే యుండిపోయెను. అదిచూచి—

"చచాజీ ! అంబపేరు చెప్పినప్పుడెల్ల మీరిట్లు దుఃఖించుచుండుట న్యాయమేనా? పోనిండు ! మీరు సావకాశముగా



భక్షించువఱకు నేనా ప్రసంగమే యెత్తను. మీరు తృప్తిగాఁ బుచ్చుకొనవలయునని మాతాజీవారు మఱిమఱి చెప్పినారు.

"ఔను! తండ్రీ ! ఆమెకు నాయందట్టి వాత్సల్యమున్నది. ఆమె స్వయముగ వడ్డించినప్పుడే నాయాఁకలి తీరుచుండెడిది. ఆమెను విడిచిన తరువాత నేను దల్లిలేని బిడ్డఁడనై యొకనాడును గడుపునిండ నాహార మెఱుఁగను. ఆమె నాకు వదినగాదు. తల్లి ! తల్లికంటెను దల్లి !"

అని మొగము వంచుకొనియే పలికి— అంతరంగమున జనించిన కరుణారసతరంగము బాష్పరూపమున వెడలి పోయినంతనే జగమల్లుఁడు మొగమెత్తెను. మొగ మెత్తునరికి— అమరసింహునిఁ జూచినప్పటికంటెను నత్యాశ్చర్య జనకం బగు నింకొక నూతన స్వరూపమును జగమల్లుఁడు చూచి— చూచినంతనే గుండెలు బాదుకొనుచు—'అమ్మా ! అమ్మా ! ఎంతో సాహసము ? ఎంత సాహసము ! శత్రుసేనలే ! శత్రుసేనలే!'' అని తొట్రుపడి పలుకుచుఁ దటాలున లేచి సాష్టాంగ నమస్కారమును గావించెను. ఆతఁడంత భక్తి చూపవలసిన వారు ప్రతాపుని కుటుంబములో నెవ్వరున్నారు? పాటేశ్వరియే కదా? జగమల్లు శిరము తన పాదములకుఁ దగులకుండ నామె యించుక వెనుకకు జరిగి, "శత్రుసేనలైనమాత్రము నీ వుండ నా కేమి భయమున్నది? లక్ష్మణుఁ డున్నంతవఱకు సీత కెట్టి యాపదయుఁ దటస్థింప లేదుకదా ?" యని పలుకుచు నాతఁడు

నేలపైనుండి లేచినంతనే తన భుజముపైనున్న యంబికం దీయఁ బోయెను. జగమల్లుఁడును మితిమీఱిన వాత్సల్యాతిశయంబునం గదిరిన దీన భావంబుతో "నాతల్లీ! నా బంగరు కొండా! నా ముద్దులమూటా! ఎన్నాళ్ళకు నిన్నుఁజూడఁ గలిగితి నమ్మా! నిజముగా నా హృదయము కఠిన పాషాణమే!" అని పలుకుచు నత్యాతురతతో నంబ నందుకొనఁబోవ, ఆ బాలిక వాని మొగంబును జూచి చూచి తల్లి మెడ బిగ్గరగఁ గౌఁగిలించుకొని భోరున నొక్క రోదనధ్వని గావించెను. అప్పుడమరసింహుఁ డామె చేతిలో నొకభక్ష్యమును బెట్టెను. మంచి మాటలఁ దల్లి బుజ్జగించెను. ఎట్టకేల కంబ రోదనము మానివేసెను. తోడనే జగమల్లుఁ డామె నందుకొని "తల్లీ! ఎందుకేడ్చితివమ్మా! నన్ను మఱచిపోయి క్రొత్తవాఁడ నని భయపడి యేడ్చితివా? ఇంతకాలమును గానరాక యిప్పు డాకస్మికముగఁ గానవచ్చిన నా కొఱకు బెంగపెట్టుకొని యేడ్చితివా?" అని యనేక ప్రశ్నలడుగుచు బుగ్గలు ముద్దులాడుచు శిరము మూర్కొనుచు నొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొనెను. పాటేశ్వరియు న్నాని యెట్ట యెదుటనే కూర్చుండి—

"జగమల్! అంబమీఁదను నామీఁదను మీకున్న యభిమానమంతయు నింతియేనా? ఆ పోవునప్పు డొక్కమాఱు మమ్ముఁజూచియైనఁ బోఁగూడదా? అమరసింహుఁడు చిన్నవాఁడును నీవే పెద్దవాఁడవు ననుకొని యింత వాత్సల్య



మ్మున నిన్నుఁ బెంచినందుకు నాపైనిప్పుడు దండెత్తి వచ్చితివా? అన్నగారితో నీకు విరోధ మున్నయెడ నాయనతో మాటాడ మానివేయుదువు గాక! రాజ్యములో నీకుఁ గావలసిన భాగము నన్నడిగి యుందువుగాక! ఇంతకు నప్పటికి మనకున్న రాజ్యమేమున్నది! ఏమైనను గొన్ని దుర్గముల నిప్పుడు గదా సంపాదింపఁ గలిగితిమి! ఈ యున్నవానిలో నీకేయ్యవి కావలయునో చెప్పుము? ఇచ్చుదానను నేను! ఈ రాజ్య భోగములపై నాసక్తి నాకుగాని మీయన్నగారికిఁ గాని లేశమ్మును లేదు. ఏమైనను ననుభవింపవలసినవారు నీవును నమరసింహుఁడును గాని తక్కిన పిల్లలు పసిపిల్లలే కదా? తండ్రీ! నిన్ను నాకడుపునఁ బుట్టినట్లు ప్రేమించుచుఁ గోరినదెల్ల నొనగూర్చుచుండ నాతోఁ జెప్పనైనఁ జెప్పక పాఱిపోయెదవా? పైపెచ్చు నాపై దండెత్తి వచ్చెదవా?.................
......ఏడువకుము! నీవ ల్లేడువఁగూడదు! పురుషుఁడవుగదా! ధైర్యమును వహింపుము! నీవుచేసిన దేమైన న్యాయ్యముగ నున్నదా? ......"

"తల్లీ! శునకోచ్ఛిష్ట దధిభాండ మెన్నివిధములచేనైనఁ బనికివచ్చునా? అన్నతో విరోధించితిని. దేశమును బరిత్యజించితిని. మాతృసమానులగు మీయెడ మహాపరాధము గావించితిని. అందుచే దేశద్రోహిని. భ్రాతృద్రోహిని. మాతృద్రోహిని. ఇట్టి పరమ పాపాత్మునికడకు మీరేల వచ్చితిరమ్మా! తల్లీ!

మహాపతివ్రతాశిరోమణులైన మీరు మీ వామపాదంబును నాశిరంబునఁ బెట్టుఁడు! తద్ధూళి సంపర్కముననైన నాజన్మము తరించునేమో? నాపాపంబులు తొలఁగునేమో? నాబుద్ధి మఱలునేమో? అయ్యయ్యో! తల్లీ! ఇన్నిన్ని మహాద్రోహములు గావించిన నే నిప్పుడు స్వామిద్రోహముగూడఁ గావింపవలయునా?......"

"నాయనా! స్వామిద్రోహము చేసి నిన్నిప్పుడు మా పక్షమునకు రమ్మని కోరుటకు నేనురాలేదు. మాకంతటి భాగ్యంబును లేదు. నాపిల్లలకుఁ బితృవియోగ దుఃఖమును, నాకు మంగళసూత్ర భంగక్లేశంబును గలిగింప నెంచుటకు నీకు మేము చేసిన యపరాధ మేమో యని సిన్నడుగ వచ్చితిని. అన్నపై నున్న కోపంబుచేతనే కదా మా వినాశనంబునకు సంకల్పించుకొంటివి? నాయనా! అంతదూరము పోనేల? నేను నీయెదుటనే యున్నాను. అమరసింహుఁడు నీప్రక్కనే యున్నాఁడు. అంబ నీ యొడియందే యున్నది. ఇప్పుడే కరవాల మందుకొని నీ సంకల్పము నెరవేర్చుకొనఁ గూడదా? తండ్రీ! సీతాకష్టము లనుభవించుచుండిన నాకు లక్ష్మణుఁడవయ్యెద వనుకొంటిని గాని నాగొంతుక తెగనికత్తిని గోసెదవని గ్రహింపనైతిని......"

అని పాటేశ్వరి మొగము వంచుకొని పొరలి పొరలి వచ్చుచుండిన కన్నీరు దుడుచుకొనసాగెను. జగమల్లుఁడును నామెదానికంటె నధికంబుగ వగచుచు నడుమ నడుమ నంబను గడుపునంజేర్చి కౌఁగిలించుకొనుచు—



"తల్లీ! నన్నుఁ జేయుమన్నపని నీవే చేయుచున్నావు! నీ నిష్ఠురోక్తులచే నాప్రాణములు సగము పోయినవి. ఈకత్తితో నామెడపై నొక్క పెట్టుపెట్టి భరింపరాని యీ మనోవేదనమును నాకుఁ ద్వరలోఁ దొలఁగింపుము. మా తల్లికడుపునఁ బుట్టిన నిర్భాగ్యులమగు నిద్దఱిలో నొకనిని మాతండ్రియే బాల్యమునఁ గడతేర్చెను. శేషున్నను నీ విప్పుడు పూర్తిచేసి యీ భూభారమును నీవు వారింపఁగూడదా తల్లీ!........"

"కుమారా! గతించిన భ్రాతృలాభమును నీకుఁ గలిగించెదను. చచ్చిన నీతమ్ముని బ్రతికించి తెచ్చి నీకన్నులయెదుటఁ బెట్టెదను. అట్లు చేయఁగలిగినయెడ నన్ను మన్నించెదవా?"

"అమ్మా! మరదినైనను బుత్రవాత్సల్యముతోఁ బెంచుచు స్వప్నమందైనను నాతో మీరు పరిహాస మాడినట్లు నాజ్ఞప్తియందు లేదే! నేడేల నిట్టి పరిహాస మాడెదరు? నా బ్రతుకు పరిహాసాస్పదమైన దనియా?"

"పరిహాసమే యనుకొనుము! నిజమే యనుకొనుము! నీతమ్ముఁడు బ్రతికివచ్చినయెడల వానిని మఱల నీవు చంపివేయవుగదా?"

"తల్లీ! నమస్కరించెదను. నాకేమియు బోధపడ లేదు. నాతమ్ముని నే నెన్నడైనఁ జంపికొనెదనా? ఆప్రశ్నయు నడుగవలెనా?"

"అడుగవలదా? బ్రతికివచ్చిన శక్తిసింహుఁడు మా పక్షమునఁ జేరి, చక్రవర్తిపక్షము వాఁడవైన నిన్ను రణరంగమున నెదిరించినప్పుడు నీవు చంపక విడిచి పెట్టెదవా? విడిచినయెడ నది స్వామిద్రోహము కాదా? ............"

"ఆహా! తల్లీ! ఆపేరుసైతము మీకింకను జ్ఞాపకమున్నదా? అయ్యయ్యో! ఏనాటిపేరు? ఏనాటిశక్తిసింహుఁడు! ఎంత కాలమునకు వినఁగలిగితిని? అమ్మా! స్వామిద్రోహమే కాదు, ఎంతటి మహాద్రోహములనుగూడఁ జేయఁగల పరమపాపాత్ముఁడనైనను జచ్చిబ్రతికిన తమ్మునిఁ జంపుకొనెదనా?"

"కుమారా! ఇంకనీయెడ దాపనేల? యథార్థంబును వినుము. ప్రచ్ఛన్నవృత్తిలో శక్తిసింహుఁ డింత కాలమును బ్రతికియే యున్నాడు."

అని ప్రతాపసింహుఁడు తన కెఱింగించిన లాహాదుర్గాక్రమణకథా విధానం బంతయుఁ బూసగ్రుచ్చినట్లు పాటేశ్వరి వానికిఁ జెప్పివేసెను. ఆవృత్తాంతంబంతయు విన్నంతనే జగమల్లుఁ డున్మాదమెత్తినవానివలె వెఱ్ఱి వెఱ్ఱి చూపులు చూచుచు—

"అయ్యయ్యో! ఆఁ- ఆఁ- నిజమేనా? నాతమ్ముఁడే? బ్రతికియే యున్నాఁడా? ఎచ్చటనున్నాఁడు? ఏదీ, ఆముద్దుల మొగ మేదీ? నాకన్నులకేమియుఁ గానరా దేమి? అప్పుడే చీకటిపడినదా? నేను నిద్రించుచుంటినా? ఇదంతయు స్వప్న



వృత్తాంతమా? తల్లీ! నిజము చెప్పరాదా? నాతమ్ముఁడు బ్రతికినట్లు నా కేల కలవచ్చినది? ఆఁ-ఆఁ- అంబ నాయొడిలోనే యున్నదే! అదుగో! అమరసింహుఁడు! తల్లీ! నీతో నేను మాటాడుచుండలేదా? ఇదిస్వప్న మెట్లగును? హా! తండ్రీ! బ్రతికియేయుంటివా? శక్తిసింహా! సజీవుఁడవేకదా సోదరా! నాకంటబడవా? నన్ను గౌఁగిలింపనీయవా? నీవు వచ్చువఱకు నాప్రాణములు నిలువగలవా? తం- డ్రీ! శ-క్తి-సిం-హా-"

అని పలుకుచు నాతఁడచ్చట మూర్ఛిల్లెను. పాటేశ్వరియుఁ దటాలున నంబ నందుకొని శీతలోపచారంబులతోఁ గొంత సేపున కాతని యథాక్రమంబుగ మేలుకొలుపఁ గలిగెను.

---

## ముప్పదినాల్గవ ప్రకరణము

### పోల్చుకొనలేకపోయిరి.

జగమల్లు మూర్ఛనుండి తేఱిన తరువాతఁ బాటేశ్వ ఱికొంతసేపు వానితోఁ బ్రసంగింప నెంచెనుగాని యింతి జక్రవర్తి సేనాసమూహములతో సమీపించినట్లు వార్త నంగున నతఁడు వానిని వెంటనే యచ్చటినుండి పంపివే అందుచే జగమల్లు మనసు సంపూర్ణముగ మార్పుఁ గలుగు గాని, వాని యుద్దేశమును స్పష్టముగాఁ దెలిసికొనఁ గలుగు గాని పాటేశ్వరి కవకాశము గలుగలేదు. జగమల్లు క

ద్వర్తనమును గూర్చి యామె సంశయముతోడనే యింటికి మఱలవలసివచ్చెను. ఆమెకుఁ దోడుగా వచ్చి వెలుపల వేచి యున్న భిల్ల పరివారికులు చీకటి పడకమునుపె పాలేశ్వరిని భద్రముగా నింటఁ జేర్చిరి. చక్రవర్తి వచ్చినప్పటినుండియు సిపాయి లెల్లరును దమ విధులన్నియు యథావిధి మన్నింప వలసి వచ్చుటచేత నిప్పుడు వారు స్వేచ్ఛగా వినోదించుచుండుటకుఁ గాని, యితరుల రాకపోకల కవకాశ మిచ్చుటకుఁ గాని వీలు బడలేదు. అతఁ డేక్షణమున యుద్ధమును బ్రారంభించునో యని యచ్చట సిపాయిలును నచ్చట రాజపుత్రులును గూడఁ బ్రతి క్షణ మెదురు చూచుచుండిరి.

క్రొత్తగా వచ్చిన రాజపుత్ర భిల్ల సైన్యముల నెల్ల రణంబున కాయత్తపరచుచు యుద్ధసంబంధమైన యేర్పాటు లన్నియుఁ బ్రతాపసింహుఁడు సహస్రాక్షునివలె వేయికన్నులతోఁ గనిపెట్టుచుండెను. ఈ ప్రయత్నములలో మూఁడుమాసముల నుండి పాపము వానికి నిద్రాహారములు లేవు. ఒక్కొక్క[illegible]డు ప్రచ్ఛన్న వృత్తితో నెవ్వరి కంటఁ బడకుండ నొంటరిగఁ [illegible] శత్రు శిబిరంబుల సమీపించిఁ యతఁ డచ్చటి విశేష[illegible]లను గనిపెట్టుచుండెను. మాండలి దుర్గము-కుంభిళా దుర్గము-[illegible]తాపగడ — లావాదుర్గము — మున్నగఁ దనకుఁ గ్రొత్తగా [illegible]నిన దుర్గములనుండి యింకను రావలసిన సైన్యముల కొఱకు [illegible] సామగ్రుల కొఱకును నతఁడు నిత్యమును నిరీక్షించు[illegible]ండెను.



చక్రవర్తి వచ్చి దండు విడిసిన మఱునాటి యుదయమునఁ బ్రతాపసింహుని కుటీరంబులయం దొక కుటీరములో రాజసింహుఁడను వానియెదుట నొక సిపాయియుఁ గూర్చుండి యతిరహస్యముగ సంభాషించుకొనుచుండిరి. రాజసింహుఁడు ఖిన్నవదనుఁడై మొగము వంచుకొనియే మాటాడుచుండెను. సిపాయి యంతకంటెను ఖిన్నవదనుఁడై కన్నీరు గార్చుచు నేడ్చుచుండెను. ఆ యేడుపునందతఁ డెందుకొఱకో రాజసింహుని నిర్బంధించుచున్నట్లును రాజసింహుఁ డందు కంగీకరింపనట్లును స్పష్టముగ నేతోఁచుచుండెను. కొంతవఱకట్లు దుఃఖించి దుఃఖించి కడకా సిపాయి యెఱ్ఱవారిన మొగంబెత్తి రాజసింహున కిట్లనియె —

"రాజసింహా ! ఇంక నీవలన నాకు నిరాశయనుట స్పష్టమేనా ?"

"ముమ్మాటికిని స్పష్టమే. నీవు మొగలాయి కాంతవు. నేను రాజపుత్రుఁడను."

"ఇంతకాలమునుండియు నిన్నాశ్రయించుకొని యుండిన నా కిప్పుడేమి సాధనము చెప్పెదవు ?"

"నిన్నీ మాఱురూపముతో రమ్మని నేను బ్రతిమాలితినా ? యుద్ధ మారంభింపకమునుపే మెల్లఁగాఁ బోయి మీ మొగలాయి సైనికులలోఁ జేరుకొనుము. ఆగ్రా చేరువఱకుఁ బైలుపడకుండఁ గాలము గడపి పరువు దక్కించుకొనుము.

"ఎట్లు దక్కించుకొనఁ గలను? నీ వెవ్వఁడవని యా సఫ్‌ఖానుఁ డడుగఁడా? ఎందుండి వచ్చితివనియు నింతకాల మెందుంటివనియు నన్నుఁ బరీక్షింపఁడా? తక్కిన సిపాయిలు మాత్రము సామాన్యముగ నన్ను విడిచెదరా? రాజసింహా! నిన్ను నమ్మికొని వచ్చినందు కన్నివిధముల నాగొంతుక తెగని కత్తితోఁ గోసి వేసితివికదా! పోనిమ్ము! నన్ను బరిగ్రహింప కున్నను నా మానమైనఁ గాపాడుము."

"నీ మానమును గాపాడుటకు నన్నేమి చేయుమన్నను జేసెదను."

"నీవు వచ్చి స్వయముగా నన్నా సఫ్‌ఖానున కప్పగింపుము. 'ప్రయాణములో వీనికి శరీరస్థితి చెడినందున నే నింతకాలమును జెంతనుంచుకొని సంరక్షణము చేసితిననియు మఱల మీ సిపాయిని మీరు పరిగ్రహింప వచ్చు'ననియుఁ జెప్పి నర్పింపుము! ఇంతకంటె నిన్నేమియుఁ గోరను."

అట్టి యనృతము లాడుట రాజసింహున కిష్టము లేక పోయినను మెహరున్నిసావలని బాధ తప్పిపోవునుగదా యని వాని కంగీకరింపక తీరినది కాదు. మఱల నామె బుద్ధి మాఱిపోకుండ శీఘ్రముగనే సాగనంపవలెనని యెంచి రాజసింహుఁడు వెంటనే యామెతోఁ గుటీరమునుండి లేచి బయలుదేరెను. వారిరువురు వెలుపలికి వచ్చినంతనే యమరసింహుఁ డచ్చటి నెవరినో యెవరికొఱకో వెదకుకొనుచు వచ్చుచు రాజసింహునిఁ జూచి—"రాజసింహా! మా చిన్నతమ్ము నెత్తుకొని



మీరాభాయి యీ ప్రాంతమునకు వచ్చుట నీవు చూచితివా? అని యడిగెను. రాజసింహుఁడు వానినిఁ జూచి నవ్వుచు—

"చూచితిని. అదుగో! ఆ సరోవరతీరంబునం దున్న మామిడిచెట్టుక్రింద నున్నది." అని బదులుచెప్పెను. తరువాత రాజసింహుఁడును సిపాయియు మొగలాయి శిబిరముల వంక నడువ సాగిరి. అమరసింహుఁడు సరోవరతీరంబునకు నడువసాగెను.

మూర్తీభవించిన వనలక్ష్మివలె సరోవరతీరంబునందలి రసాలతరుచ్ఛాయ నధివసించి పసిపాప నాడించుచున్న మీరాభాయి నమరసింహుఁ డొక్క పఱుగున సమీపించెను. సమీపించినతోడనే—

"మీరా! పాలుపోసెదరఁట! మాతాజీవారు తమ్ముని దీసికొని రమ్మనినారు?"

"నిజమేకాని యీ కబురు చెప్పుటకు నీ వేల వచ్చితివి? మఱియెవరినైనఁ బంపలేక పోయితివా? పంపుటకు మనుష్యులే లేరా? నిన్న మీ బాబాజీవారు సెలవిచ్చినదప్పుడే మఱచిపోయితివా? ఆయన కోపము చూచి నాగుండెలు గడగడ వడకినవి. 'ఇఁక మీఁద నీ జాతిభ్రష్టకన్యకతోఁ బ్రసంగించుచు నా కంటఁ బడితివేని నిన్నింటిలోనుండి గెంటివేసెద' నని యంత కఠోరముగా వారు సెలవిచ్చినప్పుడు నీ కాభయమే లే దేమి? నేను గంటఁబడినప్పుడెల్ల నీ వేదో మాటాడకమానవు. నే నీమూలఁ జేరుకొంటిని. ఇచ్చటికిని వచ్చితివి. మన కింటనుండు యోగ్యత లేనట్లున్నది."

"పోనిమ్ము. ఇరువురమును గలిసియే పోవుదము."

"వెఱ్ఱివాఁడవు కావు. అంతవఱకు వచ్చినప్పుడు నీ వేల వచ్చెదవు? అప్పుడు నాదారి నాదే. నీదారి నీదే."

"మీరా! యింతకాలమునుండి పరిచయముండియు నా స్వభావమును గుర్తింపలేవా? ఈ విషయములో నే నేమి ప్రమాణముచేయు మన్నను జేసెదను."

"హా అమరసింహా! ఒక జాతిభ్రష్టకన్యకొఱకు నీవు తల్లిని దండ్రిని నన్నదమ్ములను రాజ్యమును విడిచెద వన్న నెవ్వరైన విశ్వసింతురా? ఎందు కీ మాటలు?"

"ఎవరు విశ్వసింపక పోయినను నన్నెఱిఁగిన నీవు విశ్వసింపవా? నే నంత చంచలచిత్తుఁడనా? ఎవ్వ రాగ్రహించినను నాకు లక్ష్యము లేదు. నిన్నుఁ బరిగ్రహించి తీరెదను. ఆలయములోనికి రమ్ము! దేవతా సాన్నిధ్యమున నీ యిష్టము వచ్చినప్రమాణము చేసెదను."

"మఱి యొకమాఱు మీ బాబాజీ వారిచేఁ జీవాట్లు పెట్టించుటకా, నీ ప్రయత్నము! ఆలయములో జపముచేసి కొనుచుందురు—నే నచ్చటికి రాను."

"బాబాజీవారు పొద్దున నుండియు నింట లేరు. నీవు భయపడ నక్కఱలేదు. పోనిమ్ము! అదిగో! అటుచూడు! మొగలాయి శిబిరములనుండి భిక్షకొఱకు — ఎవఁడో యొక పైగంబరు వచ్చుచున్నాఁడు. పైగంబరులు కేవలము నీశ్వర



సాక్షాత్కారముగల దివ్యపురుషులే కదా? నేను వానిపాదము లంటి ప్రమాణము చేయవచ్చునా? నీవు విశ్వసించెదవా?"

అని పలుకుచు నామె యేమియుఁ బ్రత్యుత్తరము చెప్పకుండనే యమరసింహుఁడు ప్రక్కకుఁ దిరిగి కొంచెము ముందుకేగి చప్పట్లు చరచుచు— "ఫకీర్మహరాజ్! ఇట్లొకమాఱు దయచేయవలెను." అని బిగ్గరగఁ బిలిచెను. తోడనే యప్పుడాదారి నేగుచున్న ఫకీరొకఁ డాకేక విని యేమేమో చదువుచుఁ బాడుచు వారిని సమీపించెను. అప్పు డమరసింహుఁడు—

"ఫకీర్మహారాజ్! నే నీ కన్యకను బ్రేమించితిని."

"అఛ్ఛా."

"ఈ కన్యకయు నన్నుఁ బ్రేమించినది."

"బహుతచ్ఛా!"

"కాని — యీమె నా యనురాగమును విశ్వసింపకున్నది."

"అరే - రే - రే - రే -!"

"అందుచే దివ్యపురుషులైన మీ పాదములంటి యీమె నెన్నటికిని విడువ నని ప్రమాణము చేయుచున్నాను."

"భేష్ - భేష్ - భేష్!"

అని పలుకుచు నాఫకీరు పాప మమరసింహుని దొడ్డపై గట్టిగ నొక్కటి చఱచెను. అతఁడు శత్రురహస్యములను గుర్తించుటకై మాఱువేషముతో సంచరించుచుండిన ప్రతాప

సింహుఁడే యని పాపము వారిద్దరును గూడ మొదటఁ బోల్చుకొనలేకపోయిరి. ఇంతలో యుద్ధారంభసూచకం బగు తుపాకి మోఁతలు శత్రుసైన్యమునుండి యాకస్మికముగ వినవచ్చుటచేతఁ బ్రతాపుఁడు వెంటనే యచ్చటినుండి తొలంగిపోయెను.

## ముప్పదియైదవ ప్రకరణము

### యుద్ధమునాటి వింతలు.

ఈ మూఁడు మాసములలోఁ బ్రతాపసింహుఁడు సమకూర్చుకొనఁగలిగిన సైన్యము మొత్తముపై నిరువదిరెండు వేలకుఁ దక్కువ యుండదు. ఇందులో నెనిమిదివేలమంది రాజపుత్రులు, తక్కినవారు భిల్లసైనికులు. స్వరాజ్యోద్యమంబునకు జోసీభాయి యొసంగిన మొదటివిరాళం బగు నలువదివేల ధనంబును బ్రతాపసింహునకు మిక్కిలి శుభప్రదం బైనది. ఆవిత్తంబు నతఁడు మనస్ఫూర్తిగ నందుకొనుటయె తడవుగ, భామాసామూలంబున నొక్కమాఱుగఁ బదునైదు లక్షల రూప్యములు వానిచేతిలోఁ బడినవి. ఆమీఁద విషోదక పానంబునం జచ్చిన లావాసైన్యములనుండి తుపాకులు కత్తులు నీటెలు బల్లెములు కళ్లెములు జీనులు మొదలగువానిని సూరామరసింహులు భద్రపరచి భిల్లులచే మోయించుకొని పోయి ప్రతాపసింహునకు సమర్పించిరి. ఇన్నింటికంటె నత్యధి



కంబుగఁ బ్రతాపసింహునకుఁ బ్రాప్తించిన యొక ధనలాభమును గూర్చి మాత్రము చదువరు లింతవఱకు నెఱుఁగరు. ఆసఫ్‌ఖానుఁడు చక్రవర్తి యాజ్ఞపై రాణీదుర్గావతిపై దండెత్తిపోయి యామె నోడించి తద్రాజ్యంబు సమస్తమును దోచుకొనినప్పుడు వాని కెన్నిలక్షల ధనము లభించినదో యాతఁడు లెక్కించుకొనలేక పోయెను. ఆధనంబులోఁ గొంతవఱకు మాత్రమే యాసఫ్‌ఖానుఁడు చక్రవర్తికి సమర్పించి, తక్కినదంతయుఁ దన కొసంగఁబడిన లావాదుర్గములోఁ జిరకాలమునుండి దాచిపెట్టుకొనెను. దుర్గావతీరాణి జవాహరీలోఁ బదునైదు లక్షల విలువగల యొక రత్నహార ముండెడిదఁట! చక్రవర్తికిఁ దెలియకుండ నాసఫ్‌ఖానుఁడు దాచివేసిన వానిలో నది యొకటి. ప్రతాపసింహుఁడును శక్తిసింహుఁడును లావాదుర్గము నాక్రమించుకొని యందు లభించిన విత్తంబును లెక్కించుకొనఁగా నిరువదిరెండువేల సైన్యంబునకుఁ బండ్రెండుసంవత్సరములవఱకు యథేచ్ఛగాఁ సరిపడునట్లు వారికిఁ దోచినది. దుర్గములోనున్న సిపాయిలతి స్వల్పసంఖ్యాకులగుటచే వారు పోరు గావింపకయే దుర్గము నా సోదరవీరులకు విడిచిరి. చందావతుఁడు రహస్యముగ బోధించిన హితోపదేశము ననుసరించి, ప్రతాపుఁడు కొంతధనము నాసిపాయిలకుఁ బంచిపెట్టి వారి వేతనంబుల హెచ్చించి, యన్నివిధంబుల మహానందపరవశులం గావించి వారిని సంపూర్ణముగఁ దన స్వాధీనము

చేసికొనెను. అందుచే షహబజ్ఖానుని మరణవార్త యింత వఱకు దుర్గమును విడిచి పైకి రాలేదు. కేవల నిర్జన ప్రదేశమునందలి యా విషసరోవరతీరమునం గల కళేబరంబుల నెల్ల ప్రతాపుఁడు రెండవకంటఁ బడనీకుండ నవలీల భూపతనంబు చేయించెను. అప్రయత్నప్రాప్తంబు లగు నత్యధిక ధనలాభంబుల నిన్నివిధంబులం బడసిన ప్రతాపసింహుఁ డిమ్మూఁడు మాసంబులలో నిరువదిరెండువేల సైన్యమును సమకూర్చుకొనఁ గలిగె నన్న నేమి వింత? విధి ప్రతికూలుఁడైనప్పు డన్నియుఁ బ్రతికూలములే యగును. అనుకూలుఁడైనప్పు డన్నియుఁ నవలీలలో ననుకూలపడును! పడవలసిన పాట్లుపడి చేయవలసిన ప్రయత్నములు చేసి, యోర్చవలసినంతకాల మోర్చినవాఁ డగుటచేఁ బ్రతాపసింహుని స్వాతంత్ర్యోద్యమంబున కిప్పుడు విధి యనుకూలుఁ డయియే యున్నాఁడు.

ఇట్లు సర్వసన్నద్ధుండై స్వాతంత్ర్య సంగ్రామ సమారంభ సంరంభుఁడైయున్న ప్రతాపునిపై దండెత్తివచ్చిన మొగలాయిసేనల తుపాకుల మోఁతలు చదువరులు క్రిందటి ప్రకరణంబున వినియుండుటచే యుద్ధమారంభింపఁబడె నని మఱల వ్రాయనక్కఱలేదు. ఇంచుమించుగ నెనుబదిమైళ్ళ విస్తీర్ణము గల యారావళీ పర్వతప్రాంత కాంతారములలోఁ బ్రస్తుతము ప్రతాపుఁడు నివసించుచుండిన ప్రదేశమునకు సమీపంబునం గల 'హల్దీఘా'ట ను పర్వతమధ్యస్థ విశాలస్థలంబున నుభయ



సైన్యంబులును దలపడెను. భిల్లసేనలతోఁ గొండలపైనుండి చుండుఁడును రాజపుత్రాశ్వక సేనలతో భూమిపైనుండి ప్రతాపుండును ఒమతమ సైనికులఁ బురికొల్పుకొనుచు, నించుమించుగ నలువదివేల పరిమితిగల మొగలాయిసేనల నెదిరించి వారించుచుండిరి. రోదసీకుహరంబెల్ల గప్పు నవిచ్ఛిన్నమహాధూమపటలంబు జీమూతపటలం బనియు, నిర్గళదాభీలకీలికామాలికలు విద్యుల్లత లనియు, తుపాకిగుండ్లు వడగండ్లనియుఁ జెంతంగల బాదాని కవీశ్వరుఁడు తన రణక్రియా కౌశలమును వర్ణింపుచుండఁ దనయెడ నపరాధ ధన స్వీకారాపరాధంబు గావించిన ప్రతాపసింహునిపై నాసఫ్ఖానుఁడు కసియెల్లఁ దీర్చుకొనుచుండెను. ధంధమారావములతో బ్రహ్మాండమును బీటలు వారించుచు శతఘ్నులు శత్రు శతఘ్నులై యవిచ్ఛిన్నముగఁ బ్రయోగింపఁబడుచుండెను. కొండల నెక్కి నికుంజమండలములనుండియు బండరాళ్ళ నడుమనుండియు భిల్లతండములతోఁ జందుండు శిలాఖండముల నఖండముగఁ బ్రయోగించుచుండెను. అమోఘ మహిమాతిశయంబుగల గాండివ వినిర్ముక్త నారాచంబులంబోలె, ధనుర్విద్యాపారంగతులైన యా భిల్లభటులు గుఱిచూచి రివ్వు రివ్వున విడుచు బాణపరంపరలలోఁ బ్రతి బాణంబును దప్పక యొక్కొక రిపు ప్రాణంబు హరింపం దొడంగె. ప్రతాపాధికుండైన ప్రతాపుఁడు చైతకాభిఖ్యంబగు తన రణాశ్వంబుపై నారూఢుండై రాజలాంఛనం

బగు శ్వేతఛ్ఛత్త్రంబును సేవకులు పట్ట, గవచఖడ్గాద్యఖిల సాధనంబులతో నెచ్చట జూచినను దానయై రాజపుత్ర సేనాచక్రమును దిద్దిరం ద్రిప్పుచుఁ దన రణోత్సాహంబెల్ల వెల్లడించుచుండెను. కాని యేమి ప్రయోజన మున్నది? మొగలాయి వాహినీనివహంబునుండి వెడలుచున్న తుపాకులలో మూఁడవవంతు తుపాకులును దన సేనలనుండి వెడలవయ్యె. వారికింగల శతఘ్నులవంటి నూతనాగ్ని యంత్రంబులు తనకు బొత్తిగ లేవయ్యె. ఆఫిరంగులనుండి యఖండముగ వెలువడుచుండిన గుండ్ల తాకుడుచే రాజపుత్ర సైనికులు తన కన్నుల యెదుటనే వందలకొలఁది పీనుఁగుపెంటలగుచుండిరి. నభోంతరాళంబెల్లఁ గ్రమ్ముకొనుచుండిన యా క్రొంబొగలకును, నామహాధ్వానంబులకును దనకే గుండెలు బ్రద్దలు వారుచుండెను. ఇన్నింటికిఁదోడుగ దనఁ సైన్యంబుకంటె శత్రుసైన్య మత్యధికసంఖ్యాకంబై క్షణ క్షణ మభివృద్ధి గాంచుచున్నది. ఉత్తుంగ మాతంగముపైఁ జుట్టును నినుపగళ్ళుగల యడ్డకట్లు కట్టఁబడిన బంగారపు టంబారియందు మహామంత్రియైన మానసింహుఁ డొకవంక సలీముతోడను నొకవంక దామోదరసింగుతోడను బట్టుపరుపులపైఁ గూర్చుండి సేనావారంబునం దంతట విహరించుచు స్వయముగ మొగలాయి సైనికులఁ బ్రోత్సహించుచుండెను. దూసికొని వచ్చెడు తుపాకిగుండ్లు తాగలేక బారులుగట్టిన రాజపుత్రవీరులు నేల వ్రాలుచుండిరి. నాటి సాయంకాలమునఁ



జక్రవర్తి యాజ్ఞపై మొగలాయి సేనలెల్ల రణరంగమును విడిచి తొలఁగిపోవుసరికి — స్వాతంత్ర్య సౌధమునకుఁ దమతమ కళేబరముల సోపానప్రాయములుగఁ జేసి తమ విధివిధానముల యథావిధిగ నిర్వర్తించుకొని మాతృఋణ విముక్తులై చన్న బంధుమిత్రాదులైన రాజపుత్రుల ననేకులఁజూచి శౌర్య సముద్రుండగు ప్రతాపసింహుఁడు లేశమును జలింపక నిమీలితనేత్రుండై నిశ్చల హృదయంబుతో నంబాదేవి నొక్కమాఱు స్మరించి నమస్కరించి, నాటి సంపూర్ణాపజయంబును సంపూర్ణానందముగనే యనుభవించుచు స్వసైన్యంబులతోఁ దానును మఱలి పోయెను.

నాటి దినమునఁ గదనరంగ మలంకరించిన రాజపుత్ర సేనానివహంబులను జూచినంతనే చక్రవర్తి యత్యాశ్చర్యమును బొందెను. వేలకొలందిగ నున్న యుద్ధాశ్వంబులును, యుద్ధాశ్వములకుం దగిన జీనులు మున్నగు పరికరంబులును, పరికరంబులతో సిద్ధపరుపఁబడిన యయ్యుత్తమాశ్వంబులకుం దగిన రజపూత రౌతులును, రౌతుల కత్యావశ్యకంబులగు కత్తులుఁ గటారులు నీజెలు బాకులుఁ దుపాకులు మున్నగు సాధనంబులును నిదానముతోఁ గనిపెట్టి — మూఁడు మాసముల క్రిందటఁ దనకు వశపడినట్లు వ్రాసిన ప్రతాపసింహుఁడింతలో నింతటి మహాసైన్యము నెట్లు సమకూర్చు కొనఁగలిగెనో యని వింతపడసాగెను. ఆలుబిడ్డల కన్న వస్త్రములు

లేక, హతశేషులైన పదువురు రాజపుత్రులతో మాత్రము ప్రతాపుఁడు మిగిలి యుండెనని రాజసింహుఁడు చెప్పిన వృత్తాంతమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని ప్రతాపునియం దమానుష ప్రజ్ఞ యేమైనఁ గలదాయని నవ్వుకొనుచుండెను. తురంగాది సమస్త రణరంగోపకరణంబులతో నింతటి మహాసైన్యం బీతని కెవ్వ రొసంగిరో యని యాలోచించుచుండెను. తనకు మంత్రశక్తియం దెక్కుడు విశ్వాసముండుటయే గాక, తాను గొన్ని మంత్రము లభ్యసించినవాఁడు నగుటచేత, ప్రతాపసింహుఁడు చిరకాలారణ్యావాస విశేషంబున నట్టి శక్తు లేమైన సంపాదించెనా యని యూహించుచుండెను. మొత్తముపై నా రాజశేఖరుఁ డసాధారణ ప్రజ్ఞావంతుఁడనియు మహాత్ములలో గణింపవలసినవాఁడనియు సార్వభౌముఁడు నిశ్చయించుకొనెను! యుద్ధానంతరమునఁ దన మఖమల్ గుడారమునందు హుక్కా సేవించుచు నొక్కఁడే కూర్చుండి చక్రవర్తి చాల సేపువఱకు నీవిషయములనే మఱల మఱల ననుకొనుచుండెను.

సూర్యాస్తమయమైనందునఁ జక్రవర్తి విడిసిన శిబిరంబునందంతట నిప్పుడిప్పుడే దీపములు పెట్టఁబడుచుండెను. దీపికాస్తంభాగ్రములయం దమర్పంబడిన చీనాదేశపు వింత వింత గాజుగొట్టములయందలి దీపంబు లెల్ల నొక్కొక్కటి యొక్కొక వైచిత్ర్యమును జూపుచు, నట్టి వైచిత్ర్యములును లేని యావట్టి యడవులకొక క్రొత్తసోయగమును గల్పించుచున్నవి.



వందలకొలఁది గుడారంబులతో నాప్రదేశంబంతయు నొక పెద్దపట్టణ మనియే చెప్పఁదగియున్నది. యుద్ధరంగమునుండి మఱలిన సిపాయి లిప్పుడిప్పుడే తమ తమ నెలవులు చేరుకొనుచున్నారు. కొన్ని గుడారములయం దింకను దీపారాధనము జరుగనే లేదు. దీపరహితంబులైన పటకుటీరాంతరముల యందుఁ దప్ప బాహ్యప్రదేశముల యందలి వెలుఁగింకను దొలఁగిపోలేదు. చుట్టుపట్టులఁ గల యడవిపట్టులను విలోకించు వేడుకతో వాహ్యాళికొఱ కంతఃపురరాణులు కొందఱధిష్ఠించి వెడలిన జనానాయేనుఁగులును నిప్పు డిప్పుడే తిరిగి వచ్చుచున్నవి. అప్పుడే రణరంగమునుండి మఱలి వచ్చి, యల్లంతదూరంబుననే మాతంగమును డిగ్గి, యొండొరుల భుజములపైఁ జేతు లిడికొని స్యాలక సలీములు గుడారముల సమీపించుచుండిరి. నాటి యుద్ధవిశేషము రవంతయును దనకు బోధపడనందున "ఎవరు గెల్చిరి? కడ కెవరు గెల్చినట్లు?" అని యాతురతతో స్యాలకుఁడు మాటిమాటికిని సలీమును మార్గస్థులను నడుగుచుండెను. వారివెనుక యథాక్రమంబుగ క్రైస్తవ దాసియైన లూసి మధుపానపాత్రతో వచ్చుచు - మధుపానముకొఱకు మెల్లఁగ వారిని బ్రతిమాలుకొనుచుండెను. వెనుకకు తిరిగి చూడకయే పొమ్మని వా రామెను గసరివేయుచుండిరి. ఎన్నిమాఱులు పొమ్మన్నను బోవక, పాపము లూసీ మఱింత దైన్యముతో—

"దామోదరసింగ్ మహారాజ్! "ఇన్నాళ్ళు దయలేక పోయినను, ఈయుద్ధదినములలో మాత్రము పూర్వమువలె మీరు కటాక్షింపక తప్పదని, అల్మీడా మీతో మఱి మఱి మనవిచేయుమన్నారు. మధుపానము లేక పాపము వానికి మతిపోవుచున్నది. నాతప్పు క్షమించి కొంచెము కటాక్షింపక తప్పదు."

"ఛీ! ఛీ! పిల్లికళ్ళ దొంగముండా! సిగ్గులేక మఱల మాయొద్ద కెట్లు వచ్చితివే? బుఱ్ఱబ్రద్దలు కొట్టికొనినను నీ కొక్క చుక్కయైన నివ్వను. పో! ఆనాడే నే నీ ప్రతిజ్ఞ పట్టితిని. ప్రచండ తేజోమండల మార్తాండ గండభేరుండ భయంకరుండనై, నాసాటి నర పురుష మనుష్య వాసుదేవు లెల్లరు పక్కున నవ్వునట్లుగా చేసిన ప్రతిజ్ఞ తప్పిపోవుదునా! యుద్ధమునుండి యిప్పుడే వచ్చి మహాగ్రహముతో నున్న నన్ను చికాకుపెట్టకు! పో! వేగిరము పో!"

అని స్యాలకుఁడు తృణీకరించినంతనే పాపము లూసీ యింక లాభము లేదని వెంటనే యచ్చటినుండి పోయినది. కరుణను జెరపట్టిననాడు లూసియే కేకలు వేసి యల్లరిచేసి జగమల్లును దీసికొనివచ్చి తమ కంత పరాభవము చేయించిన దని స్యాలకసలీము లాగ్రహించి యానాటినుండియు నామెకు మధుపాన మొసంగుట మానివేసిరి. అంతవఱకు రహస్యముగా వారిని మంచిచేసికొని వారియొద్దనుండి మధుపానమును



గొనుచుఁ దన ప్రియుఁడైన యాల్మీడా కొసంగుచుండుట లూసీ కాధారమై యుండెను.

లూసిని గెంటివేసి రేవాదేవినివాసంబునకుఁ బోవు సంకల్పముతో దారినడుమం గల గుడారములనడుమనుండి వచ్చుచుఁ గ్రమక్రమముగా వారు దీపరహితంబై యున్న యొకపటకుటీరంబును సమీపించిరి. అది యొక్కటియే కాక దాని ప్రక్కనున్న రెండు మూఁడు చిన్నచిన్న గుడారములయందుఁగూడ దీపములు లేవు. కాంతిరహితం బగు నాప్రదేశమునం దక్కడక్కడ, నేవో పనులున్నట్లు నటించుచు కొందఱు దాసీలు సంచరించుచుండిరి. వారందరు రేవాదేవి దాసీలే యని స్యాలక సలీములు గ్రహించిరి. శూన్యదీపం బగు నాప్రదేశమునుండి స్యాలకసలీములు పోవుచుండ నాకస్మికముగఁ బ్రక్కనున్న యొక గుడారమునుండి "చచ్చితిని. చచ్చితిని. అయ్యో! అయ్యో! రక్షింపుఁడు! రక్షింపుఁడు! నన్నీ రాజసింహుఁడు బలవంతముగఁ జెరపట్టుచున్నాఁడు. రండు రండు!" అని యొకస్త్రీ గావించిన యార్తనాదము వారికి వినవచ్చినది. ఆరోదనధ్వని వినుటయె తడవుగ సలీము నిశ్చేష్టితుఁ డయ్యెను. స్యాలకుఁడు తత్తరపడుచు "సలీం - సలీం - సమయమునకు కత్తి లేకపోయినది. రాజసింహుఁడు బ్రతికి పోయినాఁడు! రా! రా! ఆస్త్రీ యెవరో రక్షింతము! ఆఁ - ఆఁ - వద్దు! వద్దు! ఆనాడు జగమల్లునివలె - అదుగో!

అదుగో! కేకలు విని దీపములు పట్టుకొని దాసీలు పఱుగెత్తుకొని వచ్చుచున్నారు! మొదట వారినే లోనికి వెళ్ళనిచ్చి తరువాత మనము ప్రవేశింతము." అని పలుకుచు, "మేమిచ్చటనే యున్నాము. భయములేదు. భయములే" దని యాక్రోదన ధ్వనికిఁ బ్రత్యుత్తరముగాఁ గేకలు వేయసాగెను. స్యాలకుఁడు చెప్పినట్టులె తత్ప్రాంతసంచారులైన దాసీలు కలవరపాటుతో నిటు నటు పరువెత్తుచు సమీపకుటీరములయందలి కరదీపికలందుకొని వడివడి నాగుడారములోఁ జొరఁబడఁ దొడంగిరి. ప్రక్కన యొకగుడారముకడ ఫహారా యొసఁగుచుండిన సిపాయి, యందున్న ఖైదీయైన భామాసాను విడిచి వచ్చుటకు వీలులేక తత్తరపడుచు దూరదూరంబుగ నందందు సంచరించుచుండిన కొందఱు సిపాయిలను గేకలువేసి చప్పట్లు చఱచి పిలువసాగెను. ఎట్టకేలకు దాసీజనంబును, వారిని ద్రోసికొనుచు స్యాలక సలీములును, వారి వెనుక సిపాయిలును నప్పుడా గుడారములోఁ జొరఁబడిరి. పండుకొనుటకైన పరుపువలె నుపయోగపడుటకు నొకదానిపై నొకటి చక్కఁగాఁ జేర్పఁబడిన జంబుఖానాల మడతలకు సమీపముగా రాజసింహుఁడు భయభ్రాంతుఁడై యప్పుడా గుడారములో గడగడ వడకుచు నిలువఁబడి యుండెను. వాని కాళ్ళక్రిందఁ బచ్చని యొక మేలిముసుఁగు పడియున్నది. వాని కట్టెదుట మొగము నలచుకొని రెండుచేతులుఁ గన్నులపైఁ జేర్చి మెహరున్నిసా



వెక్కి వెక్కి యేడ్చుచుండెను. లోనఁ బ్రవేశించినంతనే దాసీలు తటాలున నామెను బట్టుకొని యామెమొగమునందలి రక్కులనుండి చిమ్ముచుండిన రక్తమును దమ చేలాంచలంబులతో నొత్తుచు రాజసింహుని వినరాని దుర్భాషలతో దూఱుచు, వెంటనే యేడ్చుచుండిన మెహరున్నిసాను దమ బాహువలయంబులలో మెల్లఁగ నడిపించుచుఁ జక్రవర్తిగుడారమునకుఁ దీసికొనిపోయిరి. "వీఁడు దొంగ! రాజపుత్రిల గూఢచారుఁడు! రహస్యములను గనుఁగొనుట కెట్లో మనగుడారములలోఁ జొరబడి యిప్పుడీఘోరకృత్యమును గావించినాఁడు. పాఱిపోఁగలఁడు. జాగ్రత్త!" అని సలీముఁడు వచ్చిన సిపాయిల కాజ్ఞాపించి స్యాలకునితోఁ దానును దాసీల వెంటనే పోయెను. రాజసింహుఁ డొకప్పుడు చక్రవర్తిమన్ననలకుఁ బాత్రుఁడై దర్బారులోఁ బ్రసంగించినవాఁ డగుటచేతను నంతకంటె నెక్కుడుగఁ గరుణకు సోదరుం డగుటచేతను రాజభటులు వానినిఁ గట్టుటగాని తిట్టుటగాని కొట్టుటగాని జరుపక కొట్టినంత యట్టహాసమును మాత్రమే చేయుచుండిరి. వెలవెలఁ బోవుచుండిన మొగంబుతోడను గడగడ వడకుచుండిన శరీరముతోడను రాజసింహుఁడు కొంచెముసేపుమాత్రమే భీతచిత్తునివలెఁ గనఁబడి తరువాత నత్యాకస్మికమైన ధైర్యమును వహించెను. నేరముచేసినవాఁడు తన నేరమును దప్పించుకొనుట కభేద్యంబైన యుపాయము స్ఫురించినప్పుడు వా

మొగ మెట్లు వికసించుచుండునో రాజసింహుని మొగముగూడ నిప్పు డట్లే వికసించుచుండెను. సిపాయిలును వాని ధైర్యసాహసముల కాశ్చర్యపడుచుండిరి.

ఇంతలో నొక రాజభటుఁడు పఱుగుపఱుగున వచ్చి 'పాదుషావారి హుకుమైనది. నేరస్థునిఁ దీసికొనిరం'డని యచ్చటి సిపాయిలకుఁ జెప్పెను. తోడనే నడుముననున్న పటకాలును నెత్తి పైనున్న పాగాలును సవరించుకొనుచు విచ్చుకత్తు లెత్తిపట్టుకొని రాజసింహు నచ్చటి సిపాయిలు చక్రవర్తి గుడారమునకుఁ దీసికొనిపోయిరి. ఆమఖమల్ గుడారములో నేలఁబఱుపఁబడిన తివాసులుఁగూడ సిక్రీపట్టణపు మఖమల్ తివాసులే. అందలి చిత్రవిచిత్రంబు లగు గాజుదీపములు వెన్నెలవంటి చల్లని కాంతులతో, లోనఁ బ్రవేశించుటకు వేడుక పుట్టించుచున్నవి. అందు సార్వభౌముఁడు నట్టనడుమఁ బట్టుపరుపులు గల వెండిగద్దెపైఁ గూర్చుండియుండెను. మెహరున్నిసా వానిపాదములకడనే నేల మొగమువంచుకొని కూర్చుండెను. ఆమె వెనుకనే దాసీలు నిలిచియుండిరి. స్యాలకసలీములు కట్టెదుట నిలువఁబడిరి. నయభయంబులతో సిపాయిలు రాజసింహుని మెల్లగ లోనికిఁ గొనిపోయి వంగి సలాములు చేసి యెత్తినకత్తులు దింపివేసి ప్రక్కకొదిగిపోయిరి. చక్రవర్తి సహజశీతల కృపారస భాసురంబు లగు విలోకనంబులతో రాజసింహుని విలోకించుచు మందమృదూక్తులతో వాని కిట్లనియె—



రాజసింహా! నీవు శత్రుపక్షము వాఁడవు. మా శిబిరంబులకు రాఁగూడనివాఁడవు. అట్లయ్యు నిర్భయముగాఁ జొచ్చితివి. ఇది మొదటితప్పు. వచ్చి నేఁ డుదయమునుండియుఁ గూడ మారహస్యములను గనుఁగొనుటకుఁ బ్రయత్నపడుచున్నావని పిల్లలిద్దరును జెప్పుచున్నారు. ఇది రెండవతప్పు—"

అని చక్రవర్తి మాటాడుచుండ దామోదరుఁడు వాని మాటలమధ్యనే—

"ఔను. మీ సైన్యముల సంఖ్యయెంతనియు— నీవుయుద్ధము చేసెదవా లేదాయనియు నన్నితఁడు రెండుమాఱు లడిగెను. నేనే యుద్ధముచేసినయెడల ముందుగానే జాగ్రత్తపడుటకుఁ గాఁబోలు వీనియుద్దేశము!"

అని మొగము చిట్లించుకొనుచుఁ బలుకుచుండఁ జక్రవర్తి చికాకుతో—

"స్యాలకా! నీవు నోరెత్తకు! రాజసింహా! వింటివా? ఈ రెండింటికంటెను గొప్పతప్పు నీ వీకన్యకను జెరపట్టించుట! నీవు కరుణకు సోదరుఁడ వగుటచేతను, ఇట్టినేరములను జేయుటకుఁదగిన ధైర్యసాహసములు నీముఖలక్షణములయందు నాకుఁ గానరాకపోవుటచేతను నిన్నింతగా నడుగుచున్నాను. నీవేమి సమాధానమును జెప్పుకొనఁగలవు?"

"దేవా! ఏలినవారి శిబిరమును బ్రవేశించినవాఁడనగుటచే మొదటి రెండుతప్పులను జేసినట్టులే! విధివశంబున మూఁడవనేరమును గూడ నే నంగీకరింప వలసివచ్చినది."

"అంగీకరించుటకు మూఁడవ నేరము సామాన్యమైనదా? ఒకస్త్రీ నన్యాయముగాఁ జెరపట్టువానికి నేను మరణదండనము విధించెదను."

"మహాప్రభూ! నేరము చేసినప్పుడు మరణదండన మైనను దప్పించుకొను టెట్లు? శీఘ్రముగా విధించి నన్ననుగ్రహింపుఁడు!"

ఇట్లు పలుకుటయె తడవుగ ద్వారము వెలుపలినుండి 'దిలేర్ఖాన్ హాజరు మహాప్రభూ!' అని దిలేర్ఖాను గట్టిగా నఱచెను. చక్రవర్తి యొకరితో మాటాడుచున్నప్పు డత్యవసరమైనసంగతులుగాని యుత్తరములుగాని యున్నయెడల సేవకు లిట్లు హాజరు మనవి చేసికొనుచుండుట యాచారము. ఎంతో తొందరపని యున్నప్పుడుగాని వా రట్టి కేకలు వెట్టరు. దిలేర్ఖానుహాజరు విని చక్రవర్తి వెంటనే వానిని లోనికిరప్పింప, నతఁ డొకయుత్తరము నతివినయముతో సమర్పించుకొనెను. చక్రవర్తి యాయుత్తరమును విప్పి చదివి, మనసు కలఁతపడిన ఏమియుఁ దోచక యిటునటుఁ జూచుచు, మఱలమఱల నుత్తరమును జదువుచు— "దిలేర్ఖాన్! ఎట్లున్న నట్లు హాజరు కావలయు నని మానసింహ పృథ్వీరాజులకుఁ జెప్పి వెంటనే వారి నిచ్చటకుఁ దీసికొని రావలయు" నని యాజ్ఞాపించి పంచి— "రాజసింహా! నీగతి నీవేయాలోచించుకొనుము!" అనిరాజసింహునకును, "ప్రస్తుత మీ రాజసింహునిఁ గూడ నిప్పుడున్న



ఖైదీయొక్కనే యుంచుఁడు" అని సిపాయిలకును, కనుసన్నలతో స్యాలక సలీములకును జక్రవర్తి సెలవిచ్చి పంపివేసెను. క్షణకాలములో నాగుడారమంతయు నిశ్శబ్దంబైనది.

చక్రవర్తి యాయుత్తరమును మఱలఁ జూచెను. ఇంకొకమాఱు చదివెను. ఎన్నిమాఱులో చదివెను. వానిమొగము చింతాక్రాంతం బయినది. కనుబొమలు ముడివడినవి. పృథ్వీరాజ మానసింహుల రాకకొఱకు కాతురత యంతకంత కధికము కాసాగెను. క్షణ మొకయుగమువలె వానికిఁ దోపసాగెను. కొంచెముసేపులోనే వారును వచ్చిరి. చక్రవర్తి వారికిఁ గూర్చుండ సెలవీయకయే, కంటఁబడినంతనే "మానసింహా! పృథ్వీరాజా! ప్రతాపసింహుఁడు సిద్ధసంకల్పుఁడు! వాని శాపము వ్యర్థముగాఁబోదు. ఈసార్వభౌమత్వమునకన్నియు గండములే తటస్థించుచున్నవి. ఈయుత్తరమును జూడుఁడు!" అనిపలుకుచు నాయుత్తరమును వారి కొసంగెను. ఇరువురు నొక్కమాఱే యాయుత్తరమును జూచిరి. చూచుటయే తడవుగ వారిమొగములు వెలవెలఁ బోయినవి. ఇరువురును నిశ్చేష్టితులైరి. అప్పుడు తత్ప్రాంతసంచారులై పాడుకొనుచుండిన తులసీదాసు గీతామృతము చక్రవర్తి కిట్లు వినరాఁ దొడంగెను—

"ఆత్మలన్నియును సర్వేశ్వరుని య—నంతాకారములండీ!
ఆత్మయొక్కఁడే యందఱిలోఁ బర—మాత్మ యొక్కఁడేనండీ!"

## ముప్పదియాఱవ ప్రకరణము

యతో ధర్మ స్తతో జయః.

"నా ప్రాణబంధువులును నా ప్రాణమిత్రులును నగు నో రాజపుత్రులారా! కర్మసాక్షియుఁ ద్రిమూర్త్యాత్మకుఁడు నగు సూర్యభగవానుఁడు పూర్వదిశాచలోపరితలంబునం బ్రవేశించి మనల నీరణరంగమునఁ బ్రవేశపెట్టెను. ఆమహా మహుఁడు లోకబాంధవుఁడు! అపరాధుల దండింపఁగలఁడు! నిరపరాధులఁ గాపాడఁ గలఁడు! లేశంబును బరరాజ్యాక్రమణాసక్తియు బరధనాసక్తియు లేక కేవలము స్వగౌరవంబుకొఱకు - స్వరాజ్యంబు కొఱకు - స్వాతంత్ర్యంబు కొఱకు - నిర్మలాంతరంగంబులతో రణరంగ మలంకరించిన యమాయకులును బవిత్రచరిత్రులును నగు మీకు సంపూర్ణజయోదయంబు గలిగించుట కొఱకే నేఁ డుదయించినాఁడు. అపరాధులకు సంపూర్ణ పరాజయంబును బరాభవంబును గలుగువఱకు నేఁడ స్తమింపఁడు! పరమేశ్వరుఁడే నిజంబగు నెడ - నిజంబైన దుష్టశిక్షకుఁడును శిష్టరక్షకుఁడు నగు నెడ - దుష్టుల శిక్షించి క్రమ్మఱ మీ రాజ్యంబును మీ కొసంగఁగలఁడు! పరమేశ్వరుఁడే లేనప్పుడు - పరమేశ్వరునకే ధర్మచింతనము లేనప్పుడు - పరమేశ్వరుఁడును బక్షపాతియే యైనప్పుడు - ఈ పాడు ప్రపంచముతో మీ కేమి పని యున్నది? లెండు! లెండు! పరమేశ్వరుని యాథార్థ్యం



బెంతవఱకో నేఁడు నిర్ణయింపుఁడు? ధర్మం బెంత జయింపఁగలదో పరీక్షింపుఁడు! అదిగో! శతఘ్నికా ధంధమధ్వానము! ఆ నూతనానలయంత్రజాలంబులకు భయంపడకుఁడు! మీ కట్టి రణసాధనంబులు లేవని శంకింపకుఁడు! నిశ్చలధ్యానముతో సంపూర్ణ విశ్వాసముతో మీ పవిత్ర స్వాంతములయందు "యతో ధర్మ స్తతో జయః" అని మాటిమాటికి స్మరింపుచుండుఁడు! ఆ మంత్రమును బఠించుచు మీరు ప్రయోగించు గడ్డిపోచ యేనియుఁ దన్మంత్రప్రభావంబున నమోఘ దివ్యాస్త్రంబై శతఘ్నికం బెను శతఘ్నియై సహస్రఘ్నియై శత్రుసహస్రంబుల సంహరింపఁ గలదు! ఈ మహామంత్రమే రాజ్యసిద్ధికి మూలమంత్రము. ఈ మంత్రమునకు జపస్థానము రణస్థలము. ఇమ్మంత్ర మాహాత్మ్యంబుచేతనే తొల్లి యుధిష్ఠిరాదులైన పాండవులు శత్రుసంహారంబు గావింపఁ గలిగిరి. తమ రాజ్యంబును బడయఁ గలిగిరి! బ్రహ్మాస్త్ర నారాయణాస్త్ర పాశుపతాస్త్ర నాగాస్త్ర గారుడాస్త్ర ప్రముఖ నిఖిల దివ్యాస్త్రంబులకును బూర్వ మీ మంత్రమే మూల మంత్రం బైనదఁట! ఈ రహస్యంబును నీ మంత్రంబును గతరాత్రి స్వప్నంబున నంబాదేవి నా కుపదేశించి యనుగ్రహించె. నేఁడు నేను మీ కుపదేశించుచున్నాను. ఇమ్మంత్రంబు మంత్రించుచు విడుచు నస్త్రంబుచేఁ గూలని మహాస్త్రంబులు లోకంబునం దుండవు. ఇమ్మంత్రంబు [illegible]

చుచు విడుచు నస్త్రంబుచేఁ గూలని మహా శత్రువులును నుండరు ! ఇంత మీరు శంకింప నేల ? శతఘ్నులకు భయంపడ నేల ? రామభద్రా ! నీ సేనలోఁ దుపాకులు మెండుగ నుండుటం జేసి నీవు శత్రువుల వేదండ తండంబు నెదిరించి చెండాడుము. లక్ష్మణుండు నీకు బాసటగా నుండఁ గలఁడు ! ప్రపంచమ్మునకు రామరావణయుద్ధమ్మును నేడు జ్ఞప్తికిఁ దేవలయు ! శక్తిసింహా ! సంగ్రామకళాకౌశలంబున నాసఫ్ ఖానుఁడు ద్రోణుని వంటివాఁడు ! వాని పాలిటికి నీవు ధృష్టద్యుమ్నుండవు గావలయును. ప్రపంచమ్మునకు మహాభారతయుద్ధమ్మును నేఁడు జ్ఞప్తికి దేవలయు ! ఉగ్రసేనా ! నీవు తక్కిన రాజపుత్రులతోఁ గాల్బలముల నెదుర్కొనుము ! ఆ ప్రక్కనే తన సేనలతో మన జగమల్లుఁ డున్నాఁడు సుమా ! నీ వాదెసకుఁ జూడనైనఁ జూడరాదు. నిన్నటిదినంబెల్ల జగమల్లు పరస్పరంబుగ నూగకుండెనేగాని పోరాటంబునఁ జొరఁబడలేదు. కారణం బేమి యైయుండునో ? ఉగ్రసేనా ! పోనిమ్ము ! ఆ ప్రాంతమునకు నేనే పోయెదను. సంశప్తకుల నర్జునుండుంబోలె మద్బాహుబలంబెల్ల వెల్లడించి కాల్బలంబుల నేలపాలు గావించెదను. రణరంగంబున ఫిరంగులఁ బ్రయోగింప నియోగింపఁబడిన యా తెల్లదొర నైన నీ వంతమొనరించు ప్రయత్నమును గావింపుము ! సమయము వచ్చినప్పుడు నీ యాశ్వికసైన్యంబులతో శక్తిసింహునకుఁ దోడుపడుము. ఇంక మన చందుండు



యథాక్రమంబుగ భిల్లతండములతోఁ గొండలపై నుండవలసినవాఁడే గదా ?..........."

అని ప్రతాపసింహుఁడు తొలినాటి పరాజయంబున నిరుత్సాహులై యున్న రాజపుత్రవీరుల నెల్లఁ బ్రోత్సహించి, రణక్రియాక్రమంబును దొలినాటి కంటె భిన్నంబుగ నిర్ణయించి, మఱునాటి యుదయంబున సమస్త సేనానివహంబులతో నాహవరంగ మలంకరించెను. పరస్పర జయాపేక్షలతో నుభయపక్షములును బోరు ప్రారంభించెను. ఒరలు వెఱికిన యాభీల కరవాలంబుల తళతళత్కాంతులు దినకరకిరణంబులం బోలె దుర్నిరీక్ష్యంబులై చెలంగ నేల యీనినగతి నెందుఁ జూచినఁ దామెయైయున్న యసంఖ్యాకంబులగు మొగలాయి కాల్బలంబులం జొచ్చి, ప్రతాపసింహుఁడు తన చండికాఖడ్గంబునకుఁ బండువు సేయందొడంగెను. ఆశాంతంబుల మ్రోయు శంఖస్వనంబులతో ననేక రాజవీరు లమ్మహావీరుని వెంటనే మొగలాయిసేనా సముద్రంబునం జొచ్చిరి. సరోవరము మధ్యం జొచ్చు గంధసింధురము చందమ్మున, వైరిమదసింధుర సింహమగు ప్రతాపసింహుఁడు తద్వాహినీ మధ్యంబునఁ జొచ్చినంతనే సుడిగుండంబుల చుట్టును దిద్దిరందిరుగు తరంగమాలికల పోలికల నరాతి సైనికులు కిలకిల వాని నలువంకల నలముకొనిరి. ప్రతాపుఁడు ప్రవేశించిన దొమ్మి యుద్ధమతి స్వల్పకాలముననే యత్యంత బీభత్సంబు గాఁజొచ్చెను.

కాలానల కీలికా మాలికాభీలంబగు కరవాలం బెత్తుగవ్వాఁడును, యమదండంబుకంటెను నుద్దండంబైన ప్రచండ గదాదండం బును బాహుదండమున ధరించి నవ్వాఁడును, ప్రతాపునిప్రతా పానలంబున కింధనము లగుచుండిన సైనిక సందోహముల నెవరు లెక్కింపఁగలరు? మార్తాండుఁడు నభోమండల మధ్యంబు సేరుటకుమున్నె యిసుక వేసిన రాలనియట్లు ముసురుకొని వచ్చిన కాల్బలంబు లనేకంబులు రూపుమాసి పీనుఁగుపెంటలై యా తేజోవంతునకుఁ గొంత విశ్రాంతియుఁ దత్ప్రదేశంబునకుఁ గొంత వైశాల్యంబును గలిగించినవి.

ఇంతయుఁ జూచుచుండిన జగమల్లుఁ డావంతయుఁ జెయిచేసికొనఁ డయ్యె. ఆతని సైన్యంబు లెంతకును రణ క్రియ కుపక్రమింపవయ్యె. ప్రతాపు నెదిరింపుమని యాసఫ్ ఖానుఁ డప్పు డప్పు డంపుచుండిన వార్తలు వానికి లక్ష్యమును గలిగింపవయ్యె. ప్రతాపుని యఖండ భండన సంరంభ విజృం భణం బెంతకును క్షీణింపదయ్యె. అప్పట్టున నాసఫ్‌ఖానుఁడంపిన యాశ్వికు లనేకు లొక్కపెట్టున నెత్తివచ్చి దీపంబును గీటకం బులుం బోలెఁ గైటకాశ్వంబును జుట్టుముట్టిరి. చుట్టుముట్టుట యె తడవుగ రెట్టించిన రణోత్సాహంబునఁ బ్రతాపసింహుఁడు సముద్రమథనకాలంబున మందరగిరిచందంబున దిద్దిరందిరు గుచు శుష్కకాంతారంబును దహించు దావానలంబులీల భగ్గు న మండుచు - నయ్యాశ్వికనికాయంబుల కాయంబుల నమే



యమ్ములగు గాయమ్ములఁ గావింపుచుండ నమ్మహా సంకులస మరమ్మున నాకస్మికమ్ముగ నొకనిశాతభల్లప్రహారంబు గాఢం బుగఁ గైటకంబునకుం దాకె. తాకుటయె తడవుగ ననేక రణ రంగ విహారంబులయ్యం దారితేరి ప్రతాపున కనేకవిజయంబులు ఘటించిన యాతురంగరత్నమొక్కసారిగఁ దెగినమెడ వ్రేలవై చుచుఁ బ్రక్కచూపులతోఁ బ్రతాపునిజూచుచుఁ గన్నీరుగా ర్చుచు నేలఁగూలి ప్రాణములువిడిచెను. చిరకాలంబునుండి తన కాశ్రయంబై పెక్కుసారు లనేకప్రాణాపాయములనుండి తన్నుఁ గాపాడిన ప్రాణాధికంబగు నయ్యశ్వరత్నంబుపైఁబడి యొక్క మాఱు వగచుటకైనను బాపము ప్రతాపున కవకాశము కలుగలేదు. భల్లప్రహారంబు తాకుటయె తడవుగ నతఁడు తన వాహనమును దటాలునఁ బరిత్యజించి క్రిందకులంఘించి యొకచేతఁ గృపాణంబును నొకచేత గదాదండంబును దాల్చి చుట్టుపట్టులనున్న యాశ్వికుల నశ్వసమేతంబుగఁ దెగటార్చు చుండియుఁ బ్రతాపుఁడు క్రమక్రమంబుగ స్వప్రాణంబుల కపాయమ్ము శంకించి యుపాయంబు వెదుకుకొను నవస్థలోఁ బడవలసివచ్చినది. అప్పట్టున జగమల్లుఁడు చక్రరక్షకుని వలె నచ్చటఁ బ్రత్యక్షంబై హతశేషులైన యాశ్వికుల హతముగావించి తా నెక్కివచ్చిన తురంగంబును నన్నగారికి సమర్పించి నమస్కరించి క్రమ్మఱ నిజసేనాగ్రంబునకుం జనియె ఆహా! ఎంతటి దీర్ఘశత్రుత్వము నైన దిగమ్రింగు

కొనగలది సోదరప్రేమ మొకటియే కదా! జగమల్లు నద్భుత కార్యంబునకుఁ బ్రతాపుఁ డాశ్చర్యానందములం బొంది యభిమాన పూర్వకంబుగ నావారువంబును స్వీకరించె.

తానంపిన యశ్వసైన్యంబు సమస్తంబు నస్తమించుటయు, తనయాజ్ఞ లక్ష్యింపక జగమల్లుఁడు రణం బుపేక్షించుటయు, ఉపేక్షించుటయెగాక యన్నపక్షమ్మున కేగి తత్ప్రాణ సంరక్షణము గావించి వచ్చుటయు వీక్షించి యాసఫ్‌ఖానుఁడు సహింపలేక శక్తిసింహునితో హోరాహోరిగఁ బోరాడుచుండియు నించుక యవకాశంబును గలిగించుకొని మొగలాయి సేనలఁ బీనుగుపెంటలు గావించుచుండిన ప్రతాపునిమీఁదను వానిసైన్యములమీఁదను గొన్ని ఫిరంగులఁ బ్రయోగింపుమని యాల్మీడా కాజ్ఞాపించెను. కాని మధుపానంబులేక మతిచెడి-తల దిమ్మువట్టి చిరాకుహెచ్చి-యుత్సాహంబునశించి - శతఘ్నీకా ప్రయోగంబున నప్రతిమప్రతిభావంతుఁడయ్యుఁ బాపము పిచ్చి వానివలె నేమియుం దోచకయున్న యాతెల్లదొర యెట్టియవస్థ యందైనఁ దనవిధికృత్యమును నిర్వహించుకొనక తప్పదుకదా? అందుచే నంతవఱకుఁ గట్టెదుటకు గుఱివెట్టియుంచిన ఫిరంగుల నిప్పుడు ప్రక్కకుఁద్రిప్పి ప్రతాపసైన్యంబుపై గుఱివెట్టి మొదటఫిరంగినిఁ బ్రయోగించెను. కాని మధుపానరాహిత్యమునఁ గలిగిన మతిరాహిత్యముచేఁ దప్పుగుఱి గూర్పఁబడిన యాఫిరంగిగుండు కట్టెదుటంగల కొండయొడ్డునందున్న యొక



పెద్ద బండరాతికిం దగిలి, దానిం గ్రిందకుఁ బడఁద్రోయుటచేఁ గొండపైనున్న భిల్లులతో నాక్రిందనుండి పోరాడుచుండిన కొందఱు మొగలాయిసైనికు లాబండరాతి క్రిందంబడి రూపు రేకలు గానరాకుండ నశించిరి. ఆఘోరకృత్యమును గనిపెట్టిన మొగలాయి వీరులెల్లరు నత్యాశ్చర్యపడుచుండఁ బాపమా ల్మీడా పశ్చాత్తాపపడుచు, వడివడి ఫిరంగిగుఱిసవరించుకొని రెండవమాఱు ప్రయోగించుసరికి నయ్యది జగమల్లు సైన్యంబునం జొరబడి యందనేకుల హతముగావించెను. తోడనే త్రోకఁ ద్రొక్కిన త్రాచుతెఱంగున జగమల్లుడుఁ జెలరేఁగి తన మొగలాయిసేనలతోఁగూడ మొగలాయిసేనల నెదిరింప నారంభించెను.

ఆసఫ్‌ఖానునకు మతి చెదరినది. ధైర్యము తగ్గినది. కర్తవ్యము తోఁచదు. జగమల్లుఁడు సేనలతోఁ దిరుగఁబడెనని చక్రవర్తికిఁ గబురంప నిశ్చయించుకొని, యథాక్రమంబుగ గజారూఢులై తనకు సమీపవర్తులై యున్న స్యాలక సలీములను జెంతకు రప్పించి - యందు సలీమునుగాంచి– "యువరాజ కుమారా! జగమల్లు మనపై నాకస్మికముగఁ దిరుగఁబడినాఁడు. ఈసంగతి మీరు స్వయముగ నేగి పాదుషావారితో మనవి చేయవలయు" నని ప్రార్థించెను. అందుకు సలీ మంగీకరింపక "ఆసఫ్‌ఖాన్! ఆకస్మికముగ వచ్చిన యేదో యుత్తరమును జూచుచు నిన్నటినుండియు నిద్రాహారములులేక యతిరహస్య

ముగ మానసింహ పృథ్వీరాజులతో పాదుషావారు దీర్ఘాలోచనమున మునిఁగియున్నారు. మే మేగిన మాపై నాగ్రహింతురు. ఇంకెవ్వరినైనఁ బంపు" మని ప్రత్యుత్తర మొసంగెను. స్యాలకుఁడు మొగము చిట్లించుకొనుచు - "తప్పు! తప్పు! మేము ప్రభువులము. నీవు మాసేవకుఁడవు. మాకు పనులు చెప్పఁగూడదు. మే మీరణరంగమును విడిచిపోవుట వీరపురుషలక్షణముగాదు." అని తీవ్రదృష్టితో వానినిఁ జూడసాగెను. అందుచే నాసఫ్‌ఖానుఁ డొక సిపాయినిఁ బంపవలసి వచ్చినది.

అట్లు సార్వభౌమునకు రణవిశేషములు తెలియఁ బంచిన యనంతరమున ఖానుఁ డన్నివిధంబుల నిరుత్సాహుఁడైయుండ నాతనిసేనలతోఁ బోరాడుచుండిన శక్తిసింహుని విజృంభణము భరింపరానిదై నలువంకల హాహారావంబు లుప్పతిల్లఁజేసెను. అదియే సమయంబని రాజపుత్రులును భిల్లులును శక్తిసింహునకుఁ దోడుగనిల్చి ఖానునకు మఱింత కలవరపాటును వానిసేనలకు మఱింత చేటుపాటును గలిగించుచుండిరి. భీష్ముం డభిమన్యుంబోలె నాసఫ్‌ఖానుఁ డప్పుడు శక్తిసింహు నడ్డగించి కనులెఱ్ఱఁజేసి తీవ్రదృష్టితో వానిని విలోకింపసాగెను. విలోకించు కొలఁది వానికోపము పెచ్చుపెరుగుటకు మాఱుగ విచ్చిపోయినది. మొగము వెలవెలఁ బారినది. హృదయమున దైన్యంబు గదిరినది. ధైర్యంబు చెదరినది. ఇన్నింటికిని గారణము శక్తిసింహుఁడు తన కంఠసీమ



నలంకరించుకొనిన రత్నహారము! అదియే పదునైదు లక్షల విలువగల రత్నహారము! సార్వభౌమునకు సమర్పింపక మెల్లఁగ సంగ్రహించుకొని ఖానుడుంచుకొనిన దుర్గావతీరత్నహారము! అట్టిపోలికగల రత్నహారం బింకొకటి యుండనందునఁ గంటఁబడినంతమాత్రముననే ఖానుదృష్టు లావంక కాకర్షింపఁబడినవి. అది కనిపెట్టి శక్తిసింహుఁడు శిరము వంకించుచు - "ఓయీ! ఖానుఁడా! ఏసరోవరోదకమును విషమిళితంబుగావించి రాజపుత్రసంహారంబు గావించితివో యాసరోవరోదకంబులనే గ్రోలి నీసోదరుఁడైన మహబఝ్ఖానుఁడు సపరివారంబుగఁ గూలిపోయెను. లాహాదుర్గమును మేమాక్రమించుకొంటిమి! నీవు దాచుకొనిన దుర్గావతీరాణి జవాహరీ సమస్తంబును దుర్గముతోఁబాటు మాకు స్వాధీనమైనది. ఇదిగో యీరత్నహారమే నీకు సమస్తంబును విశదపరుపఁగల" దని బిగ్గరగ గొంతెత్తి పలికెను. సోదరనాశనంబును దుర్గనాశనంబును సంపాదితసమస్తవిత్తనాశనంబును బాపము ఖానుని ప్రాణనాశనమునకుఁ గారణములైనవి. ఆదుర్వార్తలు వినుటయె తడవుగ గుండె పటాలునం బగిలి ఖానుఁడు తానధిష్ఠించియున్న తురంగముపైనె మూర్ఛిల్లి పట్టుతప్పి నేలంగూలుచుండ నేవంకనుండియో యాకస్మికంబుగ రివ్వునవచ్చిన రెండు వాఁడికోల లాతని కంఠంబునం గ్రుచ్చుకొని ఖానుని మఱి లేవకుండఁ జేసినవి.

సర్వసైన్యాధ్యక్షుఁడైన యాసఫ్‌ఖానుఁడు కూలినంతనే మొగలాయి సేనల యాక్రందన ధ్వనులు మిన్ను ముట్టినవి. వాని తోడనే రాజపుత్రుల విజయారావంబులును సింహనాదంబులును ఢంకాస్వనంబులును దిక్కులఁ బిక్కటిల్లినవి. అవ్యాజమోత్సాహంబున రెట్టించిన సమరోత్సాహంబుతో రామభద్రుండును నుగ్రసేనుండును దమ తమ సేనలతో నాథుఁడులేని మొగలాయి సేనలం జొరబడి, పలాయన పరాయణులైన వారిం దక్కఁ జేఁజిక్కినవారి నెల్లఁ జెండాడుచుండఁ దన్మధ్యంబున సంచరించుచుండిన యువరాజ వేదండంబు బెదరి, కుఱుర సెడి, యటు నిటుఁ బరుగిడఁ గడంగుటయు, లక్ష్యశుద్ధి యందుఁ బ్రసిద్ధి వడసిన రామభద్రుం డొక్కతుపాకి వ్రేటున మావటివానిని నేటడంప, నుగ్రసేనుం డొక్క మహాగ్ర దీర్ఘ భల్లాగ్రంబున దాని తుండంబును రంభాస్తంభంబునుం బోలెఁ జీల్చివైచె. బోరనఁ గారు కీలాలధారల ఘాంద్రు ఘాంద్రని యఱచుచు నమ్మదవారణం బున్నయట్టులె నెట్టనఁగూలి కొండ గుట్టవలెఁ జలన శూన్యంబైనది. అంబారిలోఁ గల నిరపరాధులైన స్యాలక సలీము లుగ్రసేన రామభద్రులకుఁ బట్టువడిరి.

అచిరకాలంబుననే యీ దుఃఖవార్త రణరంగమును దాటి శిబిరంబునం దంతట నల్లుకొనినది. జోధాభాయి తన కుమారుఁడైన సలీము కొఱకును, రేవాదేవి స్యాలకుని కొఱకును దుర్భర దుఃఖభారంబున వగచుచు వచ్చి, చెంత మోన



సింహ పృథ్వీరాజులు గలరను శంకయైన లేక సార్వభౌముని పాదంబులపైఁ బడిరి. తొలినాటి యుత్తరంబుచేతనే చింతాకులస్వాంతుండై యున్న చక్రవర్తిని, జగమల్లు తిరుగఁబడుటయు—ఆసఫ్‌ఖాను మరణించుటయు — స్యాలక సలీములు పట్టుపడుటయు—మఱింత వ్యాకులచిత్తునిఁ గావించి, యొక్కొక్కటి యొక్కొక్క శూలమ్మువలె బాధింపసాగెను. అయినను జక్రవర్తి సహజముగ నసాధారణధైర్యవంతుఁడు. బాల్యము నుండియు నతఁడు కష్టములనే యనుభవించినవాఁ డగుటచేత, సాధారణముగ నెట్టికష్టములకును వాని చిత్తము తత్తరపాటు చెందదు. కాని జోధాభాయియు రేవాదేవియుఁ [illegible] కట్టెదుట నఖండముగ వర్షించుచుండిన బాష్పధారావృష్టి, స్యాలక సలీములను గూర్చి వాని కేయుపాయమును దోపనీయదయ్యె. అందుచే నతఁడు విసిగి పృథ్వీరాజును జూచి.—

“కవిసత్తమా! హృదయంబును బెకలించుచుండిన పంజాబు రాజకీయాందోళనంబుకంటెఁ బ్రస్తుతము కుటుంబాందోళనము నాకధికముగా నున్నది. అందుచే నీవు స్వయముగఁ బ్రతాపసింహుని కడకేగి, స్యాలక సలీములను విడిచిపెట్టుట కాతఁ డెట్టి షరతులు కోరునో కనుఁగొని రమ్ము! విత్తంబున కాసించిన వలసినంత చెల్లింతము. పోరాటంబు మాని పొమ్మన్న నప్పుడాలోచింతము! కాని మఱియొక మాట! ప్రతాపుని తత్త్వమును బట్టి యీ రెండును నాతఁ డభిలషింపఁ డనియే నా నమ్మకము! మన మంపిన యేబది వేలరూప్యంబులును దరిద్రావస్థయం దున్నప్పుడే నిర్లక్ష్యం

బుగఁ దొలఁగఁద్రోసినవాఁడు సర్వైశ్వర్య సంపన్నుఁడై యిప్పుడు విశ్రమాసించునా? స్వప్రతాపాతిశయంబున జయమును సంపాదింపఁ బ్రయత్నింపక, రాజకుమారులు పట్టువడరను సామాన్య విషయంబును సందుచేసికొని పౌరుషహీనుఁడై పోరాటంబు మాని పొమ్మనునా? పృథ్వీరాజా! ఈ విషయంబునఁ బ్రతాపుఁ డేమి ప్రత్యుత్తర మిచ్చునో వినవలయునని నాకు మిక్కిలి కుతూహలము గలిగినది సుమా! నీవు సత్వరముగఁ బోయి రమ్ము!"

అని చక్రవర్తి సెలవిచ్చినంతనే పృథ్వీరాజు లేచి "మహాప్రభూ! నాకును గుతూహలముగనే యున్నది. ప్రతాపుని యౌదార్యమును బరీక్షించుట కిదియే తగిన సందర్భము" అని పలికి, సలాముచేసి— సెలవు గైకొని యా కవిశేఖరుఁడు పోఁబోవుచు నాలుగైదడుగులలోనే యాకస్మికముగ నాగిపోయి — ద్వారము వైపు పతితీవ్రముగఁ బ్రసరించుచుండిన తనదృష్టుల యందాశ్చర్యానందములు చిందులాడుచుండఁ దటాలునఁ జక్రవర్తిదిక్కు మొగంబై "మహాప్రభూ! ఇంక నేఁ బోవంబని లేదు. అదిగో! ఒక సేవకుఁడు నొక రాజపుత్రుఁడును దోడుగా మన స్యాలక సలీములు పంపివేయఁబడి, మూర్తీభవించిన ప్రతాపసింహుని యౌదార్యాతిశయమ్ములం బోలె వచ్చుచున్నా" రని పలుకుచుండఁగనే, స్యాలక సలీము లాగుడారములోఁ బ్రవేశించి, చక్రవర్తి సమేతంబుగ నందర కత్యాశ్చర్య సంతోషములు గలిగించిరి.

—o—



## పరస్పరౌదార్యములు

నిలుకడగన్న విద్యుల్లతలంబోలె నత్యంత శోభాయమానంబులగు దీపంబు లప్పుడే వెలిగింపఁబడినందునఁ దద్విచిత్ర దీపికాప్రకాశంబున శోభిల్లుచున్న పటకుటీరాంతర్వైభవంబును రాజకుమారుఁడుమాత్రము వింతగాఁ జూడసాగెను. వానితోవచ్చిన సేవకుఁ డట్టివైభవంబు లనేకములు చూచినవాని తెఱంగున లేశమును వింతపడక సలీమునిఁ గౌఁగిలించుకొని యానందించుచుండిన జోధాభాయిని, దామోదరసింగును గౌఁగిలించుకొని యానందించుచుండిన రేవాదేవిని, వారి నిరువురినిఁ దేరిపారఁజూచి నవ్వుకొనుచుండిన సార్వభౌముని వీక్షించుచు నిలువఁబడియుండెను. కొంచెముసేపునకే చక్రవర్తి తన దృష్టులు మఱలించి చంద్రమండలమునుండి వెడలు నమృతబిందువులంబోలె, మందహాస భాసురంబయిన ముఖంబునుండి వెడలు మధుర భాషణంబులతో—

"ఓయీ! నీపేరేమి? ఈ రాజకుమారుఁ డెవ్వరు? జగమల్లువలె స్వామిద్రోహిగాక యిప్పట్టున రాణాచూపిన యౌదార్యమునకు మేమెంతయు సంతసించితిమి."

"మహాప్రభూ! నాపేరు రామభద్రుఁడందురు. నేను లావాదుర్గాధిపతియైన శక్తిసింహుని సేవకుఁడను. ఈ రాజకుమారుఁడు రాణావారి యగ్రతనూజుఁడు — యువరాజు — మహాప్రభూ! జగమల్లు—"

అని యింకనేమో చెప్పఁబోవుచుండఁ జక్రవర్తి యాశ్చర్యముతో—

"ఏమేమీ? రామభద్రా! లావాదుర్గాధిపతి శక్తిసింహుఁడా? అతఁడెవరు? షహాబ్ఖానుఁడేమయ్యెను?"

అని యడుగ రామభద్రుఁడు షహాబ్ఖానుని మరణవృత్తాంతంబును శక్తిసింహుని జీవితచరిత్రంబును, లావాదుర్గాక్రమణ విధానంబును, ఆసఫ్ఖానుని దుర్గావతీ ద్రవ్యాపహరణంబును, తత్కారణంబైన యాతని మరణవిశేషంబును సమగ్రంబుగ విన్నవింప సార్వభౌముఁడును దక్కటివారును నవ్విశేషము లత్యాతురతతో వినసాగిరి. అప్పుడు చక్రవర్తి—

"రామభద్రా! ఉన్నట్టులుండి యెన్నివింత లెఱింగించితివి? ఇన్నియు మహాద్భుతంబులే. దైవము నిరపరాధులఁ గాపాడుననుటకును, నపరాధుల దండించుననుటకును నిన్నియుఁ దార్కాణములే. మానసింగ్! గృహమును బరీక్షించి దొరకిన వస్తువులు గొనిరావలయుననియేకదా మనము షహాబ్ఖానునకుఁ బంపినయాజ్ఞ! ఏయపరాధమునులేని మీరాభాయి కతఁడేల ఖైదువిధింపవలెను? అందుకే తగిన ఫలమనుభగించినాఁడు. దుర్గావతీద్రవ్యాపహరణానుమానము నా కాసఫ్ఖానునియందు మొదటినుండియున్నది. కాని యుపేక్షించితిని. వానియపరాధములకు నేను జేసిన శిక్ష చాలక పరమేశ్వరుఁడు తగినశిక్ష విధించినాఁడు? రామభద్రా! తనతమ్ముఁడు సజీ



ఘుఁడై యున్నాఁడను గర్వముచేతనే నా జగమల్లు మాపైఁ దిరుగఁబడుట?......"

"మహాప్రభూ! కాదుకాదు. ఫిరంగులు ప్రయోగించు తెల్లదొర మధుపానరాహిత్యంబున మతిపోయినవాఁడగుటచే గుఱితప్పి ప్రతాపసైన్యముపై విడిచిన ఫిరంగిగుండు జగమల్లు సైన్యమును దాకి యందనేకులఁ గడతేర్చుటచే జగమల్లది యెఱుంగక తప్పు తలఁచియుండును."

"మానసింగ్! ఎంతవింతగా నున్నదో వింటివా? జగమల్లు తిరుగబడెనను ఘోషయేగాని మనకీ రహస్యము నేసిపాయియుఁ జెప్పలేదు. రామభద్రా! ఈస్వల్పకాలములో నీవెఱింగించిన విశేషములన్నియు నొక్కొక్కటి యొక్కొక మహాద్భుతంబుగఁ దోచినవి. నీసేవచే శక్తిసింహుఁడును, నీసాహాయ్యముచేఁ బ్రతాపసింహుండును మిక్కిలి యదృష్టవంతులు. నీనయవినయాదులును నీమాటలపొందికయు జూడ నీవు మాకు బరిచితునివలెఁ దోచుచున్నావు. మారాజకుమారులను భద్రముగ మాకప్పగించి ప్రతాపసింహుఁడు మావలన నేమి ప్రత్యుపకార మభిలషించుచున్నాఁడు?"

"మహాప్రభూ! ఇందు సంగ్రామ విజయకాంక్షయే తప్పఁ బ్రత్యుపకారవాంఛ లేశమును లేదు. 'శత్రువులకుఁ జిక్కిన యువరాజునకుఁ బ్రాణభయము శంకించి చక్రవర్తి సమరవిముఖత్వమును జెందకుండ సత్వరముగ నప్పగించిరం'డని

కుమారుఁడైన యయ్యమరసింహునకును నాకును రాణావారు సెల విచ్చి పంపిరి."

"ఓయీ! వానియౌదార్యంబు వేయినోళ్ళఁ గొనియాడఁదగినది. వానిసంగ్రామవిజయకాంక్ష నేడు సిద్ధించినట్టులే కదా? వానియం దేదో యమానుషం బైన శక్తి యుండవలయును. కాకున్నఁ బరమేశ్వరుఁ డిన్నివిధముల నాతనికిఁ దోడుపడఁడు! రామభద్రా! అట్లైనఁ బ్రత్యుపకారమునకు మాకిం దవకాశము లేదనియే యందువా? రాణా నీతో నేమియుఁ జెప్పలేదా?"

"దేవా! రాణావారి సందేశమును జిత్తగింపుఁడు! 'భామాసా నిరపరాధి. లూటీచేసినవారము మేము. ఆ సరకులు మాయొద్దనే యున్నవి. వానినిఁ బరిగ్రహించి వర్తకుని విడిచిపెట్టుట న్యాయము. రాజసింహుఁ డను మారాజకుమారుఁ డొకఁడు మీ శిబిరంబులలోఁ జిక్కువడి యుండిపోయినట్లు తలంచుచున్నాము. అతఁడును మీకపరాధి కాఁడని తోఁచినయెడలఁ గ్రమ్మఱ మాయొద్దకుఁ బంపివేయుఁడు."

అని పలుక రాణాసందేశమును విని సార్వభౌముఁడు నవ్వుచుఁ బ్రక్కకుఁ జూచి, ఖైదీలను దీసికొని రమ్మని పహరా సిపాయి కాజ్ఞాపించి మఱల రామభద్రునిఁ జూచుచు నిట్లనెను.

"రామభద్రా! లూటీ సరకులు మఱల దొరకునని మే మెన్నఁడు ననుకొనలేదు. అయినను రాజనీతి ననుసరించి



తత్ప్రయత్నములు గావింపక తప్పదు కదా? అందుచే భామాసా విషయం బట్టుండనిమ్ము! రాజసింహుఁ డంతకంటెను నపరాధి. నిన్నటి సాయంకాలమున నతఁ డొకస్త్రీని జెరబట్ట నెంచినట్లు వానిపై సాక్ష్యము వచ్చుచున్నది!"

అని చక్రవర్తి పలుకునరికి స్యాలకుఁడు మొగము బిగించి, ముందుకు వచ్చి - గుండెపైఁ జేయి వేసికొనుచు గంభీరముగా—

"ప్రథమసాక్షిని నేను."

"స్యాలకా! నీవేమిచూచితివి?"

"మెహరున్నిసాను జూచితిని — రాజసింహుని జూచితిని."

"ఎక్కడ?"

"గుడారములో."

"అప్పుడందులో దీపము లున్నవా?"

"దీప ముండఁగా చెరపట్టునా?"

"అట్లైన జీకటిలో నీవెట్లు చూడఁ గలిగితివి?"

"నావి పిల్లికళ్ళు!

"దాసీలందఱును జూచినట్లు చెప్పుచున్నారే! వారందఱివి పిల్లి కన్నులేనా?"

"ఏమో! వారి ప్రారబ్ధము నా కెందుకు? నావి మాత్రము పిల్లికళ్లు."

ఫహారాసిపాయి ఖైదీలను లోనఁ బ్రవేశపెట్టెను. తోడనే జోగాభాయియు రేవాదేవియుఁ దవ్వు వెనుక వ్రేలాడుచుండిన సన్నని పట్టు తెరచాటునకుఁ బోయిరి. భామాసాయును రాజసింహుఁడును చక్రవర్తికి సలాములు చేసి చేతులు కట్టి కట్టెదుట నిలువఁబడిరి. అప్పుడు చక్రవర్తి —

"రాజసింహా! నీయపరాధమును గూర్చి నీ వేమి చెప్పఁగోరెదవు?"

"మహాప్రభూ! నాకు మరణదండనమును విధింపుఁడు. ఇంతకన్న నేమి ........."

అని యింకేమియో పలుకుచుండఁగనే చక్రవర్తి యాగ్రహించి —

"ఛీ-ఛీ పశువా! మరణ దండనము, మరణదండన మని నిన్నటినుండియు నొక్కరీతినే వాగుచున్నాఁడవు. నీకు మరణ దండనము విధింపలేకయే యూరకుంటి మనుకొంటివా? లేక పలుమారిట్లు పలికిన నిన్ను క్షమించి విడిచిపెట్టెద మనుకొంటివా? అడిగిన మాటకు సమాధానము చెప్పక మాటిమాటికి దొంగవేషము వేయుచున్నావా? తేనె పూసిన కత్తివంటి నీ మాటలకును మేడిపండువంటి నీ యాకారంబునకును మోసపడి, నిన్నానాఁడు మా దర్బారులో మాటాడనిచ్చినందుకిప్పుడు నొచ్చుకొనుచున్నాము. నీవంటి ఛండాలుని స్పర్శచే మా సభామండపం బపవిత్రంబైనది. నీవంటిధూర్తవర్తను



నా ప్రతాపసింహుఁ డేల చేరఁదీసెను? లేక వానినిగూడ నిట్లే మోసపుచ్చుచుంటి వేమో?—ఓయీ రామభద్రా! మా యువరాజును విడిచిపుచ్చినందుకుఁ బ్రత్యుపకారంబుగా, మరణ దండనమునుండి యీ పాపాత్ముని క్షమించి యాతఁడు కోరినట్లు విడిచితి మని మీరాణాతోఁ జెప్పుము! ఇట్టి కపటశీలునిఁ జేరఁదీయుట వానికిని క్షేమంబుగాదని నుడువుము!"

ఆమాటలు విని రామభద్రుఁడు రాజసింహుని ముఖమును దేరిపారఁ జూచుచుఁ జక్రవర్తికిఁ బ్రత్యుత్తరముగా నిట్లనియె.

"దేవా! యువరాజును విడిచిపుచ్చుటయందుఁ బ్రత్యుపకారవాంఛయే లేని రాణావారిట్టి ప్రత్యుపకారము నెన్నఁడు నంగీకరింపరు. అపరాధి యెవ్వరికైన నపరాధియే. ఏలినవారు వీని యపరాధంబును నిర్ణయించి తగినశిక్ష విధింపవచ్చును."

"ఈతని యపరాధం బీతఁడే నిర్ణయించుకొనుచున్నాఁడు.—రాజసింహా! ఇంక ని న్నేమియు నడుగ నవసరము లేదా?"

"మహాప్రభూ! రాజనీతి ననుసరించి మరణదండనమునకుఁ బూర్వ మపరాధికిం గల వాంఛితంబు నడుగుట తప్ప న న్నేమియు నడుగనక్కఱలేదు."

"అట్లైన నీవు చెప్పఁగోననెంచిన వాంఛితమునే మేము వినుచున్నాము."

"మహారాజా! వినినంతమాత్రమున నపరాధి నుపేక్షింపక వాంఛితం బనుగ్రహింపవలయు! నాకేగాక భూదేవికిఁగూడ మహాభారకారణంబై యున్న యీ శరీరంబును ఒక యుత్తమరాజపుత్రవీరుఁడు పోరాటంబున మరణించిన పవిత్రస్థలమునందు విడిచి, తరింపవలయు నని నాకుఁ జిరకాలమునుండియుఁ గోరికకలదు. ఏలినవారి పరివారంబునందలి రణవీరులలో నా హృదయ మ్మంచుకొనిన మహారణవీరుం డగు రణమల్లుని మరణస్థానంబున నామరణదండనము విధింపఁబడుగాక!"

ఆమాటలతోఁ జక్రవర్తిముఖలక్షణము లన్నియుఁ గ్రొత్తగ మాఱిపోయినవి. ముడివడిన కనుబొమ్మలతో నాతని దృష్టి, మొగము వంచుకొనియుండిన రాజసింహుని వైపున నుండి చాల సేపువఱకు మఱలలేదు. అట్లుచూచి,చూచిచూచి"

"రాజసింహా! నీకడపటి పలుకులువలన నీ ప్రవర్తమునందలి రహస్యము నా కిప్పుడు స్ఫురించుచున్నది. ఇతరుల కది స్ఫురించుట కవకాశము లేదు. ఆనాడు నీదుస్సాహసంబు మాన్పి - కాలక్రమంబున దుఃఖము మఱలుకొలఁది, నీ కిట్టి తెగువయు మఱలిపోవు నని నే ననుకొంటిని. కాని నాటినుండి నేటివఱకు నీ సాహసోద్యమంబును నీ వింకను విడువ నేలేదా?"

"మహారాజా! ప్రతాపసింహునికడకు శ్రీవారిచేఁ బంపఁబడి యీ ప్రాంతములఁబ్రవేశించినది మొదలు ఆ పవిత్ర



క్షేత్రం బెందైనఁ జూడఁగలనా యనియు, ఆచరణంబుల జాడలైనఁ గడ కీపాపిష్ఠ.........."

అని పొంగి పొరలి వచ్చుచుండిన దుఃఖము నాపుకొనలేక రెండుచేతులు మోమున వైచుకొని వెక్కి వెక్కి యేడ్చుచుండఁ జక్రవర్తి మానసింహ పృథ్వీరాజులను జూచి "మానసింగ్! పృథ్వీరాజా! ఈమె పురుషవేషముతోనున్న కరుణ యని మీ రిప్పటికైనఁ బోల్చుకొనఁ గలిగితిరా" యని యాశ్చర్యముతో నడిగెను. మానసింహుఁడు నిశ్చేష్టితుఁడై చూచుచుండఁ బృథ్వీరాజు ప్రేమాతిశయమునఁ గలిగిన యానందో[illegible]నముతో—

"కరుణా? కరుణా? మహాప్రభూ! ఎంత యాశ్చర్యమైనసంగతి? అమ్మాయీ! కరుణా! ఆనాడు నీ వీ వేషముతోఁ బోల్చుకొనుటకు వీలులేకుండ నాకడ నెంత విచిత్రముగఁ బ్రవర్తించితివో నా కిప్పుడు స్ఫురణకు వచ్చుచున్నది. తల్లీ! ఈ పురుషాకృతి వహించుటకు నీ కేమి యగత్యము తటస్థించిన దమ్మా!"

అని యాతురతతో నడుగుచుండఁ జక్రవర్తియు—

"కరుణా! చెప్పు; చెప్పు. ఆగ్రాలోనున్న దానవు ప్రతాపసింహుని వృత్తాంతములును. నానక్‌ఖానుని దండయాత్రా రహస్యములును నీ వానాఁడు దర్బారులో నెట్లు ప్రసంగింపఁ గలిగితివి?"

అని యెడుఁగఁ గరుణ కన్నీరొత్తుకొనుచు మొగ మ్న వంచుకొని, బొటనవ్రేల నేలరాయుచు నతివినయంబుతో:-

"మహారాజా! షహాబఖానుని యాజ్ఞప్రకారముగ నీ ఖామాసావారు సిపాయిలతో నాగ్రాపట్టణమునకు బయలు దేరుచున్నారనుసంగతి నాథద్వారమునకు సమీపారణ్యములయందే నివసించుచుండిన ప్రతాపపట్టమహిషి యగు పాటేశ్వరీదేవి కుమారునిముఖంబున విని తన సోదరుడైన జోసీభాయిపేర నొక యుత్తరమును వ్రాసి యామె కందఁ జేయువలయు నని, యాయుత్తరమును వీరికిఁ బంపించెను ఖామాసావారు దయతో నాయుత్తరమును గొనివచ్చి జో భాయి కిచ్చిరి. నేను దర్బారులో మనవి చేసికొనిన వృత్తాంతములన్నియు నందుఁ బాటేశ్వరీదేవిచే వ్రాయఁబడినవే. ఏలినవారి యౌదార్యాతిశయంబు లెఱింగినదాన నగుటచే నాపైన నీవిశేషములు విన్నవించుకొనిన యెడలఁ బ్రతాపసిం నకుఁ గొంత యుపకృతి జరుగఁగలదని జోసీభాయితో న చించి యామె యానతిపై నీ పురుషాకృతిం బ్రవర్తిం దేవా! ఇంత విన్నవించుకొని యేలినవారికడ బ్రాధా న్యంబును దావలె! ఈ ఖామాసావారు మాతండ్రి అది యని చక్రవర్తి పక్కునవవ్వె—

"మానసింగ్! పృథ్వీరాజా! సజీవులే యని మన కొముచున్న వారు చనిపోయినట్లును, చనిపోయిరని యన

